B. Shelelle
SP1

ఆదిమ కమ్యూనిజమునుండి బానిస సమాజము వరకు




# భారతదేశం

ఎస్. ఎ. డాంగే

C

ఆదిమ కమ్యూనిజమునుండి
బానిస సమాజమువరకు

# భారతదేశం



రచన :
శ్రీపాద అమృతడాంగే

అనువాదకుడు :
పులుపుల వెంకటశివయ్య



విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.



అంకితం

ఇన్నేళ్ళనుంచీ అన్నింటా
నాతో నిలచిన
'తా య్'కి



# విషయ సూచిక



---

# తొలిపలుకు

ఈ పుస్తకం చాలభాగం అక్టోబరు '42-జనవరి '43 మధ్య ఎరవాడ జైల్లో వ్రాయబడ్డది.

అందువల్ల విషయ వివరణంలో కొన్ని అవరోధాలు కల్గాయి. విషయానికి తగినంతగా వివరణలో సంపూర్ణత లేక పోయింది. సంస్కృతసారస్వతంలోగల మూలగ్రంథాలనుంచి గాని, వాటినిగురించి నేటి పండితులువ్రాసిన భాష్యాలనుంచి గాని లభ్యంకాగల సామాగ్రినంతటినీ ఉపయోగించడమూ, ఉదహరించడమూ సాధ్యపడలేదు.

నాకన్న యెక్కువగా విషయపరిచయం గలవా రెవ రైనా, మన కార్మికవర్గంయొక్క వుపయోగంకొరకు ఆపని చేస్తారని ఆశిస్తున్నాను.

మొదట్లో ఈ పుస్తకంవ్రాద్దామనుకోలేను. ఆరోజుల్లో ఎరవాడజైల్లో నాతోపాటున్న రాజకీయఖైదీలు లేవదీసిన అనేక ప్రశ్నలకు సమాధానంగా ఈ పుస్తకరచన జరిగింది.

స్టాలిన్‌గ్రాడ్ యుద్ధం ముమ్మరంగాసాగుతున్నఆరోజుల్లో యుద్ధం, సోషలిజం, వర్గకలహం సోవియట్ విధానంయొక్క ఉత్కృష్టతా మొదలైన విషయాలనుగురించి, అనేకసమస్యలు తీవ్రంగా చర్చింపబడుతూవచ్చినవి.

యుద్ధా లెందుకు వస్తాయి? ఒక యుద్ధానికీ, మరో యుద్ధానికీ భేదం గుర్తించడ మెలాగు? వర్గాలంటే ఏమిటి? ఒకరాజ్యాంగ యంత్రానికీ, మరోరాజ్యాంగయంత్రానికీ భేదం మెలా యేర్పడుతుంది? యుద్ధాలనేవాటిని లేకుండానే చేయడ

మెలాగు? మానవులకు ప్రభుత్వమూ, రాజ్యాంగయంత్రమూ* అనేవి శాశ్వతంగా అవసరమైనవై ఉంటాయా? దారిద్ర్యాన్ని తొలగించడ మెలాగు? ఇలాంటివే అనేక సమస్యలు.

నాకు కాంగ్రెసు ఖైదీలతో కలసియుండే అవకాశం కొద్దికాలంపాటు లభించింది. ఈ సమస్యలనుగురించి వారితో సంభాషిస్తే ఒకటి తేలింది. అసలు పునాదిలోకిపోయి భారతసమాజంలో వర్గాలయొక్క, రాజ్యాంగయంత్రంయొక్క పుట్టుపూర్వోత్తరాలకు చారిత్రక భౌతికవాదదృష్ట్యా వివరిస్తేనే తప్ప వారు తృప్తిపడేట్లులేరు. వారు కొత్తగా రాజకీయాల్లో ప్రవేశించిన యువకులు; నేర్చుకోవాలనీ, అర్థంచేసుకోవాలనీ అభిలాష కలవాళ్ళు.

కాని, అనతికాలంలో కొన్ని సంఘటనలు జరిగినవి. బ్రిటిషు అధికారులు వారినీ, నన్నూ వేరుచేశారు.

నేను జైలునుంచి విడుదలైనతరువాత, ప్రపంచట్రేడ్ యూనియన్ ఫెడరేషన్ పనిమీద యూరప్‌వెళ్ళాను. పుస్తక రచన వాయిదాపడ్డది. కార్మికవర్గంయొక్క దైనందిన పోరాటాల ఒత్తిడి అలాంటిది.

బ్రిటిషు పరిపాలకులు భారతప్రజలకు వ్యతిరేకంగా సాగించదలచిన మిలిటరీ "ఆపరేషన్ పథకాల గుట్టును వెల్లడి

---

* ప్రభుత్వమంటే అర్థం ప్రజాస్వామ్యదేశాల్లో మంత్రులు, ఉపమంత్రులు; రాచరికదేశాల్లో రాజు; పరాధీనదేశాల్లో వైస్రాయి, ఆసని ఫలహోదార్లు, రాజ్యాంగయంత్రమంటే వీరేకాక, అధ్యక్షుడు, పార్లమెంటు, సెక్రటేరియటు, కోర్టులు, జైళ్లు, పోలీసుశాఖ, సైన్యం, ఉన్నతాధికారవర్గం మొదలైనవన్నీ వస్తాయి. ప్రభుత్వం రాజ్యాంగయంత్రంలో ఒక భాగం.

— అనువాదకుడు.

చేసే ఆపరేషన్ ఎసైలం" అనే పుస్తకాన్ని నిషేధించారు. ఆ సందర్భంలో భారతప్రభుత్వపు హోంశాఖాసభ్యుడు సర్దార్ పటేల్ ఆజ్ఞప్రకారం 1947 జనవరి 14వ తేదీన దేశమంతటా కమ్యూనిస్టుపార్టీ, ట్రేడ్‌యూనియన్ల ఆఫీసులన్నీ సోదా చేయబడ్డాయి. ఆ సోదాల్లో యీ పుస్తకం వ్రాతప్రతిలో కొంతభాగమునూ, నోట్సునూ పోలీసులు యెత్తుకుపోయారు. సంస్కృతలిపిలో వ్రాయబడ్డ ఉదాహరణాంశాలను చూచి యేదో గుప్తలేఖనం (కోడ్) అనుకొనివుంటారు. తరువాత, అదృష్టవశాత్తూ వాటిని తిరిగి యిచ్చివేశారు.

చిట్టచివరకు మరో ప్రశ్న—ఎప్పుడో ఋషులకాలం నాటి భారతదేశంలోని కుటుంబమూ, ఆస్తీ, వర్గాలూ, రాజ్యాంగయంత్రమూ, వాటి పుట్టుపూర్వోత్తరాలను గురించి పుస్తకం వ్రాయడం నేడు వృధా కాలవ్యయంకాదా? అని. ఇందుకు సమాధానంగా లెనిన్‌ను ఉదహరిస్తున్నందుకు పాఠకులు మన్నించాలి.

1919 లో స్వెర్డ్లావ్ యూనివర్సిటీ విద్యార్థులకు రాజ్యాంగయంత్రాన్ని గురించి యిచ్చిన ఉపన్యాసంలో లెనిన్ యిలా అన్నాడు:

"......బూర్జువాపండితులూ, రచయితలూ యీ సమస్యలో చిక్కులూ, తికమకలూ కలిగించారు. అందువల్ల శ్రద్ధగా, స్వతంత్రంగా పరిశీలించి గ్రహించగోరేవారెవరైనా యీ సమస్యతో అనేకమార్లు తలపడాలి; మరలమరల పరిశీలించాలి; అనేక కోణాలనుంచి పరిశోధించాలి. అలా అయితేకాని యీ సమస్యను స్పష్టంగానూ, నిర్దుష్టంగానూ గ్రహించడానికి వీలుపడదు. ఈ సమస్య రాజకీయాల కన్న

టికీ ప్రధానసమస్యా, పునాదిసమస్యా కాబట్టి, మరల మరల పరిశీలింపవలసి రావడంకూడా ఒక వీలు. నేడున్న విప్లవ కల్లోల పరిస్థితులలోనే కాక, అత్యంత శాంతి పరిస్థితులలో కూడా, ప్రతి ఆర్థిక, రాజకీయ విషయంలోనూ యే పత్రిక చూచినా యీ సమస్య ప్రత్యక్ష మౌతుంటుంది."

(మార్క్సు, ఎంగెల్సు; మార్క్సిజం, మాస్కో ప్రచురణ, 424 పేజీ)

ఈ సమస్యను గురించి బూర్జువా శాస్త్రకారులు సృష్టించిన గందరగోళాన్ని గురించి లెనిన్ ఇలా అన్నాడు :

"ఈసమస్య యీనాటివరకూ మతసమస్యలతో కలగా పులగం చేయబడుతూ వుంది. మత సిద్ధాంతకారులే యిలా చేస్తే అది వారికి సహజమని వూహకోవచ్చును. ఐతే మాకు మతవిషయికమైన ఆసక్తులేవీ లేవనుకునేవారుకూడా తరచుగా ప్రత్యేకమైన రాజ్యాంగయంత్ర సమస్యను మతసమస్యలతో కలగాపులగంచేసి ఒక సిద్ధాంతాన్ని అల్లడానికి ప్రయత్నిస్తు న్నారు. ఇలా అల్లబడిన సిద్ధాంతం తాత్వికమై ప్రాతిపదిక వివ రణల్లో తరచు క్లిష్టమై వుంటుంది. ఈ సిద్ధాంతం ప్రకారం: రాజ్యాంగయంత్ర మనే దేవో దైవికమనీ, ప్రకృతి కతీతమనీ, మానవకోటి బ్రతుక్కు కారణమైన ఒకానొక శక్తియనీ, మానవునికి సంబంధించని ఒక వెలుపలివస్తువును మానవు నికి కూర్చిపెట్టే దైవాంశసంభూతమైన శక్తియనీ అంటారు. ఈ సిద్ధాంతము భూస్వాములూ, పెట్టుబడిదారులూ మొదలైన దోపిడీవర్గాల ప్రయోజనాలతో సన్నిహితంగాకట్టుబడియుండి, వాటికి దోహదంచేస్తుంది. ఈ సిద్ధాంతం బూర్జువా ప్రతినిధు లైన పెద్దమనుష్యుల ఆచారాలతో, అభిప్రాయాలతో విజ్ఞాన శాస్త్రాలతో లోతుగా గుదిగుచ్చుకుని యున్నది. ఎటు

చూచినా దాని ఛాయలే! రాజ్యాంగయంత్రాన్ని గురించి మెన్షివిక్కుల, సోషలిస్టు రివల్యూషనరీల అభిప్రాయాలు మతాసక్తములైన వంటే వాళ్ళు అసహ్యించుకుంటారు. రాజ్యాంగయంత్రముపట్ల నిర్మమకారదృష్టి కలిగిన వాళ్ళమని వారి విశ్వాసం. అట్టి మెన్షివిక్కులూ, సోషలిస్టు రివల్యూషనరీలూకూడా రాజ్యాంగయంత్రాన్ని గురించిన వారి అభిప్రాయాల్లో ఈ ఛాయలు కనిపిస్తూంటాయి. మిగిలిన వర్గాలన్నిటికన్నా, పాలకవర్గాల ప్రయోజనాల కుపయోగం కాబట్టి ఈ సమస్య యింతగా తికమకలు చేయబడ్డది; క్లిష్టం చేయబడ్డది (దీన్ని మించిన గందరగోళంలో ముంచబడ్డది ఒక్క అర్థశాస్త్రం మాత్రమే.)

(మార్క్స్, ఏంగెల్స్: మార్క్సిజం, మాస్కో ప్రచురణ 425 పేజీ)

మన దేశపు మెన్షివిక్కులూ, సోషలిస్టులూ దీన్ని గుర్తింతురుగాక!

ఈ సమస్య నెలా పరిశీలించాలో వివరిస్తూ లెనిన్ యిలా అన్నాడు :

"ఈ సమస్యను సాధ్యమైనంతవరకు శాస్త్రీయంగా పరిశీలించాలంటే రాజ్యాంగయంత్రంయొక్క పుట్టుకా, అభివృద్ధినీ గురించిన చరిత్రను దిజ్మాత్రంగానైనా పరిశీలన చేయాలి. ఈ సమస్యను శాస్త్రీయ దృక్పథంతో పరిశీలించాలంటే, దీనివెనుకనున్న చారిత్రిక సందర్భమేమిటో విస్మరించకూడదు. ఇది చరిత్రలో యెలా పుట్టింది? దీని అభివృద్ధి క్రమంలో యేయే దశలను గడిచింది? ఈనాడు యిది యే విధంగా పరిణమించింది? అని పరిశీలించాలి. సామాజికశాస్త్రాలకు సంబంధించిన సమస్యలను నిర్దుష్టంగా పరిశీలించే అలవాటు

పట్టుబడాలంటే, అసంఖ్యాకమైన వివరాలతోనూ, లెక్కలేనన్ని విధాలైన పరస్పరభేదాభిప్రాయాలతోనూ తలమునిగి కొట్టుకు పోకుండా వుండాలంటే, యిలాంటి పరిశీలనావిధానాన్ని అనుస రించడం అత్యంత అవసరం."

ఇంకా యిలా అన్నాడు

"రాజ్యాంగయంత్రాన్ని గురించిన సమస్యాపరిశీలన సందర్భంలో కుటుంబమూ, ప్రైవేటుఆస్తీ, రాజ్యాంగ యంత్రమూ-వీటి పుట్టుపూర్వోత్తరాలు" అనే ఏంగెల్స్ గ్రంథాన్ని పరిచయంచేసుకుంటారని ఆశిస్తున్నాను. ఆధునిక సోషలిజాన్ని గురించిన ప్రధానగ్రంథాల్లో యిది ఒకటి. (మార్క్సు, ఏంగెల్స్: మార్క్సిజం మాస్కో ప్రచురణ 426 పేజీ)

అందువల్లనే భారతదేశ చరిత్రలో ఈ విషయాన్నే వివరించబూనుకున్న యీ పుస్తకం పైన వుదహరించిన ఏంగెల్స్ యొక్క గ్రంథాన్ని దగ్గరగా అనుసరిస్తున్నది. దుర దృష్టవశాత్తూ, ఏంగెల్స్ తన ప్రముఖగ్రంథాన్ని రచించిన రోజుల్లో ఇండియాను గురించి వ్రాయడానికి తగినన్ని ఆధా రాలు లేకపోయినవి.

ఈ నాతొలిపలుకులో నేనుపయోగించిన ఆధారాలను చర్చించదలచలేదు. అలాగే నాకు కావలసిన పుస్తకాలూ మొదలైనవాటిని అందించిసాయపడిన అనేకమంది స్నేహితు లకు కృతజ్ఞత తెలపడంలేదు. ఆభాగాన్ని రెండవ సంపుటం ముద్రించే అవకాశం కలిగేనాటికి అట్టిపెడుతున్నాను.

— యస్. ఎ. డి.



# ప్రవేశిక

# భారతదేశ చరిత్ర

## సమకాలిక పరిశీలనా పద్ధతులు

అతి ప్రాచీన యుగాలలో మానవనాగరికతకు కేంద్రాలైన దేశాల్లో భారతదేశ మొకటి. ప్రపంచంలో మొట్టమొదట తిండిమొక్కలు పుట్టిన యేడు దేశాల్లో యిది ఒకటి.* మనుష్యుడు యీ తిండిమొక్కలను యేరి, పెంచి, ప్రపంచమంతటికీ విస్తరింపజేసినది యీ యేడు దేశాలనుంచే. ఆదిమ మానవుడు చతుష్పాత్తైన జంతువునుంచి విడివడి, పనిముట్లను తయారుచేసుకునే రెండుచేతులుగల సామాజిక మానవుడై, ప్రకృతితో పోరాడి, బ్రతికి, ప్రపంచమంతటా విస్తరించినది మొదట యే దేశమునుంచో, యింతవరకూ నిర్ణయంకాకుండా వున్న సమస్యయే. పూర్వమానవుని పుర్రె యెముకల అవశేషాలు చైనా, జావా, యూరపు, ఆఫ్రికా మొదలైన దేశాల్లో దొరకడాన్నిపట్టి, మానవజాతి యెక్కడనుంచి యెటు విస్తరించిందో వూహించడానికి మానుషశాస్త్రజ్ఞులకు వీలు చిక్కింది. భారతదేశానికూడా యీ "ఘనతను" పంచిపెట్టదలచినవారు శైవలిక పర్వతాలనూ ♦ వాటి పరిసర ప్రదేశాలలో జరిగిన పరిశోధనలనూ ఉదహరించి, సగం జంతువుగానూ సగం మానవుడుగానూ వుండే పూర్వమానవుడు మనదేశంలోనూ నివసించాడనే, మానవజాతినీ నాగరి

---

* యన్. ఐ. వావిలావ్. 'Science at Cross - Roads'

♦ యఫ్. బోస్ "మానుషశాస్త్రం" (Anthropology)

కతనూ ఉయ్యాల పొత్తిళ్ళలో లాలించిన ప్రాచీన దేశము మనదికూడానని నిర్ధారణ చేస్తున్నారు. భారతదేశ చరిత్ర పరిశోధకులైన భారతీయ చరిత్రకారులు మన దేశంయొక్క, మన నాగరికతయొక్క ప్రాచీనతను గురించి చాలాపట్టుదల వహించియున్నారు.

భారతీయ రచయితలూ, చరిత్రపరిశోధకులూ, మన ప్రాచీనతను రుజువుచేయడంతోమాత్రమే తృప్తిపడటంలేదు. ఈనాడు ప్రపంచంలో నాగరికమని చెప్పుకోబడుతున్న ప్రతిదీ సైన్సూ, తత్వశాస్త్రమూ, రాజకీయశాస్త్రమూ మొదలైనవన్నీ, ఒకనాడు మనదేశంలో ఉండివున్నవేననీ, మనమెరిగియుండినవేననీ, రుజువుచేయ ప్రయత్నించడం వీరి కొక వేలంవెర్రిగా పరిణమించింది. తత్వశాస్త్రంలో కాంటు గొప్పవాడైతే మన శంకరాచార్యులు అంతకన్నా గొప్ప వాడు. సారస్వతంలో షేక్స్‌పియర్ గొప్పవాడంటే మన కాళిదాసు అంతకన్నా గొప్పవాడు. మీకు రూసోయొక్క సోషల్ కాంట్రాక్టు సిద్ధాంతముంటే మాకుకూడా అలాంటి దొకటి ఉండేది. మాకు విమానాలు, రైళ్ళు, మందుగుండు-ఒకటేమిటి-అన్నీ ఉండేవి. అంతేకాదు, ఇంగ్లీషువాళ్ళూ, యూరపియన్లూ తోళ్ళుచుట్టుకుని తిరిగేరోజుల్లో మాకింత గొప్ప నాగరికత ఉండేది!

పైవిధమైన ఊహాయే నిజానికి మన చరిత్రకారుల ఉత్సాహశక్తి. మనలను చరిత్రనుంచి తుడిచివేయడానికి ప్రయత్నించుతూన్న విదేశశత్రువునుంచి ఆత్మరక్షణచేసుకో డానికి మన పాతగోడలనూ, పాడుపడిన అగడ్తలనూ పైకి త్రవ్వాం. భూర్జపత్రాలనూ, రెల్లు కాగితాలనూ

గాలించాం. నానాటికీ బలపడుతూన్న స్వతంత్రోద్యమాన్ని నీరుకార్చడానికి ప్రపంచ చరిత్రతో పోల్చితే మన ప్రాచీనతా, మనం సాధించిన మహత్కార్యాలూ ఎందుకూ చాలవనే నీరసభావం మన ప్రజానాయకత్వంలో కలగజేయడానికి, బ్రిటిషు పరిపాలకుడు చరిత్ర నుపయోగించాడు. చారిత్రకంగాచూస్తే మన బ్రతుకులు నిరంతరం అపజయాల పాలై విదేశస్థుల పాలనక్రింద పడియుండటమే-యిదీ యిప్పటి వరకూ తెలిసిన మనచరిత్రయొక్క సారాంశం. మన భౌగోళిక వాతావరణ పరిస్థితులూ, మన సంస్కృతీ మనకీదుర్గతులు కల్పించాయని యీ చరిత్ర చెపుతుంది. కేంబ్రిడ్జి చరిత్రనూ,* యితర గ్రంథాలనూ రచించిన చరిత్రకారులు యీ సిద్ధాంతాన్ని ప్రచారంచేశారు-వీళ్ళంతా బాధ్యతకలవాళ్ళుకూడాను. ఈ సిద్ధాంతాన్ని ఖండించడానికనీ, భారతదేశచరిత్ర ప్రపంచ చరిత్రతోపాటే పుట్టిందనీ, నేడు మనదేశంలో విస్తరించి యున్న ఆర్యులు అనేకవేల సంవత్సరాలనాడు ఆర్కిటిక్ ప్రాంతాలనుంచి♦ ప్రపంచమంతటికీ విస్తరించిన ఆర్యులేననీ, భారతదేశంలో ఆర్యులు సాధించిన మహత్కార్యాలు ఇంత వరకూ మానవుడు సృష్టించినదానిలోకెల్లా ఉత్తమమైనవనీ

---

* ఫ్రేజర్ "Introduction to Ancient History"

♦ తిలక్ "Arctic Home in the Vedas"

తిలక్ తన సిద్ధాంతంప్రకారం "హిమప్రళయాల మధ్యకాలపు ఆర్య సంస్కృతి మామూలుగా ఊహిస్తున్నదానికన్నా ఉచ్ఛస్థితిలో ఉండేదని, ఈజిప్టులో చరిత్రకు పూర్వం నివసించిన ఆదిమవాసుల సంస్కృతికీ, నాగరికతకూ మన ఆదిమ ఆర్యుల సంస్కృతీ నాగరికతలు సమానములని నిర్ణయించడానికి అభ్యంతరాలు లేవనీ" ఋజువు చేశానన్నారు.

(పేజీ 464-ముద్రణ 1925)

ఆ పరిశితులను భవిష్యత్తులోకూడా మానవుడు మించిపోలే డనీ ఋజువు చేయబూనుకున్నారు. మన చరిత్రకారులు ఓట మిని ఎరుగరు.

ఈ విధమైన చరిత్రరచన బ్రిటిషు ప్రభుత్వ వ్యతిరేక పోరాటానికి దోహదమిచ్చిందనడంలో సందేహంలేదు. దీని వల్ల భారత జాతీయవాదికి ఒకవిధమైన మనోదండిని కలుగ జేసి నప్పటికీ దానితోపాటు గతాన్ని గురించి తప్పు విలు వలను యిచ్చింది. గతంలో జరిగిన దాన్నంతటినీ మూఢ భక్తితో కొలవడంవలన వర్తమానానికి నిరుపయోగం కావ డమేకాక, ప్రత్యక్షమైన అవరోధంగాకూడా తయారైంది.

'శివాజీ అఫ్‌జల్‌ఖానుని చంపడంలో నీతి ఉందా, లేదా? బుద్ధిపూర్వకంగా హత్యచేశాడా? లేక కుట్రచేసి చంపాడా? యుద్ధనీతిప్రకారం అలా హత్యచేయడం చెల్ల దగిందేనా?' ఇలాంటి చర్చలతో పెరిగిన సవాలక్ష గ్రంథమూ చూస్తే నేటి విద్యార్థులకు నవ్వు రాకమానదు. శ్రీ జయస్వాల్ ప్రాచీన హైందవ సమాజాన్ని (*Ancient Hindu Polity*) గురించి రచించిన మహాగ్రంథం, ప్రాచీన భారతదేశంలో రిపబ్లిక్కులుండేవనీ, "స్వపరిపాలిత ప్రజా తంత్రాలుండేవనీ" రుజువుచేసి, భారతదేశం పార్లమెంటరీ ప్రజాతంత్ర వ్యవస్థలకు పనికిరాదని బ్రిటిషు పాలకవర్గాలు చేసే నిర్ధారణలను ఖండించడానికే వ్రాయబడ్డది. బ్రిటిషు పాలకులు గ్రీక్, రోమన్ నాగరికతలకు తామే వారసుల మంటారు; ప్రాచీన నాగరికతలలో ప్రథమస్థానం తమదీ, ఈజిప్ట్, పాలెస్టయినులదీననీ అంటారు. మహాభారతానికి ఒక

అర్థంకానీ, వాస్తవికత కానీ లేదనీ, హైందవ వేదాంతాలకు చారిత్రక ప్రతిపత్తి లేదనీ, భారతదేశ విజేత అలెగ్జాండరును కన్న గ్రీసు దేశచరిత్రయే భారతదేశ చరిత్రకన్నా ప్రాచీన మని వారి వాదన.

మన మేధావులకు రేచిక్కెత్తిపోయింది. మనకు రెల్లు కాగితపు రికార్డులు (*Papyrus*) లేవు; గ్రైజెట్ గోపురాల (*Pyramids*) లాంటివి వుంటే తిరుగులేని సాక్ష్యంగావుండేవి. అఖ్నాటన్, ట్యూటన్ ఖామెన్, మమ్మీలూ (*Mummies*) లేవు. ఉర్ బాబిలన్‌లలాంటి పట్టణాలైనా బయటపడలేదు. విదేశ పరిపాలకుల పురాతత్వ పరిశోధన శాఖ కీ విషయంలో శ్రద్ధ తీసుకొనవలసిన అవసర మేముంది? ఇలాంటి పరిస్థితు లలో మన ప్రాచీనత్వాన్ని రుజువు చేసుకొనడం యెలాగు? ప్రభుత్వ సహాయంగానీ, దేశంలో ధనికుల సహాయంగానీ లేకుండా, స్వతంత్రంగానే చరిత్ర సామాగ్రిని సేకరించుకో డానికి మన చరిత్ర పరిశోధకులు పాటుపడ్డారు. బ్రాహ్మణు లకు రాజులిచ్చిన దానాలనూ, రికార్డుచేసిన రాగిరేకులనూ, శిలా శాసనాలనూ, నాణాలనూ, అశోక స్తంభాల లాంటి వాటిపైన వ్రాసిన వ్రాతలనూ సేకరించారు. మత గ్రంథా లలో ఉదహరించిన ఖగోళశాస్త్ర విషయాల సహాయంతో మనచరిత్ర స్మృతులను క్రీస్తుకు పూర్వము 3000 లేదా 4000 సంవత్సరాలవరకూ నెట్టుకెళ్ళారు. కాని యీ నిర్ణ యాలకు చారిత్రక ప్రతిపత్తి యీయబడలేదు.♦

---

♦ తిలక్ రచించిన "Orion-మృగశిర", దీక్షిత్ రచించిన "వేదాంగ జ్యోతిషము", భారత యుద్ధకాలము, వేదకాలము నిర్ణయించే వివిధ

చిట్టచివరకు సింధురాష్ట్రంలో "మొహంజోదారో" పట్టణం బయటపడ్డది. మన నాగరికత క్రీ. పూ. 3000 యేళ్ళ నాటిదని మన యూరపియన్ ప్రభువులుకూడా అంగీకరించక తప్పలేదు. ఈజిప్ట్, గ్రీస్, రోమన్, చాల్డియన్ మొదలైన దేశస్తులకన్నా మనం తక్కువ ప్రాచీనులం కాము! మనది కూడా ప్రాచీనదేశం; మనం ప్రాచీన ప్రజలం. మనము చరిత్ర, గొప్ప విజ్ఞానమూ కల్గిన మేధా సంపన్నులం; అంటే మనమూ బ్రతుకగలం, పోరాడగలం, నిలువగలం, ముందుకు నడవగలం అన్నమాట.

మన చరిత్ర గ్రంథజాలంయొక్క అభివృద్ధినిగానీ, మన గత చరిత్రను క్రమబద్ధంగా నిర్మించడానికి మన మేధావులు చేసిన అఖండమైన కృషినీ, త్యాగాన్నికానీ సమీక్ష చేయడం ఇక్కడ సాధ్యంకాదు. తిలక్, రాజవాడే, రెనడే, జయస్వాల్, పావాగి, కుంటె, భండార్కర్, కేత్కర్ మొదలైనవారూ, మరికొందరు యూరపియనులుకూడా భారతదేశ చరిత్రను అనుస్యూతంగా వ్రాయడానికి ప్రయత్నించారు. ఇలా ప్రయత్నించిన వారినందరినీ యిక్కడ పేర్కొనడం కూడా సాధ్యమైన పనిగాదు. వీరి పరిశోధనలకు సంబంధించిన కొంత ముడిసామాగ్రి అచ్చైందికూడా. కాని యింతవరకు జరిగినదంతా భారతదేశ చరిత్రను గురించి యూరపియన్ చరిత్రకారులు అంటే బ్రిటిషు చరిత్రకారులు కల్పించిన

---

గ్రంథకర్తల చర్చలూ చూడదగినవి. వేదాలు క్రీ. పూ. 1500 నాటివనీ, భారతయుద్ధం క్రీ. పూ. 1000 నాటిదనీ యూరపియన్ చరిత్రకారులు నిర్ణయిస్తున్నారు. కాని సుమేరియన్ ఈజిప్షియన్ మొదలైనవారి ప్రాచీనత క్రీ. పూ. 4000-6000 మధ్యకాలపుదనీ నిర్ణయించారు.

దృక్పథాన్ని ఖండించడానికే జరిగింది. అంటే చరిత్ర రచన జాతీయపోరాటంలో ఒక ఆయుధంగా పరిణమించింది. 19 వ శతాబ్దంలో దానిని అలాగే వుపయోగించారు కూడా.

వారి దృష్టిలో చరిత్రఅంటే, అంతవరకు కనిపెట్టబడ నటువంటివీ, కనిపెట్టినా తప్పుగా ఉపయోగించి నటువంటివీ అయిన కొన్ని కొన్ని సంఘటనలనో, చరిత్ర సత్యాలనో కని పెట్టడమే కాదు. ఉద్దేశరహితమైన ఆవిష్కారమూ కాదు. యుద్ధరంగంలో సైన్యాలను విన్యస్తం చేసినట్టు, చారిత్రక సంఘటనలను యేర్చికూర్చేవారు. అవన్నీ సత్యాలే. కాని వాటిని శత్రువుతో పోరాడటానికి తగినవిధంగా కూర్చారు.

అఫ్‌జల్ ఖానుణ్ణి చంపినమాట నిజం. కాని యీ సత్యాన్ని సరియైన సందర్భశుద్ధితో వివరించాలి. శివాజీ నమ్మక ద్రోహియనీ మహారాష్ట్రులంతా అలాంటి నీతి తక్కువవాళ్ళనీ చెప్పే ఇంగ్లీషువాళ్ళలాగా వాదించ గూడదు. అశోకస్తంభము ప్రత్యక్షంగా కంటికి కనపడు తున్నదే. దాని కాలనిర్ణయంప్రకారం రెండువేలయేళ్ళనాడు మనం అంతటి ఉదాత్తధర్మాలను ప్రచారం చేశాం. మన కంతటి మంచి రాజ్యవ్యవస్థ వుండేది. మరిన్నీ ఐదువేల యేళ్ళనాటి 'మొహన్‌జోదారో' యిటుకా, పెంకూ, స్నానపుగదులూ కల పట్టణం కాబట్టి మీరు రాకపూర్వం మాకు నాగరికత లేదనవద్దు. మీరులేకపోతే మరల మేమ లాంటి ఘనకార్యాలు చేయలేమనీ అనవద్దు.

19వ శతాబ్దపు ఉత్తరార్ధభాగంలోనూ, 20వ శతాబ్దం లోనూ, మన పండితుల దృష్టికి చరిత్రరచన అనేది

సామ్రాజ్యవాద శత్రువుపై భారతజాతీయత జరిపిన పోరాటంలో ప్రయోగింపవలసిన ఆయుధం. ప్రాచీనతా, వంశవృక్షమూ, పూర్వపుశక్తి మేధస్సుల బలంతో మనం స్వాతంత్ర్యానికి అర్హులమని ఋజువుచేయడమూ, తద్వారా పాలకులను దురాక్రమణదారులను లొంగకుండా యెదిరించేట్లు ఉత్సాహ పరచడమూ, మన మహోజ్వల చరిత్రలో యెలాగో అలాగే నేడుకూడా మనం అన్నిటికీ తట్టుకుని విజయం సాధించగలమనే ఆత్మవిశ్వాసాన్ని కలుగజేయడమూ, యివీ ఆనాటిచరిత్ర రచనలో గల ఉద్దేశ్యాలు.

అయితే చరిత్రరచనలో యిలాంటి దృక్పథంవల్ల కొంత మనోనిబ్బరాన్ని, ఆత్మవిశ్వాసాన్ని కలుగజేయడం మినహా మరో ప్రయోజనం లేకపోయింది.

ఇక్కడ ఒక్కప్రశ్న. ఈ మేధావులు యెవరిప్రతినిధులు? వీరు మనోనిబ్బరాన్ని, ఆత్మవిశ్వాసాన్ని యెవరికి కలిగిస్తున్నారు? ఒక్కటిమాత్రం చరిత్ర తెల్పినసత్యం; మొదటి ప్రపంచ యుద్ధానంతర సంక్షోభకాలంవరకూ, బ్రిటిషు అధికారానికి వ్యతిరేకంగా సాగుతూ వచ్చిన విప్లవోద్యమాలలో భారత ప్రజాసామాన్యంలోని అత్యధికభాగం పాల్గొనలేదు. 1905 నాటి సంక్షోభంవరకూ, జాతీయోద్యమాన్ని నడిపిన మేధావులు ప్రజాసామాన్యం దగ్గరకు పోవడంకానీ, వారికి వుత్సాహాన్ని కలుగజేయడం కానీ, పోరాటానికి అవసరమైన నినాదాలను యివ్వడంకానీ జరగలేదనేచెప్పాలి. ఆనాటి మధ్యతరగతి నాయకత్వమూ, మితవాదపు బూర్జువావర్గమూ వారి చారిత్రక రచనలలో అధినివేశ ప్రతిపత్తి (Dominion Status) కొరకు కార్యక్రమ ప్రణాళికలను రూపొందిస్తు

న్నారు; అంటే సామ్రాజ్యవాద పరిపాలకవర్గాల ఆర్థిక విధానమూ, పార్లమెంటరీ ప్రజాతంత్రమూ మొదలైనవాటి కొరకూ, వారితో సమానమైన పాలకవర్గ హోదాకొరకూ తమకుగల అర్హతలనూ, హక్కునూ ప్రతిపాదిస్తూ ఉన్నారు.

అప్పుడప్పుడే తలెత్తుతూన్న బూర్జువావర్గమూ, వారి మేధావి ప్రతినిధులూ, తమయొక్క వర్గప్రయోజనాలనూ, జాతీయప్రయోజనాలనూరూపొందించడానికీ, వాటిని చారిత్రకంగా సమర్థించడానికీ వీలుగా భారతదేశచరిత్రకు తగిన నిర్వచనాలిచ్చారు. ఆనాటి చరిత్రగ్రంథాలలో ఏ కొన్నింటిని చూచినా, ఆనాటి చరిత్రకారుల నెవరిని తీసుకున్నా యీ విషయం స్పష్టపడుతుంది. ఆనాటి భారత పెట్టుబడిదారీవర్గం తమ ప్రయోజనాలవిషయం యింకా యేకాభిప్రాయానికి రాలేదు. అప్పటికి వారి కా స్థాయి రాలేదు. బ్రిటిషుప్రభుత్వ వ్యతిరేకమైన రాజకీయపోరాటంలో యే కార్యక్రమ ప్రణాళికను నిర్ణయించాలి, ఏ పద్ధతులను అనుసరించాలి అనే విషయాలు వచ్చేటప్పటికి వారిలోగల బలహీనతలూ, వైరుధ్యాలూ, పరస్పర వ్యతిరేక రాజకీయ ప్రణాళికలూ ముందుకు తోసుకొచ్చినవి. ఇవన్నీ వారి వ్రాతల్లో ప్రతిబింబించినవి. ఒక్కవిషయంలో మాత్రం అన్నివర్గాలు యేకాభిప్రాయానికి వచ్చినవి. భారతదేశంయొక్క ప్రాచీనతా, రాచరికపారంపర్యమైన ఆధిక్యతా, ఆనాటి ధనధాన్యసమృద్ధీ, బుద్ధిసంపదా, నేటిదారిద్ర్యమూ, దైన్యమూ, వీటిని గురించిన చారిత్రక సారాంశాల్లో యేకాభిప్రాయముండేది. కాని నేటి పోరాటంలో ఎలాంటి సాంఘిక, రాజకీయ సాధ

నాల నుపయోగించాలి? వాటిని యేనాటి చారిత్రకఘట్టం నుంచి సేకరించాలి? అనే సమస్యలు వచ్చేసరికి భారత బూర్జువావర్గమూ, వారి మేధావులు అభిప్రాయభేదాలుకల్గి వేర్లుపడ్డారు. పాతచరిత్రనుగురించిన యేకాభిప్రాయం కాస్తా భగ్నమైపోయేది; అప్పుడు మరల చారిత్రక సంఘటనలూ, వ్యక్తులూ, చారిత్రకఘట్టాలూ చర్చలోకొచ్చేవి; చరిత్రలు తిరిగి వ్రాశేవారు. ఈ వ్రాతలు రెంటినిబట్టి ఉండేవి. ఒకటి-సామ్రాజ్యవాద వ్యతిరేకపోరాటంలో ఆ యా బూర్జువా ముఠాలు నిర్దేశించుకున్న రాజకీయ ప్రణాళికలు. రెండు-సామ్రాజ్యవాద బూర్జువాలక్రిందా, జాతీయ బూర్జువాల క్రిందా, రెండువిధాలా దాస్య మనుభవిస్తూన్న భారత కష్ట జీవి ప్రజాసామాన్యముపట్ల దోపిడీవర్గమైన భారత భూస్వామ్య పెట్టుబడిదారీకూటమి అవలంబించే వైఖరి.

ఇంగ్లీషువాళ్ళు మొగలులనూ, మహారాష్ట్రులనూ యెలా జయించగలిగారు? భారతదేశాన్ని జయించడానికి జరిగిన చివరియుద్ధాల్లో ఇంగ్లీషువాళ్ళు మహారాష్ట్రులతో చాలా తీవ్రంగా పోరాడవలసివచ్చింది. ఇంగ్లీషువాళ్ళు అలాంటి మహారాష్ట్రులను యెలా జయించగలిగారు? బ్రిటిషువాళ్ళకు పూర్వం భారతదేశాన్ని జయించిన ప్రతిభా శక్తివంతులు మొగలులు. అలాంటి మొగలులను మహారాష్ట్రులు శివాజీ నాయకత్వంక్రింద జయించగలిగారు. మొగలులను జయించ గలిగిన మహారాష్ట్రులు ఇంగ్లీషువాళ్ళ కెందుకోడారు? బ్రిటిషు దురాక్రమణను ప్రతిఘటించడానికి అవసరమైన కార్యక్రమ విధానాలను నిర్ణయించుకోవల్సివచ్చిన సందర్భంలో ఇలాంటి

సమస్య లుదయించాయి. ఈ రెండు సమస్యలకూ సమా ధానాలు దొరికితే బ్రిటిషు విజేతలనుంచి స్వాతంత్ర్యం పొంద డానికి సాధన విధానాలను నిర్ణయించుకోనవచ్చును. ఈ సమ స్యలలో చరిత్రకారులు శ్రద్ధాసక్తులతోనూ, నూతనోత్సా హంతోనూ నిమగ్నులైనారు. మొగల్ మహారాష్ట్ర సంబం ధాలు ఇటీవలి జ్ఞాపకాలుగానూ, సమాజానుభవంలో భాగం గానూ ఉండటంవల్ల మధ్యతరగతి మేధావులూ, బూర్జువా జాతీయ పత్రికలూ వీటి పరిష్కారం విషయంలో యెక్కువ శ్రద్ధ చూపినవి.

మనకు చారిత్రకసామగ్రి యెక్కువగాలేదు. దానికితోడు బ్రిటిషుపాలకులు ప్రతిబంధకాలు కల్పించుతున్నారు. అందు వల్ల చరిత్ర పరిశోధన కష్టసాధ్యమైపోయింది. మహారాష్ట్ర పరిపాలన నాటి రికార్డులుండే పురాగ్రంథ భాండారాల్లోకి అధికారవర్గాలు చరిత్ర పరిశోధకులకు ప్రవేశమీయలేదు. మొగలు, మహారాష్ట్ర శిథిల సామ్రాజ్యాలకు వంశవారసులైన వాళ్ళుకూడా తమ కన్యాయంగా సంక్రమించిన సంస్థానాధి పత్యాలు ఊడిపోతాయనే భయంవలన, బ్రిటిషు అధికారులకు విశ్వాసపాత్రమైన మార్గమే అవలంబించారు. వారూ తమ పురాగ్రంథ భాండారాల్లోకి చరిత్ర పరిశోధకులను ప్రవేశించ నీయలేదు. జమీందారీ, భూస్వామ్య, సామంత వంశాల వారూ చరిత్రకారులను దగ్గరకు రానియలేదు. వీళ్ళందరూ తమ వంటగదుల్లో పడియున్న అస్తిపంజరాలెక్కడ బయట పడతాయోనని భయపడ్డారు. పూర్వచరిత్ర రహస్యాలు ప్రజలకు తెలుస్తాయేమోనని వీరి భీతి. ఇన్ని ప్రతిబంధకా లున్నప్పటికీ, చరిత్ర పరిశోధకుల కృషి కొంత ఫలించింది.

చరిత్ర పరిశోధనారంగంలో కుస్తీలూ, యుద్ధాలూ ప్రారంభ మైనవి. భారతీయ చరిత్ర పరిశోధకులు, భారతదేశ చరిత్రను గురించిన ప్రసక్తి యెత్తగలగడానికి పూర్వమే, బ్రిటిషు చరిత్రకారులు దోపిడీ, దురాక్రమణా జరిగేరోజుల్లో తమచేత బడ్డ సామగ్రిని ఉపయోగించి భారతదేశచరిత్ర గ్రంథాలను వ్రాశారు. ఎల్ఫిన్‌స్టన్, గ్రాంటుడఫ్, బ్రిగ్స్, టాడ్, మోర్లాండు మొదలైనవాళ్లు రాసిన గ్రంథాలద్వారా ప్రపంచానికి భారతదేశ చరిత్ర యీపాటికే నేర్పబడుతూవచ్చింది.

వీరి తరువాత వచ్చిన భారతీయ చరిత్రకారులు భారతదేశ చరిత్రను గురించీ, చారిత్రక సంఘటనలను గురించీ, విదేశ రచయితలు చేసిన తప్పుడు నిర్వచనాలనూ, అబద్ధ ప్రచారాలనూ యెదుర్కొనవలసి వచ్చింది. కాని తమ దృక్పథాలను వివరించవలసి వచ్చేటప్పటికి తికమకలుపడ్డారు. మనమాట్టే యెక్కువ గర్వపడతగిన ఫలితాలను సాధించలేక పోయారు. అయితే, దేశీయ మితవాద బూర్జువావర్గం భవిష్యత్తులో తమ కార్యక్రమ ప్రణాళికకు ఉపయోగించుకోదగిన కొన్ని సారాంశాలను మాత్రం తేల్చారు.

పెద్ద పెద్ద పరిశోధనా గ్రంథాలను వదిలేసి సాధారణ ధోరణిని ప్రతిబింబించే యే కొలది గ్రంథాలను మనం పరిశీలించినా, శత్రువులపై పోరాటంలో ఉపకరించాలనుకున్న భారతదేశ వివరణలో, మన బూర్జువా మేధావులు యెలాంటి దృక్పథాన్ని అనుసరించారో సులభంగా తెలుసుకొనవచ్చును.

శివాజీ నాయకత్వంక్రింద మహారాష్ట్ర విజృంభణ విజయం పొందడానికి గల కారణాలేవో వివరిస్తూ, బొంబే

హైకోర్టు న్యాయమూర్తియైన మహాదేవ గోవింద రెనడే "మహారాష్ట్ర రాజ్య విజృంభణ (Rise of the Maharata Power)" అనే గ్రంథాన్ని వ్రాశాడు. 1918 లో మితవాద వర్గానికి చెందిన ప్రముఖ పండితుడూ, వ్యాసకర్తా అయిన ఎన్. సి. కేల్కార్ ఇంగ్లీషువాళ్ళు మహారాష్ట్రుల నెలా జయించారో వివరించడానికి "మహారాష్ట్రులూ-ఇంగ్లీషువాళ్లూ (The Maharatas and the English)" అనే గ్రంథాన్ని రచించాడు. పానిపట్టువద్ద మహారాష్ట్రుల ఓటమి, శివాజీ విజృంభణకు కారణమైనశక్తియుక్తులు; మహారాష్ట్ర ప్రభుత్వ సంస్థలలో చెలరేగిన కులకక్షలూ, వ్యక్తికుట్రలూ; ఇంగ్లీషు వాళ్ళ ఆయుధసంపత్తీ, టెక్నిక్కూ మొదలైన విషయాలను గురించిన సమాచారాన్ని సేకరించి, అనేక పెద్దపెద్ద పరిశోధక గ్రంథాలను ప్రచురించాడు. మేజర్ బాసు "ఇండియాలో క్రైస్తవరాజ్య విస్తరణ" అనే గ్రంథాన్ని రచించాడు. ఇకను 1857 స్వాతంత్ర్య యుద్ధాన్ని గురించి వెలువడ్డ పుస్తకాలనేకం. భవిష్యత్తులో పోరాటాలకు మార్గదర్శికాలుగా ఉండడానికి ఈ రచనలు అనేక సారాంశాలను తేల్చినవి. ఆనాటి మన ఆధునిక మేధావులు చరిత్ర నెలా అర్థం చేసుకున్నదీ, యీ సారాంశాలను పరిశీలిస్తే తెలుస్తుంది.

16, 17 శతాబ్దాలనాటి మత ప్రవక్తలూ, వారి అనుచర బృందాలూ, నాటి హిందూ సమాజంలోని పౌరోహిత వర్గాల నైతికపతనానికి వ్యతిరేకంగా వారు సాగించిన మత ప్రబోధక ధర్మయుద్ధాలూ, మహారాష్ట్ర రాజ్యవిజృంభణ విజయాలకు కారణములని రెనడే అంటాడు. యూరప్‌లో

కేథలిక్కు మత ప్రాబల్యానికి వ్యతిరేకంగా వర్ధిల్లిన రిఫర్మేషన్ ఉద్యమాన్ని ఆధారంచేసుకుని నూతన సమాజాలూ, నూతన రాజ్యాలూ యేర్పడినట్లే మనదేశంలో మహారాష్ట్ర రాజ్య విజృంభణకు నాటి "భక్తి" మతోద్యమాలు కారణభూతా లైనాయంటాడు, చరిత్రకు మతమే గమనశక్తియని రెనడే పరిగణించాడు. అయితే యీ పరిణామానికి దోహదమీయ డానికి శివాజీలాంటి మహావ్యక్తి సాధనమాత్రుడుగా ఉండ వలసి వచ్చింది. రజ్వాడే మొదలైన యితర చరిత్రకారులు మతమే చరిత్ర గమనానికి కారణమని అంగీకరించినప్పటికీ, అట్టి నూతనమత ప్రబోధనకూ, జాతి పునరుద్ధరణకూ ప్రతి నిధులైన వ్యక్తులెవ్వరు ? రామదాస స్వామియా ? శివా జీయా ? లేక మరొకరా ? అన్న విషయంలో భేదించారు. మహారాష్ట్రుల దొక ప్రత్యేకమైన "ఉపజ్ఞ" అంటాడు రెనడే. దాన్నతడు మహారాష్ట్ర ధర్మమని పేర్కొన్నాడు. ఆ మహారాష్ట్ర ధర్మముకూడా చరిత్ర గమనశక్తుల్లో ఒకటి అన్నాడు. ఐతే మహారాష్ట్రులు బ్రిటిషువాళ్ళ చేతుల్లో ఎందుకు ఓడిపోయారు ? అనే ప్రశ్న వచ్చేసరికి మత భ్రష్ట త్వమే ఓటమికి ప్రధాన కారణమని చెప్పకపోవడం విచి త్రంగావుంది. క్రైస్తవమత స్వీకారోద్యమంవల్లనే తద్వార ప్రినాదాలవల్లనే తాము జయించినామని భారతదేశం తమ ఒడిలో ఊడిపడినదని బ్రిటిషువాళ్ళు చెప్పలేరు. బహుశా యిదే మహారాష్ట్రుల ఓటమికి మతభ్రష్టత్వాన్ని కారణమని చెప్పకపోవడానికి కారణమై ఉండవచ్చు. కేల్కార్ మరో రకంగా వాదించాడు. మహారాష్ట్రులలో సమష్టి జాతీయతా భావం తక్కువ; యెవరికివారే

యమునాతీరే అన్నట్లు, వ్యక్తిపరమైన బిగుకునందలి ప్రేమమెక్కువ; ఇంగ్లీషువాళ్ళలో సమష్టిభావం ఎక్కువ బలంగాఉంది; వ్యక్తిపరమైన విడబాటు తత్వం వారిలో లేదు; ఈ భేదంవలన మహారాష్ట్రులు ఓడిపోయినారు, ఇంగ్లీషువాళ్లు గెలిచారు-ఇదీ కేల్కారు వాదధోరణి. కాని ఇంగ్లీషువాళ్ళ చరిత్రనుబట్టి చూస్తే వారికి యిలాంటి విజయకారణాలైన గుణగణాలు పూర్వం లేవు. మరి 17, 18 వ శతాబ్దాలలోనే యిలాంటి గుణగణాలు వీరి కబ్బడానికి కారణమేమో కేల్కారు మొదలైనవాళ్ళు వివరించడానికి ప్రయత్నించలేదు. బి. డి. బాసు మరో కారణాన్ని ఉద్ఘాటిస్తున్నాడు;అబద్ధాలకూ,కుట్రలకూ దగాబాజీతనానికీ ఇంగ్లీషువాళ్ళది అందెవేసిన చేయి; భారతదేశంలోని రాజులూ, మహారాజులూ యిలాంటి దుర్గుణాలను యెరుగరు. అందువల్ల యింగ్లీషువాళ్ళు గెలిచారు—మనరాజులూ, మహారాజులూ ఓడిపోయారు—అనేది బి. డి. బాసు వాదన. చరిత్ర గమనమంతా మనుష్యుల భావనల వలనా, రాజనీతి దురంధరులయొక్క, నాయకులయొక్క, వ్యక్తిగతసుగుణ దుర్గుణాలవలన నియమితమై నడుస్తుందనేది యీ వాదన లన్నిటియొక్క సారాంశము. కోటానుకోట్లుగా ఉన్నకష్టజీవి ప్రజాసామాన్యమూ, యుగయుగాలుగా జరిగిన వారి సామాజిక వ్యవస్థల పరిణామమూ అంతా చరిత్రలో వచ్చే "వీరపురుషులు, గురువులు, అవతారపురుషులూ" ఇలాంటి వారియొక్క వ్యక్తిగత ఇష్టాయిష్టాలమీదా, నైతిక భావాలమీదా, మతవిశ్వాసాలమీదా ఆధారపడియున్నదని యీ వాదనల భావము. అపూర్వ వ్యక్తుల మహత్తే చరిత్రకు

గమన శక్తియని కొందరన్నారు; ఒక కులముయొక్క, ఒక జాతియొక్క స్వతస్సిద్ధ గుణాలని మరికొందరన్నారు.

కాని, యీ భావాలూ, విలువలూ, నీతులూ, విశ్వాసాలూ ఎలాపుట్టాయి? ఎలా గతించాయి? మరల అవెలా పుట్టాయి? ఒకదేశంలో ప్రవర్తిల్లే భావసముదాయం మరో దేశంలో ప్రవర్తిల్లుతూన్న అదే భావసముదాయాన్ని యెలా తోసిపుచ్చగలుగుతున్నది? ఈప్రశ్నలకు పై వాదనలేవీ సమాధాన మీయడంలేదు. అంతా ఛాన్సు, యాదృచ్ఛికము, విధిలిఖితము. కాబట్టి యిలాంటి వాదనల పర్యవసానం, మానవ సమాజానికి తన భవిష్యత్తును క్రమబద్ధంగా దిద్దుకునే ఆశ లేకుండా పోవడమే అవుతున్నది.

ఈ ధోరణిలో మన చరిత్రకారులు తమకు విద్యావిజ్ఞానాలను గరపిన విదేశీ గురువులను అనుకరించారు. అంతవరకే. వీరు కార్లైల్, బర్క్, బెన్‌థామ్, గ్రీన్, హెగెల్ మొదలైనవారికి శిష్యులు. ఈ తత్వశాస్త్రజ్ఞులు తమతమ దేశచరిత్రలకు ఆధ్యాత్మిక, కర్మసిద్ధాంతదృష్ట్యా నిర్వచనాలిచ్చారు. ఆ సిద్ధాంత నిర్వచనాలనే మన చరిత్రకారులు అందుకుని వాటిని అదేరూపంలో మనచరిత్రకు వర్తింపచేశారు. మనలను జయించిన విదేశీయ బూర్జువాలయొక్క చరిత్ర, సిద్ధాంతాలను పరిగ్రహిస్తున్నామేయని మన మహాపండితులు సంకోచింపలేదు. కారణమేమంటే, మన దేశపు సమాజమే చితికి, ముక్కలై విజేతలైన సామ్రాజ్యవాద దేశపు బూర్జువాసమాజ ప్రతిబింబంగా పునర్నిర్మాణం చేయబడుతున్నది.

పైనచెప్పినట్లు, ఇటీవలి బ్రిటిషుకాలపు చరిత్రను పరిశోధించినమూలంగా, అప్పుడప్పుడే పుట్టి పెరుగుతూన్న స్వదేశీ బూర్జువావర్గానికీ, మేధావిబృందాలకూ, రాజకీయ సామాజిక ప్రణాళికను తయారుచేసుకోడానికి వీలుకలిగింది. దేశ దుర్గతి కంతటికీ ప్రజాసామాన్యమే కారణమనేవాళ్ళు మూఢవిశ్వాసాలనూ, సంకుచిత కులతత్వాలనూ రూపు మాపితేనే తప్ప, దేశానికి పురోభివృద్ధి కలుగదన్నారు. ఫ్యూడల్ జమీందారీయుగపు వ్యక్తిపరత్వమే మన ఓటమికి కారణమనుకొనేవాళ్ళు ఫ్యూడల్ వంశ గౌరవ ప్రయోజనాల సరిహద్దులను దాటి, సమష్టి జాతీయతాభావ మలవరచుకొనడమే తరుణోపాయ మన్నారు. ప్రజలు వొట్టి మట్టిముద్దలు; "వీరపురుషులు, నాయకులు, అవతారపురుషులు" మొదలైనవారి భావాలూ, ఆదర్శ జీవితాలూ ప్రజలను తగిన విధంగా తీర్చిదిద్దుతాయి. కాబట్టి ప్రజలు మహాపురుషుల యెడల భక్తి విశ్వాసాలూ, అణకువా కలిగి అనుసరించుతుండాలి. అంతకుమించి వారికి మరోపాత్ర లేనేలేదు.

మతాతగాదాలుకూడా చారిత్రకంగా సమర్థించబడ్డాయి. పీష్వాలు నాయకత్వం వహించిన రోజుల్లో మహారాష్ట్రులు ఓడిపోయినారు; పీష్వాలు బ్రాహ్మణులు; కాబట్టి బ్రాహ్మణప్రమేయమున్న ఏ రాజకీయ నాయకత్వాన్నైనా నమ్మకూడదని బ్రాహ్మణేతరపక్షం(Non-Brahmin Party) వాదించింది. కాయస్థులు బ్రాహ్మణులపై పోరాడటానికి పూర్వచరిత్రలను ఉదహరించారు. అందులోనూ చివరకు సంస్కృతభాషాశాస్త్రంకూడా(Philology) ఒక ఆయుధంగా

ఉపయోగించబడ్డది. నిమ్నజాతులవారు "కోరెగాంవ్"* యుద్ధములో తాము నిర్వహించిన పాత్రతో ప్రారంభించి, హిందువుల సాంఘిక రాజకీయ విధాన ప్రబంధమైన మనుస్మృతిని నిరసిస్తూ, తమ ప్రణాళికను రూపొందించారు.

ఇలా రాజకీయపార్టీల ప్రస్తుత నినాదాలనూ, కార్యక్రమప్రణాళికలనూ రూపొందించడానికీ, సమర్థించడానికీ గతచరిత్ర ఉపయోగింపబడుతూ వచ్చింది. పూర్వపు జయాపజయాలనుంచి నేర్చిన గుణపాఠములు ప్రస్తుత విజయానికి తోడ్పడాలని ఆ యా పార్టీలవారు ఆశించారు. అంటే, చరిత్ర పరిశోధనలోనూ, రచనలోనూ బూర్జువా మేధావులు ఒక ప్రయోజనాన్ని నిర్దేశించుకున్నారు; ఒక నిశ్చితమైన పాక్షిక దృష్టిని అనుసరించారు. వీరి యీ దృక్పథం ప్రకారం, అసంఖ్యాక ప్రజాసామాన్యం నిరంతరం కష్టించడమూ, ఈ నాయకుని ప్రక్కనో ఆ నాయకుని ప్రక్కనో పోరాడటంతప్ప చరిత్రలో వారికి మరోపాత్ర లేదు.

కాని, త్వరలోనే గతచరిత్ర తత్వశాస్త్రజ్ఞులకూ, ఆధునికచరిత్రకు చెందిన బూర్జువా నాయకత్వానికీ వైరుధ్యమేర్పడ్డది. నేటి రాజకీయ, సాంఘిక వాస్తవపరిస్థితులు మన చరిత్రకు కొత్త. వీటిని పాతచరిత్రానుభవదృష్ట్యా వివరించడం సాధ్యపడదు. 16, 17 శతాబ్దాలనాటి బాబరూ, అక్బరూ, శివాజీ, పీష్వాలూ, మహాప్రవక్తలూ, సాధువులూ వారి గాజ

---

* కోరెగాంవ్ యుద్ధంలో పీష్వాలు ఓడారు, ఇంగ్లీషువాళ్ళు గెలిచారు. ఇంగ్లీషువాళ్ళు గెలవడానికి వారి తరపున పోరాడిన మహార్ సైనిక దళాల నైపుణ్యమే కారణ మంటారు.

కీయాలూ వారు బ్రతికిన సమాజమూ వేరు. విక్టోరియా, పామర్‌స్టన్, చర్చిల్, వై.ఎం.సి.ఎ., తిలక్, గాంధీ, మార్క్సు, ఎంగెల్సు, లెనిన్, స్టాలిన్‌లు నివసించిన, నివశిస్తూన్న 19, 20 వ శతాబ్దపు రోజులు వేరు. ఆనాడు చరిత్ర నిర్మాత లకు సహాయకారులుగా ఆవిరి యంత్రాలుగానీ, టెలి గ్రాఫులుగానీ, ప్రపంచ విస్తారితమైన మార్కెట్లుగానీ, ఆర్థిక సంక్షోభాలూ, సమ్మెలూ, విప్లవాలూ కానీ లేవు. అయితే, ఋగ్వేదకాలంలో బాంకింగూ, వడ్డీరేట్లూ వున్న వనీ, బుద్ధవిహారాలకాలంలో పార్లమెంటరీ ఓటింగుపద్ధతి ఉన్నదనీ, చాణక్యునికాలంలో కార్టెల్సు, కంబైన్సులాంటి వ్యాపార సంస్థలున్నాయనీ మొదలైన విషయాలనేకం "కనిపెట్టిన" సాహసవంతులు లేకపోలేదు. కాని సామాజిక రాజకీయ వాస్తవికత దృష్ట్యా యిలాంటి ప్రయత్నాలన్నీ అపహాస్యకరమైనవి. ప్రపంచాన్నంతటినీ చుట్టుముట్టే నేటి పెట్టుబడిదారీ పారిశ్రామిక విప్లవాన్ని యింతకు పూర్వపు చరిత్రలో కని విని ఎరుగం. మార్కెట్లకొరకూ, ముడిసరు కులకొరకూ పెట్టుబడి పెట్టి, అమితలాభాలు తీయడానికి బూర్జువావర్గం చేసే ప్రయత్నాల మూలకంగా, ప్రపంచ మంతా మొట్టమొదటిమారుగా ఒకేఒక యేకఖండంగాతయా రైంది. నేటి సామ్రాజ్యవాదానికీ, దాని విజయాలకూ, అలెగ్జాండరు, జెంఘిజ్‌ఖాన్, మహారాష్ట్రుల విజయాలకూ పోలికేలేదు. అలాగే నేటి శ్రామికవర్గము పాలకవర్గమై, దరిద్రంతో కుంగిపోయే సమాజాన్ని శాశ్వత సమృద్ధి సంప దలతో తులతూగేటట్లు మార్చవలెననే ఆశయంతో సాధించ

గలుగుతూన్న మహాత్కార్యాలను, ప్రాచీన మధ్యయుగ చరిత్రలనాటి కష్టజీవి ప్రజాసామాన్యము ఊహించగలిగినైనా ఉండజాలదు. నేడు సంపూర్ణంగా కొత్తశక్తులూ, కొత్తవర్గాలూ, కొత్తప్రజలూ పుట్టుకొచ్చాయి. వీరిని అర్థంచేసుకోడానికీ, వీరిని నడపడానికీ భారతీయ బూర్జువా చరిత్రకారుల సిద్ధాంతాలుకానీ, విదేశీయబూర్జువా చరిత్రకారుల సిద్ధాంతాలుగానీ ఉపయోగపడవు. పూర్వపు గ్రంథకర్తలు రచించిన చరిత్రయేదీ మొదటి ప్రపంచ యుద్ధానంతర సంక్షోభం తరువాతకాలపు జాతీయ స్వతంత్ర పోరాటాలకు సజీవమైన సహాయకారి కాజాలదు. ఎందువల్లనంటే యీ కాలంలో భారతదేశం ప్రపంచ విప్లవ పరిధిలో చేరింది. భారతీయ కష్టజీవి ప్రజానీకము ప్రజాస్వామిక విప్లవ పతాకను యెగురవేసింది.

19 వ శతాబ్దంలోనూ, 20 వ శతాబ్ద ప్రారంభంలోనూ ప్రచురింపబడిన చరిత్ర గ్రంథజాలంతో పోల్చుకుంటే, గడచిన ఇరవై యేళ్ళలోనూ భారతదేశ చరిత్రనుగురించి చెప్పదగిన గ్రంథ మొక్కటైనా వెలువడలేదనాలి. శాస్త్రయుక్తమైన విప్లవాత్మక దృక్పథంతో చరిత్రను నిర్వచించడానికి పూనుకునేబదులు "చరిత్రమిణుకులు (Glimpses, of History)" "హైందవప్రభ (Glory that was Ind)" లాంటి చరిత్రలు రాశారు. వీటిలో అంతా తికమకలూ, ఊగిసలాటలూ, నిట్టూర్పులూ తప్ప మరేమీలేవు. గుడ్డివాళ్ళు ఏనుగ్ని చూచామనుకున్నట్లున్నవి. అంటే దీని అర్థం చరిత్రపరిశోధన పూర్తిగా ఆగిపోయిందనికాదు.

ప్రాముఖ్యత తగ్గి సామాజిక చరిత్ర (Social History) కు ప్రాముఖ్యత వచ్చింది.*

సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా రాజకీయచరిత్ర (Political History) తన కర్తవ్యాన్ని సాధించింది. ఒక సమష్టి జాతీయనినాదాన్ని రూపొందించింది. ఇంగ్లీషు యూరోపియన్ చరిత్రతత్వజ్ఞులుప్రసాదించిన ఆధ్యాత్మికవాద సాధనాల సహాయంతో, అలాంటి జాతీయనినాదం రూపొం దించడం సులభంకూడా అయింది. ఇండియా అతి ప్రాచీన మైనది. దానికొక ఆర్థికవిధానముండేది. వీర పురుషులూ, రాజపుంగవులూ ఉండేవారు. రాజ్యాంగాలుండేవి. యుద్ధాలు జరిగినవి. రాజ్యాంగ చట్టాలూ ఉండేవి. భారతదేశానికి మరల ఆ మహర్దశ పట్టాలి.

భారతదేశం నూతన పరిశ్రమలనూ, వ్యవసాయాన్నీ, నూతన సంస్కృతినీ, జాతీయ ప్రతిపత్తినీ నిర్మించుకోడానికి ప్రయత్నించుతూన్నది. సామ్రాజ్యవాద పాలకవర్గాలు ఆ ప్రయత్నాలకు ప్రతిబంధకాలుకల్పించరాదు; కాని కల్పించు తూన్నవి. కాబట్టి సామ్రాజ్యవాదాన్ని ప్రతిఘటించాలి- కొత్తపద్ధతిలో ప్రతిఘటించాలి.

---

* భారతదేశంలో కులాలు, తెగలూ; రాజ్యాంగ యంత్రముయొక్క పుట్టుపూర్వోత్తరాలు; వివాహచరిత్ర; సనాతన భారతదేశంలో విద్యా విధానము; బ్యాంకింగు; న్యాయవిధానము; రెవిన్యూ; మహాభారత యుద్ధ కాలంలో సామాజిక వ్యవస్థ; ప్రాచీనకాలంలో వ్యాపారపరిశ్రమలు; హిందూ, అరబ్ సంస్కృతీ సంబంధాలూ మొదలైన విషయాలమీద ఘుర్యే, దత్త, బనిప్రసాద్, రణాడే, భార్గవ, ఆల్టేకర్, గోషాల్, వైద్య, ఫిక్ మొదలైనవారు అనేక గ్రంథాలను రచించారు.

చారిత్రిక సామాగ్రిని సేకరించడంలోనూ, పరిశోధన చేయడంలోనూ, నిర్వచనాలు చేయడంలోనూ నిమగ్నులైయున్న చరిత్రకారులున్నారు; చరిత్ర పరిశోధక మండలులున్నాయి. కాని సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటానికి అవసరమైన కార్యక్రమ ప్రణాళికనూ, ఉత్సాహాన్నీ గత చరిత్రనుంచి సాధించాలనే సంకల్పంమాత్రం సన్నబారింది. బూర్జువావర్గం తాను నడిపే జాతీయోద్యమం యొక్క "రాజ్యాంగహక్కుల"కుసంబంధించిన రాజకీయప్రణాళికనూ, "జాతీయ పరిశ్రమాభివృద్ధికి సంబంధించిన ఆర్థిక స్వాతంత్ర్య ప్రణాళికనూ ఆ సామ్రాజ్యవాదంతోనే ఒడంబడికలు చేసుకోవటంద్వారా రూపొందించుకొనగలిగింది. ఈసందర్భములో అశోకుడూ, అక్బరూ, పీష్వాల పరిపాలనలనాటి శాసనాలూ, దానపత్రాలకన్నా ఐర్లెండు, అమెరికా, ఇంగ్లండుల చరిత్రలే యెక్కువ తోడ్పడ్డవి. అందువల్ల నిర్భాగ్యులైన పరిశోధక పండితులు ప్రభుత్వ సహాయంగానీ, బూర్జువా వర్గంనుంచి ఆదరణగానీ లేక, యెలాగో ఒకలాగున బ్రతుకులు దొరలించుకునే దుర్గతికి లోనైనారు.

అయితే, రాజకీయ చరిత్రకు ప్రాముఖ్యత తగ్గిపోయినప్పటికీ, చరిత్ర పరిశోధనల్లో నూతన దృక్పథం అవలంబించవలసిన అవసరమొచ్చింది. సామ్రాజ్యవాదమూ, బూర్జువా జాతీయతా సంక్షోభంలో చిక్కుకున్నవి. సామాజిక ఆర్థిక రాజకీయ విధానాల్లో వర్గసంబంధాలూ, సామాజిక విప్లవోద్యమమూ మొదలైన సమస్యలు బూర్జువా వర్గాన్నీ, వారి మేధావి బృందాలనూ ఆకర్షించినవి. రాజకీయ చరిత్రకు

బ్రిటిషు దురాక్రమణదారుడు దేశానికంతటికీ సర్వ శత్రువైయున్నాడు. వాడికి వ్యతిరేకంగా దేశంలోవున్న ప్రజలందరూ ఐక్యంకావడమే ఈనూతనమార్గం. విదేశీసామ్రాజ్యవాద పరిపాలనను పడగొట్టితేగాని ఎవ్వరికీ పురోభివృద్ధిలేదు. కాబట్టి ప్రజలందరూ యెవరి కే ప్రయోజనాలున్నాసరే, ఒకే ఒక దృష్టిని అవలంబించాలి. ఒక్కమాటమీద నిలవాలి, సామ్రాజ్యవాదులను పారద్రోలాలి, జాతీయ స్వాతంత్ర్యాన్ని సాధించాలి. స్వతంత్రం వచ్చినతరువాత ప్రజలందరూ కార్మికులు, కర్షకులు, మధ్యతరగతులు, పెట్టుబడిదారులు మన భూమిపైన నివసించే ప్రతివ్యక్తీ మన ప్రజాతంత్రపాలనలో స్వేచ్ఛనూ, సుఖాన్నీ అనుభవిస్తారు.

కాని, కనికర మెరుగని ఒక శత్రువునుంచి స్వాతంత్ర్యాన్ని సాధించాలంటే, యుద్ధరంగంలో కురికి ఆత్మార్పణ చేయగల శక్తులుండాలి. ఆ శక్తు లేవి? ప్రతి భారతీయుడూ సామ్రాజ్యవాద వ్యతిరేకిగా ఉండాలి; స్వాతంత్ర్యప్రియుడుగా ఉండాలి. త్యాగానికి సిద్ధంగా ఉండాలి; అలా ఉన్నారు కూడానూ. ఇందులో కులం, మతం, వర్గం, వృత్తి, ఆడ, మొగ భేదాలు పాటించరాదు; పాటించబోరు. ప్రతి భారతీయుడూ విప్లవకారుడే! ఎందువల్లనంటే విదేశీసామ్రాజ్యవాదం ప్రతి భారతీయుణ్ణీ కష్టపెడుతున్నది. ఇది బూర్జువా వర్గమూ, వారి మేధావిబృందమూ చేసిన వాదన.

భారతదేశపు కష్టజీవి ప్రజాసామాన్యము కొంతకాలం ఈ వాదనను బలపరచింది. వర్గప్రయోజనాలనూ, కుల

ప్రయోజనాలనూ యితర సంకుచిత స్వార్థాలనూ దిగత్రొక్కి జాతీయతను బలపరచాలని అంగీకరించారు.

కాని యిదంతా జాతీయ ప్రతిపత్తియొక్క, జాతీయోద్యమంయొక్క కృత్రిమ ప్రతిబింబమే కాని వాస్తవ ప్రతిబింబముకాదు.

అన్నివర్గాలూ విప్లవాత్మకాలుకావు. నిజానికి స్వాతంత్ర్యం వస్తే నష్టపడేవారు కొందరున్నారు. అందువల్ల వారు భారతీయులైనప్పటికీ సామ్రాజ్యవాద వ్యతిరేకులు మాత్రం కాజాలరు. ఇంకొందరు బ్రిటిషు దురాక్రమణ దారులంటే నిప్పులు కక్కుతారు. కాని, కార్మికులూ, కర్షకులూ తాము కూడా ఫ్యాక్టరీ యజమానులతోపాటూ, ఇంకా వారికన్నా యెక్కువగానే భారతీయులమనీ, తమ కష్టానికి తగిన ప్రతిఫలమియ్యాలనీ, తాము సృష్టించిన సంపదలోనుంచి సుఖజీవనానికి తగిన వేతనాలివ్వాలనీ, కోరగానే యిప్పటివరకూ దేశభక్తులుగాఉన్న పెద్దమనుష్యులే, శాంతిభద్రతల పేరిట బ్రిటిషు తుపాకుల సహాయాన్నర్థించడానికి పరుగెత్తుతారు. అలాంటివాళ్ళ ప్రయోజనాలు యెలాంటివి? వాళ్ళ దేశభక్తి యెలాంటిది? వారి ఆశయమేమిటి? జాతీయ స్వాతంత్ర్య సముపార్జనయా, లేక స్వలాభరక్షణయా ?

జాతి యనే సామాజికవ్యవస్థ సమరసమైన సౌభ్రాతృత్వకుటుంబముకాదు. ఏక ప్రయోజనము కలదికాదు. దానిలో అనేక అంతరంగిక స్పర్థలూ, వైరుధ్యాలూ ఉన్నవి. ఈ సత్యాన్ని చరిత్ర అనుభవమూ, వాస్తవికజీవితము కలిసి, కష్టజీవి ప్రజాసామాన్యానికి క్రమేణా తెలియజేసినవి.

ఈ వైరుధ్యాల పునాది యేమిటి? ఇవి యెక్కడ నుంచి పుట్టినవి? మతమునుంచా? కులమునుంచా? విద్యా విజ్ఞానములనుంచా? కాదు. వీటిలోనుంచి కానేకాదు. సమాజం వర్గాలుగా చీలిఉన్నది. జాతికి జీవనాధారమైన ఉత్పత్తివిధానమూ, ఉత్పత్తియైన సంపదను పంపకంచేసే విధానమూ యీ రెంటిమీదా యీ వర్గాల స్వరూపం ఆధారపడి ఉంటుంది. బ్రిటిషు విజేతలచేత సృష్టింపబడిన భూస్వాముల లాంటి కొన్ని వర్గాలకు సామ్రాజ్యవాదంతో పొత్తుకలసి యుండటమే ప్రయోజనకరము. బూర్జువా వర్గముయొక్క అభివృద్ధికీ, వారు కష్టజీవులను సంపూర్ణంగా దోచుకోడానికీ సామ్రాజ్యవాదం అడ్డుగా ఉన్నది కాబట్టి వారు సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకించడంవల్ల లాభపడ తారు. కార్మిక కర్షకులను బ్రిటిషువాళ్ళూ, భారతీయ బూర్జువా వర్గమూ దోచుకుంటుంటారు. అందువలన వారు యీ రెండు వర్గాలను వ్యతిరేకించడంవల్ల ప్రయోజనాన్ని పొందుతారు. అందువలన కార్మికులూ, కర్షకులే విప్లవ వర్గం. దోపిడి అనేది సంపూర్ణంగా రద్దయిపోతే గాని కార్మికులూ, కర్షకులూ నిజమైన స్వేచ్ఛను పొందలేరు. పట్టణాలలో పెద్ద పరిశ్రమల్లో పనిచేసే కార్మికులీ విషయాన్నెప్పుడో గుర్తించడం ప్రారంభించారు. ఇతరుల శ్రమఫలితమైన లాభాల నన్నిటిని తామే మింగి, ఇంగ్లీషువాళ్ళంత పెద్దవాళ్ళు కావాలని జాతీయ బూర్జువా వర్గం ఆశిస్తుంది. బ్రిటిషువాళ్ళు ఆ ఆశలకు ప్రతిబంధకంగా వున్నప్పటికీ,

కొత్తగా పైకివస్తున్న కార్మికవర్గాన్ని చూస్తే వారు భయపడుతున్నారు.

జాతీయ స్వాతంత్ర్య సంఘటనలోనున్న కార్మిక వర్గము స్వాతంత్ర్య స్వరూప మెలా ఉంటుందో స్పష్టపరచ మని కోరింది; తన జీవిత హక్కులనూ, సంపూర్ణ స్వేచ్ఛనూ కోరింది; కొన్ని వర్గాలు స్వదేశస్థులైన కష్టజీవులను దోచు కోడంలో ఎలా విదేశస్థులతో చేతులు కలుపుతున్నారని ప్రశ్నించింది; దోపిడీ చేయబడే ప్రజలను అణచడానికి విదేశస్థులనుంచి తుపాకుల సహాయంకూడా తీసుకుంటున్నా రేమని గద్దించింది. జాతీయ బూర్జువావర్గం జాతీయ స్వాతంత్ర్య సంఘటనలో ఉంటూనే, తమ లాభాలకొరకు బేరమాడు తున్నారుగదా? జాతీయోద్యమం విప్లవాత్మ కంగా అభివృద్ధి కాకుండా అరికడుతున్నారుగదా? అంటే జాతీయ పోరాటం వర్గపోరాటంయొక్క ఒకానొక రూపమే గదా? జాతీయ విప్లవం వర్గపోరాట క్రమంలో నడిచేదే కదా? జాతీయ రాజకీయ పోరాటాలన్నీ వర్గ ప్రాతిపదికపైన జరిగేవే కదా? ఈ ప్రశ్నల కన్నిటికీ కార్మికవర్గం బూర్జువా మేధావులనుంచి సమాధానాలు కోరింది. తనలోనుంచే పుట్టుకొస్తూన్న నూతన నాయకత్వమునుంచి, అంటే కమ్యూ నిష్టులనుంచికూడా సమాధానాలను కోరింది.

బూర్జువా వర్గమూ, ప్రజలూ జాతీయ స్వాతంత్ర్యాన్ని పొందియున్న యూరపు ఖండములో యీ ప్రశ్నలే అనేక రూపాంతరాలలో ఉదయించినవి. ఫ్యూడల్ ప్రభువులూ, రాజులూ, వారి నిరంకుశాధికారమూ కూలిపోయినవి; ఉత్పత్తి శక్తులు విస్తారంగా అభివృద్ధి చెందినవి. యంత్రాలనుంచి

సంపదలనంతంగా ప్రవహిస్తున్నవి; రాజ్యాంగ యంత్రాన్ని యెవరు నడపాలో, ఓట్ల ద్వారా ప్రజాతంత్రి పద్ధతిప్రకారం నిర్ణయింపబడుతున్నది. అలాంటప్పుడు ఒక్క భాగ్యవంతులు తప్ప, మిగిలిన కష్టజీవులూ, ప్రజలూ ఆహుతియైపోవడం యెలా సంభవిస్తున్నది? కార్మికవర్గం యిలాంటి ప్రశ్నలను వేయడం ప్రారంభించగానే యూరపులో చరిత్రకారులూ, చరిత్ర తత్వశాస్త్రజ్ఞులూ సమాధానాలీయ బూనుకున్నారు. ఈ సమస్యల కన్నిటికీ మూలమేమిటని లోతుకు దిగారు. మానవ సమాజం యెలా పుట్టింది? ఒక దశనుంచి మరొక దశకు యెలా పరిణామం చెందింది? ఈ పుట్టుకకూ, పెరుగుదలకూ, పరిణామాలకూ, విప్లవాలకూ కారణమైన శక్తి యేమిటి? ఈ సమస్యకు బూర్జువాశాస్త్రం సమాధాన మీయ లేకపోయింది. ధనికులూ-బీదలూ అనీ, పరిపాలకులూ-పరిపాలితులూ అనీ, బలవంతులూ-బలహీనులూ అనీ, నాయకులూ-అనుచరులూ అనీ, యిలాంటి విభాగాలు అనాదిసిద్ధాలూ శాశ్వతంగా ఉండేవేననీ, ఇదంతా సృష్టిమాయ, భగవదేచ్ఛ కర్మఫలమనీ యిలాంటి సమాధానాలు యీవరకే బూర్జువా పండితులు చెప్పివేశారు.

కార్మికవర్గం ఈ సమాధానాల నంగీకరించలేదు. మార్క్సు, ఎంగెల్సు సామాజికాభివృద్ధి క్రమాన్ని పరిశీలించి చారిత్రక పరిణామ సూత్రాలను కనిపెట్టారు. అదే చారిత్రక భౌతికవాదం; చరిత్రను గతితర్క భౌతికవాదదృష్ట్యా వివరించడం.

ఈ సిద్ధాంతం ప్రకారం: సామాజిక పరిణామమూ, మానవుని జీవిత పరిస్థితులూ, లేక అతడు తనకొరకు సృష్టించు

కునే పరిస్థితులూ ఆయా వ్యక్తులయొక్క మంచీ, చెడూ అభిప్రాయాలమీదకానీ, వీరులూ, అవతారపురుషులూ మొదలైనవారిమీదకానీ ఆధారపడి యున్నవికావు. భౌగోళిక పరిసరాలమీద కానీ, భగవదేచ్ఛమీదకానీ ఆధారపడి యున్నవికావు. చరిత్ర గమనం, శాశ్వతంగా ఒక్కమారే ఇలా నడవాలని నిర్ణయింపబడిన యంత్రపు నడకవంటిదికాదు లేక నిరంతరమూ గాడిద చాకిరీచేసే మానవుడు బుజాన వేసుకుని లాగుతూండే మోటకాడియొక్క గుండ్రని నడకవంటిదీ కాదు.

భౌతిక ప్రకృతినుంచి పరిణామ సిద్ధంగా వచ్చినవాడు మానవుడు. అతడు తన బ్రతుకు తెరువుకొరకు, మొదట తిండి, బట్ట, గుడిసె మొదలైన వాటికోసం ప్రకృతిపై పోరాడాలి. అదే అతని ప్రాథమికమైన, లేక ప్రప్రధానమైన కృషి. ఈ కృషిలో అతడుపయోగించే ఉత్పత్తిశక్తులూ, పరికరాలూ అతడభివృద్ధి చేసే ఉత్పత్తి సాధనాలూ అతని అస్తిత్వాన్ని నిర్ణయిస్తాయి. మానవుడు సామాజిక మానవుడుగా పుట్టాడు. అతని సామాజిక వ్యవస్థ, అంటే అతనికీ తోటిమానవులకూ పరస్పరముండే సంబంధాలు ప్రధానంగా ఉత్పత్తి శక్తులపైన ఆధారపడి ఉంటాయి. ఇవి ఉత్పత్తి సంబంధాలు. ఒక్కొక్క దశలోని ఈ ఉత్పత్తి సంబంధాలూ, యివి పనిచేసే నిశ్చిత సమాజ వ్యవస్థా ఆయా దశల్లోని ఉత్పత్తి విధానాన్నిబట్టి గుర్తింపబడతాయి. ఒక దశలోని ఉత్పత్తి సంబంధాలకూ సమాజానికీ, మరో దశలోని ఉత్పత్తి సంబంధాలకూ సమాజానికీగల భేదముకూడా ఉత్పత్తి విధానాన్నిబట్టే యేర్పడుతుంది. సమాజంయొక్క రాజకీయ నైతిక, తాత్విక, సాంస్కృ

ఈ సిద్ధాంతాన్ని అనుసరించి, ఉత్పత్తిశక్తులు పరిపక్వస్థితికివచ్చిన అనేకదేశాల్లో యూరపియన్ కార్మికవర్గం విప్లవాలను తెచ్చింది. రష్యాలో సోవియట్ ప్రభుత్వాన్ని, సోషలిజాన్ని నిర్మించి కష్టజీవులైన సమానవకోటికిమార్గదర్శకమైనది.

ఈ సిద్ధాంతాన్ని బట్టిచూస్తే బ్రిటిష్ పెట్టుబడిదారీ వర్గానికి మార్కెట్లకొరకూ, డబ్బును పెట్టుబడి పెట్టడానికీ, దోపిడీ చేయడానికీ కొత్తప్రదేశం కావలసి రావడంచేత ఇండియాను జయించుకున్నది. నేటి చారిత్రికఘట్టంలో యూరప్ దేశాలూ, అమెరికా మరి ఇతర దేశాలూచేసిన దురాక్రమణలన్నీ ఆయాదేశాల బూర్జువావర్గ ప్రయోజనాల కొరకు చేసినవే.

చిన్న పెట్టుబడిదారులు కష్టజీవుల శ్రమను దోచుకుని బలిశారు. మార్కెట్లపోటీలో తమకు వర్గసహోదరులైన మిగతా చిన్న పెట్టుబడిదారులను దిగమింగారు. ఈ విధంగా పెట్టుబడి కేంద్రీకృతమైంది; పెరిగింది; సాంకేతిక నైపుణ్యాన్ని (టెక్నిక్‌ను) కేంద్రీకరించింది. ప్రపంచ మంతటికీ విస్తరించిన పెద్ద గుత్తసంస్థలుగా అభివృద్ధియైనది. వలసరాజ్యాలను జయించింది. పెట్టుబడిదారీ బానిసత్వానికి గురియైన ప్రతిదేశంలోనూ-అంతకుముందే అక్కడ పెట్టుబడిదారీ విధానముంటే తప్ప-పెట్టుబడిదారీ ఆర్థిక సంబంధాలు అమల్లోకి వస్తాయి. జాతీయ బూర్జువావర్గం పుట్టి గుత్త సామ్రాజ్యవాదులతో పోటీచేస్తుంది. లాభప్రపంచంలో తనకుకూడా నివాసస్థానం కావాలని కోరుతుంది. ఈపెట్టుబడిదారీ వర్గంతో పాటే విప్లవ వైతాళికుడైన కార్మికవర్గముకూడా పుట్టుతుంది. దీనితో, జాతీయపోరాటం ప్రారంభమాతుంది. కాని కార్మిక

వర్గమూ, కష్టజీవి ప్రజాసామాన్యమూ తమ జీవితావసర హక్కులను కోరగానే, జాతీయ బూర్జువావర్గం ప్రజలను దిగ దొక్కి, సామ్రాజ్యవాద శిబిరంలో చేరుతుంది. సామ్రాజ్య వాదులతో సంధిచేసుకుని, తన దేశీయులేమైన ప్రజలకు వ్యతి రేకమౌతుంది. జాతిసత్వాన్నీ, దోపిడీనీ నిర్మూలించి, నిజ మైన స్వాతంత్ర్యాన్నీ సోషలిజాన్నీ స్థాపించేందుకు ప్రజలు చేసే తిరుగుబాట్లను అణచివేయ ప్రయత్నిస్తుంది.

ఒకదేశంలో కార్మికవర్గము, తన చారిత్రక కర్తవ్యాన్ని గుర్తించగలిగిన చైతన్యాన్నిపొంది, నూతన సిద్ధాంత ప్రాతి పదికపైన సంఘటన ప్రారంభించినప్పుడు, ఆ దేశపు బూర్జువా వర్గం బలప్రయోగంద్వారా అణచబూనుకోవడంతోపాటు, వారి మనస్సులను బూర్జువా సిద్ధాంతాలతో కలుషితంచేయ డానికి అన్నివిధాలా ప్రయత్నిస్తుంది. అసత్యమైన చరిత్రను బోధించడం, తద్వారా వారిని బూర్జువావర్గపు తోకకు శాశ్వతంగా ముడిపెట్టియుంచడం ఈ ప్రయత్నాలలో ఒకటి. బూర్జువా సమాజ వ్యవస్థ ఉత్తమోత్తమమనీ, తప్పించు కోరానిదనీ, శాశ్వతమైనదనీ, దైవదత్తమైనదనీ, ఉత్తమ నీతివంతమైనదనీ, సౌభాగ్యాతి సౌఖ్యకరమైనదనీ కార్మికవర్గానికి నమ్మకను కలుగజేసి, వారే బూర్జువా వ్యవస్థను సమర్థించేట్లు చేయడం ఒకవేపునా – మరోవేపున చరిత్రనుగురించీ, సమాజ భవిష్యత్తును గురించీ ఉండే కమ్యూనిస్టుభావాలు కేవలం గాలిమేడలనీ, వాస్తవికమైనవి కావనీ, నీతి బాహ్యమైనవనీ, ప్రకృతికీ, మానవనైజానికీ వ్యతిరేకములనీ, సర్వనాశనకరము లనీ చిత్రించడం మరోవేపునా జరుగుతుంది. ఇందుకొరకు బూర్జువా మేధావులు మరల చరిత్ర లోతులను త్రవ్వ

తాను. కార్మికుడి యెదుట సామాజికాభివృద్ధిని గురించి పరిణామ వ్యతిరేకమైన ఆధ్యాత్మిక చిత్రాన్ని చిత్రిస్తారు - సమాజం గతితర్క భౌతికమార్గంలో అభివృద్ధి అవుతుంది అనే వాదనను ఖండిస్తారు.

1920-'30 తరువాత భారతీయ కార్మికవర్గం తన జండాతో, తన నినాదాలతో, తన పార్టీ కార్యక్రమాలతో బూర్జువావర్గానికి వ్యతిరేకంగా రాజకీయ సాంఘిక పోరాట రంగంలో ప్రవేశించింది. అప్పుడు జాతి యన్నది నిజంగా యెవరివల్ల యేర్పడుచున్నది, స్వాతంత్ర్యమూ, ప్రజాతంత్రమూ యెవరికొరకు సాధింపబడాలి అనే ప్రశ్న లుదయించాయి. వీటికి సమాధానంగా భారతీయ బూర్జువావర్గమూ, వారి మేధావివర్గమూ, భారతదేశ చరిత్రకు కృత్రిమ మార్గాలు కల్పించడానికి ప్రయత్నించారు.

యూరప్‌లోనూ, యితర దేశాల్లోనూ యెలా జరిగినప్పటికీ భారతదేశమూ, దాని సంస్కృతీ, ప్రజలూ, చరిత్రా సర్వమూ వేరనీ, మార్క్సిస్టు, లెనినిస్టు సిద్ధాంతాలు వాటికి వర్తించవనీ, ఒక వాదనతో భారత కమ్యూనిస్టు ఉద్యమాన్ని ప్రతిఘటించారు.

తమ వాదనను బలపరచుకోడానికి వేదాలనూ, స్మృతులనూ, ఉపనిషత్తులనూ గాలించారు. వర్ణ వ్యవస్థా, రాజన్యుల సింహాసనాలూ, [illegible] రాజుల ఆశ్రమాలూ [illegible] సంవత్సరాలుగా ప [illegible] [illegible], అ [illegible] [illegible]లు నుగే [illegible]

భౌతికవాద సిద్ధాంతం ప్రకారం యివన్నీ యెలా సాధ్యపడి యుంటాయని కమ్యూనిస్టులనుసవాలుచేశారు. భారతదేశంలో ఆదిమ కమ్యూనిస్టువ్యవస్థ, ఉమ్మడి ఆస్తి, మాతృస్వామికత్వము, కమ్యూనులూ లేవు; అవి విచ్ఛిన్నంకావడమూ లేదు; ప్రైవేటు ఆస్తి, రాజ్యాంగయంత్రము, వర్గాలు, వర్గకలహాలు, బానిస విధానము, యివన్నీ ఒకదానితరవాత ఒకటి వచ్చినవని మీరుచెప్పే చరిత్ర మనకు లేదు. మనకిప్పుడు పెట్టుబడిదారీ విధానమున్నదీ అంటే, బ్రిటిషువాడూ, వాడి యంత్రాలూ పెట్టిన శాపముతప్ప మరొకటి కాదు. అదీకాక మన పెట్టుబడిదారీ విధానానికి భారతీయమైన మంచిలక్షణ మొకటి ఉన్నది. అందువల్ల మనం తప్పకుండా పోరాటం ద్వారానే, విప్లవంద్వారానే సోషలిజాన్ని స్థాపించవలసిన అవసరంలేదు; మనది మనకున్నది; అది గాంధియన్ సోషలిజం. పాతచరిత్రకు సంబంధించినంత వరకు మీ కమ్యూనిస్టుసిద్ధాంతాన్ని, చారిత్రిక భౌతికవాదాన్ని భారతదేశపు చారిత్రికప్రత్యేకత పూర్వపక్షం చేసింది. అలాగే భవిష్యత్తుకు సంబంధించినంతవరకు గాంధియన్ సోషలిజమే భవిష్యత్తువిషయమై మీరు చేసే ప్రతిపాదనలను పూర్వపక్షం చేస్తుంది-యిదీ బూర్జువావర్గమూ, వారి మేధావులూ చేసేవాదన. ఇలా వర్గకలహాన్ని నిరసించడానికీ, దోపిడీ చేయబడేవర్గాలు దోపిడీనీ, దారిద్ర్యాన్ని సహించేటు [illegible] శాంతినీ, వర్గ సా[illegible]న్ని, ఆధ్యాత్మికమైన [illegible] చే[illegible] చరిత్రపరిజకీయ.

మార్క్సిస్టు చరిత్ర దృక్పథాన్ని రూపుమాపడానికి, అమెరికా, యూరప్ దేశాల బూర్జువావర్గాలవారు అది పట్టి తప్పని మొదట ప్రచారంచేశారు. కాని లాభంలేకపోయింది. అప్పుడు తమ తప్పుడు నిర్వచనాలతో దానిని కలుషితం చేయబూనుకున్నారు. బూర్జువా సామాజిక వ్యవస్థలో నిరంతర క్రమంగా వస్తున్న సంక్షోభాల మూలకంగా, మానవ జీవితంలోనూ, సమాజంలోనూ సామాజికమైన ఆర్థిక కృషికి గల ప్రాధాన్యతను బూర్జువా మేధావులు గుర్తించక తప్పింది కాదు. అలాగే సోవియట్ యూనియన్‌లో ఆర్థికసంక్షోభం లేకపోవడం మూలకంగానూ, ప్రపంచ ప్రజలందరిమీద అది ప్రసరింపచేసిన ప్రభావంవల్లనూ, బూర్జువావర్గం తమ సిద్ధాంతాలలో వర్గపోరాటాలనూ, సోషలిజాన్ని కలుపుకోనక తప్పిందికాదు. అయితే అలా కలుపుకునేప్పుడు దానిని కలుషితం చేశారు, నిర్వీర్యంచేశారు. వర్గపోరాటం సత్యమనీ, పెట్టుబడిదారీ విధానంకన్నా సోషలిజం మంచిదనీ ఒప్పుకుంటారు. కాని వర్గపోరాటంద్వారా బూర్జువావర్గాన్ని కూలద్రోసి, దాని స్థానంలో కార్మికవర్గాన్ని పాలకవర్గంగా ప్రతిష్ఠించాలని—అంటే, దోపిడీవర్గాలకు వ్యతిరేకంగా కార్మికవర్గ నియంతృత్వాన్ని, కష్టజీవుల కనుకూలంగా సంపూర్ణ ప్రజాతంత్రాన్ని నెలకొల్పి, తద్వారాఉత్పత్తి సాధనాలు—భూమినీ ఫ్యాక్టరీలనూ సమాజపరంచేసి సోషలిజా . శాంతి సమృద్ధులుకల వర్గరహిత సమాజవ్యవస - ి అంటే, బూర్జువా వర్గానికి చెందినవా

చరిత్రగమనంయొ

ఆర్థిక రాజకీయ సాగా

వర్గంలో ప్రవేశించి వారి వ్యూహాన్నీ, యెత్తుగడనూ ఆచరణనూ నీరుగార్చి, తమ వర్గాధికారాన్ని కార్మికవర్గంయొక్క దాడినుండి కాపాడుకోడానికిమాత్రమే బూర్జువావర్గ మిప్పుడు కార్మికవర్గాశయాల నంగీకరించుచున్నది. మన దేశంలో ఆధ్యాత్మిక చింతనద్వారా శాంతియుతంగా, కోరికలను చంపుకొని, ఆత్మసంయమనం చేసుకొనడంవల్లనే చారిత్రకమైన మార్పులన్నీ వచ్చాయని రుజువుచేయటానికి చరిత్ర నిదర్శనాలు చూపుతుంటారు. రష్యన్, ఫ్రెంచి అనుభవాలిలా ఉన్నాయని మన మెవరమైనా అంటే, భారతీయులు అలాంటి వారుకారు అని సమాధానం చెప్తారు. అందువల్ల మనదేశ పరిస్థితుల్లో శ్రామికవర్గ ప్రభుత్వమూ, శ్రామిక ప్రజా తంత్రమూ యేర్పడేవరకూ వర్గపోరాటం సాగించవలసిన పని లేదంటారు. దీనిని రుజువుచేయడానికే వారు కార్మిక, కర్షకులయెదుట, పూర్వ హిందూ, ముస్లింలనాటి స్వర్ణయుగాన్ని గురించి కథ లల్లి గానం చేస్తుంటారు. ప్రస్తుతం కార్మిక, కర్షకుల్లో వుండే సిద్ధాంత పరిజ్ఞానలోపాన్ని ఆధారం చేసుకుని వారి భవిష్యత్తును దొంగిలించడానికి ప్రయత్నిస్తున్నారు.

ఇలా బ్రిటిషు యుగానంతర దశలోకూడా పాలకవర్గాల వారు తమ సంకుచిత స్వార్థప్రయోజనాలకొరకూ, వర్గాశయాలకొరకూ తిం[illegible]రిత్ర నుపయోగిస్తున్నారు.

కువావర్గం జాతియంతటి పేరునా
[illegible]ంచుకోడానికై చరిత్రను
[illegible]యోగించింది. ప్రజల
[illegible]ంచే అగ్రగామి

లాగా నటించింది. కార్మికోద్యమం బలపడితే, తమయొక్క స్వార్థభూయిష్టమైన విద్రోహ చర్యలు వెల్లడియైపోతాయేమో ననే భయంతో, ఈనాడు మరల సామాజికాభివృద్ధిని గురించి తప్పుడు సిద్ధాంతాలను ప్రచారం చేస్తున్నారు. విప్లవం నుంచి ఆత్మరక్షణ చేసుకోడానికై చరిత్రనుపయోగించుతున్నారు.

భారతదేశ సమకాలిక చరిత్రకుచెందిన సంఘటనలను మన మిక్కడ చర్చించవలసిన నిమిత్తంలేదు. అయితే ఒక్కటిమాత్రం స్పష్టంచెయ్యాలి. రాజకీయ సామాజిక పరిస్థితులు మారడంతో, బూర్జువావర్గం చరిత్రను అభ్యుదయకరంగా ఉపయోగించేబదులు, అభ్యుదయ నిరోధక ప్రయోజనాలను కాపాడేందు కుపయోగిస్తున్నారు. మానవుడు మృగప్రాయమైన దశనుంచి నాగరికస్థితి కొచ్చాడు. మానవుడియొక్క యీ సామాజిక పరిణామం యే నియమాల ననుసరించి జరిగిందో కనిపెట్టి, ముందుముందు యింకా ఉన్నతదశకు పోయేందుకూ, సౌఖ్యతరమైన జీవితాన్ని నిర్మించుకునేందుకూ అవకాశాలు కల్పించడమే చరిత్రయొక్క తత్వశాస్త్ర ప్రయోజనము. నేడు భారతీయ కార్మికవర్గము, భారతీయ సమాజమునెడలా, ప్రపంచ సమాజమునెడలా మహత్తరమైన బాధ్యతను నిర్వహించవలసియున్నది. ఈ బాధ్యతను నిర్వహించగలగాలంటే బూర్జువా చరిత్ర దృక్పథం ప్రజలను సంపూర్ణంగా ఆకట్టుకొనకముందే ఆ దృక్పథంనుంచి కార్మికవర్గం సంపూర్ణంగా తెగతెంపులు చేసుకోవాలి.

భారతదేశ చరిత్రను చారిత్రిక భౌతికవాద దృష్ట్యా వివరించడానికి ఇప్పటివరకూ గట్టిప్రయత్న మేమీ జరగ

లేదు—అలాగే చారిత్రిక భౌతికవాదాన్ని ఖండించడానికి కూడా గట్టిప్రయత్నము జరగలేదు. మార్క్సిస్టులకు భారత దేశ చరిత్రనుగురించి ఒక ప్రత్యేక దృక్పథం ఉన్నది. దాన్ని వారు చారిత్రిక భౌతికవాద దృక్పథంతోనూ, వర్గ పోరాట దృక్పథంతోనూ వివరిస్తుంటారు. ఇది సాధారణంగా అందరూ యెరిగినదే. కాని యింతకు కారణం యే మార్క్సిస్టూ యిలా వివరించడానికి భారతదేశ చరిత్రను ప్రత్యేకంగా పరిశోధించడం వల్లకాదు; మొత్తంమీద మార్క్సిస్టు అభిప్రాయాలు దేశంలో వ్యాప్తి చెందడం, భారతదేశచరిత్రలో జరిగిన ఆధునిక పరిణామాలనుగురించి కొన్ని గ్రంథాలు ప్రచురించబడ్డమే యిందుకు కారణం.

బూర్జువావర్గం అధికారంలోకి వచ్చినతరువాత మన చరిత్ర కలుషితమయే ప్రమాదం యెక్కువైంది. బూర్జువా పండితులు చరిత్రను భౌతికవాదంనుంచి కాపాడటానికి, దాని చుట్టూ ముళ్ళకంచెను కొట్టాలని గడచిన కొద్ది సంవత్సరాలుగా ప్రయత్నిస్తూవచ్చారు. కాని వారి దురదృష్టవశాత్తూ, భారతదేశ ప్రాచీనతా, దాని సామాజిక విధానమూ, గ్రామ వ్యవస్థలూ, వాటి జ్ఞాపకాలూ, నిదర్శనాలూ, యెంతైనా చావక నిలిచిఉన్నందువలన, వారి ప్రయత్నాలు కొనసాగలేదు. హిందూసమాజ వ్యవస్థ పరిణామాల్ని, విప్లవాలనూ ఋజువుచేయడానికి వున్నన్ని నిదర్శనాలు మరే యితర సంఘానికీకూడా లేవు(వివరణ సౌలభ్యంకోరకూ, అర్థసౌలభ్యం కోరకూ భారతదేశ ప్రాచీనచరిత్రను హిందూసమాజ చరిత్ర యని వ్యవహరిస్తున్నాను.) ఈనిదర్శనాలు ఎంత సుస్పష్టంగా వున్నాయంటే భారత బూర్జువా వర్గంయొక్క హిందూ

నాయకత్వమే గాథ గాక, అదంతా అబద్ధమనీ కట్టుకథ అనీ, లేక మరింకోటనీ త్రోసివేయడానికి ప్రయత్నించడం కూడా జరుగుతున్నది. ఆచారాలూ, సంఘటనలూ, ఉదాహరణాలూ, సాంప్రదాయాలూ, నియమాలూ హిందూసమాజం యొక్క మత సామాజిక సారస్వత మంతటా లెక్కలేనన్ని ఉండటంవల్ల బూర్జువా చరిత్రకారుల బుద్ధికి అవి అందరానంత దిగ్భ్రమ గొల్పుతున్నవి. వివాహ స్మృతులూ, "విచిత్ర వివాహాలు" గా అగుపడే సంఘటనలనుంచి వీరులూ, దైవాంశ పురుషులూ పుట్టడమూ, ఆస్తీ, వారసత్వమూ, ఉమ్మడిఆస్తి హక్కులూ, రాజుల నడవడికలూ, రాజ్యాంగ యంత్రమూ, ఆస్తి కుటుంబముల పుట్టుకను గురించిన సిద్ధాంతాలూ, సూత్ర నియమాలూ హిందువుల పవిత్ర గ్రంథాలలో యెన్నో ఉదహరింపబడి ఉన్నవి. వాటన్నిటినీ చూచి బూర్జువా చరిత్రకారులకు దిమ్మెత్తిపోయి, అర్థం తెలియక, అవన్నీ పుక్కిటిపురాణాలని త్రోసివేస్తున్నారు. పట్టి పురాణాలను కాకుండా సామాజిక నిదర్శనాలను కూడా చూపి బూర్జువా దృక్పథం తప్పు అని ఎవరైనా రుజువుచేయ వచ్చేసరికి, బూర్జువా పండితులు మహాభారతాన్నే కల్పితమనీ, యేదో దృష్టాంతగాథ యనీ నిరసించడానికి పూనుకున్నారు. హిందువుల పురాణాలనూ, మత సిద్ధాంతాలనూ, సాంఘిక ఆచార నియమాలనూ చారిత్రక భౌతికవాద దృక్పథం ప్రకారం పరిశోధించి, [illegible]క్తం చేసినట్లైతే, భారతదేశంయొక్క ప్రాచీన చరిత్రకు సహేతుకమైన క్రమబద్ధమైన స్వరూపాన్ని నిర్మించవచ్చును, అని నా నమ్మకం. ఇలా చేయడం హిందూ సనాతను

లకుకానీ బూర్జువా తత్వశాస్త్రజ్ఞులకుకానీ రుచించకపోవచ్చును, అయినప్పటికీ మానవ చరిత్ర గమనాన్ని ఉత్పత్తి శక్తులూ ఉత్పత్తి సంబంధాలూ నియమిస్తాయనే సిద్ధాంతము - అంటే చారిత్రిక భౌతికవాద సిద్ధాంతము - భారత దేశానికికూడా పూర్వ వర్తమాన భవిష్యత్తుల కన్నిటికీ వర్తిస్తుందని రుజువౌతుంది.

ఆదిమ కమ్యూనిస్టు వ్యవస్థలూ, అది విచ్ఛిన్నమయాక ప్రైవేటు ఆస్తీ వర్గాలూ వర్గపోరాటాలూ అమల్లోకివచ్చి, కుటుంబమూ రాజ్యాంగ యంత్రమూ పుట్టి, బానిస విధానం ప్రారంభమైన ప్రాచీన యుగ చరిత్రనూ వివరించడం, భారత దేశ చరిత్రలోకల్లా కష్టసాధ్యమైన ఘట్టము. ఈ ఘట్టం నుంచి, గ్రామ వ్యవస్థలూ, వర్ణ విభాగాలూ యేర్పడ్డ ఆసియా భూసామ్య విధానంలోకి పరిణామంచెందిన ఘట్టాన్ని వివరించడం యెక్కువ సులభం.

ఈ ఘట్టాలను గురించి సమగ్రమైన చిత్రాన్ని నిర్మించాలంటే మార్క్సిస్టు పండితులు చారిత్రిక భౌతికవాదాన్ని క్షుణ్ణంగా అర్థంచేసుకోవలసి యుండటమేగాక, అతి విస్తృతమైన పరిశోధనను సాగించవలసియున్నది. ఈ కాలపు సామాజిక వ్యవస్థయొక్క స్వరూపాన్ని నిర్ణయించడానికి, ప్రాచీన హిందూమత గ్రంథాలలో ఉదహరింపబడిన ఆచారాలకూ, కర్మకాండకూ, పురాణాలకూ, “సామాజిక దృక్పథాన్ని” వర్తింపజేస్తూ బూర్జువా పండితులు తీవ్రమైన పరిశోధన చేశారు. కాని, మార్క్సు ఏంగెల్సులు పూనుకొని చరిత్ర కాళ్ళమీద నిలువబెట్టేవరకూ, యూరప్‌లో గ్రీకులనూ రోమనులనూ ట్యూటనులను గురించి చేసిన పరిశోధనకృషి

# ఒకటో అధ్యాయం

## ఆర్యుల ప్రథమ నివాసం

భారతదేశచరిత్రనుగురించి మాట్లాడేప్పుడు భారతదేశమని పిలువబడే నిశ్చితమైన యెల్లలుగల భూభాగమూ, యీ భూభాగంలో యే కులానికి, ఏ మతానికి, ఏ వృత్తికి, తాత్త్విక విశ్వాసానికి చెందినప్పటికీ, స్థిరనివాసులైయున్న మొత్తం ప్రజలూ మన మనస్సులో కొస్తారు. బ్రిటిషు పరిపాలకులు వచ్చేనాటికి భారతదేశానికి సాంప్రదాయకంగా ఉంటూవచ్చిన యెల్లలు నేడు చెరిగిపోయినవి. భారతదేశం భారత్-పాకిస్తాన్ అని రెండుగా విభజింపబడినది. అయినప్పటికీ భారతదేశచరిత్ర అనగానే పూర్వపు అవిభక్త భారతదేశమే స్ఫురిస్తుంది. ఉత్తరానా, తూర్పునా, పడమరనా మూడు పర్వతపంక్తులూ, అలాగే దక్షిణానా, పడమరనా, తూర్పునా మూడు సముద్రాలూ యెల్లలుగా ఉన్న భారతదేశంయొక్క చరిత్ర అన్న భావమే కలుగుతుంది. ఆధునిక భారతదేశచరిత్ర సాధారణంగా బ్రిటిషుయుగానికి చెందిన ప్లాసీయుద్ధంతో ప్రారంభమౌతుంది. దానికి పూర్వమో, లేక సమకాలికంగానో మహారాష్ట్రులు వస్తారు. మహారాష్ట్రులకు పూర్వం, అంటే దాదాపు క్రీస్తుశకం 1000 నుంచీ మొగ

లుఃలు వచ్చారు. ముస్లిం దండయాత్రలొస్తాయి. ఈ ఘట్టాలన్నిటిలోనూ యీనాడు భౌగోళికంగా భారతదేశమని పిలువబడే భూభాగమంతా చిత్రణలోకొస్తుంది. కాని మొగలు, మహారాష్ట్రరాజ్యాల అనంతరం 18 వ శతాబ్దం వరకూ భారతదేశం అంతా ఒక్క కేంద్రప్రభుత్వం క్రిందకు రాలేదు. నిజానికి 18వ శతాబ్దం తరవాతనుంచే యేకంగా హిందుస్తాన్ అని చెప్పుకోడానికి వీలుకల్గింది. ఇంగ్లీషు వాళ్ళు తమ పెట్టుబడిదారీ ఆర్థిక రాజకీయవ్యవస్థలతో సర్వ భారతదేశం ఒక్కటి అనే భావనను వాస్తవం చేశారు. ఈ వాస్తవికత యెంత సంకుచితమైనప్పటికీ దానిలో యెన్ని వైరుధ్యాలున్నప్పటికీ వాటన్నిటినీ యిక్కడ తడవడం అప్రస్తుతం.

అయితే వెనక్కునడిచి చరిత్రలో అతిప్రాచీన దశను చేరుకున్నట్లయితే భారతదేశంయొక్క భౌగోళికమైన, రాజకీయమైన ఏకత్వభావంకూడా చెరిగిపోతుంది. ఆ దశలో భారతదేశాన్ని ఒక దేశమని పిలువడానికి వీలుండదు. కొన్ని ప్రజా సమూహాలను గురించి మాత్రమే చెప్పుకోడం సాధ్యపడుతుంది. అప్పటిచరిత్ర ఆదిమచరిత్ర. అప్పుడుమానవులుకొన్ని గణాలుగా లేక తెగలుగాఉండేవారు;ఒకప్రదేశంనుంచి మరో ప్రదేశానికి ప్రయాణాలు చేసే సంచార గణాలుగా ఉండేవారు; యేదోఒక నిర్దిష్ట ప్రదేశాన్ని తమదిగా అప్పుడప్పుడు చెప్పుకున్నప్పటికీ, అసలు చెప్పుకోవలసివస్తే ఆ గణాలకు ఏ ప్రాంతమూ తమది అని చెప్పుకోడానికి వీల్లేదు. వారిని ఫలానా ఫలానా దేశనివాసులనిగానీ, పౌరులనిగానీ చెప్పడానికి వీలు

లేదు. గ్రీకులయొక్క, రోమనులయొక్క చరిత్రకూడా మొట్ట మొదట ఇలాంటి తెగలయొక్క, జనసమూహాలయొక్క చరిత్రగానే ఉండేది. తరవాతి కాలంలోనే నేడు మనమందరం అనుకునే గ్రీసు యిటలీదేశాల చరిత్ర అంటూ వచ్చింది. నేడు మనకు తెలిసిన ఆదిమకాల భారతదేశచరిత్రకూడా అలాగే గణాలయొక్క, తెగలయొక్క, లేక వివిధ జన సమూహాలయొక్క చరిత్రగా ఉంటూ తరవాత తరవాతనే భారతదేశ చరిత్రగా రూపొందింది.

ఆర్యులు భారతదేశానికి వెలుపల యెక్కడనో ఒక్క నివాస ప్రదేశంనుంచి భారతదేశానికి వచ్చినవారని యే ఒకరిద్దరోతప్ప చరిత్రకారులందరూ అంగీకరిస్తున్నారు. ఆర్యులు ఆ ప్రథమనివాసంనుంచి చీలి, శాఖలై కొందరు యూరపు, ఏషియా మైనరు మొదలైన పడమటిప్రాంతాలకు పోయినారు; కొందరు హిమాలయపర్వతాలను దాటి పంజాబు కాశ్మీరుల మీదుగా భారతదేశానికి వచ్చారు.

ఆర్యుల ప్రథమనివాస మెక్కడ? నేటి సైబీరియాలో యెక్కడో ఉత్తరధృవందగ్గర ఉండేదని తిలక్ మొదలైన వారంటారు; కాస్పియన్ సముద్రప్రాంతంలో వోల్గానదిఒడ్డున యెక్కడోనని మరికొందరంటారు. ఆర్యుల పురాణాల్లో వచ్చే కాశ్యపముని పేరును కాస్పియన్ సముద్రంతో వారు ముడి పెడ్తున్నారుకూడా. ఆర్యులందరికీ ఒకే నివాసముండేదని కొందరు అసలంగీకరించనే అంగీకరించరు. కాని ప్రాచీన ఆర్యుల వివిధ భాషలలోనూ పురాతనమైన ప్రాథమిక పద జాలం యొక్క నిదర్శనాలనూ [illegible] తమునుగురించీ, భావములనుగురించీ [illegible] సామ్యము

లను, పోలికలనుబట్టి, ఆర్యులు మొట్టమొదట ఒక ప్రదేశంలో ఉండి, అక్కడనుండి వివిధ ప్రదేశాలకు విస్తరించారనే ఊహయే సరియైనదిగా తోస్తుంది.

ఆర్యులెందుకు వలసపోవలసివచ్చింది? హిమప్రళయం, జలప్రళయంలాంటి ప్రకృతి వైపరీత్యాలవల్లనని కొందరంటారు. యూదులు, క్రైస్తవులు, గ్రీకులు, రోమన్లు, హిందూ ఆర్యులు మొదలైనవారందరి పురాణగాథల్లోనూ యీ ప్రళయాలు ఉదహరింపబడియున్నవి. ఈ ప్రళయాలే కాక, నాటి సంచారగణాల్లో జనాభా పెరగడంచేత, ఆహారం కొరకూ, పచ్చిక బయళ్ళకొరకూ వెతుక్కుంటూ పోవలసి రావడం, నిరంతర పోరాటాల్లో ఈ గణాలు లేక తెగలు ఒకరినొకరు తరిమివేసుకుంటూ ఉండటం-ఇలాంటి సామాజిక పరిణామంకూడా ఆర్యులు విస్తరించడానికి మరొక ముఖ్య కారణం.

ఆర్యుల విస్తరణ యేకాలంలో జరిగింది? కొందరు పండితులు క్రీస్తుపూర్వం 6000—4000 మధ్యకాలంలో యెప్పుడో జరిగిందంటారు. ఈ విషయంలో చాలా అభిప్రాయ భేదా లున్నవి. ఇంతవరకు మనకు తెలిసిన సమాచారాన్ని బట్టి దీన్ని యిదమిద్ధమని తేల్చడానికి సాధ్యంకాదు.

అదీకాక ఆదిమచరిత్రయుగం, లేక చరిత్రకు పూర్వ యుగం చాల దీర్ఘమైనది. కాబట్టి, దాన్నిగురించి మాట్లాడా లంటే వెయ్యేళ్లూ, అంతకు మించిన లెక్కన చెప్పుకోవలసిందే కాని మరో ... ప్పుడు పుట్టారు, లేక

స్టాలిన్‌గ్రాడ్ యుద్ధం యెప్పుడు జరిగింది అనేవాటివలె తారీఖులవారీగా ఆనాటి సంగతులు చర్చించడానికి వీలుపడదు.

ఐదులక్షల యేళ్ళనాడు మనుష్యుని పోలిన ఒక జంతువు నుంచి మనుష్యుడు పరిణామంచెంది వచ్చాడని మానవశాస్త్రజ్ఞులు (ఆంత్రోపాలజిస్టులు) చెప్తున్నారు. వివిధ ప్రదేశాలలో దొరికిన అతిపురాతన కళేబరాలనూ, యెముకలనూ బట్టి వారు పరిణామక్రమాన్ని నిర్ణయం చేస్తున్నారు. ఉష్ణమండలపు టడవులలో నివసించే జంతువులు ప్రకృతి వైపరీత్యాలవల్లనో, మార్పులవల్లనో ఆ ప్రదేశాలను వదలిపెట్టవలసి వచ్చింది. ఒకమారు భూమిమీద పుట్టినతరవాత బ్రతకవలెనంటే పనిచేయాలి; తిండి సంపాదించుకోవాలి; ఆత్మరక్షణ చేసుకోవాలి. ఇలాంటి అవసరంకొద్దీ ఆదిమ మానవమృగం వెనుకకాళ్ళమీద నిలుచుని, ముందుకాళ్ళను చేతుల్లాగా ఉపయోగించవలసివచ్చింది. అతడు నిటారుగా నిలుచుని, చేతులతో పనిముట్లను చేయ ప్రయత్నించడంలో చేతులు తత్ప్రయత్నాలకు అనువుగా రూపొందాయి. చేసిన పనిముట్లు అతనికి బ్రతికి పెరిగే శక్తిని పెంచినవి; అతని బుద్ధిబలం పెరిగింది; భాషను దిద్దుకున్నాడు. ఈ విధంగా 'చింపాంజీ' లేక 'గొరిల్లా'యే కాకపోయినప్పటికీ, కనీసం అలాంటి మృగమానవుడు నేడు భూమియంతటా విస్తరించియున్న సంపూర్ణ మానవుడుగా పరిణామం చెందాడు. ప్రాచీనరూపం గల మానవుడు నశించిపోయినాడు. నేడు యిక్కడా, అక్కడా ఆ ఆదిమరూప మానవుని యెముకలు మాత్రము దొరుకుచున్నవి. మానవశాస్త్రజ్ఞులు వాటి సహా

యంతో పరిణామక్రమాన్ని నిర్ణయించడానికి ప్రయత్ని స్తున్నారు.

ఆనాటినుంచి ఆర్యులు చరిత్రలోకి యెక్కేనాటివరకూ మధ్య వేలకొలది సంవత్సరాలు గడచిపోయాయి. ఆ కథ అంతా రాయడానికి తగినంత సామగ్రింకా లభ్యంకాలేదు.

హిందువుల వ్రాతలలో మన కగుపడే ఆర్యులు ఆట వికస్థితిలో ఉన్నవారు (ఆటవికస్థితి అంటే యేమిటో తరు వాత తెలుసుకుందాం). అయితే వారు ఆటవికస్థితియొక్క ప్రథమదశల నప్పటి కెప్పుడో గడచివచ్చినవారే. ఆ ప్రథమ దశలను జ్ఞాపకంచేసే చిన్నెలు కొన్ని ఆ కాలానికి చెందిన పౌరాణిక గాథల్లో అవుపడతాయి.

ఇప్పుడు మనం పరిశీలించబోయే ఆర్యులు మధ్య ఆసియానుంచి పోరాడుతూ, పెరుగుతూ ఇండియావైపుకు సాగివచ్చి, చివరకు ఇండియాను గెలిచి, యిక్కడ వలస లేర్పరచుకున్నవారే. ఈ మధ్యాసియానుండివచ్చిన ఆర్యులు ఆటవిక దశనుంచి నాగరికదశ కెలా అభ్యుదయాన్ని పొందారో తెలుసుకోడానికి ప్రయత్నిద్దాం.

ఆర్యులు భారతదేశంలో ప్రవేశించే ఘట్టాన్ని వివ రించేముందు ఒక్కప్రశ్నకు సమాధాన మీయవలసియున్నది.

ఆర్యుల రాకకుముందు భారతదేశంలో మానవనివాస మనే దుందా? ఉంటే, ఆ మానవు లెలాంటివారు? వారి నాగరికత యెలాంటిది? ఆర్యులు వారిపై పోగాడియున్నట్లైతే ఆ పోరాటాల్లో ఓడినవా రేమైనారు? అంటే ఆర్యులు రాక పూర్వము భారతదేశానికి చరిత్ర యేమైనా ఉన్నదా అనేదే

ప్రశ్న ఉన్నది. ఆర్యులరాకకు పూర్వం భారతదేశానికి చరిత్ర ఉన్నది. అయితే ఇందుకు స్వతంత్రమైన ఆధారాలేవీ లేవు. తమకు పూర్వమున్నవారినిగురించీ, తమ శత్రువులను గురించీ ఆర్యులు చెప్పినదే అధికభాగం. పంజాబులో దొరికిన హరప్ప శిథిలాలు, సింధులో లభించిన మహంజోదారో శిథిలాలు ఆర్యులకు పూర్వమున్న భారత నాగరికతకు అవశేషాలు. అయితే, నేటివరకు ఎవరూ వాటి అర్థాన్ని తగినంతస్పష్టంగా చెప్పలేకపోయారు. అందుచేత వాటిని మనం చరిత్ర వివరణ అని పిలువజాలం.

ఆర్యులరాకకు పూర్వం భారతదేశంలో ద్రావిడులని పిలువబడేవా రుండేవారనీ, వారికున్న ఉత్పత్తిసాధనాలు ఆర్యులకున్నవాటికన్నా ఎక్కువ నాణ్యమైనవిగా ఉండేవనీ, వారిని గెలవడానికి ఆర్యులు చాలా తీవ్రమైన పోరాటాలు చేయవలసివచ్చిందనీ కొందరు చెప్తున్నారు. చివరకు ద్రావిడులు ఓడింపబడి తూర్పుకు, దక్షిణానికి తరిమివేయబడ్డారు. ఓడింపబడిన ద్రావిడులలో కొందరు బానిసలుగా తీసుకోబడ్డారు. మరికొందరు ఇతర విధాలుగా విలీనం చేసుకోబడ్డారు. వారు తమ భాషయొక్క ప్రాథమిక స్వరూపాన్ని మాత్రం నిలబెట్టుకున్నారు. ఆంధ్రులు, తమిళులు, కన్నడులు, మళయాళీలు, తోడులూ ప్రాచీన ద్రావిడుల సంతతిగాభావింపబడుతారు. తర్వాతజరిగిన చరిత్ర పరిణామంలో వీరు తమ ప్రభావాన్ని ఆర్య సంస్కృతిమీద ప్రసరింపజేయగలిగారు. అయితే నేనీ గ్రంథంలో ఈసమస్యను పరిశీలించబోవడంలేదు.

ద్రావిడులకుపూర్వమే మరో కుటుంబానికి చెందినవారు భారతదేశంలో వుండేవారని కొందరు చెప్తున్నారు. వారు ద్రావిడులకు సమకాలికులో, లేక ద్రావిడులకు పూర్వంనుంచీ వున్నవారై ద్రావిడులచేత వెడలగొట్టబడినవారో అయి వుండాలి. ద్రావిడులకు పూర్వమున్నవారి సంతతివా రిప్పు డెవరైనా వున్నారా? ఈనాడు మధ్యభారతం, బెంగాల్ ప్రాంతాల్లో నివసిస్తూన్న 'మంఖ్మెరు' తెగవారు ఆ సంతతి వారే నంటున్నారు. 'ముండాలు' 'నాగులు' 'సంథాలులూ' ఈ మంఖ్మెరుల సంతతివారే. వీరు క్రమేణా తూర్పుదిక్కుకు నెట్టివేయబడ్డారు. వీరే చరిత్రకు పూర్వయుగంనాటి పాలినీషియన్ కుదురుకు చెందినవారనీ, ఈపాలినీషియన్లే మలయా, ఇండోనీషియా, ఇండోచైనా, ఆస్ట్రేలియా దేశాలకు విస్తరించారనీ మానవ శాస్త్రజ్ఞులు అంటున్నారు ఈ ప్రాంతాలలో మంఖ్మెరు తెగవారే ఆర్యులకన్నా, ద్రావిడులకన్నా అత్యంత ప్రాచీనమైనవారనీ, ఆర్యులు వలస నేలకొరకై వీరితోకూడా తీవ్రంగా పోరాడవలసివచ్చిందనీ చెప్పాలి.♦

ఆర్యులు తమ ఆదిమనివాసప్రదేశాల్లో ఎలా జీవితం గడిపేవారో, వారిగణాలు పెరగడం, వలసపోవటం యితర

---

♦ ద్రవిడులను గురించిన మొట్టమొదటి సమగ్రమైన చర్చ కాల్డ్వెల్ యొక్క "ద్రవిడియన్ గ్రామర్" అను గ్రంథములో చేయబడ్డది. ఇది 1856 నాటిది. "ఆర్యులకూ, ద్రావిడులకూ పూర్వయుగాన్ని" గూర్చి జూల్సు బ్లాక్, సిల్వీలేవి, ప్రజిలాస్కీ మొదలైనవారి వ్యాసాలను కలకత్తా విశ్వవిద్యాలయానికి చెందిన డాక్టరు పి. సి. బాగ్చీ అనువదించి 1929 లో ఒక సంపుటిగా ప్రకటించాడు. "గాధాసప్తశతి" అను గ్రంథాన్నికూడా చదవవలసి యుంటుంది.

ప్రదేశాలకు విస్తరించడం, వారి సంస్కృతీ అభ్యుదయం అన్నీ యెలా జరిగాయో చూద్దాం. ఇది అంతా ఆర్యులు సంతరించిన నిదర్శనాలమీదనే ఆధారపడియున్నది. ఐతే మనం ఆ నిదర్శనాలను పూర్తిగా వారి భావచిత్రాల దృక్పథంతో కాకుండా, మన సామాజిక శాస్త్రదృక్పథంతో పరిశీలించాల్సి వుంటుంది.

ఆర్యులచరిత్రలో దిగడానికి ఆ ఆర్యుల రచనలనే ఆధారంగా తీసుకుంటున్నాం. కాబట్టి యిక్కడ వాటిని గురించి ముందుగా కొంత తెలుసుకొనవలసి యుంటుంది.

ఆర్యుల చరిత్రసామాగ్రి ఆర్యులకు విలక్షణమైనసొత్తు. ఆదిమదశనుండి నాగరికదశవరకూ పరిణామించింది యీనాటివరకూ బ్రతుకగలిగి, ఆ ప్రాచీన స్మృతులను యింత స్పష్టమైనరూపంలో సంతరించిపెట్టుకున్నవారు ఆర్యులుతప్ప ప్రపంచంలో మరొకరు లేరు. కొంతవరకు గ్రీకులకు అలాంటి సామాగ్రిఉన్నది. ఈజిప్షియన్ల చరిత్రను వారి పిరమిడ్లపైనా, రాజసమాధులపైనా, రెల్లుకాగితపు చుట్టలలోనూ ఉన్న చిత్రలిపినుంచి తెలుసుకున్నారు. సుమెరియన్లయొక్క, అస్సీరియన్లయొక్క, వారినుంచి హిట్టైటులయొక్క చరిత్రలను మధ్యప్రాచ్యంలో బయటపడిన మట్టిపలకలమీద కోణాకార లిపి (క్యూనీఫామ్) వ్రాతలనుబట్టి తెలుసుకున్నారు. హోమర్ ద్వారా గ్రీకుల చరిత్ర క్రీస్తుపూర్వం 1000 ఏళ్ళక్రిందటి నాటిదాకా తెలుసుకోడానికి వీలుపడ్డది. ఇటీవల త్రవ్వి యెత్తబడిన అయోనియన్ మొదలైన శిథిలావశేషాలుకూడా యిందు కుపయోగపడుతున్నవి.

భారతీయ ఆర్యులు తమ ప్రాచీన సామాజిక జీవిత స్మృతులను, వేదమంత్రాలు, లేక ఋక్కులలోనూ తరువాతి వాఙ్మయంలోనూ సంతరించారు. వేదాల తరవాత, ఇతిహాసాలు వచ్చినవి. ఇతిహాసాలతరవాత సూత్రాలూ, స్మృతులూ వచ్చినవి. వేదమంత్రాలు నిశ్చితమైన స్వర కాలయుక్తంగా తదనుగుణమైన కర్మకాండతో సహా హిందూ - ఆర్యన్ సమాజపు బ్రాహ్మణులవల్ల నాలుగు వేల ఏళ్ళపాటు పారంపర్యంగా ఆనోటినుంచి ఆనోటికి అందించబడినవి. చివరకు కాగితంమీద భాష్యంతో సహా వ్రాయబడేవరకూ వేదమంత్రాలు ఆర్యుల జ్ఞాపకశక్తివల్లనే నిలిచినవి. అయితే అవి సంతరింపబడటం, నేర్వబడటం, తరువాత సంతతులకు పారంపర్యంగా అందింపబడటం అంతా మానవ శ్రేయస్సుకొరకు గానీ, చరిత్రకొరకుగానీ చేయబడలేదు. క్రీ॥ పూ॥ 1500 ల ప్రాంతాలకే అవి హిందూ సమాజానికంతటికీ ఒక మత విషయికమైన కర్మకాండగా మారిపోయినవి. అవి యీ దశలో బ్రాహ్మణ పురోహితవర్గాల భుక్తికి ఆధారాలైనవి. అందువల్ల వాటికి సామాజిక వాస్తవికత లోపించిన తరవాతకూడా, అవి తరతరాలుగా నిలిచియుండగలిగాయి. అయితే వీటిని తమ కర్మకాండగా నిలపడములో ప్రత్యేకత కన్నా హైందవార్యులు రెండువేలయేళ్ళనుంచి తమ సామాజిక వ్యవస్థను-పైకి యెన్నిమార్పులు వచ్చినప్పటికీ-పునాది నిర్మాణంలో చెడకుండా అనుస్యూతంగా అట్టిపెట్టుకున్నారు. అది వారి అదృష్టమనాలి. లక్షలాది హిందువులూ, వారితో చేరినవారూ, వారిలో ఐక్యమైనవారూ అంతా ఎన్నో దాడులనూ, దండయాత్రలనూ తట్టుకొని నిలిచారు. చివరకు

-స్టుబడిదారీయుగానికీ, పారిశ్రామిక విప్లవానికీ అందింపబడటంతో వారి సమాజం సమూలంగా పెళ్ళగింపబడ్డది; వారి పూర్వజీవితం సంపూర్ణంగా మారిపోయింది. హైందవసమాజంలో నేడు జరుగుతున్న సామాజిక విప్లవం వంటిదాన్ని వారింతకుముందెన్నడూ చూచియెరుగరు. అందువల్ల పూర్వం యెన్నో విప్లవాలను తట్టుకొని నిలిచిన వారి సామాజిక, మత, కర్మకాండ, వాటిని గురించిన జ్ఞాపకాలుకూడ యిదివరకు మాదిరే నిలిచి, భవిష్యత్తును సంక్రమించేస్థితిలో లేవు. అందువల్ల చరిత్రకారుడానాడు వాటిని కాగితంమీద ముద్రించి అట్టిపెట్టవలసి వచ్చింది. ఆ సంఘమూ, ఆ కులాలూ, ఆవాక్యాలూ, వాటిని యిప్పటివరకూ నాలుకమీద మోసిన ఆవర్గప్రయోజనాలూ శిథిలమైపోతున్నాయి. అంతకన్నా ఉత్తమోత్తమమైన సోషలిస్టు సమాజ జీవితంగా మారిపోతున్నాయి. ఒకనాడు వోల్గానదీ తీరంలో విడిపోయిన ఇండో-ఆర్యన్ సమకాలికులకు యీ ఉజ్వలపాత్రను నిర్వహించే అదృష్టం పట్టలేదు.

చరిత్ర పూర్వయుగపు ఆదిమకమ్యూనిస్టుదశను పరిశోధించడానికి వేదాలనూ, మహాభారతాన్నీ-ముఖ్యంగా వేదాలను-ఆధారాలుగా ఉపయోగిస్తాం.

ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణవేదం యీ నాల్గింటికీ విషయమూ, రచనాసంవిధానమూ ఒకటిగానే ఉంది. నిజానికి ప్రాచీన సాంప్రదాయాల ప్రకారం ఋగ్యజుస్సామవేదాలు మూడే ఉండేవి. నాల్గవదియైన అథర్వణవేదం తరువాత కాలంలో వేదప్రతిపత్తిని పొందింది. సామవేదం వేరుగా పేర్కొనబడుతున్నప్పటికీ, నిజానికి

ఋగ్వేదానికి స్వరమేళ కల్పనమై అభినయ గానంచేయబడ్డది. సామవేదం ఋగ్వేదానికి స్వరకల్పన నన్నమాట.

కర్మకాండ జరిపేటప్పుడే, అంటే యజ్ఞం చేసేప్పుడే వేదమంత్రాలకు ప్రత్యేకప్రయోజనం యేర్పడుతుంది. బ్రాహ్మణ సాంప్రదాయంప్రకారం యజ్ఞసమయాల్లో ఒక్కొక్క వేదాన్ని ఒక్కొక్క ఋత్విజుడు పఠిస్తాడు. కాని యే వేద మంత్రాన్ని యెవరు పఠిస్తారో, ఆ పఠించేటప్పుడు ఆత డేమి చేశాడో చరిత్రకారుడి దృష్టిలో ప్రధానమైన విషయాలు కావు. యజ్ఞం ఒక మతవిషయికమైన కర్మకాండగా మారక పూర్వం వేదపారాయణుడి విధి యేమిటి అనేదే ముఖ్యం. యజ్ఞకాండలో యే మంత్రం పఠించినా, ఆ పఠిత ఆ సమయంలో యేదేనా సామాజిక ప్రయోజనం కల పనిచేస్తున్నాడా అనేది చూడాలి. ఈనాడు భారతదేశం మొత్తం మీద యజ్ఞకాండను క్షుణ్ణంగా యెరిగిన బ్రాహ్మణులు యే పదిమందికన్నానో లేరు. వారు చెప్పేదాన్నిబట్టి యజ్ఞంచేసే సమయంలో నాటి ప్రాచీన సామాజిక జీవితాన్నంతటినీ పునస్సృష్టి చేయాలని తేలుతున్నది. రెండు కొయ్యముక్కల రాపిడివల్ల అగ్నిని ప్రతిష్ఠించాలి. ఇనపముక్క లేకుండా ఒక ప్రత్యేకమైన కొయ్యతోటే, గడ్డితోటే యజ్ఞశాలను నిర్మించాలి. ఆవుపాలు పితకాలి; పెరుగు చేయాలి; ధాన్యాన్ని రాతితో దంచాలి; (తిరగలిలో విసరగూడదు) యజ్ఞపశువును చంపి, తోలుపలిచి వండాలి; నృత్యగానాలు చేయాలి; అనాగరకమైన పద్ధతిలో సంభోగించాలి; పోరాడాలి; గెలవాలి; ప్రార్థించాలి; యిలా అన్నీ చేసుకుపోవాలి. యజ్ఞ కర్మ

కాండసంతటినీ పరిశీలిస్తే, అదియంతా ఆదిమార్యజీవితాన్ని తంత్రరూపంలో పునస్సృష్టి చేయడమేనని తేలిపోయింది. యజ్ఞంలో యిదంతా చేయాలని చెప్పియున్నది. ప్రపంచం, మానవుడు, జంతువులు మొదలైనవాటి సృష్టినిగురించి గాథలను గానంచేయాలి. ఉషస్సునుగురించి మనోజ్ఞమైన వర్ణనలనూ, యజ్ఞపురుషుడు, లేక నాయకుడు ప్రజలకిచ్చే మహా సంపదలను లేక "దానాన్ని" కీర్తించాలి. పిశాచాలను పారద్రోలడానికీ,రోగనివారణ చేయడానికీ ఉచ్చాటనలుచేయాలి. ఇదీ వేద సూక్తాలలో చెప్పబడిన విషయమంతా. యజ్ఞం, లేక వైదిక కర్మ అంతా చరిత్రలో ఒకానొక ఘట్టంలో ఆర్యుల వాస్తవిక జీవితాన్ని ప్రతిబింబిస్తున్నదని పండితులంతా ఒప్పుకుంటున్నారు.

ఈనాడు మనకు లభ్యమయ్యే వేదాలు బ్రాహ్మణులలోని వివిధ శాఖలవారు అనుసరించినట్టి, లేక సేకరించినట్టి పాఠాంతరాలుగా ఉన్నాయి. ఋగ్వేదం 1028 సూక్తాలతో ఒకేఒక సంహితగా, లేక పాఠసంపుటంగా లభ్యమౌతున్నది. యజుర్వేదానికి ఆరు సంహితలు లేక పాఠాంతరా లున్నవి. అందులో నాల్గింటిని కలిపి కృష్ణయజుర్వేదమనీ, మిగిలిన రెండిటినీ కలిపి శుక్ల యజుర్వేదమనీ అంటారు. అథ్వరణ వేదానికి 731 సూక్తాలో 6000 మంత్రాలోవున్నవి. సామ వేదంలో 1549 మంత్రాలున్నవి; యివన్నీ ఋగ్వేదానికి కాపీలే. అథర్వణ వేదంలో దాదాపు యేడవవంతు ఋగ్వేదంలో భాగమే. (కొన్ని ఋక్కులుకలిపి ఒక సూక్తం.)

మనకు దొరికే ఇతర వాఙ్మయసామగ్రి అంతటికన్నా వేదచతుష్టయంలోని మంత్ర[illegible] కొన్ని

మిగిలినవాటికన్నా ప్రాచీనాలు. ఆర్యసమాజ పరిణామం యొక్క ఒకదశలో కొత్తబుక్కులు, లేక మంత్రాలు రచింపబడటం ఆగిపోయింది. అప్పటివరకూ రచింపబడిన వేద వాఙ్మయం ఆర్యులపవిత్ర వారసత్వముగా నిలిచిపోయిందంటే అర్థమేమిటో ముందుముందు చూద్దాం.

ఇలా అతిప్రాచీనమైన మంత్రాలతోపాటు ప్రతి వేదానికి బ్రాహ్మణమని పిలువబడే అనుబంధమున్నది. ప్రతి బ్రాహ్మణానికీ ఒక ఆరణ్యకమున్నది. వేదాలకు అనేకకూర్పులు లేక సంహిత లుండటంవల్ల అనేక బ్రాహ్మణాలూ, ఆరణ్యకాలూ, ఉపనిషత్తులూ యేర్పడ్డాయి. బ్రాహ్మణంలోనూ, ఆరణ్యకంలోనూ సంప్రదాయమూ, గాథలూ, నిగూఢమైన ప్రశ్నలూ, నిగూఢమైన ప్రత్యుత్తరాలూ ఉన్నవి. బ్రాహ్మణాలు వచన రూపంలో ఉన్నవి ప్రాచీన సామాజిక నిర్మాణమునుగురించి, పోరాటాలను గురించి అనేక విషయాలు తెలుసుకోడానికి బ్రాహ్మణాలు మంచి ఆధారాలుగాపనికొస్తాయి. ఉపనిషత్తులు వేదాంతచర్చలు. నేడు హైందవచరిత్రను, తత్వశాస్త్రాన్ని చదివినవారందరూ యిది యెరుగుదురు. ఉపనిషత్తులు యిటీవల వేదాలకుచేర్చబడిన అనుబంధాలు. వాటినేదో ఒక వేదంతో అనుబంధించి చెప్పాలి. ఇవి నిజానికి వేదభాగాలుగా పరిగణింపబడవు. ప్రతి వేదసంహితకూ సూత్రాలున్నవి. ఈ సూత్రాలు శ్రౌత, గృహ్య, ధర్మ, శుల్వసూత్రాలని పలు విధాలు. ఈసూత్రకాలంనాటికి వచ్చేసరికి మొదటివేదాలకూ, ఆ కాలపు సమాజానికీ చాలామారం ప్రయాణమౌతుంది. మొందు· నియమాలూ, శిక్షలూ,

కుటుంబకర్మలూ, ఆ స్త్రీ మొదలైనవన్నీ-అంటే గణ జీవిత దశను దాటిన సమాజానికి సంబంధించిన విషయాలన్నీ ఉన్నాయి.

ఈ వాఙ్మయాన్నీ మంత్రతంత్రాలనూ, సాంప్రదాయాచారాలనూ, గాథలనూ మొదలైనవాటి నన్నిటినీ సేకరించి, అతి ప్రాచీనమైన యజ్ఞకర్మ నంతటినీ దాని మూల స్వరూపంలో ఒకచోటకు చేర్చి, దానినుంచి ఆదిమార్య సమాజాన్ని పునర్నిర్మాణం చెయ్యాలి. వేదవాఙ్మయపండితులనేకమంది యింతకు పూర్వమే యీపని చేశారు. వారి నిక్కడ ఉదహరించను; తరవాత తరవాత ప్రస్తావవశంగా ఉదహరిస్తుంటాను. వారు అవసరమైన సామాజిక చరిత్ర సామాగ్రి నంతటినీ ఒకచోటకు సేకరించారు. కాని వారంతా అసలు విషయాన్ని విస్మరించారు. అందువల్ల వారు ప్రాచీన ఆర్య గణజీవితాన్ని చిత్రించలేకపోయారు. నిజానికి ఆ పండితులకు చారిత్రక భౌతికవాదం తెలియకపోవడంవల్లను, 19 వ శతాబ్దంనాటి బూర్జువా సామాజిక దృక్పథాన్నే అనుసరించడంవల్లను, చిక్కుకోరానిచోట్ల వారు రొంపిలో చిక్కుకున్నారు. ఐతే వారిది సామాజికదృష్టి, మతదృష్టికాదు. అందువల్ల అందిన చరిత్రసామాగ్రిని వ్యస్తం (Sift)చేశారు; అందుచేత మనపని సులభమైంది. అసలు కీలకాన్ని తెలుసుకుంటే, బూర్జువా పండితులు సేకరించిపెట్టిన సామాగ్రినుంచే ఆర్యుల ఆదిమ కమ్యూనిస్టుసంఘము లేక గణముయొక్క పరిణామాభివృద్ధులనుగురించి సులభంగా తెలుసుకొనవచ్చు. అర్థంలేని కర్మకాండలాగా, గాథల్లాగా వేదాల్లోనూ,

8

ముఖ్యంగా బ్రాహ్మణాల్లోనూ ఉన్న సమాచారాన్ని, మహాభారతంలోని చరిత్రాంశాలనూ అర్థంచేసుకొనడానికి కీలక మేమంటే, యజ్ఞమనగా యేమిటో అర్థంచేసుకొనడమే. సమాజంయొక్క స్మృతి, ఆచారసాంప్రదాయమూ, మత కర్మలూ అన్నీ బ్రహ్మనూ, యజ్ఞాన్నీ కలిపి సృష్టికి ప్రారంభం గానూ, బ్రతుకు సర్వస్వంగానూ ఆర్యులు భావించేవారని తెలుపుతున్నాయి. అది గ్రహించి యజ్ఞమంటే యేమిటి? యజ్ఞానికీ, బ్రహ్మకూ సంబంధ మేమిటి? అనే విషయాన్ని వేదాలనూ, బ్రాహ్మణాలనూ, మహాభారతాన్నీ పరిశీలించడం ద్వారా తెలుసుకున్నట్లయితే, ఆదిమార్యుని నిజస్వరూపం మన కళ్ళకుకట్టినట్లు తెలుస్తుంది. అప్పుడు, వేదాలలో బ్రహ్మనుగురించీ, యజ్ఞాన్నిగురించీ పూర్తిగా అర్థరహిత మైన ఆడంబరశబ్దాలుగా మనకు కనిపించేవాటిలో కొంత చరిత్రసామగ్రిని చూడగల్గుతాం. కాబట్టి మనం యజ్ఞాన్నీ, యజ్ఞంలో వివరింపబడిన కర్మకాండనూ పరిశీలించి పునర్నిర్మాణం చేద్దాం. యజ్ఞకాండనుబట్టి ఏ బ్రహ్మలో తాను లీనమైఉంటున్నట్టు భావించేవాడో, ఆ పరబ్రహ్మనుబట్టి ఆర్య మానవుని పుట్టుకను పరిశీలిద్దాం; పునర్నిర్మాణం చేదాం.

# రెండో అధ్యాయం

## సంస్కృతియొక్క ఆదికాలపు దశలు

మానవుని సంస్కృతీ నాగరికతలను గురించీ, అతని జీవిత మెలాంటిది, ఆలోచన లెలాంటివి, జీవితావసర వస్తువుల నెలా ఉత్పత్తి చేసుకుంటాడు అనే విషయాలనుగురించీ చెప్పే చారిత్రక ప్రమాణ గ్రంథ మేదైనా ప్రతిదశలో అత డుపయోగించిన పనిముట్లనుగురించికూడా చెప్తుంది. మానవ శాస్త్రజ్ఞులూ, సామాజిక చరిత్రకారులూ దాదాపు అందరూ ముఖ్యంగా ప్రాచీనసమాజాల చరిత్రనుగురించి చెప్పేటప్పుడు ఈ ఆచారాన్ని పాటించారు. మానవుడు వేటపరికరాల నుపయోగించాడనో, చేపలుపట్టే పరికరాల నుపయోగించాడనో లేక నాగలిపట్టి వ్యవసాయం చేశాడనో చెప్తుంటారు. ఉత్పత్తి పరికరాల ననుసరించి సమాజచరిత్రను కొన్ని ఘట్టాలుగా విభాగించడంకూడ కద్దు. రాతియుగము, కంచు యుగము, యినుపయుగము మొదలైనవి యిలాంటి విభాగాలే. చరిత్రను గురించి వారిసిద్ధాంతా లెలా ఉన్నప్పటికీ సామాజిక మానవుని జీవితంలో ఉత్పత్తిపరికరాలు కీలకమైన ప్రాముఖ్యాన్ని వహిస్తున్నాయనే సత్యాన్ని వారు కాదనలేకుండా ఉన్నారు. బూర్జువా చరిత్రకారుడు యీ సత్యాన్ని అంగీక

గించినప్పటికీ, దీన్ని దాటి ఒక్క అడుగుకూడా అతడు ముందుకు కదలడు.

ఒకొ్కక్క దశలో అమల్లో ఉన్న ఉత్పత్తిశక్తులు ఆ యా దశల్లోని సమాజ జీవితస్వరూపాన్ని నిర్ణయిస్తాయని మార్క్సిస్టులు విశ్వసిస్తున్నారు. మానవుడు ఆలోచించ గలగక ముందునుంచే, మరేపనీ చేయగలగక ముందునుంచే బ్రతకడానికి కూడూ, గుడ్డా, గూడూ సంపాదించుకోవాలి. ఈ ప్రాథమిక కృషిలో ప్రకృతిపై పోరాడవలసివస్తుంది. ఈ పోరాటానికై అతడు నిర్మించుకోనగలిగిన పనిముట్లూ, అతడు కూడదీసుకోగలిగిన తోటిమనుష్యుల సంఖ్యా, వారి పని నైపుణ్యమూం యివన్నీకలసి ఉత్పత్తిశక్తులనబడతాయి. మొట్టమొదట యీ ఉత్పత్తి శక్తులంటే, అప్పుడు భౌగోళిక పరిస్థితులూ, ప్రకృతి వాతావరణమూ అనుకూలంకావడం అదనంగా సహాయపడుతుంది. ఉత్పత్తిశక్తులే లేకపోతే వీటి ప్రయోజన మేమీఉండదు.

ఈ ఉత్పత్తిశక్తుల పునాదిమీదనూ, వీటి స్వభావాన్ని బట్టీ సమాజవ్యవస్థ నిర్మాణమౌతుంది. మానవులు తమమధ్య పరస్పర సంబంధాల నెలా నిర్మించుకుంటారో, తమకూ ఉత్పత్తి పరికరాలకూ మధ్య యెలాంటి సంబంధాలను కల్పించుకుంటారో, ఆ సంబంధాలు ఉత్పత్తి సంబంధా లన బడతాయి. ఈ ఉత్పత్తిశక్తులమీద ఆధారపడతాయి. ఆదిమ యుగంలో రాతిగొడ్డళ్ళ నుపయోగించే ఆటవికులు పెట్టుబడి దారీ సంబంధాలను కలిగియుండజాలరు. అలానే ఆవిరి

యింజన్లుగల పెట్టుబడిదారులూ, కార్మికులూ ఆదిమ కమ్యూనిస్టు గణసంబంధాలను కలిగియుండి జాలరు.

ఒకదశనుంచి మరొకదశకు మార్పుజరిగే పరిణామ కాలంలో ఉత్పత్తి పరికరాలే విప్లవకారణాలౌతాయి. ఉత్పత్తి పరికరాల ప్రత్యేకత యేమంటే అవి నిత్యపరిణామాత్మకాలు; యేదశలోనూ అవి పేరుగట్టి నిలిచిపోయేవి కావు. ఉత్పత్తి పరికరాలయొక్క నిత్యపరిణామానికి మానవుల సామాజికోత్పత్తి కృషి, మానవ సామాజికావసరాలూ కారణాలుగా ఉన్నాయి.

ఉత్పత్తి పరికరాలలోనూ, ఉత్పత్తి శక్తులలోనూ కలిగేమార్పులే సమాజవ్యవస్థయొక్క, లేక నిర్మాణంలో వచ్చే విప్లవాత్మక పరిణామాలకు కీలకమైన కారణాలు.

ఆటవిక దశనుండి అనాగరికదశకు, దానినుండి నాగరికతకు మానవుని అభివృద్ధిక్రమంయొక్క దశలను, వాటి ప్రధాన స్వభావాలను గురించి ఎంగెల్సు మనకు యిచ్చిన వివరణ ఉత్తమమైనది. ఆ వివరణ నాధారంచేసుకుంటే మనం ఆర్య చరిత్రను ఇంకా చక్కగా అవగాహన చేసుకోగలుగుతాము.

## ఆటవికదశ

1. ప్రాథమికదశ : మానవజాతియొక్క శైశవావస్థ యిది. మానవుడు యింకా తన మొట్టమొదటి నివాస స్థలాల్లోనే అంటే ఉష్ణోగ్ర, అర్ధ ఉష్ణోగ్ర అరణ్యాలలో, కనీసం కొంతకాలమైనా చెట్లమీద నివసిస్తూండేవాడు. అందువల్ల అతడు పెద్ద [illegible] క్రూరమృగాలనుండి రక్షింపబ [illegible]

వచ్చా [illegible] [illegible]ంకెలు అ[illegible]

రంగా ఉండేవి. మాటద్వారా అభిప్రాయాల ప్రకటన యీ దశలో మానవుడు సాధించిన ప్రధాన విజయం. చరిత్రరచన ప్రారంభమయ్యాక మనకు తెలియవచ్చిన జాతు లేవీ యీ ప్రాథమిక స్థితిలో ఉన్నట్లు మనకు ఆధారాలులేవు. ఈ దశ వేలకొలది సంవత్సరాల్లో విస్తరించినప్పటికీ, ఇందుకు ప్రత్యక్ష సాక్ష్యం మనకు లేదు. కాని మానవుడు జంతు ప్రపంచంనుండి ఉద్భవించాడని అంగీకరించినప్పుడు ఈ పరిణామదశ ఉండాలని ఒప్పుకోవలసి వస్తుంది.

2. <u>మాధ్యమికదశ</u> :—ఈ దశ చేపలు తిని బ్రతకడం (చేపలతోపాటు ఎండ్రపీతలు, పెంకుచేపలు, తదితర జలచరాలనుకూడా చేర్చవచ్చు) నిప్పును ఉపయోగించడం నేర్చుకోవడంతో ప్రారంభమవుతుంది. చేపల ఉపయోగం పూర్తిగా పొందాలంటే వాటిని నిప్పుతో కాల్చడం అవసరం గాబట్టి ఇవి రెండూ అన్యోన్యాలే. ఏమైనా ఈ కొత్తఆహారం నిపెట్టబడ్డాక మానవుడు ఒక స్థలము, వాతావరణంతో సంబంధంలేకుండా స్వతంత్రంగా తిరిగే స్థితికి వచ్చాడు. తన యీ అనాగరిక స్థితిలోకూడా మానవుడు నదీతీరాల వెంబడి, సముద్రతీరాలవెంబడి సంచరిస్తూ, భూతలంలో అధిక భాగానికి విస్తరించగలిగాడు. పూర్తిగా లేక ప్రధానంగా యీ దశకు ...బంధించిన రాతియుగంలోని మొరటు రాతిపరికరాలు ...లియోలితిక్ పరికరాలనబడేవి) అన్ని ఖండాలలోను ...రకడంవల్ల ఈమానవవలసలు రుజువవుతున్నాయి. కొత్తగా ...చబడ్డ ప్రదేశాలు, కొత్తవిషయాలు ...పెట్టడానికి నిరం...

...ప్రాపిని... ...రితకం.

వీటన్నిటిమూలంగా కొత్త ఆహారదినుసులను కనిపెట్టారు. కందమూలాదులను ఉడకబెట్టడం, భూమిలో లోతైన పొయ్యిలలో కాల్చుకోవడం నేర్చుకున్నారు. గదలు, ఈటెలు కనిపెట్టాక యీ ఆహారానికి తోడు, అప్పుడప్పుడు వేటాడటం గూడ ఉండేది. వేటాడటంద్వారా మాత్రమే జీవించే తెగలు ఆ రోజులలో లేవు. పుస్తకాలలో మాత్రమే వారు మనకు కనిపిస్తారు. వేటాడి ఆ కష్టఫలితాన్ని సంపాదించడంలోగల ప్రమాదాలే యిందుకు కారణం. ఆహారదినుసులలో ఎప్పటికప్పుడు ఏర్పడు అస్థిరత్వంవల్ల యీ దశలో నరమాంస భక్షణ ఉద్భవించి, చాలా కాలంవరకు కొనసాగినట్లు కనపడుతుంది. ఆస్ట్రేలియాలోని ఆదిమవాసులు, పోలినీషియన్ తెగలలో చాలామంది జనం యిప్పటివరకు అనాగరికతయొక్క యీ మాధ్యమిక దశలోనే ఉండిపోయారు.

3. <u>ఉన్నతదశ</u> : విల్లు, అంబు కనిపెట్టడం, తత్ఫలితంగా వేటాడబడ్డ క్రూరజంతువులు భోజనంలో నిత్యభాగం కావడం, వేట ఒక సామాన్యవృత్తిగా పరిణమించడం—వీటితో యీ దశ ప్రారంభమయింది. విల్లు, నారి, అంబు కలిసి ఒక సంకీర్ణమైన పరికరం. దీనిని కనిపెట్టడమంటే అంతకు ముందు ఎంతో కాలంగా మానవుడు ఎంతో అనుభవాన్నీ, నిశితమైన ఆలోచనాశక్తినీ సమకూర్చుకోగలిగి యుండాలి. అనేక యితర పరిశోధనలతో అతనికి పరిచయం ఉండాలి. విల్లంబులు ఉపయోగిస్తున్నప్పటికీ పాత్రలుచేసే కళతో పరిచయంలేని (కుండల కున్నదగ్గరనుండే అనాగరికదశ ప్రారం

చెపుతున్నాడు) జాతులను పరిశీలించినట్లైతే, యీ మొదటి దశలోనే మానవుడు గ్రామాలలో నిలకడగా ఉండడం ప్రారంభమైనట్లు, జీవిత వసతుల ఉత్పత్తిలో కొంత పాటవం కొయ్యపాత్రల, వస్తువుల ఉపయోగం, నారతీసి వ్రేళ్ళతో బట్టలు నేయడం, పీచుతో బుట్టలల్లడం, సున్నితమైన రాతి పరికరాలు ఉపయోగించడం అమల్లోవున్నట్లు గమనిస్తాము. అంతేగాక, చాలవరకు భూగర్భవసతులలోను, కొన్నిచోట్ల కొయ్యచెక్కలతో కట్టబడ్డ యిళ్ళలోను నిప్పు, రాతిగొడ్డళ్ళు ప్రకాశించాయి. ఉదాహరణకు యీ అభివృద్ధి అంతా ఇంకా మట్టిపాత్రలు చేసేవిధానం తెలియకపోయినా విల్లంబులతోమాత్రమే పరిచయంగల పశ్చిమోత్తర అమెరికాలోని ఇండియన్లలో గోచరిస్తుంది. అనాగరికదశలో యినుపకత్తి నాగరికదశలో తుపాకులు ఎలా నిర్ణాయక ఆయుధాలో ఆటవికదశలో విల్లంబులు అలాంటివి.

## అనాగరికదశ

1. ప్రాథమికదశ :—మట్టిపాత్రలు కనిపెట్టడంతో యీ దశ ప్రారంభమవుతుంది. ఈ మట్టిపాత్రలు తయారు చేయడమనేది చాలాప్రదేశాలలో ముందు బుట్టలకు, కొయ్య పాత్రలకు నిప్పు అంటుకోకుండా కాపాడేందుకు మట్టిపూత
...డంనుండి, అటుపిమ్మట లోపల బుట్టలు లేకుండానే
...లో పాత్రలు తయారుచేయవచ్చుననే ఊహాజ్ఞానం
...గినట్లు రుజువు చేయవచ్చు. బహుశా అన్ని
...యుండవచ్చు.

ఇంతవరకు చెప్పబడ్డ పరిణామక్రమం ఒక నిర్ణీతదశ వరకు అన్నిప్రాంతాల తెగలకు సాధారణంగా వర్తిస్తుందని భావించవచ్చు. కాని అనాగరికదశ ప్రవేశంతో మరోదశ ప్రారంభమవుతుంది. రెండు మహాఖండాలలోని అసమాన సహజసంపదయొక్క ప్రభావం ఈ దశలో ప్రకటితమౌతుంది. పశువుల్ని మచ్చికచేయడం, మొక్కల్ని పెంచడం అనాగరిక దశయొక్క ప్రత్యేకలక్షణం. పాతప్రపంచమనబడే తూర్పు ఖండంలో మచ్చికచేయ వీలైన అన్నిజంతువులు, ఒక్కటి మినహా పండించవీలైన అన్ని ఆహారధాన్యాలూ ఈ దశలో లభ్యమయ్యేవి. పశ్చిమ ఖండమైన అమెరికాలో లామా అనే పెంచ వీలైనజంతువు ఒక్కటే ఉండేది. అదైనా దక్షిణ భాగంలోనే. పండించ వీలైనట్టి అన్నింటిలోకీ మంచిదైనట్టి మొక్కజొన్న ఒక్కటే ఉండేది. ఈ రెండు ఖండాలలోని విభిన్న సహజ పరిస్థితులమూలంగా ప్రజలు తమతమ ప్రత్యేక పద్ధతుల్లో నడిచారు. వీరి అభివృద్ధిక్రమంలోని వివిధ దశల మధ్య సరిహద్దు రేఖలు భిన్నంగా ఉంటూ వచ్చాయి.

2. <u>మాధ్యమికదశ</u>:—ఇది తూర్పుఖండంలో జంతువుల మచ్చికతో ప్రారంభమవుతుంది. పశ్చిమఖండంలో నీటిపారుదలద్వారా మొక్కలను పెంచడంతోను, సూర్యరశ్మిలో ఎండ బెట్టిన ఇటుకలు, రాళ్ళతో ఇళ్ళుకట్టడంతోనూ ఈదశ ప్రారంభమవుతుంది.

తూర్పుఖండంలో అనాగరికతయొక్క మాధ్యమికదశ పాలు, మాంసం యిచ్చే జంతువుల పెంపకంతో ప్రారంభ మయింది. కాని యీ దశలో చాలాకాలంవరకు మొక్కల

పెంపకం తెలియనట్లు కన్పిస్తుంది. పశువులమచ్చిక, పెంపకం వాటిని పెద్దపెద్ద మందలుగా ఏర్పరచడం ఆర్యనులూ, సెమైట్లకూ, మిగిలిన అనాగరిక జాతులకూ మధ్య దేశాలకు దారితీసినట్లు కన్పడుతుంది. ఈనాటివరకూ యూరోపియన్ ఆర్యనులకు, ఏషియాటిక్ ఆర్యనులకు పశువుల పేర్లు ఒకటిగానే ఉన్నాయి. కాని వ్యవసాయాని కనువైన మొక్కల పేర్లు చాలకాలంవరకూ ఎక్కడా కలవవు.

అనువైన ప్రదేశాలలో పశువులను మందలుగా ఏర్పరచడం పచ్చికబయళ్ళ జీవితానికి దారితీసింది. సెమైట్ తెగలు యూఫ్రటిస్, టైగ్రిస్ పచ్చికమైదానాలలోను, ఆర్యనులు యిండియా, ఆమూదరియా, సిర్ దరియా, డాన్, నీపర్ నదీ తీరాలలోవున్న పచ్చికమైదానాలలోను నివసించినట్లుకనబడుతుంది. ఇటువంటి పచ్చికబయళ్ళ సరిహద్దులలోనే జంతువుల మచ్చిక మొట్టమొదటగా సాధించబడినట్లు గోచరిస్తుంది. ఈ పచ్చికబయళ్ళలో నివసించేవారు మానవుని పుట్టుక ప్రదేశాలలోగాక ఇతర ప్రదేశాలలో పుట్టినట్లు, తమ ఆటవిక పూర్వీకులూ అనాగరికదశయొక్క ప్రాథమికదశలోని తెగలు కూడ నివసించుటకు వీలులేని ప్రదేశాలలో పుట్టినట్లు తరువాత తరాలవారికి గోచరిస్తుంది. కాని నిజానికి ఒకసారి పచ్చిక బయళ్ళ జీవితానికి అలవడ్డ ఈ మాధ్యమికదశలోని అనాగరికులు నీటివనరులుగల యీ పచ్చికమైదానాలను వదిలిపెట్టి తమపూర్వీకులు నివసించిన అటవీప్రాంతాలలోనికి తిరిగిపోవాలని కోరుకోరు. ఆర్యనులూ, సెమైట్లూ ఇంకా ఉత్తరానికి, పశ్చిమానికి వెళ్ళగొట్టబడినప్పటికీ అచట—అంటేపశ్చిమఏషియా,

యూరప్‌ల అరణ్యప్రాంతాలలో—నివసించడానికి కష్టపడ్డారు. అచటి అనువుగాని భూముల్లో తమ పశువులకోసం వ్యవసాయంద్వారా ధాన్యాదులను పండించుకోగలిగేవరకూ, చలికాలం అక్కడ గడపడానికి అలవడేవరకు చాలా బాధపడ్డారు. పశువుల మేతకోసమని మొట్టమొదట ధాన్యాలు పండించడం ఇచటే ప్రారంభమైయుండవచ్చు. తర్వాతనే అవి మానవుల ఆహారానికికూడ ముఖ్యావసరాలయ్యాయి.

ఆర్యనులకూ, సెమైట్లకూ విరివిగా పాలు, వెన్న, మాంసం మొదలైనవి ఆహారంగా లభించుటవల్ల ఈ ఆహారం పసిపిల్లల అభివృద్ధికి బాగా తోడ్పడుటవల్ల బహుశా యీ రెండు తెగలు మిగతా వారికన్న అభివృద్ధిలో ఆధిక్యత సంపాదించగలిగాయి. ఉదాహరణకు దాదాపు పూర్తిగా శాకాహారులుగా ఉండవలసివచ్చిన న్యూమెక్సికోలోని ప్యూబ్లో ఇండియన్ల మెదడు, మత్స్యమాంసాలు భుజించే ప్రాథమికదశలోని ఇండియన్ల మెదడుకన్న చిన్నదిగా ఉండేది. ఏమైనప్పటికీ యీ దశలోనే నరమాంసభక్షణ క్రమంగా అంతరిస్తుంది. అది ఒక మతసంబంధమైన లేక మాంత్రిక క్రియగా మాత్రమే నిలిచిపోతుంది.

3. <u>ఉన్నతదశ</u> :—ముడి ఇనుమును కరగించడంతో యిది ప్రారంభమవుతుంది. అక్షరాలు కనిపెట్టి వ్రాతను ప్రారంభించడం, తద్వారా సాహిత్యరికార్డులు తయారుచేయడంతో యీ దశ నాగరికదశలోనికి పరిణామం చెందడం ఆరంభమయింది. ఇదివరలోనే చెప్పినట్లు తూర్పుఖండవాసులుమాత్రమే యీ పురోగమనాన్ని స్వతంత్రంగా సాధించారు. ఈ దశలోనే యిదివరకటి దశలన్నీ కలిపి

చూచినాకూడా ఉత్పత్తిలో ఎక్కువ అభివృద్ధి సాధించ బడింది. వీరయుగానికి (Heroic age) చెందిన గ్రీకులూ, రోమ్‌నగర స్థాపనకు కొంచెం పూర్వమున్న ఇటాలియన్ తెగలూ, టాసిటర్ నాటి జర్మనులూ, వైకింగులనాటి నార్మనులూ యీ దశకు చెందినవారే.

ఇవేగాక, మనం మొట్టమొదటిసారిగా పశువులు లాగే ఇనుపనాగళ్ళ ఉపయోగాన్ని యీ దశలో చూస్తాము. తద్వారా పెద్దఎత్తున వ్యవసాయం—పొలం వ్యవసాయం—ఆనాటి పరిస్థితుల్లో ఆహారవసతుల సృష్టిలో విపరీతమైన అభివృద్ధి సాధ్యమయింది. ఇదే సందర్భంలో అడవులను నరికి అవి సాగుకు అనువయ్యే పంటభూములుగాను, పచ్చిక భూములుగాను మారడం గమనిస్తాము. ఇలా మార్చడం ఇనుపగొడ్డలి, పార లేకుండ సాధ్యపడదు. దీనితోపాటు జనాభా కూడా త్వరితగతిని పెరగటం, పరిమిత ప్రాంతాల్లో జనాభా ఒత్తిడి ఎక్కువగావడం ప్రారంభమైంది. పొలం వ్యవసాయం అభివృద్ధిచెందడానికి పూర్వం ఒకే కేంద్రపరిపాలనావ్యవస్థ క్రింద ఏవో కొన్ని అసాధారణ పరిస్థితుల్లో మాత్రమే ఐదు లక్షలవరకు జనాభాను సమకూర్చడం సాధ్యమయేది. బహుశా అది యెక్కడా జరిగియుండదు.

హోమర్ పద్యకావ్యాల్లో ముఖ్యంగా 'ఇలియడ్'లో అనాగరిక దశయొక్క ఉన్నతదశ ఉచ్ఛస్థాయికి నందుకున్నట్లు చూస్తాము. మెరుగైన ఇనుప పరికరాలు, గాలితిత్తులు, చేతిమర, కుమ్మరిసారె, సారా, నూనెఉత్పత్తి, లోహకళ, బండ్లు, యుద్ధరథాలు, చెక్కలు, దూలాలతో నౌకానిర్మాణం, చెక్కడపుపని (Architecture) ఒక కళగా

పెంపొందడం, గోపురాలు, బురుజులు, ప్రాకారాలతో పట్టణ నిర్మాణం, హోమర్ పురాణాలు, పౌరాణిక గాథలు—ఇవన్నీ గ్రీకులు అనాగరికదశలోనుండి నాగరికదశకు పురోగమిస్తూ న్నప్పటి సాంప్రదాయాలు. హోమర్ కాలంనాటి గ్రీకులు అనాగరిక దశయొక్క ఉన్నతదశనుండి యింకా పురోగ మించుటకు ప్రయత్నిస్తున్న రోజులలో ఇంకా ఆ దశయొక్క గుమ్మంలోనేయున్న జర్మనులను గురించి సీజర్, టాసి టస్‌లు వర్ణించిన దానితో వీటన్నిటిని పోల్చిచూస్తే ఆ దశలో ఉత్పత్తి ఎంత అభివృద్ధి అయిందో చూడ గలుగుతాము.

"మార్గన్" అనుసరించిన మార్గంలో ఆటవికదశనుండి అనాగరిక దశలోకి, దానినుండి నాగరికతయొక్క ప్రారంభ దశలోకి మానవజాతి చెందిన పరిణామాన్ని గురించి నేను యిచ్చిన చిత్రం సరికొత్త వివాదగ్రస్తంకాని విషయాలతో అది నిండియుంది. వివాదగ్రస్తం కానివని ఎందుకంటున్నా నంటే అవి నేరుగా ఉత్పత్తినాధారం చేసుకునే చెప్పబడ్డాయి కనుక. అయినా మానవసమాజం తన ప్రయాణాన్ని పూర్తిగా కొనసాగించాకగాని యీ చిత్రాన్ని సమగ్రంగా తయారుచేయలేము. అప్పటివరకు యిది అస్పష్టంగానే, అసమగ్రంగానే ఉంటుంది. ఆనాడే అనాగరికదశనుండి నాగ రికదశకు ఎలా పురోగమించిందీ, ఆ రెండింటికీ మధ్యనున్న ప్రధానమైన తేడాలనూ సమగ్రంగా చిత్రించ వీలవుతుంది. ప్రస్తుతానికి మార్గన్ చేసిన దశల విభజనను ఈ క్రిందివిధంగా పొందుపరచవచ్చు.

ఆటవికదశ :— యథాతథంగా ఉపయోగించడానికి అనువుగా ఉన్న ప్రకృతిసిద్ధమైన వస్తువులను స్వాధీనం జేసుకోవడం ప్రధానంగా యీ దశలో ఉంటుంది. మానవుడు ఉత్పత్తి చేసినవన్ని ముఖ్యంగా యీ వస్తువుల స్వాధీనానికి పనికివచ్చే పరికరాలే.

అనాగరికదశ :— ఈ దశలో పశువులమచ్చిక, వ్యవసాయం ద్వారా ప్రకృతినుండి మానవకృషిఫలితంగా ఉత్పత్తి నెక్కువ చేయుటకు అవసరమైన విజ్ఞానాన్ని సంపాదించటం ఉంటుంది.

నాగరికదశ :—ఈ దశలో ప్రకృతి సిద్ధమైన వస్తువుల నింకా ఎక్కువగా ఉత్పత్తిచేసుకోవడం; పరిశ్రమలను పెంపొందించుకోవడం; కళల అభివృద్ధి కవసరమైన పరిజ్ఞానం సంపాదించుకోవడం ఉంటుంది.

(కుటుంబం-పుట్టు పూర్వోత్తరాలు- పేజీ 41 ఇంగ్లీషు ముద్రణ)

## నా గ రి క త

మానవసమాజం నాగరికదశలో ప్రవేశించగానే ఆదిమ కమ్యూన్ అంతరించిందన్నమాట. అనాగరికదశకూ, నాగరికదశకూ మధ్యగల ప్రధానమైన తేడాను ఏంగెల్సు యీ క్రింది విధంగా క్లుప్తీకరించాడు.

"శ్రమవిభజన, తత్ఫలితంగా వ్యక్తులమధ్య మారకం, ఈ రెంటినీ కలుపుతూన్న సరుకుల ఉత్పత్తి, యివన్నీ ఉచ్ఛ

స్థాయికి అభివృద్ధియై ఆనాటి సమాజంలో విప్లవాత్మకమైన మార్పును సాధించినదశయే నాగరికదశ."

(అదే గ్రంథం-పేజీ 247)

ప్రయివేటు ఆస్తి, ధనికులు బీదలనే తేడాలు, వర్గాలు, ఒక వర్గాన్ని మరొకవర్గం దోపిడీచేయడం, బానిసత్వం, స్త్రీలపై పురుషుల పెత్తనం, పట్టణాల గ్రామాలమధ్య శాశ్వత నిస్సంయోగం (anti thesis), తుదకు దోపిడీవర్గాల చేతులలో దోపిడీచేయబడుతున్న వర్గాలను అణగగొట్టేందుకు సాధనంగా రాజ్యాంగయంత్రం-యివన్నీ సరుకుల ఉత్పత్తి మారకాలతోనే ఉత్పన్నమయ్యాయి.

"పైన చెప్పబడ్డ ప్రాథమిక నిర్మాణంయొక్క సహాయంతో పాతఅమాయక సమాజం సాధించలేని వాటినన్నిటినీ నాగరికదశ సాధించగలిగింది. కాని మానవుని యితర శక్తి ప్రవత్తులన్నింటినీ అణచివేసి అతనిలోని క్రూరసహజాతాలను, ఆవేశాలను రెచ్చగొట్టి వానిని పెంపొందించడం ద్వారానే దీన్ని సాధించగలిగింది. నాగరికదశ ప్రారంభమైన నాటినుండీ యీనాటివరకూ కూడా పచ్చిదురాశ మాత్రమే మానవునికి ప్రోత్సాహశక్తిగా ఉంటూ వచ్చింది. సమాజం యొక్క సంపదగాక, యీ దురదృష్ట వ్యక్తియొక్క సంపద, ఇంకా ఎక్కువసంపదను, మరింత సంపదను సముపార్జించడమే నాగరికతయొక్క ఏకైక ప్రధాన ఆశయంగాఉంటూంది. ఈఆశయ సాధనలో నిరంతర శాస్త్రాభివృద్ధి, పరిపక్వమైన కళావికాసం మెట్టు మెట్టుగా సాధించ బడ్డాయంటే, దానికి కారణం

యీ సమాజంలో యివిలేకుండా సంపదను సృష్టించడం కష్టం గాబట్టే.”

(అదే గ్రంథం-పేజీలు 251-2)

అందువల్లనే ప్రాచీన ఆర్యన్ మానవుని చరిత్రను పరిశీలించేటపుడు మనం మొదట అతను ఉపయోగించిన ఉత్పత్తి పరికరాలనూ, వాటిద్వారా అతడెలా ఉత్పత్తి చేశాడు; అనేదాన్ని చూడాలి. అలా పరిశీలించినపుడే అతని నిర్మాణ వ్యవస్థ-అంటే అతని ఉత్పత్తి సంబంధాలు, పిమ్మట అతని సిద్ధాంతాలూ, నీతి సూత్రాలూ, కుటుంబ సంబంధాలూ మొదలైనవి తెలుస్తాయి.

# మూడో అధ్యాయం

## యజ్ఞము-ఆర్యగణముల సమిష్టి ఉత్పత్తివిధానం

వేదవాఙ్మయంలోనూ, మహాభారత తేతిహాసంలోనూ సృష్టిని గురించీ, ఆదిమకాలపు మానవజీవితాన్ని గురించీ అనేక గాథలున్నాయి. అనాగరిక స్థితిలోని మానవునికి సహజమైన ఊహాగానాలూ, కల్పిత చిత్రప్రతిబింబాలూ వేద వాఙ్మయంలో ఉంటాయి! ఇవేకాక వారి పూర్వీకుల పరిస్థితీ, జీవిత విధానమూ, కార్యకలాపాలూ, పురోభివృద్ధీ మొదలైన వాటినిగురించి అత్యంత ప్రాచీనమైన విషయా లనేకం పొందు పరచబడియున్నవి. తరువాత ఒక దశలో హైందవార్యులు ఆర్యుల సామాజికాభివృద్ధిని గురించీ, మానవుని గురించీ, సృష్టినిగురించీ సొంతంగా ఒకసిద్ధాంతాన్ని నిర్మించుకున్నారు. యుగాలనీ, మన్వంతరాలనీ, ఒక కాలమాన పద్ధతిని యేర్పాటు చేసుకున్నారు. ఈ పద్ధతి వట్టి కల్పన, ఊహా గానం మాత్రమేకాదు. అది సమాజంయొక్క స్మృతిపథంలో వున్న సామాజిక పరిణామాలను వివరించే ఒక ప్రయత్నము. అయితే యీ ప్రయత్నానికి ఆటవికులకూ, అనాగరికులకూ సహజమైన ఊహాగానపుతొడుగులను చాల తగిలించారు. మానవుడు ఆనాటిస్థితిలో తనచుట్టూ జరిగే సంఘటనల

కన్నిటికీ ప్రాణంపోసేవాడు? తెలివినీ, చైతన్యాన్నీ ఆపాదించేవాడు; తన చుట్టూ ఉన్న ప్రపంచాన్ని తనవంటిదిగానే చూచేవాడు. అతడప్పటి కింకా ప్రకృతి గర్భంనుంచి బొడ్డు కోసుకొని బయటపడలేదు. ఇంకా ప్రకృతిలో ఒక భాగంగానే ఉంటున్నాడు. అందువల్ల అతడు సూర్యునీ, చంద్రునీ, నక్షత్రాలనూ, ఋతువులనూ, చెట్లనూ, రాళ్ళనూ, నదులనూ, భూమినీ అన్నిటినీ శక్తులుగానూ, దేవుళ్ళు దేవతలు మొదలైనవిగానూ భావించుకున్నాడు. చచ్చినవాళ్ళందరూ పూడ్చివేయబడియో, కాల్చివేయబడియో అదృశ్యులైపోయినప్పటికీ, ఆతని మనస్సు కింకా వారు బ్రతికున్న వాళ్ళుగానే తన సరసను కూర్చుని తనతోపాటు భుజించే వాళ్ళుగానే స్ఫురించేవారు. శాస్త్రవిజ్ఞానముకానీ, ప్రకృతి వృత్తాన్నీ, సమాజ జీవితాన్నీ అదుపులోకి తీసుకొనగలిగిన శక్తిగానీ లేని అనాగరికస్థితిలో ప్రాచీన జనసమూహాలన్నీ యిలాంటి ఊహాత్మకవర్ణనలకూ, సిద్ధాంతబీజాలకూ పుట్టుగడ్డలుగా ఉంటాయి. అయితే వీటన్నిటివెనకా వీటికి రూప నిర్ణయంచేసే సమాజ జీవితమూ, ఉత్పత్తి విధానమూ, ఉత్పత్తిశక్తులయొక్క, ఉత్పత్తి సంబంధాలయొక్క అభివృద్ధిదశా నిర్ణాయకశక్తులుగా కూడా ఉంటాయి. పౌరాణిక కథలూ, గాథలూ యీ ఉత్పత్తి సంబంధాలను ప్రతిబింబించక తప్పదు. నిజానికి యీ కథల్లోనూ, గాథల్లోనూ ఉన్న సార మిది.

చరిత్ర అంటేనూ, జగత్తుఅంటేనూ, హిందువులకున్న దృక్పథానికి ప్రధాన లక్షణమేమంటే: అది చరిత్రను కదలిక లేనటువంటి స్థావరమైన దానినిగా చూడదు; నిరంతగమనశీల

ముగానూ, నిత్యపరిణామాత్మకముగానూ పరిగణిస్తుంది. అనేక పోరాటాలద్వారా, అనేక విపత్తులద్వారా యీ పరిణామాలు సంభవించి కొంతకాలంవరకూ కుదురుపాటుగా ఉంటాయి. వీటివలన మానవ సమాజజీవితం యెంతగా మారుతుందంటే, ఒక యుగలక్షణాలు మరొక యుగంలో సంపూర్ణంగా, ఒకొక్కప్పుడు వ్యతిరేకార్థకాలుగా కూడా పరిణమించుతాయి. దీన్నిగురించి వివరాల్లోకి పోకుండా, ఒక్క సంగతిమాత్రం చెప్పవచ్చును. చరిత్ర పరిణామాన్ని గురించిన యీ ప్రగతిశీల దృక్పథం దైవనిర్ణయమైన ఒక వర్తులాకార పరిధితో, యంత్రంవలె యేమీ మార్పులేకుండా జగత్తంతా పరిభ్రమిస్తుంటుంది అనే భావంగా మార్చివేయబడ్డది. అందువల్ల పరిణామాన్ని గురించిన హిందూ డైనమిక్ దృక్పథం నిరుపయోగమైంది. కాని హిందూ చరిత్రకారులు యీవిధమైన పిడివాదాన్ని చేపట్టకముందు అతడు తన స్మృతిపథానికి వచ్చిన అంశాల నన్నింటినీ చిత్తశుద్ధిగా చరిత్రలో చేర్చాడు.

కాలాన్ని, అంటే సామాజికచరిత్రను కృత, త్రేత, ద్వాపర, కలియుగా లని నాలుగు యుగాలుగా విభజించారు. మానవసమాజము, లేక ఆర్యసమాజము కృతయుగంతో ప్రారంభమై తరువాత రెండు యుగాలను గడిపి, మహాభారత యుద్ధం ముగియడంతో కలియుగంలోకి ప్రవేశించింది. కలియుగం యింకా నడుస్తున్నది.

అంటే హిందూచరిత్రకారుడు చెప్పినదాని ప్రకారం మానవ సమాజం (హిందూసమాజమంటే యింకా సరిగ్గా ఉంటుంది) స్పష్టమైన నాలుగు చరిత్ర యుగాలద్వారా అభి

వృద్ధిమైనది. ఈ నాలుగు యుగాల్లో ప్రతియుగానికీ ప్రత్యేకమైన సామాజిక నిర్మాణ నియమమున్నది. అంటే ఉత్పత్తి, వినిమయం లేక పంపకం, సాంఘిక సంబంధాలూ, కుటుంబ వివాహ సంబంధాలూ, నీతి, దైవపూజ మొదలైనవాటికి సంబంధించిన నియమా లున్నవన్నమాట.

యుగం మారడంతో పాటు మానవధర్మం కూడా మారుతుందనే విషయాన్ని హిందూ వాఙ్మయం నొక్కి-చెప్తున్నది. ధర్మమంటే యేమిటి? జీవిత విధానము, మానవుని బ్రతుకునియమము, *జీవితం దేంతో కట్టుబడియున్నది? సంపదను ఉత్పత్తిచేయడంతోటీ, సంతానాన్ని ఉత్పత్తి చేయడంతోటీనూ (అంటే సెక్సు లేక వివాహము) ఈ రెంటికీ అర్థమూ, కామమూ అని హిందువులు పేరుపెట్టారు.

హిందూ భావవాదు లేమి బోధించినప్పటికీ, వారి ప్రాచీనులు భౌతిక వాస్తవికతే సామాజిక జీవితానికీ, మానవ జీవితానికీ ప్రాతిపదికగా గుర్తించి దాని కట్టి విలువ యిచ్చారు.

ఈ నాల్గు యుగాలకు హిందూ చరిత్ర తత్వశాస్త్రజ్ఞు లిస్తున్న నిర్వచన మేమిటి?

ఐతరేయ బ్రాహ్మణం (VII-15) యిలా నిర్వచించింది :

కృత అనగా తిరుగాడడం*♦
త్రేత అనగా లేచి నిలుచోవడం.

---

*ధృధారయతి, ఇతిధర్మః—

*♦ కలిఃశయానో భవతి । సంజిహానస్తు ద్వాపరః
ఉత్తిష్ఠంస్త్రేతా భవతి । కృతం సంపద్యతే చరన్ ॥

ద్వాపర అనగా మెల్లగా కదలడం.

కలి అనగా నిద్రపోవడం లేక పడుకునియుండడం.

కలియుగానికీ, మిగిలిన మూడు యుగాలకూ ఉన్న వ్యత్యాసం చాల స్పష్టమైంది. రచయితలు కలియుగంవారు కాబట్టి కలియుగ లక్షణాలను అన్నింటిని వారు అనేక రచనలలో చాల వివరాలతోనూ, ఎంతో జాగ్రత్తగానూ పేర్కొన్నారు.

ఈ విషయం తర్వాత వివరిస్తాను.

యుగయుగాలుగా జరుగుతూ వచ్చిన మానవుని అభివృద్ధినిగురించి వేదా లెలా వర్ణించాయి? ఉత్పత్తి పరికరాలలోనూ, ఉత్పత్తి సంబంధాలలోనూ వచ్చిన మార్పులను అవి వివరించాయా! సామాజికాభివృద్ధిని గురించిన ఈ సమస్యలకు వేద నిర్మాతలు యేమని సమాధానా లిచ్చారు?

వేదవాఙ్మయమంతా, ఒకేఒక్క అవసరాన్ని గురించీ, ఆ అవసరసాధనకు తీసుకోవలసిన చర్యను గురించీ నొక్కిచెప్తున్నది: ఆహారోత్పత్తి, మనుష్యసంఖ్య అభివృద్ధి-(ధనం, ప్రజ) ధనం అంటే మానవునిఉత్పత్తి పరికరాలు, అతని ఆర్థికోత్పత్తి కృషి, ఇది రెండవదియైన ప్రజోత్పత్తికి అనుబంధమైనది; వేద సంహిత లన్నిటిలోనూ ఈ రెండు సమస్యలకు సంబంధించిన విషయం చాలా ఉన్నది.

ఆహార సంపాదన చాల కష్టమైనపని. నాటి మొరకైన రాతి పనిముట్లతో అలాకాక తప్పదు. వేటతో కూడిన నిరంతర విపత్కర జీవితమూ, ఆహారానికి జంతువులు దొరుకునా లేదా అనే ఆదుర్దా, నిత్యమూ వాటిని వెన్నంటి తిరుగవలసి

యుండటమూ, నివాసానికి తావులేకపోవటమూ, నిప్పులేకపోవటమూ, ప్రకృతినుంచీ క్రూరజంతువులనుంచీ రక్షణలేకపోవటమూ— ఈపరిస్థితుల నన్నిటినీ ఆర్యమానవుడు తలుచుకుని భయకంపితుడైనాడు. తిండికొరకు చేసేపోరాటాల్లో, ఒక్కొక్కప్పుడు మనుష్యులు గుంపులు గుంపులే నశించేవారు. ఈ చావులను చూస్తే ఒక్కొక్కప్పుడు మనుష్యజాతి మొత్తం తుడిచిపెట్టుకపోయేదా? అన్నంత దిగ్భ్రమాశ్చర్యాలు కలిగేవి. వేదకర్తలు యీ భయాన్ని తమ విలక్షణమైన ధోరణిలో వర్ణించారు. తిండి కొరకూ, బ్రతుకు కొరకూ, సంతానోత్పత్తి కొరకూ చేసే ప్రయత్నము లన్నీ, అలాంటి సమస్యలతోనే బాధపడుతున్న సృష్టికర్త ప్రజాపతియొక్క ప్రయత్నాలుగా వర్ణింపబడినవి. సృష్టికర్తయైన ప్రజాపతి ప్రపంచాన్నిసృష్టించే సమయంలో అనేక గర్భస్రావాలు కలిగినవట! ఆయనయే తిండిలేక చనిపోతాడా అన్న సంకటస్థితి యేర్పడ్డదట!

అప్పుడు పాలు సృష్టింపబడినవి. అవి పుచ్చుకున్న తరవాత ప్రజాపతికి ప్రాణమొచ్చిందట. అప్పుడాతడు ప్రత్యేకంగా పదకొండు జంతువులను యేరుకుని కాల్చుకుని తిన్నాడు. ♦ ఇలా ప్రపంచంపుట్టిబ్రతికిందట. సృష్టికర్తయైన భగవంతుడికే ఆగతిపడ్తే యిక మానవమాత్రుడి సంగతి యెలా ఉండేదో చెప్పనక్కరలేదు!

ఆర్యుల దేవతలు తమనాయకుడైన ఇంద్రుణ్ణి ప్రార్థించారు. "ఓ యింద్రుడా? వజ్రాన్నీ (రాతిఆయుధం) అస్థినీ (దధీచి శరీరంలోని వాడియైనయెముక) ధరించి ఆహారసామగ్రిని

---

♦ ఋగ్వేదము : 3-9-1-1; 2-5

యివ్వకుండా వున్న వృత్రునిమీదా, విశ్వరూపునిమీదా తీవ్రంగా యుద్ధం సాగించు''మని వారి ప్రార్థన.

ఇలా వేలకొలది సంవత్సరాలు కృతయుగపు ఆటవిక పరిస్థితుల్లో మానవులు భూమిమీద దిక్కూ దివాణంలేకుండా తిరిగారు. వేటజంతువులు దొరకకా, రోగాలవలనా, యిరుగు పొరుగు శత్రువులవలనా, ఇంకా యితర కారణాలవలనా ఒక ప్రదేశంనుంచి మరో ప్రదేశానికి తరుమబడ్డారు. ఆటవిక యుగంలోనే కాక తరవాత యుగాల్లోకూడా ఆర్యులు వలస పోతూ వచ్చారని 'వెండికార్' చెప్తున్నది. ఒక్క కలి యుగం లేక నాగరికయుగంలో మాత్రం యీ వలస ప్రసక్తిని యెత్తలేదు.

అలాంటి పరిస్థితుల్లో ప్రైవేటు ఆస్తికానీ, బానిసలు కానీ, రాజ్యాంగ యంత్రముకానీ వుండడానికి వీల్లేదు. అంటే దోపిడీదారులూ, దోచుకోనబడేవారూ అనే వర్గాల మీద ఆధారపడిన సమాజవ్యవస్థ యేర్పడటానికి వీల్లేదు. ఆహారోత్పత్తిలేక ఆహారానికి పనికివచ్చే జంతువులను వేటాడటం సమిష్టిశ్రమగా ఉండేది. లభ్యమైనదానిని సమి ష్టిగా అనుభవించేవారు. ప్రకృతికి వ్యతిరేకంగా బ్రతుకు కోసం జరిగే పోరాటంలో మానవుడు యేకాకిగా ఉన్నాడా శక్తిహీనుడైపోతాడు.

ఉత్పత్తి పరికరాల పరిణామంలో నిప్పును కనిపెట్టడం, జంతువులను మచ్చికచేయడం రెండవదశ. వీటిని మృగ ప్రాయుడైన ప్రాచీన ఆటవిక మానవుడు యెరుగడు. ఈ రెండూ మానవసమాజ నిర్మాణంలోనూ, జీవితంలోనూ గొప్ప విప్లవాన్ని కలిగించినవి.

"ఈ రెండూ అభివృద్ధి కావడంవల్ల మానవుడి విముక్తికి ప్రత్యక్ష సాధనాలు సమకూడినవి. (ఎంగెల్సు: Ape to Man నర వానరంనుంచి నరుడు-ప్రకృతి గతితర్కం Dialectics of Nature లోని అధ్యాయం.)" అడవులలో పిడుగుపడి చెట్లు మాడిపోవటం చూచారు. నిప్పు అడ్డమొచ్చినదానివల్లా తగులబెట్టే భయంకరమైన శక్తి. దానికెదురులేదు. ఇది నాటి మానవుడు చూచాడు.

(ఋగ్వేదం 1-143-5; 1-65-4)

అయితే మనుష్యుడు అలాంటి నిప్పును తన యిష్టము వచ్చినప్పుడు చేయడమూ, దానిని ఒక సాధనంగా, ఒక శక్తిగా మానవ శ్రేయస్సుకొరకు ఉపయోగించడమూ యెలాగు? అనేది సమస్య. ఆర్యులలో యీ సమస్యను పరిష్కరించినవాడు ఆంగీరసుడో, లేక అతని వంశీకులలో ఒకరో అయివుంటారు. ఆర్యుల ప్రవరలలో ఒకదానికి మూలపురుషుడు ఆంగీరసుడు. ఆంగీరసుడే అగ్నిని కనిపెట్టినట్లు ఋగ్వేదములో అనేకచోట్ల పేర్కొనబడినది.*

ఆర్యుల జీవితములో విప్లవ పరిణామాన్ని కలిగించిన సాధనం అగ్ని. అగ్ని దొరికింతర్వాత, ఆర్యుల జీవితమంతటికీ అదియే మూలకారణమని భావించబడింది. అగ్ని కేంద్రమై దానిచుట్టూ ఆర్యుల జీవితం నిర్మాణమైంది. సృష్టి, అస్తిత్వం, అభ్యుదయం, సంపద, సౌఖ్యం అన్నీ అగ్నినుంచే పుట్టినవి.

---

* త్వామ్ అగ్ని అంగీరసో గుహాహితమ్ అన్వవిన్దన్ శిశ్రియాణం వనేవనే సజాయసే మధ్యమానః సనో మహత్తమాహుః ॥
ఋగ్వేదం 5-2-8; 10-36-6; 5-11-6.

అగ్నివల్ల వచ్చిన అత్యంత, ప్రధానమైన ఫలితాలు రెండు : జనాభా పెరిగినది; పశుసంపద వృద్ధియైనది. (ప్రజా పశవః)

వేటాడి తెచ్చిన మాంసమునూ, చేపలనూ నిప్పులో కాల్చిగానీ లేక ఉడకబెట్టిగానీ తింటే సులభంగాజీర్ణమౌతుంది. అందువల్ల అగ్ని దేవుడికి ఆమదు (పచ్చిఆహారంతినేవాడు)డనీ, క్రవ్యాదు (చచ్చిన చేపలను తినేవాడు) డనీ పేర్లు వచ్చినవి. అగ్ని క్రూరమృగాలనూ, భూతపిశాచాలనూ పారద్రోలినది.* అగ్నిలాంటి సాధన మింకాయెరుగని శత్రువుపైనా; క్రూర మృగాలపైనా వేసి నిప్పులనూ, మండే కొరవులనూ విసర వచ్చును. ♦ అగ్ని మనుష్యుణ్ణి తీవ్రమైన చలి మంచు వాతావరణంనుంచి కాపాడినది. సైబీరియా ప్రాంతాల దీర్ఘనిశి రాత్రుల కటికి చీకటి, కరకుచలి మంచు వాతావరణంలో కంటిచూపూ, ప్రయాణమూ సులభమైనది.

నిప్పు చేయటంతోపాటే జంతువులను మచ్చికచేయడం కూడా నేర్వడంవలన నిరంతరం ఆహారం దొరికే గ్యారంటీ యేర్పడ్డది. వేటకు జంతువులు దొరకకా, చేపలు దొరకకా, ఒక్కొక్కప్పుడు మనిషిని మనిషి పీక్కుతినవలసివచ్చేది. ఒకసారి మానవుని నివాసంలోకి ఆకాశంనుంచి అగ్ని వచ్చిందనగానే, పశువుల పెంపకం సులభసాధ్యమైనది. అందువల్ల మాంసమూ, పాలూ నిత్యాహారములైనవి. వెచ్చని దుస్తులకొరకూ, ఇతర అవసరాలకొరకూ చర్మమూ, ఉన్ని లభ్యమైనవి. ఇతర ఉపయోగకరములైన పనిముట్లకు కొమ్ములూ, యెముకలూ

* ఋగ్వేదం. 3-15-1

♦ ఋగ్వేదం. 3-15-1

దొరికినవి. నూతనమైన ఉన్నతదశలోకి జీవితం ఒక్కమారుగా యెగిరి వచ్చినది. యుగం మారింది.

ఈ కొత్తయుగ పరిణామానికికూడా మరల అగ్నియే కారణము. అగ్ని లభ్యంకావడం కారణంగానే తరవాత తరవాత ముడిలోహాలను కరిగించటం వచ్చింది. దీనితో జీవితంలో మరో విప్లవం సంభవించింది. ఈ విషయానికి మరోమారు వద్దాం. అందుచేతనే ఋగ్వేదం అగ్నిని మనుష్య నివాసాలకు నాయకుడుగానూ, సంరక్షకుడుగానూ పేర్కొన్నది. ఆయన విష్పతి. — విష్ అంటే మనుష్య నివాసం. అగ్ని వల్లనే మనుష్య నివాసా లేర్పడుతున్నాయి. అగ్ని మానవ జాతికి ఆప్తతముడు, అతి ప్రాచీన మిత్రుడు. మానవుడి కొరకు దేవతలే అతనిని పంపారు. నిజానికి అతనివల్లనే దేవతలకు తిండి లభిస్తున్నది.

ఏంగెల్సు "ప్రకృతియొక్క గతితర్కం" అనేగ్రంథంలో యిలా వ్రాశాడు:

"యాంత్రిక చలనాన్ని వేడిమిగా మార్చడమెలాగో కనిపెట్టి దాన్ని ఆచరణలో పెట్టడం ఎంత ప్రాచీనమైనదంటే, మానవచరిత్రయొక్క ప్రారంభంలోనే అది జరిగిందని చెప్ప వచ్చు. దానికి ముందు ఉత్పత్తి పరికరాల విషయంలోను, పశువుల్ని మచ్చికచేసే విషయంలోను ఎన్నోకొత్తసంగతులు కనిపెట్టబడినా, రాపిడిద్వారా నిప్పునుపుట్టించడమనేది ప్రకృతి యొక్క నిర్జీవ శక్తిని మానవుడు తన ఉపయోగంకోసం మార్చుకోగలడని నిరూపించే మొట్టమొదటి ఉదాహరణ. ఈఅద్భుత పురోభివృద్ధియొక్క అనంత ప్రాముఖ్యత మానవుని

మనస్సుమీద యెంత ఎక్కువ ప్రభావాన్ని ప్రసరించిందో ఇప్పటికీ ప్రజల్లోవున్న కొన్ని మూఢనమ్మకాలవల్ల తెల్సుకో వచ్చు. కంచు, ఇనుముయొక్క ఉపయోగం కనిపెట్టబడిన తర్వాత చాలకాలంవరకు మొట్టమొదటి ఉత్పత్తి పరికర మైన రాతికత్తిని స్తుతిస్తూ ప్రజలు పండుగలు, ఉత్సవాలు చేసుకొనేవారు. మతసంబంధమైన యజ్ఞయాగాదులన్నీ రాతి కత్తితోనే జరిగేవి. ఒక యూదు పౌరాణికగాథను బట్టి అడ విలోపుట్టిన పురుషులకు రాతి కత్తితోనే సుంతీ చేయాలని జోషువా ఆదేశించాడు. కెల్టులు, జర్మన్లు నరబలులలో రాతికత్తులనుమాత్రమే ఉపయోగించేవారు. ఇవన్నీ చాలా కాలం క్రితమే మరుగున పడిపోయాయి. కాని, రాపిడిద్వారా కనిపెట్టబడిన నిప్పువిషయం యిలా కాదు. ఇతరపద్ధతుల ద్వారా నిప్పును తయారుచేయడం కనిపెట్టినతర్వాత చాల కాలంవరకు అధికసంఖ్యాకులైన ప్రజలు రాపిడిద్వారానే అగ్నిహోత్రాన్ని తయారుచేసుకోవలసి యుండేది. ఇప్పటికీ అనేక యూరపియన్ దేశాల్లో రాపిడిద్వారా మాత్రమే మాంత్రికశక్తిగల అగ్ని లభిస్తుందని ఒక మూఢనమ్మకం ప్రజల్లో ప్రబలంగా ఉంది. (ఉదా: అంటువ్యాధుల నిర్మూల నకు మన జర్మనీలో ఉపయోగింపబడే మహానలం). ఈ విధంగా మానవుడు ప్రకృతిమీద సాధించిన మొట్టమొదటి మహావిజయం ఇప్పటికీ మన స్మృతిపథంలో సగం తెలిసి సగం తెలియక అనేక మూఢనమ్మకాలరూపంలోనూ, హీదెన్ పౌరాణిక గాథల అవశేషాలలోనూ నిలిచిపోయింది. ప్రపం చంలో అతి విద్యావంతుల మనుకొనే ప్రజల్లోకూడా యీ

మూఢనమ్మకాలు వేళ్ళు పాతుకుపోయాయి" (పేజి 79-80 లారెన్సు అండ్ విషార్ట్ 1946 కూర్పు).

ఆర్యులిలా తమ నూతన జీవితాన్ని అగ్నిపైనా, పశువులపైనా ఆధారపరచి నిర్మించుకున్నారు. తమ స్థాయికి తగినట్లు కొత్త ఉత్పత్తిపరికరాల, కొత్త ఉత్పత్తిశక్తుల సహాయంతో సమాజ నిర్మాణం చేశారు. అంతకు పూర్వపు నిలకడదశతో పోల్చుకుంటే, మొట్టమొదటిమారుగా సంపదా, సమృద్ధీ అని చెప్పుకోనదగిన ఉత్పత్తివిధానం అమల్లోకి వచ్చింది. అంతకు పూర్వమున్న నిలకడదశలో నిరంతరం వానలూ ప్రకృతివైపరీత్యాల మధ్య సర్వనాశనాని కెదురౌతూ దిక్కులేని తిరుగుడుగా ఉండేది. అవి సృష్టికర్తకు కూడా గర్భస్రావం జరిగేరోజులు. ఆ రోజులు గతించినవి. కొత్త ఉత్పత్తిశక్తులూ, కొత్త ఉత్పత్తివిధానాలూ వచ్చిన మూలకంగా మానవుడు మృగప్రాయమైన ఆటవికస్థితినుంచి అనాగరికస్థితికీ-సంచారస్థితినుంచి జనపద నివాసస్థితికీ-తిండి లేక మాడుతూ అప్పుడప్పుడు మనుషులనుకూడా పీక్కుతినే స్థితినుంచి నికరంగా కూడూ, గూడూ, రక్షణా గ్యారంటీ అయినస్థితికీ-ప్రకృతిపై . పోరాటంలో నిస్సహాయస్థితినుంచి శక్తిసంపన్నత కలిగే స్థితికీ అభివృద్ధి చెందాడు. కృతయుగంలోనుంచి మానవుడు త్రేతాయుగంలో ప్రవేశించాడు. అత డిదివరకు పడుతూ లేస్తూ ఒక చోటునుంచి మరో చోటుకు తిరిగేవాడు. ఇప్పు డతడు ఆత్మవిశ్వాసంతో నిటారుగా నిలుచున్నాడు. సంతోషమూ, నవ్వులూ, పాటలతో అతడు మెరిసిపోయాడు.

ఈ నూతన ఉత్పత్తి విధానానికీ, నూతన సమాజ వ్యవస్థకూ, నూతన కళకూ ఆతను పెట్టిన పేరేమిటి?

అగ్ని, పశుసంపదా, జనపద నిర్మాణమూ (విషస్ లేక వ్రజస్) రావడంతో యజ్ఞంకూడా వచ్చింది. సృష్టికర్తయైన బ్రహ్మ త్రేతాయుగంలో మనుష్యునికి యజ్ఞాన్ని ప్రసాదించాడు. యిది కృతయుగంలో లేదు.*

బ్రహ్మ మనుష్యుని కిచ్చిన వరాలలో ఉత్తమోత్తమమైన వరము యజ్ఞము. తద్వారా మనుష్యుడు ఒక యుగంలోనుంచి మరొక యుగంలోనికి తరించాలని వైదిక సాంప్రదాయం తెలియజేస్తున్నది.

అగ్నిని కనిపెట్టడంతో ఆర్యుల సమాజానికి లభించిన నూతన ఉత్పత్తివిధానమే యజ్ఞము. యజ్ఞమనబడే ఈనూతన జీవితం సర్వసమృద్ధికీ, సృష్టి అభివృద్ధికీ దారితీస్తుంది. యజ్ఞం చేసినప్పుడు సృష్టి లేక బ్రహ్మ ప్రారంభమవుతుంది. ఆర్యగణానికి బ్రహ్మ అని పేరు. ఆ బ్రహ్మయొక్క ఉత్పత్తి విధానమే యజ్ఞము. బ్రహ్మ అంటే సమిష్టి ఉత్పత్తి విధానముగల ఆర్యుల ఆదిమ కమ్యూనిస్టు గణము. ఈఉత్పత్తి విధానాన్ని గురించీ, యీ బ్రహ్మయొక్క జీవితవిధానాన్ని గురించీ, యీ ఆదిమ కమ్యూనిస్టుగణ జీవితాన్ని గురించీ, తెలిపే జ్ఞానమే వేదాలు.

---

* త్రేతాయుగే విధిస్తు ఏష యజ్ఞానామ్ న కృతయుగే —
(భారతం - శాంతిపర్వం. 237-101.)
త్రేతాదౌ యజ్ఞాః (భారతం - శాంతిపర్వం 244-14.)
సహ యజ్ఞాః ప్రసృష్ట్వా.

హైందవార్య సాంప్రదాయముయొక్క చరిత్ర రచనావిధానమే అది. ఆర్యుల చరిత్రలో ప్రాచీనమైన ఆదిమ కమ్యూనిస్టు యుగాన్ని గురించి తెలుసుకొనడానికి ఇదే కీలకమైనఅంశము.

సామాజిక మానవుడు ఆదిమ కమ్యూనిస్టుదశలో ఉండటానికి కారణం ఉత్పత్తి శక్తులు అతి మొరటుగా ఉండి, ఉత్పత్తి చాలా అల్పం గావడంవల్లనే కాని, ఉత్పత్తి సమృద్ధిగా జరగడంవల్ల కాదని చారిత్రక భౌతికవాదం చెప్పుతున్నది. ఏదైనా ఉత్పత్తి చేయాలంటే సమిష్టి శ్రమవలన కాని సాధ్యపడదు. ఆ దశలో ప్రైవేటు ఆస్తిగానీ, వ్యక్తిగత అనుభవంగానీ, ప్రైవేటు కుటుంబాలుగానీ ఉండటం అసంభవం. ఇదే ఆదిమ కమ్యూనిస్టు వ్యవస్థయొక్క ప్రధాన లక్షణం. యజ్ఞవిధాయకమైన ఉత్పత్తికి ఈ లక్షణాలున్నాయా? బహ్మ అంటే ఆదిమ కమ్యూనిస్టు గణమూ, దాని జీవితమూ, సంస్కృతీ, తాత్విక సిద్ధాంతమూ, నీతినియమాలూ, ఆదిమ మానవ సంఘాల అన్నిటి చరిత్రలో ఉదహరించబడిన ఆదిమ కమ్యూనిస్టు లక్షణాలను లేక ఆదిమ సమిష్టిజీవిత లక్షణాలను కలిగియున్నవా? ఆదిమ కమ్యూనిజంయొక్క ముఖ్య లక్షణాలను మొదట మోర్గాన్ గుర్తించాడు. మార్క్సు ఏంగెల్సులు వాటిని పరిశోధించే సవిస్తరంగా వివరించారు. చారిత్రక భౌతికవాదాన్ని నిరసించే బూర్జువా పండితులుకూడా వాటిని కొంతవర కంగీకరించారు. ఆ ఆదిమ కమ్యూనిస్టు తెగ లక్షణాలే యజ్ఞ విధానంలోనూ, బ్రహ్మయందునూ అగపడుతున్నాయా? అవుపడుతున్నాయి. ఎలాగో చూద్దాము:

ఆదిమకమ్యూనిజంయొక్క, దాని ఉత్పత్తివిధానము యొక్క, ఆదిమకమ్యూనిష్టు జీవితముయొక్క ప్రధాన లక్షణా లేమిటి? సమిష్టిశ్రమ, సమిష్టి అనుభవము; ప్రైవేటు ఆస్తి ఉండదు. మొదట శ్రమ విభజన వుండదు; తరువాత తరు వాత ఉత్పత్తిశక్తులభివృద్ధికావడంతో శ్రమవిభజన ఏర్పడు తుంది. వర్గా లుండవు. నిర్మాణం 'జెన్' నిర్మాణం: అంటే రక్త బంధువు లందరికీ పరిమితమైనది. దానికి ఆధారం మాతృ స్వామికపద్ధతి. అందులో సభ్యులందరూ యేకకుటుంబీకులు. తరువాతకాలపు నాగరికతలక్షణమైన వివాహమూ, ప్రైవేటు కుటుంబవిధానమూ అందులో వుండవు; కమ్యూన్‌కు సంబం ధించిన వివిధ విధులను నిర్వహించేవా రంతా కమ్యూన్ సభ్యులందరిచేత యెన్నుకొనబడినవారే. ఉత్పత్తిసంబంధా లను లేక ఆస్తిసంబంధాలను అమలుపరచడానికి, సైన్యమూ, పోలీసులుగల రాజ్యాంగయంత్ర ముండదు. పన్నులు వసూలు చేయటం ఉండదు. అందువల్ల రాజ్యాంగ చట్టముగానీ, ఆ చట్టాన్ని బలప్రయోగంతో అమలు జరిపే యంత్ర నిర్మా ణముగానీ ఉండదు.

ఇవి అన్నీ అమల్లోకి వచ్చినప్పుడు ఆదిమకమ్యూనిస్టు వ్యవస్థ భగ్నమైనది. సమిష్టివిధానము నశించినది. వేదాలు హైందవార్యుల యజ్ఞాలను వర్ణించిన సందర్భములో ఈ లక్ష ణాల నన్నిటిని ఒక విలక్షణమైన పద్ధతిలో వివరించినవి. వివిధ చారిత్రక యుగానుభవాలయొక్క క్రోడీకరణమే వేదసంహి తలు. దేవతలు యజ్ఞాలుచేశారు. దేవతలు యజ్ఞంలో అస్తిత్వాన్ని పొందారు. యజ్ఞంద్వారా బ్రతుకులు సాగిం చారు. నాటిజీవితసర్వస్వానికీ నియమసాధనములైనయజ్ఞాలను

నుంచి మూర్తిత్వము పొందినవారే దేవతలన్నారు. వారినీ (అంటే దేవతలనూ) వారి సంతతివారైన ఆర్యులనూ మనం ఆవిధంగానే విడమర్చి తెలుసుకోనగలుగుదుము. దేవతలు చేసిన సత్రయజ్ఞము ఆదిమార్యుల సమిష్టిశ్రమ విధానం యొక్క స్వరూపమే!

సత్రయజ్ఞంయొక్క ప్రధానలక్షణ మేమంటే అందులో పాల్గొనేవారందరూ ఋత్విజులే, అందరూ యజమానులే. అంటే యేమిటి? తరువాత కాలపు యజ్ఞకర్మలో, యజ్ఞాన్ని జరిపేవారంతా పలువిధాలైన ఋత్విజులుగా విభజింపబడ్డారు. ఇలా విభాగం చేయబడిన ఋత్విజులను ఒక ప్రైవేటు గృహస్థు నియమించుకొని, వారిచేత యజ్ఞం చేయిస్తాడు. యజ్ఞకర్మకయ్యే ఖర్చునంతా గృహస్థే భరిస్తాడు. ఈయజ్ఞం చేయించే గృహస్థును యజమాని అంటారు. సత్రయజ్ఞంలో అలాలేదు. అది సంపూర్ణంగా సమిష్టిగా చేయబడేది. ఆ సమష్టిలో యే కొంచెం వ్యష్టిభావంకూడా ఉండదు. ఆ సమిష్టి శ్రమలో యే విధమైన భేదాలుకానీ, శ్రమవిభజనకానీ, లేకుండా అందరూ పాల్గొంటారు. తరువాతకాలంలో వచ్చిన పదిహేడు విధాలైన ఋత్విజులు సత్రయజ్ఞంనాటికి లేరు. సత్రయజ్ఞంలో రెండవ లక్షణమేమంటే, సమిష్టి శ్రమవల్ల లభ్యమైన యజ్ఞఫలాన్ని సమిష్టిమీద సమానంగా పంచుకుంటారు; యజ్ఞఫలం సమిష్టిగా అనుభవించబడుతుంది. దీనిని 'సమాఖ్య' అన్నారు. అంటే సోమరసాన్ని ఒకే పాత్రనుంచి త్రాగుతారు. ఈ "సమాఖ్య"విధి సోమయాగానికి చెందిన అగ్నిష్టోమంలోనిది. ఇది మహాయజ్ఞంలో లేదు. సత్ర

యజ్ఞంలో ఉన్నది. అంటే సత్రయజ్ఞంలో దీనికి ప్రత్యేక మైన నిగూఢార్థ మున్నదనాలి.

మూడవ లక్షణమేమంటే: సత్రయజ్ఞంలో పాల్గొనే వారంతా రక్తబంధువులు. అంటే ఒకేగోత్రంవారు. ఇతర యజ్ఞాలలో యిదిలేదు. దీని అర్థంనాటి ఆదిమ కమ్యూనిస్టు తెగలో అందరూ ఒకేగోత్రానికి చెందినవారూ, రక్తబంధు వులుగానూ ఉంటారు. రక్తబంధువులు కానివారికి అందులో స్థానంలేదు. సమిష్టిగా సత్రయజ్ఞాన్ని లేక సామాజిక కృషిని ప్రారంభించేటప్పుడు, ఏక గోత్రీకులందరూ చేతులను ఒక చోటికి కలిపి, చిట్టచివరివరకూ యేమీ తప్పిదంలేకుండా ఒకే మనస్సుతో సహకరిస్తామని ప్రతిజ్ఞచేస్తారు. దీనిని తానూ నపత్రప్రచార మంటారు.

క్రమ విధానాన్ని, ఒక ప్లానుప్రకారం సమీకరించి నడపడానికి, ప్రతి సమిష్టి కార్యక్రమంలోనూ యెవరో ఒకరిని ప్రత్యేకించాలి. అందువల్ల సత్రయజ్ఞానికి నాల్గవలక్షణ మేమంటే ఉత్పత్తిశక్తులు పెరిగి, చేయవలసిన పనులు యెక్కువైనందువల్ల, అవసరమైన విధులను నిర్వర్తించడానికి కొందరిని యెన్నుకుంటారు. దీనినే 'ప్రవరణ' అంటారు. 'ప్రవరణ' అంటే ఏరుకోడం, యెన్నుకోడం అని అర్థం. యజ్ఞం అయిపోగానే ఈ విధి నిర్వాహకులంతా మరల కమ్యూన్ యొక్క లేక గణంయొక్క సమిష్టిలో కలిసిపోతారు.

ఐదవలక్షణ మేమంటే సత్రయజ్ఞ విధాయకమైన శ్రమలో స్త్రీలూ, పురుషులూ కూడా పాల్గొంటారు. ఇది తరవాత యజ్ఞాల్లో లేదు.

సత్రయజ్ఞంయొక్క లేక సత్రయజ్ఞ విధాయకమైన శ్రమయొక్క ఈలక్షణాలన్నీ ప్రాచీనకాలపు ఆర్యులలో ఆదిమ కమ్యూనిస్టు విధానం అమల్లోఉండేదని తెలుపుతున్నాయి.

తరవాతకాలపు వేదసంప్రదాయంలో చెప్పినట్లు అంటే సూత్రాలలో చెప్పినట్లు ప్రైవేటు గృహస్థులు జరిపించే యజ్ఞాలే ఈ సత్రయజ్ఞాలు కావా అని వేదపండితులు ప్రశ్నించవచ్చును. సత్రయజ్ఞానికీ తరవాతకాలపు గృహస్థులుచేసే యజ్ఞాలకూ సంబంధమేలేదు. ముఖ్యంగా పైన పేర్కొనబడిన ఒకటి, మూడు, నాలుగు, ఐదు లక్షణాలు ప్రైవేటు గృహస్థుల యజ్ఞాలలో యెక్కడా లేవు. సత్రయజ్ఞాలు ప్రత్యేక సమయాలకు అనుగుణమైన ప్రత్యేకయజ్ఞాలు కావా అని కొందరడగవచ్చును. వేదాలలో "ఉత్తరధృవ నివాసము" (Arctic Home in the Vedas) అనే గ్రంథంలో ఆర్యులు కొన్ని రోజులపాటో, కొన్ని నెలలపాటో వరుసగా ఆచరించే నిత్య యజ్ఞ సముదాయానికే సత్రయజ్ఞమనీ, సత్రయజ్ఞము ప్రాచీనతమమైన యజ్ఞమనీ తిలక్ పేర్కొన్నాడు. అయితే సత్ర యజ్ఞము ఆదిమార్యుల సమిష్టిజీవిత విధానమని ఆయన చెప్ప లేదు. అంతో యింతో సామాజిక దృక్పథంగల వేదపండితులందరూ యజ్ఞకర్మనుగురించి చేసినచర్చలవలన,ఆదిమార్యుల కమ్యూనిస్టుసంఘాలు బ్రతుకు తెరువుకూ, సంఘాభివృద్ధి కొరకూ నిత్యమూ సాగించే పనిపాటల సముదాయమే సత్ర యజ్ఞమని తెలుసుకోవచ్చును. ఇందువల్లనే సంస్కృత భాషలో సత్రశబ్దానికి ఏకసమయంలో కూడికగా, సమిష్టిగా అని అర్థం వచ్చినది.

( సాకం, సత్రా, సమం, సహాయితి అమరః )

దేవతలకఖండసంపదలనిచ్చినదని పేరుపొందిన త్రిరాత్ర క్రతువును తీసుకుందాం. ఈ క్రతువువలన, ప్రాచీనతమ కాలపు ఆర్యులు పశుధనాన్ని యెక్కువగా వృద్ధిచేశారని తెలుస్తుంది. యజ్ఞాన్ని గురించిన ఆఖ్యాయిక లేక యజ్ఞగాధ ఈ త్రిరాత్ర క్రతు వెలా పుట్టినదో, దీనిని ఆచరించే విధాన మేమిటో వివరిస్తున్నది. ఈ త్రిరాత్రక్రతువు ప్రత్యేకత ఏమంటే, ఇది మూడు క్రతువులు కలిసి ఏర్పడినది. దీనిని సమిష్టిగా ఆచరిస్తారు. త్రిరాత్రక్రతువు పుట్టుక గురించి ఇలా చెప్పబడినది:

దేవతలలో మూడు కమ్యూన్‌లు ఉండేవి, అంటే మూడు దేవగణాలుండేవి. వసు, రుద్ర, ఆదిత్యగణాలు. ప్రజాపతే ఈ గణాలను సృష్టించాడు. ఆఖ్యాయిక వీటిని గణాలనీ, సంఘాలనీ పేర్కొంటున్నది. ప్రజాపతి యీ మూడు గణాలకూ, మూడు అగ్నుల నిచ్చి పూజించమన్నాడు. అలాగే ఒక సంవత్సరకాలం మూడు గణాలూ సమిష్టిగా పూజించి ఒకఆవును సృష్టించారు. ప్రజాపతి వారి ప్రయత్నాలకు సంతుష్టుడై, ఆ యావును వసుగణానికిచ్చి ఉత్పత్తిని సాగించమన్నాడు. వసుగణం ఆ ఒక్క ఆవు నుంచీ 333 ఆవులను పొందారు. ప్రజాపతి మొదటి ఆవును తీసుకుని రుద్రగణానికిచ్చాడు. వాళ్ళకూ 333 ఆవులు లభించాయి. ఆదిత్యులు కూడా యిలానే చేశారు. అప్పుడు యీ 999 ఆవులనూ, మొదటి ఆవునూ కలిపి వెయ్యి ఆవులతో యజ్ఞం చేశారు (ఈ వెయ్యి ఆవులూ దక్షిణగా ఇచ్చివేయబడినవని తరవాత కాలపు భాష్యకర్తలు భాష్యం చెప్పారు).

పైన ఇచ్చిన ఆఖ్యాయిక గాథ ఆర్యగణసంఘాలలోని సమిష్టి ఉత్పత్తి విధానం యొక్క ప్రధానాంశాల నన్నిటినీ స్పష్టంగానూ, సులభంగానూ అర్థమయ్యేటట్లు వివరించినది. మొదటి అంశము : క్రతువును ఆచరించినవారు ఒకే వంశానికి చెందిన గణసభ్యులై ఆదిమ కమ్యూనిస్టు జీవితాన్ని అనుసరిస్తున్న దేవతలు. రెండవ అంశము: మూడు అగ్నులను ప్రతిష్ఠించి చేసిన సమిష్టి ప్రయత్నంవల్ల ఒక్కఆవు మాత్రమే లభించింది. అంటే సమిష్టి ప్రయత్న ఫలితాన్ని వ్యక్తివ్యక్తికీ పంచడం అసంభవంగా ఉండేదని అర్థము. కథలో చెప్పినట్లు ఒక్క ఆవువల్ల ఇంకా ఎక్కువ సంపదను వృద్ధిచెయ్యాలంటే, ఆ ఒక్క ఆవునే ఒకే సమయంలో మూడు గణాల మధ్య పంచడానికి వీల్లేదు. మూడవ అంశం : గణాల సంపద పెరిగిన కొలదీ శ్రమ ఫలితం సమానంగా లభ్యమైనది. కథలో మొదటి ఆవును ఒక గణం తరవాత మరొక గణానికి వరసగా ఇవ్వడం ప్రతి గణానికీ సమాన సంఖ్యలో ఆవులు లభ్యం కావడం దీన్నే సూచిస్తున్నది. నాలుగవ అంశము : మొత్తం ఉత్పత్తివల్ల లభ్యమైన సంపద నంతటినీ ఒక చోటకుచేర్చి మూడు గణాలూ సమిష్టిగా అనుభవించినవి. ఇదే యజ్ఞము. ప్రాచీన యజ్ఞ విధాయకమైన సమిష్టి ఉత్పత్తి వినిమయాల పద్ధతికి ఇంతకన్నా స్పష్టమైన నిదర్శనం మరొకటిఉండబోదు.

యజ్ఞవిధానంప్రకారం గణంయొక్క నిత్యకార్యక్రమమేమోచూద్దాం. సోమయాగంలోని అగ్నిష్టోమమూ,షడంగ క్రతువూ, దేవసత్రయాగమూ వీటినుంచి సత్రయాగ విధానంలోని నిత్యకార్యకలాపాలను స్పష్టీకరించవచ్చును.

ప్రాచీనకాలపు ఆర్యులయొక్క ఆదిమ కమ్యూనిస్టుగణం చాలా చిన్నది. పాలినీషియన్ తెగలలోని కుటీర నివాసుల యూనిట్ యెంత చిన్నదో అంత చిన్నది. ఇలాంటి చిన్న చిన్న యూనిట్లను నేటికీ భారతదేశంలో కొన్ని గ్రామాల్లో చూడవచ్చును. ఈ గణాలకున్న ప్రధాన సంపద పశువులు. ఈ పశువులను, చుట్టూ రాళ్ళను గట్టుగా పేర్చి ఆ ఆవరణలో ప్రత్యేకంగా కాపాడేవారు. ఒక్కొక్కప్పుడు గణనినాసమంతటికీ యీ ఆవరణ ఉండేది. ఈ ఆవరణలను 'అశ్మవ్రజాలు' అనే వాళ్ళు. ఇలాంటి రాతిఆవరణలు పూర్వము యూరప్‌లో కూడా వుండేవి. 'సమిధల' (వంటచెరుకు)తో నిప్పును చేసే వారు. నిరంతరమూ మండుతూండే ఈ అగ్ని గణ జీవితానికి అంతటికీ కేంద్రము. ఈఅగ్నిని దీర్ఘచతురస్రాకారముగానున్న కొయ్య ఆవరణలో ఉంచేవారు. ఈ ఆవరణపేరు ప్రాగ్వంశ మండపము. దీని నిడివి 48 అడుగులు, వెడల్పు 36 అడుగులు. ఇదే గణముయొక్క ఉమ్మడి వంటశాల. దీనిప్రక్క నేపాలు, పెరుగు, నెయ్యి మొదలయినవాటినీ, ధాన్యాన్ని ఉంచే గణ గృహముండేది సోమరసపు గడ్డినీ, దానినుంచి సోమరసమును పిండి తయారుచేసే పరికరాలనూ, ఆ సోమరసాన్ని పట్టి ఉంచే పాత్రలనూ (గ్రాహాలను) అన్నిటినీ అట్టిపెట్టేందుకు వేరే మరొక కట్టడం యేర్పాటుచేసేవారు. గణమంతా సమావేశ మయ్యేందు కొక స్థలాన్ని ప్రత్యేకించేవారు. దాపున ఒక స్థలంలో త్రవ్వి, ఆ మట్టితో సమావేశస్థలంలో ఆసనాలను నిర్మించేవారు. ఈ ఆసనాలను "ధద్వాల" లంటారు. వీటిపైన కూచుంటే మెత్తగా ఉండటానికి "బర్హి"అంటే గడ్డిని పరచే

వారు. ఈ సమావేశస్థలము పేరు "మహావేది". ప్రతిరోజూ చేయవలసిన పనిపాటలను చేయడానికీ, అగ్నిదేవుని దయవల్ల లభ్యమైనదానిని భుజించి, సంతోషంగా కాలం గడపడానికి గణసభ్యులందరూ యీ మహావేదికకు చేరేవారు.

ఈ మహావేదిపాడవు తూర్పు పడమరలుగా 108 అడుగులూ, ఉత్తరదక్షిణాలుగా తూర్పుచివరను 72 అడుగులూ పడమటి చివరను 90 అడుగులూ ఉండేదంటే, గణంలో అంత స్థలానికీ సరిపోయినంతమంది సభ్యులూ ఉండేవారన్నమాట. ఈ మహావేదికకు దగ్గరగానే తినడానికి పనికిరాక వదలివేయబడిన పదార్థాన్నీ, కసువునూ పోగుచేసేందుకు స్థలం ఏర్పాటు చేయబడేది.

ప్రతి ఉదయమూ హోత దేవతలనూ, మనుష్యులనూ సమావేశానికి రమ్మని పిలుస్తాడు అందరూ రాగానే ఎవరెవరేయే పనులు చేయాలో నిర్ణయించి ఆయా పనులు అప్పగిస్తాడు. కొందరు సోమరసపుగడ్డిని తెచ్చి, దంచి రసం తీయాలి. కొందరు ఆసనాలమీద పరవడానికీ, "దుస్తులనూ", తలపాగాలనూ అల్లడానికీ, పశువులకు కట్టుతాళ్లను పేనడానకీ, కుటీరాలపై కప్పుకొరకూ అవసరమైన వివిధరకాలగడ్డినితీసుకురావాలి. కొందరు నిప్పుకొరకు కట్టెలను (సమిధలను) కొట్టుకురావాలి. ఆవులనూ, గొర్రెలనూ పాలుపిదకడం'దుహిత'పని. జంతువునుకోసి, చర్మంవలిచి నిప్పుమీద ఉడికించేది శమిత. కొయ్యతోగానీ, రాతితోగానీ తయారుచేసిన రోళ్లలో ధాన్యాన్ని దంచుతారు. అప్పటికింకా తిరగళ్ళు లేవు. మట్టితో కుండలు చేసేవారు. లోహాలను కరిగించడం అప్పటికింకా

లేదు. బుట్టలల్లడానికి కొయ్యబెత్తాలనో, గడ్డినో ఉపయోగించే
వారు. అందరూ కలసి గృహపతిని ఎన్నుకునేవారు. ఆగృహ
పతియే స్త్రీ పురుషులను పనిపాటలలో నియోగించి డైరెక్టుచేసే
వాడు. గణంయొక్క కార్యకలాపాల్లో పాల్గొంటూ, గణ
సభ్యులకు ఆయా పనుల్లో శిక్షణఇచ్చి నేర్పేటందుకు పలువిధా
లైన "అధ్వర్యు"లుంటారు. దీనంతటిమీదా అజమాయిషీ
చేసి ఇక్కడా అక్కడా ఉండే తప్పులను చూపేందుకు "బ్రహ్మ"
ఉంటాడు. సమిష్టిశ్రమకు అవసరమైన హుషారునూ, "లయను",
ఊపును కలిగించేందుకు పాటలు పాడతారు. ఈ పాటలు
పాడటంలో సూత్రధారుడై నడిపేవాడు "ఉద్గాత". నాటిశ్రమ
సులభమైనదికాదు, కాని విసుగును కలిగించేదికూడా కాదు.
పిండివిసరడానికి తిరగళ్ళులేవంటే, గుర్రపు ప్రక్కటెముకలను
పదనుపెట్టి, వాటితో గడ్డికోయవలసివచ్చేదంటే, ఆరోజుల్లో
పనిపాటలు యెంత కఠినమైన శ్రమగా ఉండేదో తెలుస్తుంది.
జంతువులను నరికి చర్మము వలిచేందుకు ఇనుపకత్తులుండేవి
కావు. అప్పటికింకా లోహాలను కరిగించడం తెలియదు.
అందువల్ల బడితలతో బాదిగానీ, తాళ్ళతో గొంతులకు
ఉచ్చులు బిగించిగానీ జంతువులను చంపి, ఎముకలతో చర్మం
వలిచేవారు. ఉత్పత్తిపరికరాలూ చాలా మొరటుగా ఉండే
వనీ అందువల్ల యజ్ఞంలో శ్రమ, దాని సమిష్టిలక్షణం చాల
వెనుకబడి ఉండేదని పై విషయాలు తెలుపుతున్నాయి.

ఉత్పత్తియైనదానినంతటినీ, ఉపయోగించడానికి, లేక
భుజించడానికి, నేరుగా మహావేదిదగ్గరకు తెచ్చేవారు. ఇలా
చేర్చాలని ధర్మం విధించింది. దేవభాగమూ, పితృభాగమూ

(హవిస్సు) ముందుగా అర్పించబడేది. ఇట్లా "హవిస్సు"ను యివ్వకపోతే మానవుడు బ్రతుకలేడు. అయితే మనుష్యులు యజ్ఞంచేసినప్పుడు మాత్రమే హవిస్సు నివ్వడం జరుగుతుంది. హవిస్సును అర్పించిం తరవాత మిగిలిన హుతశేషాన్ని గణ సభ్యులందరూ భుజించేవారు. గణమంతా సమిష్టిగాకృషిచేస్తే లభ్యమైన ఆహారాన్ని వినిమయంచేసే పద్ధతియే నిత్య'హవన' మనబడుతుంది. ఈ హవన విధి యజ్ఞకర్మలో అంతర్భాగమే.

పనిచేసే సమయంలో మధ్య మధ్య హుషారుకొరకు సోమరసం తాగేవారు. ఉడకబెట్టిన పిండి (పురోడాశము)నీ, వేయించిన బార్లీగింజలనూ, బియ్యాన్ని పెరుగుతోటో, పాల తోటో కలిపి ఉపాహారంగా తినేవారు. ఏరోజైనా మాంస భోజనమే అసలు తృప్తిమైన, సంతోషకరమైన భోజనము. మాంస భోజనం విషయంలో మాత్రం ఆర్యులు యేలోపాన్ని రానిచ్చేవారుకాదు. వారికి తినరాని జంతువంటూ ఉండేది కాదు. మామూలుగా అయితే మేకనూ, గొర్రెనూ, జింకనూ తింటారు. ఆవునూ, యెద్దునూకూడా తినేవారేకాని, వాటివల్ల యితర ఉపయోగం యెక్కువగా ఉండేది కాబట్టి, వాటిని తరచుగా చంపేవారుకాదు. బాగాతిని, మస్తుగా తాగి, ఆడా మొగా కలిసి జతలు జతలుగా అగ్నిచుట్టూపడి నిద్రపోయే వారు. ఇలా మొదటిరోజుల్లో జరిగేది. కాని తరువాత తరు వాత గణనివాసంలో దాంపత్యపద్ధతి వచ్చింది. తరవాత ఆడ మొగ యేజత కాజతగా కుటీరాల్లోకిపోయి నిద్రించేవారు. మానవుడు సంతృప్తుడైనాడు. అలాగే అగ్నిదేవుడుకూడా. ఈవిధంగా గణము ('బ్రహ్మ') బ్రతుకు సాగించింది; శ్రమిం చింది; సుఖించింది; అభివృద్ధిచెందింది.

# నాలుగో అధ్యాయం

## యజ్ఞము - బ్రహ్మము - వేదము

ఇక్కడ యజ్ఞ శబ్దముయొక్క వ్యుత్పత్తి, అర్థమూ యేమిటో తెలుసుకోనడం అవసరం. "యజ్ఞ" అనేది ఒకే మాట కాదు. య,జ,న అనే మూడుమాటలు కల వాక్యము. "య" లేక "ఐ" అనే ధాతువుకు 'పోవుట', 'కూడదీయుట' అని అర్థము. 'జ' అంటే కనుట అని అర్థము. న,అన్,అన్ట్ అనేవి ప్రథమ పురుష బహువచన క్రియాంతాలు. ఈమూడు శబ్దాలనూ కలిపి అర్థం చెప్పుకొంటే "వారు కూడదీస్తారు, మరియూ కంటూరు" అని వస్తుంది. కూడదీసేవేమిటి? కనే దేమిటి? వస్తువులనూ, బిడ్డలనూ. అలాగే యజుర్వేదము:లోని 'యజుస్' లేక "యజుర్" అనేవికూడా యేకశబ్దాలు కావు. అవికూడా వాక్యాలే. యజ్, ఉస్ లేక ఉర్. ఈ "ఉర్" కూడా ప్రథమపురుష బహువచనక్రియాంతరూపమే. యజ్+ ఉస్ లేక యజ్+ఉర్ అన్న వాక్యానికికూడ 'వారు కూడ దీస్తారు. మరియు కంటూరు' అనే అర్థమే వస్తుంది. తరువాత తరువాత ఈ వాక్యము 'యజ్ఞ' అని నామవాచకంగా మారి పోయి వస్తువులనూ మనుష్యులనూ సమిష్టిగా ఉత్పత్తిచేసే

విధానమనేఅర్థాన్నిపొందింది. ఈవిధానాన్నిగురించినజ్ఞానమే వేదము.

దీన్నిబట్టి ప్రాచీనకాలపు ఆర్యుల్లో, పై వేటు ఆస్తీ, వర్గాలూ, రాజ్యాంగయంత్రమూ అమలుకు రాకపూర్వము, వారవలంబించిన సమిష్టి ఉత్పత్తి విధానమే యజ్ఞము అని తెలుతున్నది. పై వేటు ఆస్తీ,వర్గాలూ,రాజ్యాంగయంత్రము రాగానే, పురాతనకాలపు సత్రయజ్ఞమూ, క్రతువులూ జీవిత విధానంనుంచి తొలగిపోయి, కేవలం మత విషయకమైన కర్మ కాండగానూ, ఒకానొక పూజా విధానముగానూ, సమాజం యొక్క పూర్వ స్మృతులుగానూ నిలిచిపోయినవి; ప్రాచీన ఆర్యగణ సమాజంనుంచే, వర్గాలూ, కులాలూగల సమాజం పుట్టింది. ఆనాటి సామాజిక వాస్తవికతా, దాని సిద్ధాంతమూ, విశ్వాసములూ తరవాత కాలానికి సామాజిక వారసత్వంగా సంక్రమించినవి. ఆర్యసమాజం యజ్ఞవిధానంలో అభ్యుదయం పొందింది కాబట్టి ఆర్యులు ఆ వారసత్వాన్ని జ్ఞప్తిలో పదిల పరచుకున్నారు. కాని యజ్ఞవిధానంయొక్క, దాని సిద్ధాంత విశ్వాసాలయొక్క సామాజిక వాస్తవికత అంతరించిన తరవాత వాటికి చెందిన సిద్ధాంతము మతవిషయకమైన కర్మకాండగా నిలిచిపోయినది. కొత్తగావచ్చిన వర్గాలు ఆసిద్ధాంతాన్ని మత కర్మగానే ఆచరించినవి.అంతేకాదు.కొత్తఆర్థికవిధానములో, కొత్త సామాజిక వ్యవస్థలో కొత్తవర్గాలు తాము దోచుకొనే ప్రజాబాహుళ్యంమీద తమ అధికారాన్ని గట్టిగా స్థిరపరచు కునేందుకు ఈ కర్మకాండను ఒక ఆయుధంగా ఉపయోగించు కున్నారు. పూర్వపు యజ్ఞకర్మను సరిగ్గా యేమీ పొరబాటు

లేకుండా అనుకరించినట్లయితే, పూర్వకాలంలోవలెనే సంపద సమృద్ధి, వంశాభివృద్ధి కలుగుతాయని ప్రజలందరికి నమ్మకను కలుగజేశారు. యజ్ఞకర్మ వాస్తవమైనయజ్ఞాన్ని అనుకరించడముగా మారింది. ఇది ఎలాసంభవించిందో తరువాతచూద్దాం. యూరప్‌లోకానీ,ఇండియాలోకానీఉన్న వేదపండితులందరూ యజ్ఞంలో కొంతభాగం ఆర్యుల ప్రాచీన జీవిత పరిస్థితులను ప్రతిబింబిస్తున్నదని అంగీకరించినప్పటికీ సత్రయజ్ఞాన్నీ, క్రతువునూ సంపూర్ణంగా అర్థం చేసుకోలేకపోయినారు. * తరువాతకాలపు మతకర్మలలోనూ, యజ్ఞవిధానంలోనూ ప్రతిబింబితమాతూన్న ఆర్యజీవితపు ప్రత్యేక లక్షణాలనూ, ఇతర విషయాలనూ చూడలేకపోయినారు. ఉదాహరణకు గోత్రాలూ ప్రవరనుగురించి వారుపడ్డ గంద్రగోళం యింతా అంతాకాదు. (ఆ విషయాన్ని తరువాత అధ్యాయంలో పరిశీలిద్దాం). యజ్ఞమంటే ప్రధానంగా దేవతలనూ, దైవాంశలనుకునే ప్రకృతిశక్తులనూ పూజించడమే ననుకోడంవల్ల వారికి ఆ అవస్థపట్టింది. యజ్ఞంలో కొంత భాగం మాత్రమే సమాజంయొక్క పనిపాటలనూ, పరిస్థితులనూ ప్రతిబింబిస్తుందనుకున్నారు. గడ్డికోయడానికి యెముకల నుపయోగించారనీ, ధాన్యాన్ని దంచడానికి రాతి నుపయోగించారనీ అంటే ఆనాడు ఇనపకత్తులూ, తిరగళ్ళూ లేవనిమాత్రమే

---

* సోమయాగం ఆర్యులు యెలా వలసపోయేవారో తెలుపుతూందని వివరిస్తూ శ్రీ కుంతే ఒక అధ్యాయానికి అధ్యాయమే వ్రాశాడు. ఈ సందర్భంలో యీనాటి యజ్ఞకర్మలో అగ్నిని ప్రతిష్ఠించే ఆవరణను నాలుగు గాండ్ల బండిమీద కట్టడమూ, యజ్ఞపశువును కట్టే యూపస్తంభాన్ని నేలలో పాతక అడుగున వెడల్పైన పీటకు బిగించి నిలువబెట్టడాన్ని ఈ [illegible]ండంశాలనే ముఖ్యమైన రుజువులుగా పేర్కొన్నాడు.

సామాజిక నిర్వచన మిచ్చారు. ఆ పండితులకు అంతవరకే తెలుసు. ఈ విధంగా అనాగరికులైన ఆర్యులకు ప్రకృతికి అతీతమైన శక్తుల్లో నమ్మక ముండటంవల్ల యజ్ఞకర్మ అమల్లోకి వచ్చిందని చెప్పేవారు. ఇంతమాత్రంచేత ఆర్యుల సమాజంలో యజ్ఞకర్మకు గల అధికారంకానీ, యజ్ఞమే ప్రాణానికీ, భాగ్యానికీ మూలమనేవారి విశ్వాసంగానీ, యజ్ఞమే వారి ఆలోచనా, జీవిత సర్వస్వమూ అయి వుండటంకానీ, యెందువలననో తెలియడానికి వీలుండదు. ఎముక, రాతిపని ముట్లూ, తరువాత కనిపెట్టబడిన నిప్పూ, పశువులను మచ్చిక చేయడము, నేర్వడము, సామాజిక విప్లవాన్ని కలుగచేసినవనీ, దాన్నుంచి ప్రాచీన మానవుడు కొత్త సమిష్టి ఉత్పత్తి విధానాన్ని సృష్టించుకున్నాడనీ, యీ కొత్తగా కనిపెట్టబడిన రెండు సాధనాలవలన గణ జీవితం సంపూర్ణంగా మారిపోయినదనీ ఆ కారణంగా యేర్పడ్డ కొత్త జీవితవిధానానికి సంబంధించిన సిద్ధాంతము సహజంగా వారి జీవిత మంతటిలోనూ ప్రతిబింబించినదనీ యీ వేదపండితులకు అర్థంకాలేదు. యజ్ఞాన్ని ఒక ఉత్పత్తివిధానంగా చూడగలిగితేనే ఆర్యుల పూర్వచరిత్రనుఅర్థంచేసుకొనగలం. మానవుడు మృగప్రాయమైన ఆటవికస్థితినుంచి అనాగరికస్థితికీ, అనాగరిక స్థితి నుంచి నాగరికస్థితికీ వచ్చిన చరిత్ర అతీత ప్రకృతిశక్తులను గురించిన అర్థరహిత గాథలతో కలగాపులగంగా ఉన్నప్పటికీ, ఆ చరిత్రకు అర్థమున్నది. కేవలం ఊహాగానంమీదనూ, పూజా విశేష కర్మకాండమీదనూ ఆధారపడిన చరిత్రనూ, సామాజిక జీవితాన్నీ నిర్మించలేము.

ఊహాచిత్రాలు, కర్మకాండల పరిశీలనద్వారా సామాజిక జీవితాన్ని చేరుకోవలసిన కర్తవ్యం మనది.

మన పండితులకు అర్థంకాని రెండో విషయం 'బ్రహ్మ' అనేదాన్ని గురించి యజ్ఞవిధిలోనూ, సృష్టి, సామాజికాభివృద్ధులను గురించిన గాథలలోను 'బ్రహ్మ'ను గురించి ప్రసక్తి పదేపదే వస్తుంది. కాని చరిత్రకారులు దాని నిదమిద్ధమని తేల్చి నిర్ణయించలేకుండా ఉన్నారు.

వీరు వేదకాలపు ఆర్యుల 'బ్రహ్మ'కూ, ఉపనిషద్వేదాంతుల 'బ్రహ్మ'కూ భేదమున్నదని గుర్తిస్తున్నారు. ఆదిమ కమ్యూనిస్టు గణాలలోని వేదకాలపు ఆటవిక ఆర్యుడు సామాజిక వైరుధ్యాలనూ, వర్గ పోరాటాలనూ, దోపిడీనీ ఎరుగడు. ఉపనిషత్తాలపు ఆధ్యాత్మిక వేదాంతము అతని కిటీవల చాలా కాలానికిగాని రూపొందలేదు. ఉపనిషత్తాలపు బ్రహ్మకు ఆది చైతన్యము పరమాత్మ అని అర్థము; ప్రపంచమంతా దాని వికాసమే. ఉపనిషద్బ్రహ్మ నిర్గుణము. వేద బ్రహ్మ సగుణము. ఉపనిషద్బ్రహ్మను యోగశాస్త్రంలోనూ, వేదాంతశాస్త్రంలోనూ చెప్పబడిన మననం ద్వారానే లేక తపస్సుద్వారానే తెలుసుకొనగలం. వేదబ్రహ్మ తింటాడు, తాగుతాడు,, ఆడతాడు, పాడతాడు, ఆనందిస్తాడు, పెరుగుతాడు, జీవితాన్ని ప్రత్యక్షంగా అనుభవిస్తాడు. ఉపనిషద్బ్రహ్మ కారణాతీతుడు, ఇంద్రియ జ్ఞానాతీతుడు, కోరికలు లేవు; అనుభూతులు లేవు. కామక్రోధాది షడ్వర్గరహితుడు. తిండీ, తాగుడూ, సౌఖ్యమూ మొదలైనవన్నీ నిషేధాలు; యీ నిషేధాలకారణంగా ఉపనిషద్బ్రహ్మను ఉపవాసంద్వారానేకాని తెలుసు

కొనడానికి వీల్లేదు. ఇలా అస్తిత్వరహితుడూ, ఆత్మైక జీవనుడూ, ఇంద్రియ జ్ఞానశూన్యుడూ అయిన ఈ "ఉదాసీన బ్రహ్మ" వలన వేదకాలపు ఆర్యులకు ప్రయోజనమేమీ లేదు. వైదికార్యుల బ్రహ్మ అస్తిత్వముకలవాడు, సమిష్టిగణ సభ్యుడై ఈ ప్రపంచంలో బ్రతికాడు. అతడిందులో భాగము. వైదికార్యులకు "బ్రహ్మ" అంటే గణమనీ, గణ సంఘ సభ్యులనీ అర్థము. ఆదిమ మానవులందరివలెనే, వారుకూడా సూర్యునీ, చంద్రుడునీ, నక్షత్రాలనూ, భూమినీ అన్నిటినీ గణానికి ముడిబెట్టారు. ఈ గణానికీ, గణ జీవితానికీ అంతటికీ అగ్ని కేంద్రము.

వేదవాఙ్మయంలో ఇదంతా ఉండటం వేదపండితులందరికీ తెలుసును. కాని ఆధ్యాత్మికతత్వ ప్రభావానికి లోనైనవారు కాబట్టి వేదబ్రహ్మనుకూడా అగమ్యగోచరమైన దానినిగా చేయడానికి ప్రయత్నించారు. హాగ్, ఎగ్లింగ్, హిల్బ్రాంట్, కేత్కర్, తిలక్ అందరూ ఈ బ్రహ్మచుట్టూ తిరిగారు, తిరిగారు; కాని ఇది అని పోల్చలేకపోయినారు. యజ్ఞం యొక్క స్వరూప స్వభావాలను నిర్ణయించలేక పోయినారు. ప్రఖ్యాత భాష్యకర్త అయిన శాయనుడి భాష్యం నుంచి, హాగ్ "బ్రహ్మ" శబ్దానికి గల అర్థాలనన్నిటినీ క్రోడీకరించాడు. ఆ లిస్టుప్రకారం బ్రహ్మ అంటే (1) ఆహారము లేక నైవేద్యము* (2) సామవేదగాయకుడి గానము (3) ఇంద్ర

* ఈ పండితులనుసరించిన శాయనుడమార్గం తప్పు. ఋగ్వేదాన్ని గురించిన అధ్యాయంలో బ్రహ్మణస్పతి అనే శబ్దంలోని బ్రహ్మన్‌ను శాయనుడు 'ఆహారమని' తప్పు అర్థం చెప్పాడు. దీనిని చర్చించిన రజ్వాడే 'బ్రహ్మన్

జాలం లేక గారడి విధానము (4) విద్యుక్తముగా పూర్తిచేయ బడిన కర్మకాండ (5) మంత్రము లేక యజ్ఞబలి (6) హోత్రి అనబడే పౌరోహితుని మంత్రపఠనము (7) గొప్ప (బృహత్).

ఈ అర్థాల్లో ఎక్కడా ఆధ్యాత్మికవాదపు పోకడలు లేవు. ఇవి అన్నీ గణానికీ, గణకార్యకలాపాలకూ సంబంధించినవి. వాటినుంచే పుట్టినవి. హిల్‌బ్రాంట్ యీ విధంగా వివరించాడు : ఋగ్వేదంలోని బ్రహ్మన్ అనబడేది నూతనమైనది. ఇంతకుముందు ఉండినది కాదు. పితరులనుంచి జననమందినది. యజ్ఞముయొక్క చప్పుడు కాగానే అది పుట్టుతుంది. హవనవిధిలో మంత్రపఠనం చేసి సోమరసం పిండినప్పటినుంచీ దాని వాస్తవికజీవితం ప్రారంభమౌతుంది. దేవతల సహాయం వల్ల యుద్ధాలలోకూడా దానికి హాని కలుగదు. సోమరసం దాన్ని రక్షిస్తుంది ♦ హిల్‌బ్రాంట్ ఈరుజువుమీద ఆధారపడి, బ్రహ్మన్ అన్నది ఒక అగమ్యగోచరమైన శక్తియనీ, ఆశక్తిని అనేక విద్యుక్తకర్మకాండలద్వారా పొందవచ్చుననీ, మంత్ర పఠనము, ఉచ్చాటన, బలి, దానము మొదలైనవాటిని విధ్యుక్త క్రమంలో చేయడంద్వారా సాధించబడతగిన ఒక ఐంద్రజాలిక

---

అంటే ఆహారానికి యజమాని అనడంగాని, అర్చనకు యజమాని అనిగానీ చెప్పడం తప్పనీ బ్రహ్మణస్పతి అంటే 'బ్రహ్మన్' యొక్క, లేక ఋషుల యొక్క నాయకుడని అర్థమనీ అన్నారు. రజ్వాడే చెప్పినదానికి కొంచెం ముందుకెళ్ళితే యజ్ఞగణ సంఘముల నాయకుడే బ్రహ్మణస్పతి యని గ్రహించవచ్చును. రజ్వాడే 'రాధామాధవం' పేజీ 107 చూడండి)

♦ ఋగ్వేదం VIII 37-1; VII 69-9; VI 23-5; I 47-2; VII 29-9; VI 52-3 మొదలైనవి.

శక్తిగా (Magic force) నిర్వచనం చేసిన హాగ్ యొక్క అభిప్రాయంతో ఏకీభవించాము.*

దీనినిబట్టి వేదకాలపు ఆర్యులు సమిష్టిగా పనిచేసేప్పుడూ, గానం చేసేప్పుడూ, సోమరసం తాగేప్పుడూ, అంటే యజ్ఞకర్మ నాచరించేప్పుడూ ప్రతి పనిలోనూ తమ జీవితం యొక్క నరనరాల్లోనూ గణభావాన్ని అనుసరిస్తారు. ఈ సమిష్టి గణజీవిత భావననూ, చైతన్యాన్నీ, విశ్వవ్యాప్తమైన బ్రహ్మగా చూస్తారు. ఈ స్వరూపమైన బ్రహ్మయే గణము. ఇది గణముతప్ప వేరొకటిగాదు. అతనికి అప్పుడున్న అభివృద్ధి దశలో అది ఒక అగమ్యమైన శక్తి; యజ్ఞంవల్లపుట్టి, యజ్ఞంలోనే అది అస్తిత్వాన్ని పొందుతుంది. యజ్ఞంవల్ల ఆహుతమౌతుంది, పిలువబడుతుంది. సమిష్టిశ్రమలో భౌతిక ప్రవృత్తులకు కలిగే ప్రోత్సాహమూ, ఆనందాతిశయమూ, అనాగరికమానవునికి అగమ్యగోచరంగాను, మాంత్రిక శక్తిగాను కనబడ్డంలో ఆశ్చర్యంలేదు. కాని మన మెందుకు మంత్రముగ్ధుల మవాలో కారణం కనపడదు.

---

* దాస్‌గుప్త 'తత్వశాస్త్రచరిత్ర' 1932
పేజీ 20-22 లో ఉదహరించినదానినుంచి.

శ్రమవిధానంలో సహకారంవల్ల కలిగే ఫలితాలనుగురించి మార్క్స్ యిలా వ్రాశాడు:

"అనేక శక్తులను సమీకరించి ఒకటిగా చేసినప్పుడు ఒక కొత్తశక్తి (Power) పుట్టడమే కాకుండా, అనేక పరిశ్రమలలో పనిచేసేవారు సామాన్యమైన సామాజిక సంబంధమువలననే ఒకవిధమైన ఉత్సాహమూ, వారిలోని పశుప్రవృత్తులకు ఉద్దీపనమూ కలిగిన, ప్రతి కార్మికుడికీ వ్యక్తిగతంగా పనిలో నైపుణ్యంకూడా పెరుగుతుంది."

(మార్క్స్ కేపిటల్ సంపుటం I పేజి 316)

అగ్నినుంచీ పశువులను మచ్చిక చేయడంనుంచీ రూపొందిన యజ్ఞంవల్ల సంపద అభివృద్ధి అయినది; గణ సభ్యుల సంఖ్య అభివృద్ధిఅయినది; గణం రూపుమాసిపోకుండా రక్షింపబడినది. కాబట్టి ఆర్యసంఘ జీవితము అగ్ని కేంద్రముగా నిర్మింపబడినది. యజ్ఞము అగ్నిపై ఆధారపడినది. కాబట్టి తరవాత తరవాత, మానవులు అభివృద్ధిమై యినుమును కరిగించి, కొడవలిని తయారుచేసుకున్నప్పటికీ, ఆర్య మత కర్మలలో మాత్రం, వారి పూర్వులవలెనే దేవతలను సంతృప్తులనుచేసి సర్వసంపదలనూ పొందే ఉద్దేశ్యంతో ఆ పూర్వీకులనే అనుకరించారు. వారి మంత్రాలనే గానం చేశారు. యజ్ఞంకొరకు గడ్డిని కోయడంలో పూర్వమువలె గుఱ్ఱపు ప్రక్కటెముకనే ఉపయోగించారు. కొత్తగా చేసుకొన్న కొడవలిని ఉపయోగించలేదు. గణము అంతరించింది; దానితోపాటు ఆ యెముకను వుపయోగించడంకూడా అంతరించింది. కాని గణమునూ, యజ్ఞమునూ మరల ప్రాణంపోసి ఆచరణలోనికి తీసుకుని రాలేకపోయినప్పటికీ యజ్ఞమును ఒక మతవిధిగా సంకేతంచేసి అనుకరించవచ్చును. అందులో వాస్తవికతమాత్ర ముండదు. పూర్వపు యజ్ఞమంత్రములను మాత్రము పఠించవచ్చును; కాని పూర్వపు సమిష్టిగణమును అంటే వాస్తవమైన, ఆనందమయమైన బ్రహ్మను ప్రాణంతో సృష్టించడానికి వీల్లేదు. పూర్వము సామాజిక వాస్తవికత కలిగిన యజ్ఞము, యిప్పుడొక గాథగా అయిపోయినది. అయితే యీ గాథ పూర్వపు వాస్తవికతనుంచి వచ్చినదే. పూర్వము యజ్ఞజీవితాన్ని వాస్తవంగా అనుభవించిన వారినుంచి ఆ గాథ తరవాత వారి సంతతివారికి వార

సత్యంగా సంక్రమించినది. పూర్వపు భావసముదాయాన్నీ, ఆచరణనూ కొంతవరకు సంచితంచేసుకున్నటువంటి తరవాత తరములవారు వాటి అనుకరణమువలన సంపదనూ, ఆనంద మునూ పొందవచ్చుననే కాంక్షతో, ఆ మంత్రాలకే ఆ కర్మ కాండకే అంటిపెట్టుకుని ఉన్నారు.

గణజీవితదశనుంచి తరవాత పోరాటాలుజరిగి గణము విచ్ఛిన్నమైపోయిన దశవరకూ ఆర్యులసమాజం అభివృద్ధి చెందిన వివిధదశలనూ ప్రతిబింబించే వేదమంత్రాలన్నిటినీ సేకరించి తరవాత తరములవారు తమ మత కర్మవిధులుగా యేర్పాటు చేసుకున్నారు. అయితే యజ్ఞనియమానికి సంపూర్ణంగా వ్యతిరేకమైన సామాజిక నిర్మాణ నియమాలకు దోహదంగా పూర్వపు యజ్ఞవిధిని మార్చివేశారు. ఈ మార్పిడి చారిత్రకావసరంగా జరిగింది. ఈ విషయానికి తరవాత వద్దాం. ఇక్కడ చెప్పదలచిన విషయం మాత్రం యేమంటే యజ్ఞం వాస్తవికమైనదిగా ఉన్నకాలం గతించి వర్గపోరాటాలూ, వైరుధ్యాలూ ఏర్పడి పాతసమాజ గర్భంలోనే నూతనసమాజ బీజాలు నాటుకుని పెరుగుతున్నరోజుల్లో ఈనాటి వేదసంహితలు సంపుటీకరించబడినవి. అయితే అప్పటికింకా వర్గరాజ్యాంగ యంత్రానికి సంపూర్ణ విజయమూ, సర్వాధికారమూ లభించని పరివర్తనదశ అని చెప్పాలి.

అందువల్ల ఈదశలో వేదసంహితలు ఒక అపూర్వమైన శక్తిగా మారిపోయినవి. నిజానికి యజ్ఞజీవనాన్ని వాస్తవంగా అనుభవించిన ప్రాచీనార్యునికి వేదాలు పవిత్రమైనవనే అభిప్రాయమేలేదు. అతనే కొత్తబుక్కులను, లేక మంత్రాలను

అర్లేపాడు. ఈ ఋక్కులూ, మంత్రాలూ అతని సృజనాత్మక కృషికీ, అనుభవానికీ, అనుభూతికీ ఈయబడిన శబ్దరూపములే. వాటిని అతడు పాడినప్పుడు అవియేవో అగమ్యాలనీ, పవిత్రాలనీ అనుకోవలసిన అవసరంలేదు. అందువల్లనే ఇంద్రుణ్ణి ప్రార్థనచేయడానికీ, యజ్ఞకర్మ నాచరించడానికి కొత్త మంత్రాలు చదువబడినట్లు, ప్రాచీన వేదాల్లో పేర్కొన బడినది. తరవాత యజ్ఞాలలో అంటే అవి మతకర్మగా మారిన తరవాత కొత్త మంత్రాలు అవుపడనే అవుపడవు. ఈ దశలో అప్పటివరకున్న మంత్రాలను మార్చి, కొత్తవాటిని చేర్చడం అపచారంగా యెంచబడింది. నిజానికంతే. వర్గసమాజంలో పూర్వపు మంత్రాలు పవిత్రములై పోయినవి. వేదాలు మత గ్రంథాలై పోయినవి. వాటిలో ఒకమాట మార్చకూడదు; చేర్చకూడదు.

ప్రాచీనకాలపు ఆర్యుల యజ్ఞము నుంచి సంక్రమించిన వేదాలు సంపదను, అంటే భౌతికంగా వాస్తవమైన సంపదను, సృష్టించే సాధనాలుగా పరిగణింపబడినవి. పదునాల్గవ శతాబ్దమువాడైన శాయనుడు "మానవుడికి అవసరమైనవస్తువులను పొందే జ్ఞానాన్ని ఇచ్చి, అతని అభీష్టాన్నిసంతృప్తిపరచడానికీ అరిష్టాలను తొలగించడానికీ ఏర్పడిన గ్రంథమే వేదము" అని నిర్వచించాడు. *ఋగ్వేదంలోని వేద శబ్దానికి సంపద అని అర్థము. "విద్"=పొందుట లేక లభ్యముచేసుకొనుట. "విద్" అంటే సంపదనుపొందుట అయినప్పుడు అది పొందుట ఎలాగో

---

* ఇష్టప్రాప్తి-అనిష్ట పరిహారయోః అలౌకిక ఉపాయం యో గ్రంథో వేదయతి స వేదః-(శాయణాచార్య.)

కూడా తెలియాలి. అలా తెలుసుకోవడం లేక అజ్ఞానంకూడా "విద్" అయినది. జ్ఞానమంటే సంపదను పొందే జ్ఞానమైతేనే గాని దానికి అర్థం, విలువ, ఉపయోగంవుండవు. అందువలన విద్=తెలుసుకొనుట అనే ధాతువునుంచి వేదశబ్దమేర్పడినది. వేద=జ్ఞానము. దేన్ని గురించిన జ్ఞానము? సేకరించుటకును, ఉత్పత్తి చేయుటకును, పొందుటకును గురించిన జ్ఞానము. దేన్ని పొందుటకు? దేన్ని ఉత్పత్తి చేయుటకు? "ప్రజాః పశ్వాదిః" అంటే సంతానమనూ, పశువులనూ అని వెనక ముందాడకుండా ప్రాచీనార్యులు సమాధాన మిచ్చారు.

వర్ధమానమైన ప్రాచీన మహో (బ్రహ్మన్) గణసంఘ మును గురించిన జ్ఞాపకాలలో యీయజ్ఞ విధానమూ, దీన్ని గురించిన జ్ఞానమూ సృష్టి ప్రారంభమైనప్పటినుంచీ, గణ ములు పుట్టినప్పటినుంచీ ఉన్నవి. గణజీవితం జ్ఞానంతోపాటే ప్రారంభమైనది. కాబట్టి వేదాలను రచించడం యెవ్వరూ చూడలేదు. వేదాలు యెవరిచేతనూ రచింపబడలేదనే నమ్మికను పెంపుచేసిన యిటీవలి వర్గసంఘం అసలే చూడ లేదు. అందువల్లనే వేదాలు అనాదీయములనీ, నిత్యములనీ, సామాన్య మానవుల సృష్టికావనీ - అపౌరుషేయములనీ * చెప్పబడినది. మానవుడు భౌతికసంపద లేకుండా బ్రతుక లేడు. మానవునితో పాటే సంపద పుట్టాలి. కాదు! అంతకు ముందునుంచే ఉండాలి. కాబట్టి దానితోపాటే వేదాలు కూడా ఉండియుండాలి. ఇదీ తర్వాత ఆర్యులు వాదించిన

---

* అపౌరుషేయమంటే పురుషునికి పూర్వము సృష్టింపబడినదనికూడ అర్థము చెప్పవచ్చును. అంటే పురుషసూక్తంలో వర్ణింపబడిన వర్గసహిత సమాజం పుట్టకముందు సృష్టింపబడిన వని అర్థము.

పద్ధతి; ఆత్మకూ అస్తిత్వానికిగల సంబంధాన్ని గురించీ, జీవిత బంధనాన్నుంచీ ఆత్మవిముక్తిని పొందడాన్ని గురించీ ఆధ్యాత్మిక వేదాంతులు చేసేలాంటి అగమ్యగోచరత్వమును ఆదిమ ఆర్యులు కానీ, తరవాత ఆర్యులు కానీ వేదాలకు అంటగట్టలేదు. వేదాలను సంపుటీకరించిన ఆర్యులు వేదాలు వాస్తవికములనీ, కల్పితములనీ రెండుగా విభజించిన చిత్తశుద్ధి కలవారు. ఇలా వాస్తవికమూ, కల్పితమూ రెండూ కలిసిన వేదాలు పూర్తిగా కల్పితగాథలైనవి. కారణమేమంటే వేదాలను సంపూర్ణంగా వేదవిరుద్ధమైన నూతన వాస్తవికతను సమర్థించడానికి ఉపయోగించారు కాబట్టి. ఈ విషయం హిందూ వాఙ్మయాన్నంతటినీ మూడు భాగాలుగా విభజించడంలో విశదమౌతుంది. వేదాలలోని నిజమైన మంత్రాలు మంత్రద్రష్టలైన ఋషుల సాక్షాత్కారాలు. అవి ఋషులు చూచినవి. చూడటం దగ్గరనుంచి వినడం దగ్గరకు వచ్చినది. సాక్షాత్కారంనుంచి శృతికి వచ్చినది. శృతులు వాస్తవిక మంత్రాలూ, కల్పిత మంత్రాలూ చేరిన కలయిక. ఆ తరవాత కేవలం జ్ఞాపకాలు మాత్రమే వచ్చినవి. అంటే స్మృతులు వచ్చినవి. హిందూ సాంప్రదాయమూ, మతవాఙ్మయమూ ఆ తరవాత వచ్చిన స్మృతిరూపములైన చట్టాలనూ పరీక్షిస్తే, అవి ఆర్యుల సమాజవ్యవస్థ మంత్రదృష్టి నాటి- అంటే వేదాలను చూచిననాటి గణవ్యవస్థ దశనుంచి వైరుధ్యబీజాలు పెరిగి ఆగణవ్యవస్థ విచ్ఛిన్నమయ్యే పరిణామ దశకూ, (అంటే వేదములను వినుటద్వారా; శ్రౌతధర్మము ద్వారా సమాజం నడుపబడే దశ) దానినుంచీ చిట్టచివరకు గణవ్యవస్థను రూపుమాపి, వేదకాలపు యజ్ఞముతోనూ,

తత్సమాజముతోనూ పోలికేలేని వర్గాధారమైన రాజ్యాంగ యంత్రముపుట్టి పాదుకున్న దశకు రావడాన్నిసూచిస్తున్నవి. ద్రష్టమంత్రము, శృతి, స్మృతీ యీ మూడూ పైనవివరించిన మూడు సామాజిక దశలనూ సూచిస్తున్నాయని స్పష్టపడుతుంది.

ఇప్పుడు పాఠకు లొక ప్రశ్న అడుగవచ్చు. కర్మకాండ, సాంప్రదాయం, కల్పిత గాధలతో కూడుకొనియున్న వేదయజ్ఞమంతా, ఊహాకల్పితరూపంలో అయినప్పటికీ ఆ నాటి సామాజిక-ప్రాకృతిక వాస్తవాన్ని ప్రతిబింబిస్తుందా? లేక అందులో ఏ భాగమైనా అర్థరహితమైన కల్పితాలా? ఈ ప్రశ్నకు వివరాలతో కూడిన చర్చలోకి దిగకుండా సమాధానం చెప్పాలంటే, ఏంగెల్స్ ఏమివ్రాశాడో చూస్తే చాలు. 'డూరింగ్ సిద్ధాంత ఖండన' అనే గ్రంథంలో ఆయన యిలా వ్రాశాడు :

"మానవుల నిత్యజీవితాన్ని కంట్రోలుచేసే బాహ్యశక్తులు వారి మనోఫలకంమీద ముద్రించే ప్రతిబింబమే మతం. ఈ ప్రతిబింబంలో ఐహికశక్తులన్నీ మానవాతీతమైన స్వరూపం ధరిస్తాయి. చరిత్రయొక్క ప్రాథమికదశలో ప్రకృతి శక్తులు ఆ విధంగా ప్రతిబింబింపబడేవి. ఆ తర్వాత పరిణామ దశల్లో అవి అనేక జాతులలో అనేక భిన్నరూపాలు ధరించాయి. ఈ మొదటి పరిణామక్రమం ఇండో-యూరపియన్ జాతులకు సంబంధించినంతవరకు భారతీయ వేదాలతో ప్రారంభమైనట్లు పౌరాణికగాధలవల్ల తెలుస్తూంది. ఆ తర్వాత పరిణామదశలు భారతీయుల్లోను, పర్షియన్‌లలోను, గ్రీకుల్లోను రోమన్లలోను, జర్మన్లలోను, ఆధారాలున్నంతవరకు కెల్టుల

లోను, లిథుయేనియన్లలోను, స్లావ్ ప్రజలలోను కనిపిస్తాయి."
(పేజి 470; మాస్కో 1947వ కూర్పు)

ప్రకృతిశక్తులుమాత్రమే ప్రతిబింబించిన యీ మొట్ట మొదటి పరిణామక్రమం త్వరలోనే సామాజిక శక్తులు కూడా ప్రతిబింబించిన పరిణామ క్రమంతో కలిసింది. ఏంగెల్స యిలా వ్రాశాడు :

"అనతికాలంలోనే ప్రకృతిశక్తులతో బాటు సామాజికశక్తులుకూడా పనిచేయ నారంభించాయి. ఇవి ప్రకృతి శక్తుల మాదిరిగా అంత అగమ్యగోచరంగానూ అంత మానవాతీతమైనవిగానూ మొదట కనిపించేవి; మానవునికి అవి అంత అవసరంగానూ కనబడి అధికారం చెలాయించేవి. మొదట్లో ప్రకృతిశక్తుల్నిమాత్రమే ప్రతిబింబిస్తూ వచ్చిన ఊహాత్మక రూపచిత్రాలకు యీ దశలో సామాజిక లక్షణాలు వచ్చాయి. చారిత్రక శక్తులకు ప్రతినిధులుగా అవి రూపొందాయి."

(పై గ్రంథంనుంచే : పేజి 470-71).

బూర్జువా పండితులు వేద వాఙ్మయాన్ని పరిశీలించడంలో యింతవరకు మొదటి పరిణామదశకు మాత్రమే అత్యంత ప్రాముఖ్యత నిచ్చి, రెండవదశను ఉపేక్షించారు. పౌరాణిక గాథలలోని దేవతల సామాజిక లక్షణాలను, వారి కార్యకలాపాలను సరిగా పరిశీలించినట్లైతే, వాటి ఊహాకల్పిత రూపాలను మినహాయించినప్పుడు ఆదిమ కమ్యూనిస్టుసమాజం యొక్క చిత్రం మనకు కనబడుతుంది. దీన్ని ఏంగెల్స తన కాలంలో గమనించాడు. అతడిలా వ్రాశాడు :

"తర్వాత దశలో దేవతలకుండే యీ ద్వంద్వ స్వభావాన్ని పౌరాణిక గాథలు విస్మరిస్తున్నాయి. ప్రకృతిశక్తుల ప్రతిబింబాలుగా రూపొందిన దేవతల లక్షణానికే అవి ప్రత్యేకప్రాధాన్యత నిచ్చాయి. పౌరాణిక గాథలలో తర్వాత ప్రవేశించిన గందరగోళానికిమూలకారణం యీద్వంద్వస్వభావాన్ని గుర్తించకపోవడమే." (పై గ్రంథంనుంచే: పేజీ471).

ఇట్టి "ప్రత్యేక ప్రాధాన్యత" యివ్వడంవల్లనే చాలామంది యూరపియన్ రచయితలు, భారతీయ రచయితలు వాస్తవాన్ని చిత్రించడంలో విఫలులయారు.

నేను వేదవాఙ్మయంలోని పౌరాణిక గాథలద్వారాను, దేవతావర్ణనలద్వారాను వారి సమిష్టి సామాజిక వ్యవస్థను వివరించడానికి పూనుకున్నాను. ఇందుకు కారణ మేమంటే, మార్క్స్ చెప్పినట్లు "పౌరాణిక గాథలన్నీ ప్రకృతి శక్తులకు ఊహలలోను, ఊహలద్వారాను స్వరూపమిచ్చి వాటిమీద అధికారంచేస్తాయి". మానవ జీవితంయొక్క సాంఘికావసరాలనుంచే యీ ఊహలు ఉత్పన్నమవుతాయి. ఏసామాజిక వ్యవస్థలో యివి రూపొందుతాయో, ఆ సామాజిక వ్యవస్థ యొక్క చిత్రాన్నికూడా అవి మన ముందుంచుతాయి. ఈ విధంగా అవి ఆర్యన్ గణాలనుగురించి తెలుసుకోవడంలో మనకు సహాయం చేస్తాయి.

అయితే ఒక విషయం జ్ఞాపకముంచుకోవాలి. యజ్ఞాలు దేవతలు, పురాణగాథలు, మంత్రాలు వీటికి సంబంధించిన ఆధారాలన్నిటికీ నిర్దిష్టమైన అర్థం ఉన్నదనుకోవడం పొర

బాటు. వాటిలో కొన్ని వట్టికల్పన. ఈ సందర్భంలో ఏంగెల్స్ యిలా వ్రాశాడు :

"తాత్విక రంగానికి చెందిన మతము, తత్వశాస్త్రము మొదలైనవి మూలానికి మరింతదూరంగా ఉంటూఉంటాయి. మనం శుద్ధకల్పనగా భావించే కొన్నివిషయాలకు ఏదో ఒక మూలం ఆదిమకాలంలో లేకపోలేదు. ప్రకృతినిగురించిన, మానవజీవితాన్నిగురించిన వికృత భావాలకూ, దయ్యాలు, మంత్రాలనుగురించివ నమ్మికలకూ ఆనాటి ఆర్థికహీనస్థితియే ప్రాతిపదిక. అయితే, ఆదిమకాలంలోని యీఆర్థికహీనస్థితికి ప్రకృతినిగూర్చిన వికృతభావాలు సహాయపడ్డాయి; అంతే గాక యివే ఆ హీనస్థితికి కారణాలుగా ఉంటూ కొంతవరకు దానిని నిర్ణయించేవికూడా. ప్రకృతిని గురించి మానవుని విజ్ఞానం క్రమక్రమంగా పెంపొందడానికి ఆర్థికావశ్యకతే చోదకశక్తిగా ఉంటుంది; ముందుముందు యిది మరింత వాస్తవం. అయితే, ఆదిమకాలంనాటి చెత్తభావాలన్నిటికీ ఏదో ఒక ఆర్థికకారణం ఉండితీరాలని వాదించడం డాంబిక మనిపించుకొంటుంది." (మార్క్స్-ఏంగెల్స్ ఉత్తర ప్రత్యుత్తరాలు; పేజీ 452 మార్టిన్ లారెన్స్ 1934 కూర్పు)

మనం యీ చెత్తంతా వదలివేసి, అనాగరిక ఆదిమ ఆర్యుని గణజీవిత మెలా ఉండేదో, అతని సత్ర-క్రతు కర్మ లెలా ఉండేవో తెలుసుకోడానికి ప్రయత్నిద్దాం.

# అయిదో అధ్యాయం

## గణము - గోత్రము

(ఆర్యగణముల సామాజిక ఆర్థిక కుటుంబ నిర్మాణము)

నిప్పును కనిపెట్టడం, పశువులను మచ్చికచేయడం, ఈ రెంటి మూలకంగా ఆర్యులు నిత్యమూ ప్రకృతిశక్తులపై పోరాటంలో తాము నశించిపోయే విపత్కర పరిస్థితులు గణ జీవితంనుంచి తొలగిపోయినవి. ఉత్పత్తిశక్తులు రోజురోజుకూ అభివృద్ధి అవుతున్నవి; ఐనప్పటికీ అవింకా మొరటుగానే ఉండటంచేత దరిద్రమూ, అధికమైన శ్రమా తప్పడంలేదు. సత్రయజ్ఞ విధాయకమైన శ్రమవల్ల ఉత్పత్తియైనదంతా వెంటనే అనుభవంకొరకే సరిపొయ్యేది. వ్యక్తి శ్రమద్వారా కావలసినదానికన్నా అదనంగా ఉత్పత్తికాగలస్థితికి ఉత్పత్తి పరికరాలు అభివృద్ధికాలేదు. అదనం అంటే చావకుండా బ్రతకడానికి కనీసంగా అవసరమైనంత అని. కాబట్టి, మానవుడు తన శ్రమవల్ల తన అనుభవానికి అవసరమైనదానికన్నా అదనంగా ఉత్పత్తిచేయగలడనే విషయం వారి కింకా తెలియదు. మానవుని శ్రమశక్తివలన అదనంగా ఉత్పత్తిచేయడంగానీ, శ్రమచేయకుండానే బ్రతుకు సాగించడంగానీ, ఒకరు

మరొకరి శ్రమ నుపయోగించుకుని బ్రతకడంగానీ యెవ్వరికీ తెలియదు. నాటి గణముయొక్క ఉత్పత్తి నైపుణ్యాపరిస్థితులు ఆ దశలో ఉన్నాయి. కాని పశువుల పెంపకమూ, యితర నూతనాధారాలూ అభివృద్ధి అవుతూ ఉండటంవలన, యిలా నోటికీ చేతికీ అందీ అందకుండా ఉండే పరిస్థితులు శీఘ్రంగా మారిపోతూవచ్చినవి. అయితే యీ పరిస్థితులలో ఒకరు మరొకరి శ్రమమీద బ్రతుకుదామనే భావమే పుట్టలేదు. ఉత్పత్తి శక్తులు అలాంటిభావం కలగడాని కవకాశ మీయలేదు.

ఉత్పత్తిపరికరాలు వెనుకబడివుండటంవల్ల కలిగిన మరొక ఫలిత మేమంటే; ఆనాటి ప్రాథమికదశలో అదనంగా ఉత్పత్తిచేయడంగాని, అనేక రకాల వస్తువులను ఉత్పత్తి చేయడంగానీ ఉండేదికాదు. అందువల్ల ఉత్పత్తి చేయబడిన దంతా నేరుగా అనుభవంలోకి పొయ్యేది. ఉత్పత్తియైన వస్తువులపైన ఉత్పత్తిదారులదే కంట్రోలు; అవి వారిదగ్గర ఉండేవి. మారకం లేదుకాబట్టి మార్కెట్టూ, డబ్బూ మొదలైనవాటికి సంబంధించిన గారడీ రహస్యాలు వా రెరుగరు. ఉత్పత్తికీ వస్తు సమీకరణకూ స్థానమైన మహావేదీ, వివిధ ఆవరణలూ, పచ్చికబయళ్ళూ కల గణ నివాసమూ దాని మధ్య ప్రతిష్ఠింపబడిన అగ్ని-యివీ గణంయొక్క ప్రపంచమంతా. దీనిని దాటితే చుట్టూ వాతావరణమంతా శత్రుత్వమూ, దుష్టత్వమూనూ.

ఈ దశలో ఉత్పత్తిపరికరాలు వెనుకబడి యుండుట వలన గణసభ్యులమధ్య శ్రమవిభజనకు అవకాశం లేదు. అతి ప్రాచీనకాలపు సత్రయజ్ఞంలోని శ్రమవిభజన తాత్కాలికమైనది. కాని స్థిరమైనటువంటి శాశ్వతమైనటువంటి ఆర్థిక

ప్రయోజనంగా రూపొందలేదు. అందువల్ల ఆదిమగణ సంఘములో వర్ణవిభాగంకానీ, వర్గవిభాగంగానీ లేదు. ఒక నివాస ప్రదేశంలో నివసించే సభ్యులందరూ కలిసి గణం యేర్పడుతుంది. గణసభ్యులపేరు విశస్సులు. గణంయొక్క సభ్యత్వం చాలా చిన్నది. కాబట్టి శాశ్వతమైన శ్రమవిభజన అనేది సాధ్యపడలేదు. తగినంత జనాభా పెరిగితేనేకాని సమాజంలో శ్రమవిభజన సాధ్యపడదు. అందువల్ల సత్రసమాజంలో లేక ఆదిమార్యగణంలో వర్ణవిభజన లేకపోయింది. వర్ణత్రయమనీ, వర్ణచతుష్టయమనీ తరువాత యేర్పడినవే.

ఆర్యుల సమాజంలో ఒకానొక అభివృద్ధిదశగా వర్ణాలేర్పడినవనీ, మొదటవర్ణాలుండేవి కావనీ అందరూ ఒప్పుకున్న విషయమే. అందువల్ల దానిని గురించి చర్చించవలసిన పనిలేదు. అంతేకాక వర్ణవిభాగం శ్రమవిభజన రూపంలో వచ్చినదనికూడా అందరూ ఒప్పుకున్నదే. వర్ణవిభజన యెలావచ్చిందీ అనేవిషయం తరువాత విచారిద్దాం.

అయితే యిక్కడ మొదట నిప్పును కనిపెట్టడానికీ తరవాత పశువులను మచ్చికచేయడం నేర్వడానికీ మధ్య కొంత కాలవ్యవధి ఉన్నదని గుర్తించాలి. కాని పశువులను మచ్చిక చేయడం దగ్గరనుంచి మారకము, శ్రమవిభజన, వర్ణవ్యవస్థ, తదనుగుణమైన సామాజిక నిర్మాణ పరిణామాలన్నీ రావడం శీఘ్రగతిని జరిగింది. అప్పటినుంచీ ఆర్యగణం శీఘ్రపరిణామాన్ని పొందింది.

సమిష్టిగా శ్రమచేస్తూ, సమిష్టిగా అనుభవిస్తూ అగ్ని చుట్టూ జీవితాన్ని నిర్మించుకున్న సత్రయజ్ఞంనాటి ఆదిమ

గణాన్ని చూచాం. నాటి గణజీవితం ఒక విధంగాచూస్తే నేడు భారతదేశంలోని కొన్ని గ్రామాల్లో అవుపడే పెద్ద కుటుంబాల్లోని జీవితమూ, పనిపాటల విధానం లాగానే ఉండేది. అయితే నేటి కుటుంబాల్లో ఇంటిపెద్దల కుండే అధికారంగానీ, ఇన్నిరకాల శ్రమకానీ నాటిగణాల్లో ఉండేవి కావు. శ్రమవిభజన అనేది ఉంటే స్త్రీ పురుషులమధ్యమాత్ర ముండేది. వేటాడటం, పశువులను మేపడం, యుద్ధాలు చేయడం పురుషులపనియైతే ఆహారం వండటం, పాలుపితకడం, గణనివాస ప్రదేశంచుట్టూ ధాన్యం పెంచడం, ఇల్లు దిద్దడం మొదలైనవి స్త్రీల పనులుగా ఉండేవి. ఇద్దరిశ్రమా సామాజికమైన సమిష్టిశ్రమయే. సమిష్టిగా చేస్తారు. సమిష్టి యనే భావిస్తారుకూడా. ప్రైవేటు కుటుంబం అనేది లేదు. స్త్రీ పురుషులమధ్య హెచ్చుతగ్గు అంతస్తుల భేదం లేదు.

గణం చిన్నది; శ్రమవైవిధ్యమూ, శ్రమవిభజనా, మారకమూ, దోపిడీచేసేవారూ - చేయబడేవారూ, ధనవంతులూ-దరిద్రులూ అనే వర్గవిభజనా, ఇలాంటివి గణంలో ఉండేవి కావు. అందువల్ల అందరి ప్రయోజనాలూ కాపాడుటకని పైకిచెప్తూ, నిజానికి దోపిడీదారుల ప్రయోజనాలను మాత్రమే కాపాడటానికి సంఘానికతీతంగా ఉన్నామంటూ, సంఘాన్ని శాసించే అధికారవర్గ నిర్మాణంయొక్క అవసరం లేకపోయింది. కాబట్టి అలాంటిది ఇంకా రాలేదు. వర్గాధికార సాధనమైన రాజ్యాంగయంత్రముకానీ, సైన్యమూ పోలీసు సిబ్బందులుకానీ, పన్నులు వసూలు చేయడంకానీ ఉండేవి కావు. గణ సమాజానికి అలాంటియంత్రం యొక్క అవసరం లేకపోయింది.

అయితే అలాంటప్పుడు గణసంఘంయొక్క అంతరంగిక విధానమూ, పైనుంచి వచ్చే దాడినుంచి రక్షించుకునే విధానమూ యెలా వుండేవి ? ప్రాచీన హైందవార్య గ్రంథకారులు ఈసమస్య ప్రసక్తి తెచ్చి సమాధానాలిచ్చారుకూడా.

గణ సంఘాలలోని ఆంతరంగిక నిర్మాణమూ, అది కొనసాగడానికి అవసరమైన వ్యక్తిగత నడవడీ, గణానికీ వ్యక్తులకూ మధ్య సంబంధాలూ, వాటిని ఉల్లంఘించడం, అందుకు శిక్షలు విధించడం, ఆ శిక్షలను అమలుపరచే శక్తీ, అధికారమూ, డబ్బు మొదలైన వాటినిగురించి వేదవాఙ్మయంలో ఎక్కడా సమస్యలరూపంలో ప్రస్తావించబడలేదు. ఈసంగతిని వేదపండితులూ, పతితలూ అందరూ ఎరుగుదురు. వేదచర్చలన్నీ సృష్టినిగురించీ, విశ్వంయొక్క పుట్టుకను గురించీ, మనుష్యుడూ, అగ్ని, పశుధనం వీటిని గురించీ జరిపిన చర్చలే. తరువాతపుట్టిన బ్రాహ్మణాలలో మాత్రమే అధికారమూ, సాంఘిక నీతి నియమాలూ, నడవడికలనుగురించి వ్రాయబడినది. ప్రాచీన వేదవాఙ్మయంలో పోరాటాలు, యుద్ధాలూ, వాటి ఫలితాలను గురించి కూడా చర్చింపబడినది. సాంఘిక నీతినియమాల్లో ఒక్క అంశాన్ని గురించి మాత్రమే అంటే స్త్రీ పురుష కామసంబంధాలను గురించి మాత్రమే వేదాలో అక్కడక్కడా అవుపడుతుంది. రాజు, రాజ్యాంగయంత్ర పాలకులూ, పాలితులూ, వ్యక్తుల హక్కులూ, విధయిలాంటి వెన్నడూ వివాదాంశాలుగా ఉండలేదు.

ఈ ప్రాచీన ఆర్యగణ నిర్మాణ విధానానికీ, తరువాత ఆర్యసమాజ నిర్మాణ విధానానికీ గల భేదాన్ని ప్రాచీన

వాజ్మయం తరువాతనాటి గ్రంథకర్తలు గుర్తించారు. ప్రాచీన వేదవాజ్మయ కాలం తరువాత గణాలు విచ్ఛిన్నమైనవి; వర్గ రాజ్యాంగయంత్రాలు అమల్లోకివచ్చినవి,కొత్తరకంయుద్ధాలు అంటే అంతర్యుద్ధాలు వచ్చినవి. వాటితోపాటు ఆంత రంగిక నిర్మాణానికి సంబంధించిన కొత్త సమస్యలు అనగా రాజ్యాంగ బలగమూ, పన్నులూ, న్యాయచట్టమూ, నీతి నియమాలూ మొదలైనవి తలయెత్తినవి. ఈ విషయాలు వేద వాజ్మయంలోకన్నా ఇతిహాసాల్లోనూ — ముఖ్యంగా మహా భారతంలోనూ,స్మృతుల్లోనూ ప్రధానవిషయాలుగా చర్చింప బడినవి. వాటిలోని పాత కొత్తల తారతమ్యాన్ని గురించిన చర్చల నుంచి ఆదిమ గణాలయొక్క ఆంతరంగిక నిర్మాణం మెలావుండేదీ తెలుసుకో వచ్చును. నాటి ఉత్పత్తిశక్తుల అభి వృద్ధిని అనుసరించి ఆ గణాల ఆంతరంగిక నిర్మాణం పనిచేసేదని స్పష్టంగా, సమగ్రంగా సమాధానాలు దొరుకుతాయి.

ఆదిమార్య కమ్యూనిస్టు సమాజ నిర్మాణం గణ నిర్మా ణంగా ఉండేదని వెనుక త్రిరాత్ర క్రతు విధానాన్ని పరిశీలించే టప్పుడు చూచాం. ఏంగెల్స్ మాటల్లో చెప్పాలంటే ప్రత్యేక అధికారవర్గముయొక్క ఆజ్ఞలతో నిమిత్తం లేకుండానే "దానంతట అది పనిచేసే సాయుధ ప్రజా సమాజ నిర్మాణమే" సమాజ నిర్మాణ మనవచ్చును. ప్రత్యేకంగా బల హాగం చేసే రాజ్యాంగయంత్ర మొకటియుండి,తద్వారా ాజ వ్యవహారాలనన్నిటినీ కంట్రోలు చేయడమనేది లేదు. టుఆస్తిపై ఆధారపడిన పరస్పర విరోధ వర్గాలుగా ాజము విభాగమై యుండకపోవడమే అందుకు కారణము.

ప్రకృతి పరిస్థితుల ఒత్తిడీ, గణంలోని సభ్యులయొక్క అభిప్రాయమూ కలసి, ప్రతివారూ తాము నిర్వర్తించవలసిన సామాజిక విధికి కట్టుబడియుండునట్లు చేసినవి. ఏమైనా పొరపాటులుంటే బహిరంగంగా మందలించడం ద్వారా సరిదిద్దబడేవి. గణంలో ఒక సభ్యుడు మరొకసభ్యుణ్ణి చంపడంలాంటి మహాపరాధం జరిగినప్పుడు అపరాధిని గణంలోనుంచి వెళ్ళగొట్టేవారు. నాటి ఆటవిక జీవితంలో గణంలోనుంచి వెళ్ళగొట్టడమంటే మృత్యువునోటికి అందించడమే. అందువల్ల అది కఠినాతికఠినమైన శిక్షన్నమాట. సైనికబలగమూ, శాసనాల నమలుపరచే కరడుకట్టిన అధికారవర్గమూ లేదుకాబట్టి పన్నుల విధానముకూడా ఉండేదికాదు. సమిష్టివిధానంలో గణసభ్యులచేత ఎన్నుకొనబడిన వ్యవహర్త నేరుగా ఉత్పత్తి చేయకపోయినప్పటికీ, శ్రమవిభానంలో భాగస్వామిగా ఉంటాడుకాబట్టి, అతనికి సమిష్టిగా ఉత్పత్తి చేసినదానిలో నుంచే భాగ మిస్తారు. వృద్ధులను, పసిబిడ్డలనుకూడా పని చేయనవసరంలేకుండానే పోషిస్తారు.

గణంలో సభ్యత్వ అర్హతలను యెలా నిర్ణయిస్తారు? వర్గరాజ్యాంగంలోనూ, సోషలిజంలోనూ నిశ్చితమైన సరిహద్దులుగల భూభాగానికి వర్తించే రాజ్యాంగచట్టానికి కట్టుబడి, ఆ భూభాగంలో స్థిరనివాసం కలవారు పౌరులుగా గుర్తించబడతారు. కాని ఒక రాజ్యాంగ చట్టముక్రిందకు వచ్చే ప్రాదేశిక నిర్మాణానికి గణము కట్టుబడియుండదు. బంధువులు లేక రక్తసంబంధీకులే గణంలో సభ్యులుగా ఉండటానికి అర్హులు.

అందుచేత, యజ్ఞవిధాయకమైన ఉత్పత్తిని సాగించే వేదకాల సమాజనిర్మాణం గణవ్యవస్థా రూపంలో ఉంటుంది. అందులో సభ్యులంతా రక్తబంధువులు. అది సమిష్టి ఆస్తి పైనా, ప్రాథమికదశలో సమిష్టిశ్రమపైనా ఆధారపడి యున్నది. వర్గవిభజన, వర్ణవిభజన, రాజు, రాజ్యాంగ యంత్రము, దోచుకునేవారు-దోపిడీ చేయబడేవారనే భేదములు గణ సమాజంలో లేవు. గణము ఆత్మప్రవర్తకమైన సాయుధ ప్రజావ్యవస్థ.

తరువాతకాలపు హిందూమత గ్రంథాలలో గణ సమాజాన్ని పై విధంగానే వర్ణించారు. వేదకాలపు దేవతలూ, మనుష్యులూ గణాలుగా జీవించారు.

ఈ గణనిర్మాణానికి, తరవాత వచ్చిన రాజ్యాంగ యంత్రం, రాజులు, వర్ణవిభేదాలు, అంతర్యుద్ధాలు మొదలైనవాటితో కూడుకొనియున్న సంఘనిర్మాణానికీ విపరీతమైన వ్యత్యాసం ఉన్నది. అందువలన ప్రతివారూ యీ మార్పు యెలా సంభవించిందో తెలుసుకోవాలని కుతూహల పడతారు. సమాధానాలుగా వచ్చిన కారణాంశాలు పూర్తిగా సరియైనవి కాకపోయినప్పటికీ సరియైన కారణాలకు దారిచూపేవిగా ఉన్నవి.

మహాభారతంలో క్రొత్తగా అమల్లోకివచ్చిన ఆచరణయేదైనా పాత ఆచారంతో పొసగనప్పుడు యిది యెలాగని కురువంశ పితామహులైన భీష్ముణ్ణి ప్రశ్నించేవారు. మహాభారతంలోని పాండవులూ, కౌరవులూ రక్తబంధువులూ, దాయాదులూను. పాండవులు కౌరవులను ఓడించారు. పాండవుల నాయకుడైన ధర్మరాజు భీష్ముణ్ణి ఇలాఅడిగాడు. "మామూలు

గానే కాళ్ళూ చేతులూ కలవాడూ, అందరిమాదిరే చచ్చి పోయేవాడూ అయిన సామాన్య మానవుడొకడు వ్యక్తి గతంగా తనకన్నా బలవంతులైనవాళ్ళూ, తెలివిగలవాళ్ళూ అయినవారికి రాజై పరిపాలించగలగడానికి కారణ మేమిటి? అతనికా శక్తి యెలా వచ్చింది.''*

ఇందుకు సమాధానంగా భీష్ముడు తనకు తెలిసినంత వరకు రాజ్యాంగయంత్రంయొక్క పుట్టుకను గురించి చెప్పాడు. ఆయన చెప్పినదానిలో ముఖ్యాంశ మేమంటే: "రాజ్యము కానీ, రాజుకానీ లేనటువంటి రోజులుకొన్ని వుండేవనేదే (ఇక్కడ రాజన్ అంటే రాజ్యము అని అర్థం). కృతయుగం లోనో, అంతకుముందో "రాజ్యముగానీ, రాజుగానీ; దండించే వాడుగానీ, దండింపబడేవాడుగానీ వుండేవారు కారు (రాజ్యాంగయంత్రమూ లేదు. దోపిడీ చేయబడేవారూ లేరు). ప్రజలు పరస్పరం రక్షించుకునేవారు. అది వారి జీవిత ధర్మంగా ఉండేది.'' "వారి పొరపాట్లు బహిరంగంగా మంద

* సమాన జన్మమరణః, సమః సర్వైర్గుణైర్నృణామ్
విశిష్ట బుద్ధీన్ శూరాంశ్చ కథమేకోధితిష్ఠతి॥ శాంతి 58-8
నైవరాజ్యం న రాజాఽసీన్నచ దండో న దాండికః
ధర్మేణైవ ప్రజాః సర్వా రక్షంతి స్మ పరస్పరమ్॥ 58-14
శ్రూయం తే హి పురాణేషు ప్రజా దిగ్దండశాసనాః॥ 300-8
పాల్యమాన స్తథాన్యోన్యమ్ పరస్పరభావయుతః
పురాదిగ్దండ ఏవా సీద్ - వధదణ్డోఽద్యవర్తతే॥ 273-19
సంహత్య ధర్మం చరతాం పురాసీత్సుఖమేవ తత్
తేషాం నాసీద్విఘాతవ్యం ప్రాయశ్చిత్తం కథంచన। 276-12

ప్రాచీన గణసమాజంయొక్క ఆంతరంగిక నిర్మాణ వ్యవహారలక్షణా లను ఈ శ్లోకాలు క్రోడీకరిస్తున్నవి.

లించడంద్వారా సరిదిద్దబడేవి'' అని మరోచోట చెప్పాడు. అంతరంగికంగా పోటీలూ, ఆస్తిని కూడబెట్టదామనే పేరాశ ఐకమత్యం చెడిపోవటం యివి గణసమాజా న్నెదుర్కొనే ముఖ్యమైన విపత్తు లన్నారు. "కులమూ, కుదురూ, రక్త స్పర్శల్లో సమానులు"♦ అంటూ వారి పరస్పర సంబంధాల లక్షణాన్ని వివరించారు. అంతర్యుద్ధం గణ నియమాన్ని నాశనం చేస్తుంది. రక్తబంధుత్వాన్నీ, దానివల్ల వచ్చే బాధ్యతలనూ గుర్తించకపోవడం చాలా ముఖ్యమైన నియమోల్లంఘనము. ♦♦

కృతయుగ కాలంనాటి గణాలలో వారు నాదీ-నీదీ అనే భేదాన్ని పాటించ లేదు అని గ్రంథకర్తలందరూ చెప్పారు. ఇది ఒక గాథ. అయితే ఈ గాథకు ఆదిమయుగపు సమిష్టి గణ జీవితం పునాది. నిజానికి మహాసామ్రాజ్య నిర్మాతా, రాజరిక నిరంకుశ రాజ్యాంగయంత్ర సంస్థాపకుడూ అయిన కౌటిల్యుడు గణాలు (తైత్తిరీయ బ్రాహ్మణములో చెప్పబడినట్లు) వైరాజ్యములనీ, వాటిలో ఎవరికీ నాదీ నీదీ అనే భావముండేదికాదనీ పేర్కొన్నాడు. ఆధునిక బూర్జువా వర్గాలు నేటి సోషలిజాన్ని గురించి ఆడిపోస్తున్నట్లే, నాటికౌటిల్యుడుకూడా వైరాజ్యంలో అంటే రాజు లేనిరాజ్యంలో పౌరుడుతనప్రభుత్వాన్నీ, దేశాన్ని పరుల కమ్మివేశేవాడనీ, ప్రభుత్వమంటేనూ, దేశమంటేనూ

---

♦జాత్యా చ సదృశాస్సర్వే కులేన సదృశాస్తథా॥ శాంతి 107-31

♦♦ [illegible] నాభ్యజానన్తి [illegible] కార్యే॥ [illegible] 58-19.

యెవరికీ బాధ్యత వుండదనీ" ఆడిపోశాడు.* ఇలా ప్రాచీన యుగపు ప్రజాతంత్రాన్ని నాశనం చేసినవాళ్లు దానిని పతిత మైనదని ఒకవేపు దూషిస్తూనే మరోవైపు దాని ఆంతరంగిక మైన ఐక్యతనూ, అందువల్ల శత్రువును ప్రతిఘటించడానికిగల బలాన్నిచూచి భయపడేవారు. వర్గరాజ్యాంగ యంత్రము యొక్క, ప్రైవేటు ఆస్తియొక్క వర్గాభిమాన దృక్పథం కళ్ళ కెక్కి ఉండటంవలన గణసమాజ మెలా జీవితం గడుపు తూండేదో అర్థం చేసుకోలేక పోయినారు. గణ సమాజం బ్రతికింది-బాగా బ్రతికింది కూడా. పైన పేర్కొనబడిన వర్గ పక్షపాతులు చెప్పినవన్నీ స్వవచన వ్యాఘాతాలే. కొందరు మాత్రం భీష్ముడివలె గణజీవితాన్ని గురించి ఉన్న వాస్త వాన్ని ఒప్పుకోవలసి వచ్చింది.

గణనిర్మాణమూ, రక్తబంధుత్వమూ సమానార్థకాలు. ఇవి గణముయొక్క ఉత్పత్త్యర్థములోనె ఇమిడివున్నవి. ఇండో ఆర్యులుచీలి వలసపోకముందు, తమ మొదటి నివాసప్రదేశంలో ఉన్న రోజుల్లోనే గణమని అర్థమిచ్చే ధాతురూపం భాషలో ఏర్పడినది. స్మృతులకాలంలో గణశబ్దం ఒకవిధమైనరాజకీయ నిర్మాణార్థంలో వాడబడినది. వేదాల్లోనూ, మహాభారతం లోనూ, స్మృతుల్లోనూ వాడబడిన "గణ" శబ్దము యజ్ఞశబ్దము

---

*వైరాజ్యంతు జీవితః పరస్యాచ్ఛిద్య 'న ఏతన్మమ' ఇతి మన్యమానః కర్షయతి, అపవాహయతి, పణ్యం వా కరోతి, విరక్తం వా పరిత్యజ్య అపగచ్ఛతి యితి॥ (కౌటిల్యుడు అర్థశాస్త్రం 8-2)

ప్రైవేటు, ఆస్తి యాజమాన్యములేని రాజ్యాంగము "అరాజకము" అని నిర్వచింపబడినది.

"న హి విత్తేషు ప్రభుత్వం కస్యచిత్తదా॥" (శాంతి : 48-71)

వలెనే "జన" అనే సంస్కృత ధాతువునుంచి పుట్టినది. దీనికి 'కనుట', 'ఉత్పత్తి' చేయుట అని అర్థము. ఈఅర్థము సంపదకు సంబంధించినది. స్త్రీ పురుష సంబంధానికి చెందినదికూడా. ఇలా ఆర్యులు సామాజిక, ఆర్థిక, లింగ (స్త్రీ పురుష సంబంధములు) సంబంధాలకు మూటికీ ఒకే ధాతు శబ్దాన్ని వాడారు. యజ్ఞవిధాయకమైన ఉత్పత్తి విధానం గణసమాజ వ్యవస్థతో కట్టుబడిఉన్నది. గణంలో ఉండేవాళ్ళందరూ రక్తబంధువులు. (జన) అంటే అగ్నిచుట్టూ యజ్ఞవిధాయకమైన జీవితంలో పుట్టి సంతానాన్ని, సంపదనూ సమిష్టిగా ఉత్పత్తిచేసే స్త్రీ పురుషులు అని అర్థము.

ఈ సందర్భంలో మార్గన్ను ఉదహరిస్తూ ఏంగెల్స్ ఇలా వ్రాశాడు :

"ఈ స్త్రీపురుషుల సమాజనిర్మాణాన్ని వర్ణిస్తూ మోర్గన్ వాడిన 'జెన్స్'అనే లాటిన్ శబ్దము దానికి సమానార్థకమైన 'జెనోస్' అనే గ్రీకుశబ్దములోనుంచి పుట్టినది. ఈ 'జెన్స్' 'జెనోస్' అనే రెండుశబ్దాలు 'కనుట'అనే అర్థంకల సంస్కృత ధాతువు'జన్'లోనుంచి పుట్టినవి.'జన్'జెనోస్, సంస్కృతంలో జన, గోథిక్ 'కూని' ప్రాచీనకాలపు నార్సు, ఆంగ్లో శాక్జన్ పదము 'కైన్', ఇంగ్లీషు 'కిన్', మిడిల్ హైజర్మన్ 'కనే' అనే శబ్దాలన్నీ వంశానుక్రమణికను సూచిస్తాయి. లాటిన్‌లో జెన్స్, గ్రీకులో జెనోస్ (ఈరెంటికీ గణ-గోత్రశబ్దాన్నికూడా చేర్చుతున్నాను-డాంగే) ఈ శబ్దాలు ఒకే మూలపురుషుడి వంశస్థులమని చెప్పుకుంటూ, కొన్ని ప్రత్యేక సామాజిక, మత విషయక నియమాలవల్ల ప్రత్యేక వ్యవస్థగా ఐక్యమైన స్త్రీ

పురుష సంఘ నిర్మాణమును సూచిస్తాయి," (ఏంగెల్స్ - కుటుంబం పుట్టుపూర్వోత్తరాలు)

ఆర్యుల ప్రాచీన సంఘవ్యవస్థ రక్తబంధుత్వముమీద ఆధారపడినదనీ, ఆ వ్యవస్థయే తరువాత ఏర్పడిన "జాతుల (Nations)కు" పునాదియనీ ఆర్య గ్రంథకారులు పదే పదే అనేకవిధాలుగా సూచించారు. భారతదేశంలో సగభాగానికి మించి ఆక్రమించిన ప్రసిద్ధమైన తెగలు పది. ఈ పదీకూడా బంధుగణాలేనని చెప్పబడుతున్నది. యయాతి అనే ఒక్క తండ్రికి దేవయాని, శర్మిష్ట అనే యిద్దరు భార్యలవలన యదు, తూర్వస, దృహ్యు, అను, పురు అనే అయిదుగురు పురుష సంతానం కలిగిందనీ, ఈ ఐదుగురి పేర్లతో పిలువబడేవే యదు, తూర్వస, దృహ్యు, అను, పురు అనే అయిదు గణాలు అనీ ఋజువు చేయబడినది. తూర్పు ఆగ్నేయ భారతదేశానికి చెందిన అంగ, వంగ, కళింగ, పుండ్ర, శుంహ అనే అయిదు తెగలూ బలిచక్రవర్తి భార్యకు దీర్ఘతమస్సు డను అంధఋషి ద్వారా పుట్టిన కుమారుల పేరిటివని చెప్పబడుతున్నది. అంటే వీరంతా ఒకేవిధమైన ఆర్థిక సామాజిక సంబంధాలను కలిగియుండడమే కాకుండా రక్తబంధువులు కూడానని గుర్తించాలి.

ఈవిధంగా ఉత్పత్తిసంబంధాలూ, రక్తబంధుత్వమూ ఒకటిగానేవున్న ప్రాచీన సముష్టి జీవనపరిస్థితులలో నివసించిన ప్రజల వ్యవస్థయే గణసమాజ నిర్మాణము.

ఈ విషయాన్నే అతి సన్నిహితమైన బంధుత్వాన్ని సూచించే పేర్లవలన కూడా తెలుసుకోనవచ్చును. తల్లి,

కూతురు, తండ్రి, భార్య, భర్త అనే పేర్లలో రక్తబంధుత్వమే కాక ఆర్యగణములోని ఆర్థిక సంబంధాలు కూడా సూచిత మౌతున్నవి.

ఆహారాన్నీ, మాంసాన్నీ మొదలైనవాటిని పంచ డమూ, బిడ్డలను కనడం మాతృ (తల్లి) యొక్క పని. మాతృ (మా = కొలుచుట). ఆహారము వలన, తల్లివలన బ్రహ్మ అంటే గణము జీవిస్తుంది; వృద్ధిపొందుతుంది. (పి-పా-తృ) పితృ (తండ్రి)యొక్క పని వేటాడటం, రక్షణచేయడమూనూ (పా=రక్షించుట). (దుహి—తృ)కూతురు ఆహారాన్ని సప్లయి చేయడంలో తల్లికి తోడుగా అతి ప్రధానమైన పాలుపితికే పనిని చేస్తుంది (దుహ్=పాలు పితుకుట). పతి పత్ని వీరిద్దరూ సంతానాన్ని కనటంలో తల్లిదండ్రులౌతారు. కామసంబం ధాలను బట్టి యీ రెండు పదాలు ఒకచోటకు చేర్చుట జన పదాన్ని నిర్మించుట అనే అర్థాన్ని సూచిస్తాయి. ఈ పదం 'స్త్రాయి' అనే శబ్దంలో నుంచి వచ్చింది. 'స్త్రాయి' అంటే ఒక చోటకు చేర్చుట అని అర్థము. దేనిని ఒకచోటకు చేర్చుట? జనపదాన్ని లేక గణాన్ని. ఇదే తరువాత కుటుంబం అనే అర్థంలోకి వచ్చినది.* పస్త్రృ, స్త్రీ, పత్ని యివి అన్నీ గణంలో ఉండే స్త్రీ పురుషుల నందరినీ సూచించే శబ్దాలు. ఆర్యులు స్త్రీ పురుషులకు వారి వారి సామాజిక ఆర్థిక విధులతో పాటు వారి వారి లింగ సంబంధాలను (Sex relation) సూచించడానికి విడివిడిగా శబ్దాలను నిర్ణయించుకొనక పూర్వమే 'స్త్రాయి' శబ్దము ఉండివుంటుంది. అందువల్లనే వ్యక్తిగత(ప్రైవేటు) కుటుంబం

---

* అపస్త్యాయతే సంఘాతీ భవతి పస్త్యమ్.

యేర్పడక పూర్వం "గృహపతి" అనే పదానికి స్త్రీపరంగానూ, పురుషపరంగానూ, రెండర్థాలూ వుండేవి (గృహపతి = స్త్రీ: పాణిని).

తరువాత యుగాల్లో ఆర్థికసంబంధాలు బంధుత్వాము వల్ల నియమించబడటం ఆగిపోయింది. ప్రాచీనగణం విచ్ఛిన్న మయ్యే రోజులకు మాతృ-పితృ శబ్దాలు బంధుత్వాన్నీ ఆర్థిక సంబంధాన్నీ రెంటినీసూచించేవి. అయితే యీదశకు వచ్చేటప్పటికి వారు గృహాన్ని నిర్మించడం, రక్షించడం, ఆహారాన్ని పంచిపెట్టడం ఆచరణలో మానేశారు; అయినా ఆమాటలకు పూర్వపు అర్థమే ఉండేది. మాతాపితరుల విధులను తరువాత ఫ్యూడల్ భూస్వామీ, ఆతరువాత పెట్టుబడిదారీ కుటుంబ యజమానీ ఆక్రమించుకుని తల్లినీ, కూతుర్నీ, తండ్రినీ, కొడుకునూ పొలాలకూ, ఫ్యాక్టరీలకూ తరిమేశారు. వారి తిండీ కుటుంబమూ అంతా దిక్కులేని ప్రపంచంలో పడ్డది. రెక్కలు విరుచుకున్నప్పటకీ తిండి గడవదు; రక్షణ దొరకదు.

ప్రాచీన ఆర్యుల ఆదిమ సమాజనిర్మాణ విధానానికి "గోత్రం" అని మరొక పేరు. గణశబ్దానికి ఉత్పత్తి కృషీ, ఉత్పత్తిదారులూ మూలమైతే, "గోత్ర" శబ్దానికి ఆహార, సంపదల మూలాధారమైన పశువులు (సంస్కృతంలో "గో") పునాది. ఇక్కడకూడా ఆర్థికార్థం ప్రధానమైనదైనప్పటికీ 'యీ గోత్ర' శబ్దం స్త్రీ పురుష కుటుంబ సంబంధాలను సూచించేదిగా హిందువులలో వాడబడుతూ వచ్చింది. ఈ శబ్దం హిందూ పండితులలో చాలా వాదప్రతివాదాలకు కారణమైంది. హిందూ వివాహ చట్టము ప్రకారము సగోత్ర

వివాహాలు పనికిరావు. గోత్రాలన్నీ కలసి తొమ్మిది ప్రధాన మైన ప్రవరలుగా విభాగింపబడినవి (ఒకే ప్రవరకలవాళ్ళు వివాహము చేసుకోవడం మాత్రం నిషేధంకాదని కొందరు పండితులవాదం). ఇలా సగోత్రవివాహాలు వేదాలలో కానీ, ప్రాచీన చరిత్రలో కానీ నిషేధింపబడలేదని వేద పండితులు యెరిగిన విషయమే. ఈ సగోత్ర వివాహనిషేధం యిటీవలిది. ఈ నిషేధం యెందుకొచ్చిందో యెవ్వరూ చెప్పలేరు. ప్రయత్నించికూడా లాభంలేకపోయింది. గోత్ర - ప్రవరల గంద్ర గోళమును వారెవ్వరూ పరిష్కరింపలేకపోయినారు.

కాని ఆర్యుల గణ-జన-గోత్ర శబ్దాలకు ఒకే అర్థము. వారి ఆర్థిక వైవాహికసంబంధాల ఆధారంమీద యేర్పడినది. గణసమాజ ఆర్థికవిధానము బంధుత్వమువల్ల యేర్పడిన సమిష్టి విధానము ఒకడెవడైనా శత్రువువుంటే వాడు బంధువులందరికీ అంటే గణానికి అంతటికీ శత్రువే. గణానికి వెలుపలనున్నది ప్రతిదీ గణానికి శత్రువే. బంధువు కానివాడు శత్రువు. అందువలన అతడు గణంలో సభ్యుడు కాజాలడు: అతడు యజ్ఞవిధిలో పాల్గొనరాదు; యజ్ఞంలో లేనివాడు పరాయి వాడు కాబట్టి వాణ్ణి చంపి, వాడి సంపదనంతా వశం చేసుకోవాలి. శత్రువులతో బంధుత్వము చేయరాదు. బంధుత్వము సర్వమూ గోత్రంలోపలే ఉండాలి. అందువల్ల ప్రాణసృష్టికీ (సంతానోత్పత్తి), జీవనాధారాల అభివృద్ధికీ గోత్రమేపునాది; గోత్రమే సరిహద్దు. అందువల్ల వివాహంకూడాసగోత్రీకంగానే ఉండాలి. ప్రాచీనార్యుల యజ్ఞవిధాయకమైన సమాజము గోత్రాన్ని దాటి, తమ అగ్నికి దూరంగా అవతల వివాహం చేసుకోవాలని ఊహించనైనాలేదు. ఆటవికపరిస్థితులలోనూ,

అనాగరిక పరిస్థితులలోనూ కూడా ఆర్యులు వందలసంవత్స రాల జీవితానుభవంవల్లనే కాని సగోత్రవివాహాలూ, రక్త బంధువులమధ్య వివాహాలూ గోత్రంయొక్క పెరుగుదలకు ప్రతిబంధకమని అర్థం చేసుకోలేకపోయినారు. నేటి సగోత్ర వివాహ నిషేధాలు అమలుకు రావడానికి వేలాది సంవత్స రాల చరిత్ర గడపవలసివచ్చింది. ఆర్యులు అనాగరికపరిస్థితు లలో ఉండగా సగోత్ర వివాహాలు చేసుకునేవారు. తరువాత చరిత్ర వాటిని నిషేధించింది. వారి సంఖ్య పెరగడం; నివ సించే ప్రదేశం విస్తరించిపోవడం, విజ్ఞాన మభివృద్ధికావడం, ఆర్థికవిధానం మారడం యిందుకు కారణాలు.

గణ - గోత్ర బంధుత్వమూ, ఆర్థిక సంబంధమూ, ఆదిమ సంఘంలో, స్త్రీ పురుషుల కామ సంబంధాలనూ, వివాహాన్ని గురించిన సమస్యలను లేవదీస్తున్నవి. ఉత్పత్తి శక్తులు వెనుకబడియుండటమే వీటి స్వరూపాన్ని నిర్ణయం చేస్తున్నది. యజ్ఞవిధాయకమైన సమాజంలో నీతినియ మాలు తరువాత కాలపు హిందూసమాజ నీతినియమాల నుంచీ, మన నేటి పెట్టుబడిదారీ నీతినియమాలనుంచీ, సోష లిస్టు సమాజ నీతినియమాలనుంచీ చాల భేదిస్తాయి.

# ఆరో అధ్యాయం

## ఆదిమ గణ సమాజంలో వివాహ పద్ధతి

నేటి సమాజంలో బూర్జువావర్గము వ్యక్తిగతంగాకానీ, సాంఘికంగాకానీ నీతినియమాలను పాటించేవారుకాదు. కాని వాటినిగురించి రాత్రింబవళ్ళు ప్రజ్ఞలు పలుకుతుంటారు; ప్రకటనలు చేస్తుంటారు. నేటి బూర్జువా సమాజంలో వివాహ పద్ధతిని గురించి జరిగే చర్చలను చూస్తే, ప్రతిదేశంలోకూడా అది తీవ్రమైన వాదప్రతివాదాలకూ, రగడలకూ గురియైందని తెలుస్తుంది. విడాకులు, బహుభార్యాత్వము, ఏకపత్నీత్వము, "ఆస్తిపెళ్ళి", ప్రేమవివాహము, యిలాంటి సమస్యలన్నీ, శీఘ్రగతిని మారుతూన్న భారతీయ సమాజంలో తుపాను ల్లాంటి చర్చలను రేకొత్తిస్తున్నవి. వీటివలన విద్యార్థికులు స్త్రీ పురుష సంబంధాలకు రెండు లక్షణాలున్నవనే దృక్పథానికి తప్పనిసరిగా వచ్చారు. (1) సామాజిక దృక్పథం—స్త్రీనీ, పురుషుణ్ణీ సమాజంలోని యూనిట్లుగా చూడటం (2) స్త్రీ పురుష సంబంధాలు ప్రకృతి నైజంగా యేర్పడతాయి అనే సహజ దృష్టి—(Natural View)

వివాహ పద్ధతిని గురించి పరిశోధనలు చేసిన చరిత్ర కారులు మానవుని కామ సంబంధాలను (Sex relations), నరవానరము (ఏప్) జింక మొదలైన జంతువులలో ఉండే సంబంధాలతో పోల్చడంద్వారా, ఏకపత్నీత్వము, బహుపత్నీత్వమూ, బహు పతీత్వమూ మొదలైన పద్ధతులు యేర్పడ్డ విధానాన్ని నిర్ణయించడానికి ప్రయత్నించారు. ఇలాంటి ప్రయత్నాలన్నీ హాస్యాస్పదాలనాలి. ఎందువల్లనంటే జంతువు లెన్నడూ ఒక సమాజ వ్యవస్థను నిర్మించగలిగి యుండలేదు. (మందను సమాజ మనరు) మరి మానవుడో, కేవలం జంతుమాత్రుడు కాడు. ఎందువల్లనంటే, ప్రకృతి శక్తులను క్రమక్రమంగా అదుపులోకి తెచ్చుకోవడంవలనా, ఉత్పత్తి సాధనాలను అభివృద్ధి చేసుకుంటూండడంవలనా, మానవుడు జంతు ప్రపంచంనుంచి బయటపడి మానవుడై మానవసమాజాన్ని నిర్మించుకున్నాడు. అందువల్ల మనుష్యులలో ఆడ మొగ సంబంధాలు మొదటినుంచి సామాజిక ప్రభావానికి లోనైయున్నవి. అవి ఆడ మొగ మధ్య ప్రకృతి నైజమైన సంబంధాలే కాక, అదే సమయంలో అవి సామాజిక సంబంధాలుగాకూడా ఉన్నవి.

ప్రకృతి మారుతూంటుంది. అభివృద్ధి చెందుతూంటుంది. అలాగే మానవుడుకూడా. అందువల్లనే ప్రకృతికీ, మానవుడికీ చరిత్రఅనేది వుండటం సంభవించింది. అవి యేనాడో ఇలా శాశ్వతంగాఉండాలని ఒకేమారు నిర్ణయమై సృష్టింపబడినవికావు. అందువలన వాటిని చారిత్రక దృష్టితో అంటే నిత్య పరిణామశీలాలుగా చూడాలి. అంటే స్త్రీ పురుషులమధ్యను ఉండే సెక్సు సంబంధాలు దైవికాలనడం కాని,

కేవలం ప్రకృతి సిద్ధాలనడంకాని, శాశ్వత నిర్ణీతాలనడంకాని సరికాదు. అవి ఒక అంతస్తునుంచి మరో పై అంతస్తుకు మారుతూ, అభివృద్ధి చెందుతుంటాయి.

ఈ కామ (సెక్సు) సంబంధాలు అన్ని సమాజాలకూ ఒకేతీరున ఉండేవికావనీ, ఒకే సమాజంలోకూడా ఒకే తీరున ఉండేవికావనీ బూర్జువా పండితులుకూడా అంగీకరిస్తున్నారు. అయితే వీటిమార్పు యే నియమంప్రకారం జరుగుతుంది? ఈ మార్పులో క్రిందిదశ యేది? పైదశ యేది? అనే విషయాల్లో మాత్రం వీరు తీవ్రంగా భేదిస్తున్నారు. పాలకవర్గాలకు చెందిన వారందరివలెనే, భారతీయ బూర్జువావర్గమూ, వారి ప్రతినిధులైన మేధావులూ నేడమల్లోవున్న సాంఘిక సంబంధాలే ఉత్తమోత్తమాలనీ మహోన్నతాలనీ వాదిస్తున్నారు.

అందువల్ల ఆర్యుల సమాజాభివృద్ధిని గురించిన చరిత్ర పరిశోధనలో ఆస్తి సంబంధాల విషయంలో వచ్చిన దుమారంకన్నా పెద్దదుమారం రేగింది. ఇలాగే 19వ శతాబ్దపు మధ్యకాలంలో ఈ స్త్రీపురుష సంబంధాలను గురించి జరిగిన పరిశోధనల్లో వివిధ ప్రాచీన తెగలకు వివిధములైన వివాహ పద్ధతు లున్నాయనీ, ఆ పద్ధతుల ఛాయలే కొన్ని ఆధునిక ఆచారాల్లో అవుపడుతున్నాయనీ బయటపడినప్పుడు,యివన్నీ యేదో విచిత్రమైన అభిప్రాయాలనీ, లేకపోతే నాగరికతలో వెనుకబడియున్న ప్రజలలో యాదృచ్ఛికంగా జరిగిన ఘటనలనీ త్రోసివేయడం జరిగింది. ప్రాచీన సమాజంలోని "సాముదాయిక వివాహపద్ధతి (Group Marriage)" నుంచి మాతృస్వామికపద్ధతి వచ్చిందనీ, అదే ప్రతిసమాజ సమూహానికీ మూలం అనీ బాఖోఫెన్ చెప్పినప్పుడు విపరీతంగా నిర

సించారు. అలాగే మోర్గాన్, మార్క్సు, ఏంగెల్సులు చారిత్రక భౌతికవాదం ఆధారంగా, కుటుంబం పుట్టుకనుగురించి ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించినప్పుడు– అంటే కుటుంబం మానవుని సామాజిక ఆర్థిక సంబంధాలకు ప్రతిబింబమేననీ, ప్రతి చారిత్రక ఘట్టంలోనూ ఉండే కుటుంబవిధానం అప్పటి ఉత్పత్తి విధానాన్నిబట్టి నిర్ణయమై ఉంటుందనీ సిద్ధాంతీకరించినప్పుడు–మార్క్సిజం స్త్రీలను "జాతిపరం" చేయమంటున్నదని ఐరోపా బూర్జువావర్గం దుష్ప్రచారం చేసింది. భారతదేశంలోకూడా బూర్జువా మేధావులలో కొన్నివర్గాల వారు అలాంటి అభాండాలనే వేయడానికి ప్రయత్నించారు. స్త్రీలను కూడా ఒక ఆస్తిగా పరిగణించే బూర్జువావర్గం అలా అభిప్రాయపడటం, అపవాదులు వేయడంసహజమే. కార్మికవర్గంఅలాంటిబూర్జువాఅపవాదులను అపహాస్యంచేస్తుంది.

బూర్జువాహిందూ మేధావులూ, హిందూసనాతనులూ యిలాంటి అపవాదులు వేయడం దుస్సాహసమని చెప్పాలి. కారణమేమంటే, తాను నిత్యమూ పూజించే దేవుళ్ళకే ఈనాడు తాననుసరిస్తున్నా ననుకునే నీతినియమాలు లేవు. నేటి భారతదేశంలో ప్రతివానికీ భయంకరంగా, అసహ్యకరంగా కనిపించే కుటుంబ పద్ధతులూ, సెక్సు సంబంధాలూ హిందువుల "పవిత్ర" చరిత్రలో వివరింపబడియున్నవి. క్లుప్తంలో చెప్పాలంటే, మనం సామాజిక నిర్మాణంలో ఉచ్ఛస్థితికి పోవలసియున్నది. ఆ స్థితి అనాగరిక యుగపు గణవిధానమూ కాదు; బూర్జువా నాగరికత యుగపు వర్గ బానిసత్వమూ కాదు. ఇది జరగాలంటే, స్త్రీ పురుష సంబంధాలనుకూడా చారిత్రక దృష్టితో పరిశీలించాలి.

ప్రాచీన హిందూ రచయితలు నాటి వాస్తవిక పరిస్థితులకు దగ్గరగా ఉన్నవారు కావడం చేతనూ, నాటి సామాజిక వర్గసంబంధాలకూ అంతకుపూర్వ పరిస్థితులనుగురించిన చరిత్ర స్మృతులకూ కృత్రిమమైన అర్థాలను కల్పించవలసిన ప్రయోజనం యేదీ వారికి లేకపోవడంచేతనూ, ఆస్తి సంబంధాలను గురించి కానీ, స్త్రీ పురుష సంబంధాలను గురించికాని ఉన్న విషయాలు ఎంత రుచించకపోయినా వాటిని దాచడానికి ప్రయత్నించినవారు కారు. తమ కాలపు సెక్సుసంబంధాలకూ తమకు పూర్వముండే సెక్సుసంబంధాలకూ భేదమున్నదని అంగీకరించారు. సంపద నుత్పత్తి చేయడంలోని సామాజిక సంబంధాలవలెనే, సంతానాభివృద్ధికొరకేర్పడిన(సెక్సు) కామ సంబంధాలుకూడా నాలుగుయుగాల్లోనూ నాలుగు విధాలుగా ఉన్నాయని వారు తమ సహజపద్ధతిలో వివరించారు. కురు పాండవవంశ పితామహుడైన భీష్ముడు నాలుగుయుగాలకూ చెందిన స్త్రీ పురుష సంబంధాలకూ, సంకల్ప (సాముదాయిక), సంస్పర్శ, మైథున, ద్వంద్వ అని కృత త్రేత ద్వాపర కలియుగాలకు వరుసగా నాలుగువిధాలైన పద్ధతులున్నాయని పేర్కొన్నారు.*

---

* కృతయుగే
న చైషాం మైథునో ధర్మో బభూవ భరతర్షభ॥
సంకల్పాదేవ చైతేషాం గర్భః సముత్పద్యతే॥(శాంతిపర్వం2C6-42)
తత స్త్రేతాయుగే కాలే సంస్పర్శాజ్జాయతే ప్రజా
న హ్యభూన్మైథునో ధర్మ స్తేషామపి జనాధిప॥ —43
ద్వాపరే మైథునో ధర్మః ప్రజానామభవన్నృప।
తథా కలియుగే రాజన్ ద్వంద్వమాపేదిరేజనాః॥ —44

పూర్వపు తెగలలో యీనాటికీ అమల్లో ఉన్న వివాహ సంబంధాలనుగురించి మనకు తెలిసినదానినిబట్టి ఈ నాల్గు పద్ధతులకూ రూప నిర్ణయం చేయవచ్చును. సంకల్ప సంబంధాలంటే: యే స్త్రీయైనా యే పురుషునితోనైనా సంభోగించ వచ్చును; అది వారివారి సంకల్పాన్ని (యిష్టాన్ని) బట్టి ఉంటుంది. దానికి సామాజికంగాగానీ, వ్యక్తినిబట్టిగానీ అడ్డంకులేమీ ఉండవు.

సంస్పర్శ సంబంధాలంటే:— అతి సన్నిహిత బంధువుల మధ్య స్త్రీ పురుష సంబంధాలు నిషేధింపబడి ఒక గోత్రానికీ మరో గోత్రానికీ మధ్య సాముదాయిక పద్ధతిలో స్త్రీ పురుష కామసంబంధా లేర్పడటం. సగోత్ర వివాహాలు నిషేధింపబడి అన్యగోత్రీకులతో ముఠాఉమ్మడిమీద వివాహ పద్ధతి యేర్పడడము.

మైధునం:—ప్రకృతి సహజమైన వివాహంలో చిట్ట చివరి దశ. ఈ దశ ముఠా ఉమ్మడి వివాహ పద్ధతి నశించేదశ. జంటకుటుంబం తమకిష్టమైనంత కాలము కలిసియుండవచ్చును. అంతకాలము వారికి యితరులతో సంపర్క మేమీవుండదు.

ద్వంద్వం:—ఈ పద్ధతి కలియుగంలోని ఏకపత్నీత్వ పద్ధతి. పురుషుడు ప్రైవేటు ఆస్తికి సర్వాధికారియై, స్త్రీ కూడా అతనియొక్క అదుపుఆజ్ఞల్లో బానిసగా ఉంటుంది.

నేటి వివాహపద్ధతి ప్రాచీనమైనది కాదనీ, పరిణామ క్రమంలో ఒకదశలో యిటీవల వచ్చినదనీ హిందువుల వాఙ్మయం తెలుపుతున్నది. రోగగ్రస్తుడైన పాండురాజు తన భార్యలైన కుంతీ మాద్రులకు యితరులవలన బిడ్డలను కనమని

నచ్చజెప్పడానికి ఏకపత్నీ వివాహాలులేని నాటి పూర్వాచారాన్ని గురించి దీర్ఘోపన్యాసమిచ్చాడు.* సూర్యుడు కన్యయైన కుంతినిసమీపించినప్పుడు ఆమె పూర్వకాలపు స్వేచ్ఛాసహజమైన ప్రేమను చూపినప్పటికీ, దానివలన శీఘ్రగతిని మారుతూ నూతన విలువలను యేర్పరచుకుంటున్న లోకం యేమనుకుంటుందోనని కొంచెం తటపటాయించింది. అప్పుడు సూర్యుడు ప్రాచీనాచారాలను ఉదహరించి, ఆమె అనుమానాన్ని నివృత్తిచేశాడు. అలాగే తన సోదరుడు సంతానం లేకుండానే చనిపోవడంవల్ల భీష్ముని తల్లి రాజ్యాన్ని, ఆ స్త్రీనీ నిలబెట్టడానికి యితరులవల్లనైనా సంతానాన్ని పొందమని కోడల్ని కోరగా, కోడలు సందేహించింది. అప్పుడు భీష్ముడు కూడా ప్రాచీన ఆచారాలను ఉదహరించి ఆమె అనుమాన నివృత్తిచేస్తాడు. మహాభారతమూ, పురాణాలూ, వేదాలూ కలియుగంలో స్త్రీ యేకపత్నీత్వ పద్ధతిలో కట్టివేయబడి యున్నదనీ, ఏకపత్నీత్వము ఆమెవరకే వర్తిస్తుందికాని

---

* అథ త్విదం ప్రవక్ష్యామి ధర్మతత్త్వ నిబోధ మే ।
పురాణబుషిభిర్దృష్టం ధర్మవిద్భిర్మహాత్మభిః॥
అనావృతాః కిల పురా స్త్రియ ఆసన్వరాననే ।
కామచారవిహారిణ్యః స్వతంత్రాశ్చారుహాసినీ॥

తాసాం వ్యుచ్చరమాణానాం కౌమారాత్సుభగే పతీన్ ।
నాధర్మోఽభూద్వరారోహే సహి ధర్మః పురాఽభవత్॥

తం చైవ ధర్మం పౌరాణం తిర్యగ్యోనిగతాః ప్రజాః
అద్యాప్యనువిధీయంతే కామక్రోధవివర్జితాః॥

ప్రమాణదృష్ట ధర్మోయం పూజ్యతే చ మహర్షిభిః ।
ఉత్తరేషు చ రంభోరు కురుష్వద్యాపి పజ్యతే॥

(శాంతిపర్వం-128)

పురుషునికి వర్తించదనీ, ఆమెకు కలిగే సంతానం పూర్వం వలె తల్లి ద్వారాకాక తండ్రిద్వారానే గుర్తించబడుతుందనీ, ఇలాంటి విధానంమీద ఆధారపడిన కుటుంబం సహజమైనది కాదనీ, కొన్ని కొత్తపరిస్థితులకు అనుగుణంగా సమాజం కొత్తగా నిర్మించుకొన్నదనీ–భారతం, పురాణాలూ, వేదాలూ అన్నీ ఒకేతీరున వివరిస్తున్నవి.*

అయితే ప్రాచీన సమాజంలో సహజ సంబంధాలూ, కుటుంబమూ యెలావుండేవి ?

ఆటవిక పరిస్థితులలోనున్న ఆర్యులు అతి సన్నిహిత బంధువులమధ్య యే అడ్డూ, నియమమూ లేకుండా స్వేచ్ఛగా కామేచ్ఛను తీర్చుకునేవారు. ఈ పద్ధతివల్ల చెడు ఫలితాలు కలుగుతాయని గ్రహించడానికి వారికి చాలాకాలం పట్టింది. అత్యల్పసంఖ్యలో ఒక చిన్నసామాజిక సమూహంగా యేర్ప డిన స్త్రీపురుషులు క్రూరమైన ప్రకృతి పరిస్థితులమధ్య ఒకరి కొకరు అంటిపెట్టుకునియుండి, సమిష్టిగా పనిచేసి బ్రతికి, వారిలో వారే సంభోగించి, సంతానాన్ని కనేవారు. ఆర్థికంగా యెలాగో, అలాగే కామ (సెక్సు) విషయంలోకూడా సగం మనిషీ సగం జంతువుగా, ఆటవికుడుగా ఉండేవారు. ప్రకృతిని అర్థంచేసుకొని, పోరాడి గెలిచి బయటపడటం ఒకటే అతని వ్యాసంగం. తల్లికీ కొడుక్కూ, తండ్రికీ కూతురుకూ, అన్న దమ్ములకూ అక్క-చెల్లెండ్లకూ మధ్య కామసంబంధాలు వాంఛనీయాలుకావని వారప్పటికింకా తెలుసుకోలేకపో యారు. కాబట్టి ఈనాడు వ్యభిచారముగా పరిగణింపబడే వావివరుసలులేని కామసంబంధాలు ఆనాడు నిషేధములు

---

* ఇలాంటి ఉదాహరణలు భారతంనిండా అనేకం వున్నవి.

కావు. ఇలాంటి కామసంబంధాల పోళకువలు నేడెక్కడా కానరావు. ఆర్యుల పౌరాణిక గాథలలో దేవతలూ, ప్రజాపతులూ పుట్టి పెరిగిన ఘట్టాలను వర్ణించిన సందర్భాలన్నీ యిలాంటి కామసంబంధాలున్న దశ ఒకనాడుండేదని సూచిస్తున్నవి. ఈ ఉదాహరణలనుచూచి నేడెవ్వరూ గాభరా పడటంలేదు. పైగా అవి దేవతలకు సంబంధించినవి కాబట్టి దోషాలు కావని సామాన్యంగా సమాధానం చెప్పి వదిలేస్తున్నారు.

ఐతరేయ బ్రాహ్మణంలో సృష్టిక్రమాన్ని వివరించే సందర్భంలో ఆదిసృష్టికర్తయైన ప్రజాపతి సృష్టికొరకు తన కూతురుతో సంభోగించాడని చెప్పబడినది.*మత్స్య. వాయు పురాణాలు బ్రహ్మనుగురించి యిలాగే చెప్పినవి. తరవాత కాలంలో అలాంటి సంకల్పిక కామసంబంధాలు నిషేధింపబడినప్పటికీ, ప్రజాపతి పాత అలవాటును వదలిపెట్టలేదు. అయితే కొంచెం జాగ్రత్తగామాత్రం వుండవలసివచ్చింది. అందువల్ల అతడు జింకరూపం ధరించి, తనవలెనే రోహిత అనే జింక రూపంధరించిన తన కూతురుదగ్గరకు వెళ్లాడు. కాని దేవతలు కనిపెట్టే ఉన్నారు. తీరా సంభోగంచేయకముందే ప్రజాపతిని బాణంతో కొట్టారు. ఋగ్వేదగాథ ఈవిషయంలో కోపాన్ని ప్రకటించలేదు. దోషులిద్దరూ నక్షత్రలోకానికి పోయారు. వీరే ధనుర్నక్షత్రం (Hunters) (ఐతరేయ బ్రాహ్మణం 3-33, 5-32). ఇదంతా యేదో జ్యోతిశ్శాస్త్ర విషయాన్ని గురించిన అర్థాంతర గాథ(Allegory)అని తోసివేసినప్పటికీ,

---

* ప్రజాపతిర్వై స్వామ్ దుహితరమధ్యాయత్‌॥

నాటి వాస్తవికక జీవితంలో యిలాంటి ఆచారం లేకపోతే ఈ విధమైన ఊహగానీ, సిద్ధాంతంగానీ ఖగోళశాస్త్ర విషయికంగానైనా యేర్పడి ఉండటానికి వీల్లేదు.

'హరివంశం'కూడా యిలాంటి సందర్భాల నెన్నిటినో ఉదహరిస్తున్నది. "విశిష్ట ప్రజాపతి" యొక్క కూతురైన 'శతరూప' యుక్తవయస్కురాలైన తరువాత తన తండ్రినే వివాహమాడింది (11 వ అధ్యాయం) 'మనువు' తన కూతురైన ఇళను పెండ్లాడాడు (10 వ అధ్యాయం). జహ్నుడు తన కూతురు జహ్నవీగంగను పెండ్లి చేసుకున్నాడు (27 అధ్యాయం). హరివంశం యింకా చిక్కైన కేసులనే ఉదహరించింది. ప్రచేతసు లని పదిమంది అన్నదమ్ములు – వాళ్ళకు సోముడనే కొడుకు – సోముడికి "మరీష" అనేది కూతురు–పదిమంది ప్రచేతసులకూ, సోముడికీ కలసి మరీషవల్ల దక్షప్రజాపతి అను ఒక కొడుకు పుట్టాడు. దక్షుడు బ్రహ్మకొడుకు అనీ, అతడు తన కూతుర్ని తాతయైన బ్రహ్మ కిచ్చాడనీ, వారిద్దరికీ నారదుడు పుట్టాడనీ మరో కథ ఉన్నది.

వ్యాసుడూ, వైశంపాయనులలాంటి ప్రాచీన గ్రంథకర్తలూ తమకు జ్ఞప్తిలో ఉన్నవాటి నన్నిటినీ పోగుచేసి ఇలాంటి చరిత్రలను చెప్తూంటే, జనమేజయమహారాజు ఆశ్చర్యపడి యిది యెలా సంభవమౌతుందని అడిగాడు – వారుకూడా యిదంతా పూర్వపు యితిహాసమనీ, నిజంగా జరిగిందనీ, యిదే ప్రాచీనసమాజ వ్యవస్థలోనున్న ధర్మమనీ, అందువలన యిది ఆనాడు సాధ్యమయిందనీ తొణకకుండా సమాధానం చెప్పారు.

ఆ విధమైన సంఘ నిర్మాణంలో బంధువిభేదాలుగానీ, కామసంబంధాలలో నిశ్చితమైన నిషేధాలుకానీ ఉండేవి కావు. కాని యీ విధమైన సంబంధాలు భవిష్యత్సంతానాభివృద్ధికి హానికరములని తెలుసుకున్నారు. అందువల్ల మొట్టమొదట తండ్రీ కూతుళ్ళకూ, తల్లీ కొడుకులకూ మధ్య కామసంబంధాలు నిషేధింపబడినవి. తత్ఫలితంగా బంధు వివాహ పద్ధతి వచ్చినది (Consanguine marriage).* ఈ పద్ధతిలో తరాలవారీగా వివాహాలుచేసుకునేవారు. తాతలు ముత్తవలూ అందరూ పరస్పరంగా భార్యాభర్తలు. అలానే వారి బిడ్డలైన తల్లులూ తండ్రులూను. ఇందులో పెత్తల్లి పినతల్లి బిడ్డలైన అక్కచెల్లెండ్రూ, అన్నదమ్ములూ పెండ్లాడవచ్చును.

రెండవదశలో సోదరీసోదరులకుమధ్య వివాహాలు నిషేధింపబడినవి. ఈ పరిణామానికీ వెనుకటి పరిణామానికీ చాలా భేదమున్నది. ఇందులో వివాహము వయస్సులు మెక్కువదగ్గరగాలేక దాదాపు సమానంగా ఉంటాయి. తల్లివేపునుంచి తోబుట్టువైన సోదరితో వివాహమాడటం మొదటి నిషేధం. దీనితో ప్రారంభించి క్రమేణా సోదరీ సోదరుల వరుసకలవారందరికీ నిషేధం వర్తించబడింది. ఈమార్పు ఎంతో కష్టం మీద కాని జరుగలేదు. ఋగ్వేదకాలం చివరలో 'యమి' తన సోదరుడైన "యముణ్ణి" ప్రేమించి అతనిద్వారా సంతానాన్ని పొందకోరింది. యముడందుకు అంగీకరించక, వరుణదేవుడి కిది తెలిస్తే కోపగిస్తాడని చెప్పాడు. దేవతల కంగీకార

---

* ఏంగెల్స్ "కుటుంబం-పుట్టుపూర్వోత్తరాలు"

మేనని 'యమి' వాదిస్తుంది.* ఋగ్వేదంలో యీ సంభాషణ చివరిదాకా దొరకలేదు. అయినా చివరకు యముడు అంగీకరించలేదనుకున్నప్పటికీ, వెనకటి వివాహాచారాన్ని తొలగించడం యెంతకష్టమైందో తెలుపుతున్నది.

తైత్తిరీయ బ్రాహ్మణంలో మరో గాథ : ప్రజాపతి కూతురైన శీతాసావిత్రి తన సోదరుడైన సోముణ్ణి పెండ్లాడ గోరుతుంది - సోముడందు కంగీకరించడు - కాని తన రెండవ సోదరియైన 'శ్రద్ధ'ను పెండ్లిచేసుకోవాలంటాడు- శీతాసావిత్రి తండ్రిని సలహా అడుగుతుంది. అత నొక తాయెత్తు నిస్తాడు. దాని ప్రభావంవలన ఆమె చివరకు సోముణ్ణి భర్తగా పొందుతుంది (తైత్తిరీయ 3-10, 9-4). మహాభారతం ఆదిపర్వం లోనూ, హరివంశంలోనూ బ్రహ్మనుంచి కుటుంబం యెలా పుట్టిందో చర్చించుతూ మరోగాథ ఉన్నది: బ్రహ్మయొక్క కుడి కాలి బొటనవ్రేలికి పుట్టిన కుమారుడు దక్షుడు; యెడమకాలి బొటనవ్రేలుకు పుట్టిన దక్షను అంటే తన సోదరిని వివాహమాడతాడు - వారిద్దరికీ 60 మంది కూతుళ్లు పుడతారు. దక్షుడికి 'మరీచి' యనీ, 'ధర్ముడనీ' యిద్దరు సోదరులు - ధర్ముడు తన సోదరుని కుమార్తెలలో 10 మందిని పెండ్లాడతాడు - మరీచి కుమారుడైన కశ్యపుడు దక్షునికూతుళ్లలో పదముగ్గురిని వివాహమాడతాడు - అంటే పెత్తండ్రి కూతుళ్ళను చేసుకుంటాడు - ఒకే కుటుంబంలో సన్నిహిత బంధువుల మధ్య వివాహాలు హానికరములనే కారణంవలన యీ విధమయిన కామ సంబంధాలు నిషేధింపబడినవి. ఈ రెండవనిషేధం మూలంగా

---

* ఉశన్తి ద్యా తే అమృతా స ఏతద్॥

గణ-గోత్రవ్యవస్థ అమల్లోకివచ్చింది. ఈ గణగోత్రవ్యవస్థలో సగోత్ర వివాహాలు చేసుకోకూడదు. అంటే ఒక గణంలో సభ్యులు పరస్పరం వివాహాలు చేసుకోకూడదు. ఇంతకు ముందుండేకామసంబంధాల్లోరక్తబంధువులనుదాటిపోరాదు♦ ఇప్పుడది నిషేధమైంది. అంటే సగోత్రవివాహంనిషేధమైంది. ఆదిమ గణాల్లో స్త్రీలూ పురుషులూ అందరూ పరస్పరం భార్యాభర్తలుగా ఉంటారు. అంటే సాముదాయిక వివాహ పద్ధతి అన్నమాట (సంకల్ప పద్ధతి). ఈ గణ-గోత్ర పద్ధతిలో భార్యాభర్తలు రక్తబంధువులు కారాదు. అందువల్ల భార్యలూ భర్తలూ బంధుత్వములేని వేరు వేరు కుదుళ్ళకు అంటే గోత్రాలకు చెంది ఉండాలి. అయితే ఒక గోత్రంలోకి భార్యలుగావచ్చిన స్త్రీలందరూ అందులోని పురుషులందరికీ సంకల్పపద్ధతిని భార్యలౌతారు (Group System). ప్రాచీన హైందవసమాజంలో గోత్రానికీ వివాహానికీవున్న అనుల్లంఘనీయమైన సంబంధం ఒకదశలో సంకల్ప వివాహపద్ధతిమీద ఆధారపడినదనీ, అయితే అందులో రక్తబంధువులు వివాహం చేసుకోరాదనే నియమం మాత్రం ఉండేదనీ తెలుస్తున్నది. ఈసమస్యకు గోత్రం వెలుపలవివాహంచేసుకోడమే (అసగోత్ర

---

♦ రక్తబంధువులమధ్య సంకల్ప వివాహ నిషేధమూ జంటకుటుంబ నిషేధమూ ఉద్దాలకుని కొడుకైన శ్వేతకేతువు విధించాడని భారతం చెప్తున్నది. ఉద్దాలకుని అంగీకారముతోనే అతని భార్యతో సంభోగించిన వ్యక్తి ఆమె తన గోత్రానికి చెందినదే కాబట్టి ఆమెతో సంభోగించే హక్కున్నదని వాదిస్తాడు.

ప్రజారణిస్తు పత్నీ తే కులశీలసమన్వితా ।
సదృశీ మమ గోత్రేణా వహామ్యేనాం క్షమస్వ మే॥

వివాహమే) పరిష్కారం. సంకల్ప వివాహం అంతమై ఏక పత్నీత్వం రావడంతో గోత్రపద్ధతి అర్థంలేకుండా పోతుంది. అందుల్ల సనాతనులు మతసాంప్రదాయంగా దాన్నే పట్టుకుని యెంతగా వేలాడదలచుకున్నప్పటికీ అది శీఘ్రంగా హిందూ వివాహ నియమంనుంచి తొలగిపోతుంది.

రక్తబంధువులు కానివారే, అంటే వేరు వేరుగోత్రాలకు చెందినవారే, వివాహాలు చేసుకోవాలి. ఐనప్పటికీ జాతిని దాటి బయటకు పోగూడదు. మొదట రక్తబంధువులకూ,సన్నిహిత బంధువులకూ పరిమితమైయున్న ఆదిమ ఆర్థికవ్యవస్థా రూపం యీ సమస్యను యెలా పరిష్కరించగలిగింది ?

ఏంగెల్సు యిలా వ్రాశాడు :

"ప్రతి ఆదిమకుటుంబమూ రెండుతరాల తర్వాతైనా చీలిపోవడం తప్పనిసరి అయేది. అనాగరికయుగంలో మధ్యదశవరకూ అమల్లోవున్న ఆదికాలపు సమిష్టి కమ్యూనిస్టు కుటుంబం కుటుంబసభ్యుల సంఖ్యను ఒక గరిష్ఠపరిమాణంలో ఉంచేది. ఆ సంఖ్య పరిస్థితులనుబట్టి నిర్ణయింపబడేమాట నిజమే అయినప్పటికీ, ప్రతి ప్రాంతంలోనూ యించుమించు ఒకే సైజులో కుటుంబం ఉండేది. అన్నా చెల్లెండ్రమధ్య కామసంబంధాలు సముచితంకాదనేభావం బయల్దేరిన వెంటనే పాత సమిష్టికుటుంబం చీలిపోయి కొత్తకుటుంబాలు స్థాపింపబడేవి... ఒకటి లేక ఒకటికన్న ఎక్కువ గ్రూపులకు చెందిన అక్కచెల్లెండ్రు ఒక సమిష్టికుటుంబానికి అంకురంగా ఉండేవారు. వారి సహజసోదరులు మరో సమిష్టికుటుంబానికి అంకురంగా ఉండేవారు."

(''కుటుంబం పుట్టుక'' పేజీ 56-57; మాస్కో కూర్పు)

వారి అక్కచెల్లెండ్రు వారి భర్తలకు సంకల్పికంగా పరస్పరం భార్యలయ్యేవారు. ఐతే యీ భర్తలు పూర్వము వలె సహజసోదరులు లేక ఏకోదరులు కారు. అలాంటి వివాహంలో తల్లివల్లనే బిడ్డ గుర్తింపబడుతుంది. ఆమెకు యజ్ఞ విధాయకమైన గణసంఘంలో ప్రముఖస్థానం వుండేది. అందువల్ల వంశానుక్రమణిక తల్లివైపునుంచి లెక్కించబడేది. కాబట్టి అక్కచెల్లెండ్రబిడ్డలే గణగోత్రాసికి వారసులైనారు. అన్నదమ్ములు తాము పుట్టిన గణగోత్రాలను వదలి తమకు భార్యలు దొరికే గణగోత్రాలకు పోవలసివచ్చేది. సమిష్టికమ్యూనిస్టు గణకుటుంబమూ, సంకల్ప వివాహమూ, మాతృస్వామిక విధానానికి పునాదియైనది. అన్ని సామాజిక విధానాలకూ యిదే పునాది. ఆర్యుల సమాజ విధానాలకుకూడా యిదే జన్మస్థానము.

అక్కచెల్లెండ్రతో గణ-గోత్రాలు స్థాపించబడినవని దక్షవంశాన్ని గురించిన గాథ తెలుపుతుంది. దక్షుడికి 60 మంది కూతుళ్ళు. ఈ 60 మందీ 10, 13, 27, 4, 2, 2, 2 లెక్కన ఏడు గ్రూపులుగా చీలి ఒక్కొక్క గ్రూపు ఒక్కొక్క ప్రజాపతిని భర్తగా స్వీకరించి ప్రపంచసృష్టిని ప్రారంభించారు. అనేక ఋషివంశగోత్రాలు స్త్రీ నామములతోటే పేర్కొనబడటం సాధారణంగా ఉన్నదే. అంటే ఆ వంశాలకు స్త్రీలే మూలకర్తలు లేక గోత్రమాతలు. ఐనా తరవాత తరవాత అవి గోత్ర పితరులయొక్క, మూలపురుషులయొక్క పేర్లతోటే పారంపర్యంగా చెప్పకోబడేవి.

ఈవిధమైన వివాహమూ, వంశానుక్రమణికా నేటి కుటుంబవ్యవస్థా, వివాహపద్ధతులనుగురించిన అభిప్రాయాలకూ

సంపూర్ణంగా వ్యతిరేకమైనవి; సహింపరానివి. అందువల్ల భారతదేశంలోనూ యూరపులోనూ నేటి బూర్జువాపండితులు అలాంటి విధానాలు యెన్నడూ లేవనిబల్లగుద్ది వాదిస్తున్నారు. కాని ఇటీవలివరకూ ఆచారరూపంలో నిలిచియున్న చారిత్రక నిదర్శనాలముందు వీరి వాదనలేవీ నిలువలేక పోయినవి. గణగోత్ర వివాహము లేక సంకల్ప వివాహమువలన కలిగిన సంతానము ఆగణముయొక్క, ఆ గోత్రమాత యొక్క వంశముగా చలామణీ అవడం నాటి సమాజానికి సహజంగా ఉండేది. అందువల్ల బిడ్డలకు మొదట గోత్రనామధేయముండి తరువాత వారివారి వ్యక్తిపేర్లు జోడించబడియుండేవి. వారిని గోత్రాపత్యములని (రక్తబంధుగణసంతానమని) పిలిచేవారు. మాతృస్వామికవిధానాన్ని కూలద్రోసి, ఏకపత్నీకుటుంబమూ, తండ్రివైపు నుంచి వంశానుక్రమణిక పరిగణింపబడటమూ వచ్చినప్పుడు తల్లిదండ్రులకు నేరుగా పుట్టిన బిడ్డను 'అనంతరాపత్యము'ని పేర్కొన్నారు. అలాంటి రక్తబంధువ్యవస్థ సహజంగా అసహ్యించుకుని బజారునపడవేసే జారసంతానమనేది ఉండేదికాదు. మాతృస్వామిక విధానం భారతదేశంలో చాలాకాలమువరకు నిలద్రొక్కుకుని ఉంది.

ద్రౌపది పాండవుల బహుభర్తృకత్వము వట్టి కల్పనగాదు. దాని చిహ్నాలు నేటికీ కొన్నికులాల్లో నిలిచియున్నవి. అవి, ఆదిమార్యసమాజంలో సంకల్ప(సాముదాయిక)వివాహాలుండేవనడానికి ప్రబల నిదర్శనాలవడంవలన చరిత్రకారులు వానిని దాచలేకున్నారు - మరోవిధంగా సమాధానం చెప్పలేకుండా వున్నారుకూడాను. అలాంటిపద్ధతి ఉన్నదీ అంటే





ఒక పెద్ద అవమానంగా భావిస్తున్నారు. కారణమేమంటే పవిత్రులైన తమ దేవతలయొక్కా, పూర్వీకులయొక్కా ఆదిమ సమాజానికి నేటితనపితృస్వామిక శాసనచట్టాలప్రకారంరూప కల్పన చేయాలనుకుంటున్నారు. ఇలాంటి విషయాల్లో కొన్ని యథార్థవిషయాలను క్రోడీకరించి పెట్టిన పురాణాలే (మూఢ నమ్మకాలతో నిండియున్నప్పటికీ) చరిత్రకు ఎక్కువ ఉపయోగ కరంగా ఉంటాయి. మార్క్సుయొక్క చారిత్రక భౌతికవాదం ద్వారా ఈయథార్థవిషయాల అసలు అర్థంమనకు తెలుస్తుంది. ఒక వ్యవస్థ ఒకనాడు అలా యెందుకున్నదో, నేడుగానీ, భవిష్యత్తులో స్త్రీస్వాతంత్ర్యాన్ని, గౌరవాన్ని నూతనపరిణతు లలో స్థాపించేకమ్యూనిస్టుసమాజంలో కానీ, పాతవ్యవస్థమరల అదేరూపంలో కొనసాగడానికిఎందుకువీలులేదో తెలుపుతుంది.

ప్రాచీనసమాజం మాతృస్వామికంనుంచి పుట్టినదనే విషయాన్ని మరుగుపరచడానికి నేటిపండితులేకాక పితృస్వామి కానికిచెందిన పూర్వపు రచయితలుకూడా ప్రయత్నించారు. ఆదిమగణానికి చెందిన మాతృస్వామికత్వమూ, సమిష్టి ఆస్తి విధానమూ చరిత్రలో యేనాడో రూపుమాసిపోయినవి. అవి నేటి ఆచార సాంప్రదాయాల్లో ఛాయామాత్రంగా నిలిచి వుండటంతప్ప చరిత్రలో యెక్కడా స్పష్టంగా ఉదహరింపబడి యుండలేదు. మాతృస్వామిక విధానం తొలగిపోయి పితృ స్వామికయుగంవచ్చిన తరువాత గ్రంథరచనచేసిన వ్యాసుడు ప్రపంచచరిత్రను ప్రజాపతుల(గోత్రజనకులు)తో ప్రారంభిద్దా మనుకున్నాడు. కానిఆయనప్రయత్నంసాగలేదు.మూలపురుషు లైన ప్రజాపతులను, వారి వంశమువారిని వారి తల్లుల పేరిటనే నామకరణం చేయవలసి వచ్చినది. పురుషులైన చరిత్ర

కారుడూ, అతని సంఘమూ స్త్రీని బానిసత్వంలో బంధించి వేసినప్పటికీ చరిత్రలో మాత్రం ఆమె కొకనాడు గౌరవ ప్రదమైన ప్రముఖ స్థానముండేదనే సత్యాన్ని దాచడానికి సాధ్యపడలేదు. (సులభంగా తెలుసుకొనడానికి పద్ధతిమిది మాతృగణాలూ, వాటిగోత్ర మాతల యొక్క పేర్లూ అను బంధంలో యీయబడినవి. వీటి అభివృద్ధీ, విస్తరణా, యుద్ధాలూ అన్నీ మహాభారతం ఆదిపర్వంలోనూ, వేదాల లోనూ విపులంగా వివరించబడినవి.)

సోమయాగంలో గణం చీలి కొత్త గోత్రం స్థాపింప బడటం వర్ణింపబడినది. ఈ సోమయాగ ప్రారంభములో 'ప్రయాణీయేష్టి' అంటే విడిపోవలెననేనిశ్చయాన్ని సూచించే ఒక కర్మకాండ ఉన్నది. ఆదిమాత అయిన "అదితి"ని మధ్యలో నిలువబెడ్తారు. ఆమెచుట్టూ గణంలోనుంచి చీలి మరోచోటికిపోయే సభ్యులను నిలవబెడ్తారు. వీరిచుట్టూ, ప్రయాణంలో సౌకర్యాన్ని కలిగించే దేవత 'పథ్యస్వాస్తి'నీ, కొత్త గణ గృహంకొరకు పాతగణ గృహంనుంచి వేర్పరించ బడిన అగ్నినీ, ఆహారదేవుడైన సోమదేవుణ్ణీ, కాలాధిపతి యైన (సవిత) సూర్యదేవుణ్ణీ, నల్గురు దేవుళ్ళనూ నాల్గు మూలలా ఉంచుతారు. వీరు నలుగురూ, ఆదిమాతయైన అదితీ యీ అయిదుగురు దేవతలూ గణంలోనుంచి కొందరు సభ్యులు చీలిపోయి మరో గణంగా ఏర్పడాలనే నిశ్చయాన్ని బలపరుస్తారు. ఈ యజ్ఞంలో ఘృత హవిస్సును ఒక్క అతి తికి మాత్రమే అర్పిస్తారు. మిగిలిన నలుగురు దేవతలకూ సామాన్యమైన వేపుడు బియ్యాన్ని (ఆజ్య) మాత్రమే

యిస్తారు. మాక్లెన్నసూ అతని అనుయాయులూ, వారిలాగా పాండిత్య ప్రగల్భాలు పలికేవారూ గోత్రజనకులే సమాజానికి మూలపురుషులని రుజువు చేయడానికి ఎంతగా ప్రయత్నించి నప్పటికీ, ప్రాచీన సమాజం మాతృస్వామికంతోటే ప్రారంభ మైనదనే అంశాన్ని తప్పించుకోలేకుండా ఉన్నారు. చరిత్రను దాచడం సాధ్యంకాదు.

గోత్రవివాహం లేక సంస్పర్శవివాహం ఉన్న కాలంలో కూడా ఒక జంట కొంతకాలం కుదురుగా ఇతరులతో సంప ర్కంలేకుండా, తమ కిష్టంవచ్చినంతకాలం కామ సంబం ధాన్ని సాగించుతుండడం జరిగేది. అంటే మైథున వివాహ పద్ధతికూడా ఉండేది. ఒకస్త్రీ ఒకపురుషుడికి అనేకమంది భార్యలమధ్య ప్రధానభార్యగా వుండేది. ఆమెకు అతడు అనేక భర్తలమధ్య ప్రధాన భర్తగా ఉండేవాడు. గణగోత్రం పెరిగి వైవాహిక బంధుత్వంమీద ఆంక్షలు యెక్కువై సంకల్ప, సంస్పర్శ విధానాలయొక్క సాముదాయిక వివాహపద్ధతి అంతకంతకూ సంకుచితమైనకొలదీ జంటపద్ధతికి యెక్కువ నిల కడ కలుగుతుంది. జంట కుటుంబం (మైథున కుటుంబం Pairing family) పై రెండు వివాహపద్ధతులనూ ఆచరణ నుంచి తొలగించింది. ఈ దశలో ఒక పురుషుడు ఒకస్త్రీతోనే వుంటాడు; అనేక భార్యలను కలిగిఉండటమూ, అప్పుడప్పుడు వ్యభిచరించడమూ పురుషుడికి ప్రత్యేక హక్కుగానే వుంటుంది. స్త్రీ పురుషులలో ఎవరైనా సులువుగా విడాకు లిచ్చుకోవచ్చును. అలా విడాకులిచ్చే సమయంలో వారి కప్పటివరకూ పుట్టిన బిడ్డలు పూర్వంవలే తల్లిదగ్గిరే ఉండి పోతారు.

ఆర్యుల జీవితంలో జంట కుటుంబవిధాన ముండేదని చెప్పడానికి అనేక నిదర్శనా లున్నాయి. తరువాత కాలంలో స్మృతులు అంగీకరించిన గాంధర్వవివాహం యిందుకు నిదర్శనము. మేనకా విశ్వామిత్రులూ, శకుంతలా-దుష్యంతులూ అనుసరించిన "పవిత్రాచార" మందరూ యెరిగినదే. జరత్కారుమహర్షి వాసుకి గోత్రానికిచెందిన నాగాంగనయైన జరత్కారను వివాహం చేసుకుని జంటసంసారం సాగించాడు. వీరిద్దరికీ కశ్యపుడు జన్మించాడు. జనమేజయుడు మొదలైన వారు నాగులపై జరిపిన యుద్ధాల్లో యీ కశ్యపుడు నాగులను కాపాడాడు. పంచపాండవులు అన్నివిధాలైన వివాహాలను చేసుకున్నారు. వారైదుగురూ కలసి, ఒక్క ద్రౌపదిని ప్రధానభార్యగా, పట్టమహిషిగా యేలడం సాముదాయిక వివాహచిహ్నం. ద్రౌపదికూడా సహజపద్ధతిని జన్మించలేదనీ, ద్రుపదరాజు యజ్ఞంచేసినప్పుడు యజ్ఞవేదికమీద అగ్నిలోనుంచి ఒక సోదరునితోసహా తండ్రికి పుట్టిందనీ మహాభారతం చెబుతోంది.* నేటికీ భారతదేశంలో యిలాంటి ఆచార చిహ్నా లున్నాయి. అంటే, ఈ బహుభర్తృకత్వం ఒక్క పాండవులే అనుభవించారనడానికి వేల్లేదు ♦ ద్రౌపదిని పట్టమహిషిగా అట్టిపెట్టుకున్న పాండవులు ప్రతి ఒక్కడూ యితరత్రా వివాహాలు చేసుకున్నాడు. హిడింబీభీములు ఘటోత్క-

---

* కుమారీ చాపి పాంచాలీ । వేదమధ్యాత్సముద్ధితా ॥శాంతి॥

♦ బహుభర్తృకత్వాన్ని వివరిస్తూన్న సందర్భంలో ఏంగెల్స్ ఇండియానూ, టిబెట్టునూ ఉదహరించి యిలా వ్రాశాడు : "బహుభర్తృకత్వం సాముదాయిక వివాహంలో పుట్టిందనే విషయాన్ని యింకా లోతుగా పరిశీలిస్తే మంచి ఉపయోగకరమైన విషయాలు తెలుసుకోవడానికి వీలుంటుంది" అన్నాడు. (తరువాయి ప్రక్క పేజీలో)

చుడు పుట్టేవరకూ జంటగా వుంటాను. ఒక కొడుకు పుట్టే వరకూ అర్జునుడు చిత్రాంగదతో జంటగా కలిసివుంటాడు. ఈ ఉదాహరణ లన్నింటిలోనూ కొంతకాలానికి భార్యా భర్తలు విడిపోయినపుడు అంతకుముందు వారికి పుట్టిన సంతానం మాత్రం తల్లులదగ్గరే ఉండిపోవడం గమనించ దగ్గది ♦

---

"అది (బహుకర్తృకత్వను)జుగుప్సాకరనులైన మహమ్మదీయ జనానాలకన్నా ఆచరణలో యెక్కువ సరళంగా నడచినట్లు కనబడుతుంది. భారతదేశములో నాయర్లలో ముగ్గురు నలుగురు పురుషులకు కలిపి ఒక భార్య వుంటుంది. వీరిలో ప్రతి ఒక్కరూ మరొక ముగ్గురు నలుగురుతో కలసి వేరొకభార్యను సమిష్టిగా పెండ్లిచేసుకోవచ్చును. ఇలాగే యెన్ని మతాకుటుంబాలైనా యేర్పడవచ్చును. ఇలాంటి అనేక పెండ్లిక్లబ్బులలో ఒక పురుషుడు చేరియుండవచ్చును అని మాక్లెన్‌మన్ అంగీకరిస్తున్నాడు. కాని యీ పెండ్లిక్లబ్బు ఒక కొత్తవిధమైన క్లబ్బు పెండ్లిపద్ధతి అని అతడు గుర్తించకపోవడం విచిత్రంగా ఉంది. ఈ క్లబ్బు పెండ్లిపద్ధతి నిజమైన బహుభర్తృకవిధానం కాదు. ఇది ఒక ప్రత్యేకవిధమైన సాముదాయిక వివాహమని గిలాడ్‌ట్యులాడ్ యీవరకే చెప్పాడు. ఇందులో స్త్రీలు బహుభర్తృకలు; పురుషులు బహుపత్నీకులు."

(ఏంగెల్స్ : "కుటుంబం పుట్టుపూర్వోత్తరాలు")

♦ద్రౌపదికాలంనాటికి ప్రాచీన సాముదాయిక వివాహపద్ధతి నశించిపోతున్నది. ఈ సాముదాయిక వివాహానికి ఆధారమైన సమిష్టివిధానంలోని స్త్రీ సమిష్టిశ్రమలో పాల్గొనడంద్వారా స్వేచ్ఛను కలిగియుండేది. సమిష్టిగా ఉత్పత్తిచేయబడిన వస్తువులు పురుషుడి ప్రైవేటు ఆస్తియైపోయేవి కావు. ఈ సమిష్టివిధానం నశించడంతో, వానిమీద ఆధారపడ్డ సాముదాయిక వివాహపద్ధతీ, స్త్రీ స్వాతంత్ర్యమూ రెండూ నశించినవి. కాబట్టే పాండవులు ద్రౌపదిని జూదంలో ఓడి కౌరవులకు అప్పగించగలిగారు.

ఏంగెల్స్ యిలా వ్రాశాడు :

"ఈ విధంగా రక్తబంధువులు వివాహాని కంతకంతకు దూరం కావడంలో సహజ యెన్నికయొక్క ఫలితం కూడా కనబడుతూవచ్చింది. మోర్గాన్‌మాటల్లో చెప్పాలంటే, రక్త బంధువులు కానివారిమధ్య వివాహం 'శారీరకంగానూ, మానసికంగానూ యిదివరకుకంటె ఎక్కువ బలంగల సంతానాన్ని సృష్టించగలుగుతుంది... అంతకంతకు అభివృద్ధిచెందే రెండు తెగలు ఒకేజాతిగా మిళితమైనప్పుడు, ఉభయ తెగల శక్తి సామర్థ్యాల కనుగుణ్యంగా మానవుని మెదడు, పుర్రె పెద్ద వవుతాయి. వాటి పొడవు, వెడల్పు పెరుగుతాయి. అందుచేత రక్తబంధువులు కానివారిమధ్య జరిగే వివాహాలవల్ల ఏర్పడు తెగలు అంతకంటె వెనుకబడియున్న తెగలకంటె యెక్కువ ఆధిక్యత సంపాదించడమో, లేక వాటిని తమ వెంట ముందుకు లాక్కువెళ్ళటమో జరిగి తీరుతుంది.

"ఈవిధంగా ఆదికాలంలో కుటుంబంయొక్క పరిణామం స్త్రీ పురుషుల మధ్య వివాహాలు పరిమితమైయున్న వలయం అంతకంతకు సంకుచితమవడాన్నిబట్టి ఉంటుంది; మొదల్లో యీ వలయం తెగకంతకూపరిమితమైవుండేది. మొదట దగ్గర బంధువుల మధ్య, తర్వాత అంతకంటె దూరపు బంధువుల మధ్య, చివరకు కేవలం వివాహంద్వారా బంధుత్వమేర్పడ్డ వారిమధ్య సంబంధాలు వరుసగా తెగిపోవడంవల్ల సాముదాయిక వివాహాలన్నీ అసాధ్యమయ్యే పరిస్థితి ఏర్పడుతుంది; చివరకు మిగిలేది ఒకే ఒక భార్యాభర్తల యూనిట్; ఇదే జీవకణం; ఈ జీవకణంలోని రెండుభాగాలూ అంతగట్టిగా

యువతులకోసం అన్వేషించేవారు; యువతులుకూడా భూలోకంలో మిన్నలైనవారిని వరించి పెండ్లిచేసుకొనేవారు!

ఏంగెల్స్ ఈసందర్భంలో ఇలా చెప్పాడు: "సాముదాయిక వివాహాలు ఆటవికయుగంయొక్క లక్షణం; ఏకపత్నీత్వం నాగరికయుగంయొక్క లక్షణం; అదేవిధంగా జంటవివాహాలు అనాగరికయుగంయొక్క లక్షణం.

ఈ జంట వివాహము లేక జంట కుటుంబము నేడు మనముచూచే స్థిరమైన ఏకపత్నీక వివాహముగా అంటే స్త్రీ పురుషునికిలొంగిచ్చి, స్త్రీకిమాత్రమే వర్తించే యేకపత్నీ వివాహంగా ఉచ్చస్థాయికి పరిణామం పొందడానికి సమాజంలో కొత్తసాధన మొకటి రూపొందవలసియున్నది. ఆ కొత్తసాధనమే ప్రైవేటు ఆస్తి. ప్రకృతిసిద్ధమైన ఆదిమ కమ్యూనిస్టు ఆర్థిక విధానంమీద ఆధారపడిన స్త్రీ పురుషులు సహజంగా యెన్నుకొని, యేర్పరచుకునే కామసంబంధాలలో నిషేధాలు నిరంతరమూ పెరుగుతూ రావడంవలన కామసంభోగం నెరపుకునే సరిహద్దులు అంతకంతకూ ఇరుకైపోతూ వచ్చినవి. జంట వివాహంయొక్క కర్తవ్యం తీరిపోయింది. ఈ మార్గంలో యిక చేయగలిగినదిలేదు. కొత్తసామాజిక శక్తులైన ప్రైవేటు ఆస్తీ, పితృస్వామికమూ, వర్గరాజ్యాంగయంత్రమూ అమల్లోకివస్తేనే కాని జంట వివాహంనుంచి మరో కొత్త వివాహపద్ధతి రావడానికి వీల్లేదు. జంట వివాహం ఒకనిశ్చితమైన చారిత్రకదశ. ఈ దశనుంచే ప్రైవేటు ఆస్తిపైన ఆధారపడిన ఏకపత్నీత్వ వివాహం అనాగరికయుగపు సమిష్టి గణసంఘ శిథిలాలమీద నిర్మితమైంది.

వివరణకోసం యిక్కడ ఆర్యసమాజంయొక్క తరువాతి పరిణామాన్ని గురించి కొంత విషయం ముందుగా చెప్పుకో వచ్చును. ఏకపత్నీ కుటుంబం "ప్రకృతిసిద్ధమైన ఆదిమసమిష్టి విధానాన్ని తొలగదోసివచ్చిన ప్రైవేటుఆస్తి, ఆర్థిక సంబంధాలపై ఆధారపడిన కుటుంబవిధానము. కుటుంబంలో పురుషుడిది పెత్తనం; బిడ్డలూ అతనికి చెందినవారే. అతని ఆస్తికంతటికీ వారసులుగా ఉండటానికే బిడ్డలను కనడం జరుగుతుంది" (ఏంగెల్సు). వర్గసమాజంలో యేకపత్నీ వివాహాలయొక్క ప్రయోజనమింతే (వర్గరహితమైన సమాజంలో యేకపత్నీ వివాహాల ప్రయోజనం పూర్తిగా వేరై ఉంటుంది). ఏకపత్నీ వివాహంయొక్క యీ అర్థాన్ని యింత పచ్చిగానూ, దాపరికం లేకుండానూ ఆర్యస్మృతికర్తలు చెప్పారు. భార్యయొక్క శీలరక్షణ అనే విషయాన్ని వాళ్ళు లెక్కచేయలేదు. తన ఆస్తి వారసత్వంకొరకు, తనకు తానై బిడ్డలను కనలేకపోయిన భర్త, తన భార్య యెవరిద్వారానయినా బిడ్డను కంటే అంగీకరించేవాడే. తాను అశక్తుడైనప్పుడు, తన భార్యను యితరులకుగానీ, డబ్బిచ్చి పిలిపించిన బ్రాహ్మణులకుగానీ, అడవుల్లో వుండే ఋషులకుగానీ, ఇతర మనుష్యులకుగానీ యెవరికైనా నియోగంచేసి సంతానప్రాప్తిని పొందేవాడు. వ్యాసుడు విచిత్రవీర్యుని భార్యలతో సంభోగించడం వల్లనే "ఆదర్శ" మహాపురుషులైన పాండవులు చరిత్రలో కెక్కగలిగారు. దీర్ఘతమసుడు బలిచక్రవర్తి భార్యలను పొందాడు. ఒకబ్రాహ్మణబాటసారి శరదండాయనుడి భార్యతో సంభోగించాడు. పాండురాజు భార్యలతో ఋషులు సంభోగించారు. అయితే తరవాత కథలో మానవమాత్రులైన

ఋషులమానం కాపాడటానికని దేవతలను పిలుచుకొచ్చారు. ప్రైవేటుఆస్తి వచ్చినకాలానికి అంటే కలియుగానికి, ఆర్య స్మృతికర్తలకూ గణసంఘంలోని జంట కుటుంబవిధానం చాలా సన్నిహిత స్మృతికాబట్టి, నూతన వర్గసమాజంలోని ఏకపత్నీత్వంయొక్క ఉద్దేశ్య మేమిటో దాపరికంలేకుండా పేర్కొన్నారు. కలియుగ వర్గసమాజానికి స్మృతికర్తయైన మనువు, ద్వాపరయుగపు సమిష్టిధర్మాన్ని, జంట (మైథున) కుటుంబాన్ని నిరసించాడు; పురుషుడు విశుద్ధసంతానంకొరకు స్త్రీని కాపాడాలి అని చెప్పాడు.* బానిసవిధానమూ, ప్రైవేటు ఆస్తీ, వర్గరాజ్యాంగ యంత్రమూ నెలకొన్న యుగానికి చెందిన భావమే స్త్రీ విలువ సంతానాన్ని కనడంలో ఉన్న దనే భావము. ఆదిమ కమ్యూనిస్టు గణసమాజంలో స్త్రీ సంతానాన్ని కన్నది. కాని ఆమె పవిత్ర మాతృదేవత; సమాజ సంపదపైనా, పురుషునిపైనా అధికారిణి; గణ సమాజ సంస్థాపనకర్తయైన ఆదిమాతృక. నాడామెకున్న గౌరవము అలాంటిది. కాని నేటి పతిత బూర్జువాసమాజంలో డబ్బిచ్చి భార్యను కొనుక్కొనే కంపానియనేట్ వివాహంలో స్త్రీ కేవలం కామతృప్తికొరకేర్పడినది. గణసమాజంలో అలాకాదు; లేక కేవలం సంతానాన్ని కనడానికై పశువులతో పాటు అట్టిపెట్టుకున్న ఒక చరాస్తిగాదు.♦ వ్యభిచారదోషం ముట్టుస్నానంతో లేక ప్రసవంతో తొలిగిపోతుందని యాజ్ఞ

* ప్రజావిశుద్ధ్యర్థమ్ స్త్రీయమ్ రక్ష్యేత్ ప్రయత్నతః (మనుస్మృతి13-9-9)

♦ ప్రజనార్థం మహాభాగాః । పూజార్హా గృహదీప్తయః॥ (23-9-26మను)

పుత్రార్థే క్రియతే భార్యా । పుత్ర పిండ ప్రయోజనమ్॥ (మనుస్మృతి)

వల్ల్యూడు చెప్పాడు.♦కొత్త ఏకపత్నీ విధానంలో పోయిన శీలాన్ని మరల గడించుకోడం అంత సులభమన్నమాట. ఖచ్చితమైన ఆస్తి వారసత్వము దైవసంకల్పము. కాబట్టి వివాహానికికూడా అదే ఆశయంగా వుండాలి. స్త్రీ పశువుతో సమానం. ఆర్ష వివాహంలో ఒక ఆవునూ, ఎద్దు(గోమిథునం) నూ యిచ్చి స్త్రీని కొనుక్కుంటారు. సంస్కృతవ్యాకరణంలో సమాహార ద్వంద్వసమాసానికి ఉదాహరణగా 'దారాగవాం' అనే సమాసం యివ్వబడుతున్నది. దీంతో భార్యకూ, పశువుకూ ఒకే విలువ కట్టబడినదని స్పష్టమౌతున్నది. సమిష్టి ఉత్పత్తివిధానమూ, సామాజికమైన ఆస్తిలో స్త్రీకి హక్కూ ప్రధానమైనవిగా ఉన్నంతకాలము యిలా స్త్రీనీ, పశువునూ, సమానస్థాయికి లాగడం అసంభవం.

"ఆదిమ కమ్యూనిస్టు కుటుంబంలోని స్త్రీలు దాదాపు అందరూ ఒకే రక్తబంధు గణానికి చెందినవారుగానూ, భర్త లందరూ వివిధగణాలకు (గోత్రం) చెందినవారుగానూ ఉండటమువల్ల ప్రాచీనకాలంలో స్త్రీకి అతి విస్తృతమైన ప్రాబల్యం సర్వసాధారణంగా ఉండేది"(ఏంగిల్స్) ఉత్పత్తిపరికరాలూ,

---

♦ వ్యభిచారాత్ ఋతౌ శుద్ధిః
గర్భేత్యాగో విధీయతే ॥ (యాజ్ఞవల్క్య 1-72)

ఏంగిల్స్ యిలా అన్నాడు: "అది (ఏకపత్నీత్వం) పురుషుడి ఆధిక్యతమీద ఆధారపడిఉన్నది. ఫలానా తండ్రికి పుట్టాడు అని చెప్పదగిన సంతానాన్ని కనడమే దాని ప్రముఖ ప్రయోజనము. అలా పుట్టిన సంతానము తండ్రి శరీరంనుంచి వచ్చారు కాబట్టి అతని ఆస్తికి వారసులౌతారు. అందువల్ల స్త్రీకన్న సంతానానికి తండ్రి యెవరో ఖచ్చితంగా నిర్ణయమై ఉండాలి. (కుటుంబం పుట్టుపూర్వోత్తరాలు) మూ-మహాభారతం-అనుశాసనిక పర్వం 45-9.

ఉత్పత్తియైన వస్తువులూ సమిష్టి యాజమాన్యం క్రింద ఉండి, సామాజిక శ్రమలో పురుషుని శ్రమ కెంత విలువవున్నదో స్త్రీ యొక్క శ్రమకుకూడా అంత విలువఉన్నప్పుడే స్త్రీకి ప్రాధాన్యత మెక్కువగావున్న కమ్యూనిస్టు కుటుంబం యేర్పడటానికి వీలుంటుంది. పురుషుడు యుద్ధం చేస్తాడు, వేటాడతాడు, చేపలుపడ్తాడు. ఆహారపదార్థాలను సేకరిస్తాడు, పనిముట్లను తయారుచేయడానికి అవసరమైన ముడివస్తువులను తెస్తాడు, స్త్రీ యిల్లు దిద్దుతుంది. ఆహారాన్ని వండి తయారుచేస్తుంది. దుస్తులను తయారుచేస్తుంది స్త్రీలుపయోగించే పనిముట్లపైన స్త్రీలూ, పురుషులుపయోగించే పనిముట్లపైన పురుషులూ సమిష్టి యాజమాన్యం కలిగియుంటారు; వేటాడే పరికరాలూ, యుద్ధంలో ఉపయోగించే ఆయుధాలూ (తరవాతవచ్చిన పశువులూ) పురుషులకు చెందేవి. గృహోపకరణాలు స్త్రీలవి. స్త్రీలూ పురుషులూ కలసి "బ్రహ్మ" లేక గణసంఘం అవుతుంది. గణంయొక్క యీ స్త్రీ పురుష సమాహార స్వరూపమునకు స్మృతిచిహ్నంగా (సంకేతం Symbol) అర్ధనారీ నటేశ్వరస్వామి వెలిశాడు. గణగోత్రానికి వెలుపలగా స్త్రీ పాల్గొనడానికి అవకాశంలేని వేరే ఉత్పత్తిగానీ, పోటీ వ్యవస్థగానీలేదు. గణగోత్రం స్త్రీవల్ల పుట్టింది. దాని రక్తబాంధవ్యమంతా స్త్రీ వల్ల నే యేర్పడ్డది. గణసమాజం పెరిగి, అనేక గణ-గోత్రాలు యేర్పడ్డప్పుడు, వాటిని నడిపిందికూడా స్త్రీయే. ఆమె ఆదిమాతయైన 'అదితి' యొక్క మహదంశ. కాళీమాత కూడా ఆమెయే. ఆహారసేకరణ కొరకూ, అందుకై చేసే యుద్ధాలకొరకూ యేర్పడే సమాలోచన సంఘాల్లో స్త్రీ లేకపోతే పనిజరగదు. అందువల్లనే

ప్రాచీన మానవుడు స్త్రీని దేవాంశగలదిగా భావించాడు. హిందూపౌరాణిక గాథలలో ఉదహరింపబడిన స్త్రీదేవత లంతా ప్రాచీన హిందూసమాజంలో స్త్రీలకు గౌరవస్థాన మున్నదనడానికి ఉదాహరణలు. యజ్ఞవిధాయకమైన ఉత్పత్తి గణసమాజమూ అంతరించిపోవడంతో ఆయుగం అంతరిం చింది. సురులకూ, అసురులకూ, మనువులకూ (మనుష్యులకు) అందరికీ సాంప్రదాయమైన యజ్ఞవిధానానికి స్త్రీయే సృష్టి కర్తయని తైత్తిరీయ బ్రాహ్మణం (1-1-4) స్పష్టంగా పేర్కొ న్నది. మనువుయొక్క కూతురూ, భార్య అయిన ఇళాదేవి వెళ్ళి, దేవతలూ అసురులూ యజ్ఞమును యెలాచేస్తున్నారో చూచి వారి పద్ధతి లోపభూయిష్టంగా ఉన్నదని భావించింది. ఆమె మనువు దగ్గరకువచ్చి యజ్ఞం యెక్కువ ఫలప్రద మయ్యేందుకు, స్వతహాగా ప్రత్యేక యజ్ఞవిధి నొకదానిని వివరించింది. మనువు కూడా ఆమె యిష్టప్రకారమే యజ్ఞా గ్నిని ప్రతిష్ఠాపన చేయమని చెప్పాడు. ఫలితంగా మనువు (మనుష్యుడు) ప్రజనూ, పశుధనాన్ని పుష్కలంగా పొంద గలిగాడు.

ప్రాచీనగణంలో ఉత్పత్తినీ, గణగోత్ర వివాహాన్నీ నిర్మించి జీవించిన విధానమిది. తరవాత కాలంకన్నా గణ గోత్రకాలపు జీవితంలో దారిద్ర్యం యెక్కువగా ఉన్నప్పటికీ, ఆంతరంగిక వైషమ్యాలు కానీ, ముఠా తగాదాలు కానీ, అంతర్యుద్ధాలు కానీ ఉండేవికావు. బ్రహ్మ అభివృద్ధియైనది- అంటే గణసంఘము పెరిగింది-ప్రపంచంలో దేశ దేశాలకూ విస్తరించింది. విస్తరణ కడ్డువచ్చిన వారందరిపైనా పోరాడి యెదుర్కొన్నది.

గణంలో అంతఃకలహాలు లేవు. కాని ఒక గణానికీ మరో గణానికీ మధ్య యుద్ధాలుండేవి. ప్రవర్ధమానమౌతూ ఉన్న గణం యుద్ధాలలో యెలా పోరాడింది? యుద్ధంవల్ల సంపాదించిన సంపదను యేవిధంగా వినియోగించింది? శ్రమ యొక్క ఉత్పత్తి ఫలితం యెక్కువ గావడంతో, మారకం రావడంతో వర్గరహితమైన గణవ్యవస్థ భగ్నమై, వర్గ రాజ్యాంగమూ, ప్రైవేటు ఆస్తీ, కొత్తఉత్పత్తి విధానమూ యేవిధంగా వచ్చినవి? సమాజం ఆటవిక స్థితినుంచి అనాగ రిక స్థితికీ, అనాగరికస్థితినుంచి నాగరికస్థితికీ అంటే కృత త్రేతా యుగాలనుంచి ద్వాపర కలియుగాలకు యెలా పరివ ర్తన చెందింది? ఈ సమస్యలను గురించి ముందు అధ్యా యాల్లో తెలుసుకుందాం.

# ఏడో అధ్యాయం

## గణయుద్ధాలు - యుద్ధసంపద

### అశ్వమేధము – పురుషమేధము – దానము

గణసమాజంయొక్క ఆర్థికవిధానాన్నీ, కుటుంబ బంధుత్వ విధానాన్నీ ఇంతవరకు పరిశీలించాం. ఇప్పుడు గణ గోత్రం ఆర్థిక పరిస్థితులవలన, బంధుత్వ నియమాలవలన చీలి కొత్తగణము లేర్పడి యెలా వలసపోవలసివచ్చినదీ చూడాలి. గణాలు తమ చుట్టూఉన్న విరోధిగణాలతో పోరాడవలసి రావడం మరొక ప్రధానవిషయం. నిర్మాణాత్మకంగా యుద్ధాలను నడపడం యుద్ధాల్లో కొల్లగొట్టిన సంపదను వినియోగించడం ఆర్యగణ జీవితంలో ప్రధాన భాగంగా ఉంటున్నవి. వీటినిగురించి తెలుసుకోడానికి మరల యజ్ఞకర్మయే మనకు మూలాధారము.

ఆ కాలంలో ఉత్పత్తినైపుణ్యం మొరటుగానూ బల హీనంగానూ ఉండేవి కాబట్టి జనాభా పెరిగినకొలదీ నేటివలె పెద్దపెద్ద జనసముదాయాలు కూడగట్టుకుని యుండడం సాధ్య పడలేదు. అందువల్ల గణ–గోత్రాలు చీలి ఆసియాఖండంలో ఖాళీగాఉన్న ప్రదేశాలకన్నిటికీ విస్తరించినవి. ఖాళీలేనిచోట్ల పోరాడి ఖాళీ యేర్పరచుకునేవారు. ఆర్థిక పరిస్థితులవొత్తిడి

వలననూ, సగోత్ర సంకల్ప వివాహాములు నిషేధింపబడటం వలననూ, గోత్రసంతానం ముఠాలు ముఠాలుగా వలస బోయిన విషయమూ, ఎలా వలసబోయినదీకూడా ఆర్యుల యజ్ఞకర్మ స్పష్టంగా తెలుపుతున్నది.

హరివంశగాథ ప్రకారంఆశిక్నిగోత్రంలోసమిష్టిసంతానం ఐదు వేలమంది ఉండేవారు. వీళ్ళకు మరల సంతానం కలగ బోతుంది. అందువల్ల గణసమాజము ఆర్థిక సంక్షోభాన్నెదుర్కొనవలసివచ్చింది. హిందూ పురాణగాథల్లో విషమపరిస్థితు లేర్పడినప్పుడో,తగవులాటలొచ్చినప్పుడో సలహాలిచ్చిగానీ, తగాదాలు పెంచిగానీ యెలాగైనా వాటిని సర్దుబాటు చేయ డానికి నారదుడుప్రత్యక్షమౌతుంటాడు. అలాగే యీగాథలో కూడా నారదుడువచ్చాడు. గోత్రసంతానంచీలి, స్థలాంతరా లకు వలసబోయి కొత్తగణా లేర్పరచుకుంటేనే తప్ప, ఉన్న ఆహారోత్పత్తి అవకాశాలు అంతపెద్దగణానికి సరిపోవనీ, దరిద్రమూ సంక్షోభమూ బాధిస్తాయనీ సలహాయిచ్చాడు. ఆ సలహా ననుసరించి, ఆ గణం చీలి, ఒకభాగం స్థలాంతరానికి వలసబోయింది తిరిగిరాకుండా. దక్ష ప్రజాపతివలన ఆశిక్నికి మరల వేయిమంది సంతానం కలిగారు. వాళ్ళనుకూడా మరల అలాగే పంపివేయడం జరిగింది.

ఇలా కొత్త స్థావరాలను వెదుక్కోవడమూ, కొత్త గణాల నేర్పరచడమూ అంత సులభంగానూ, శాంతంగానూ జరిగే పనిగాదు. మనుష్యుడి అభివృద్ధికి తగినట్లే భూమియొక్క నైసర్గిక రూపములో అనేకమైన అడ్డంకులను తొలగించవలసి యున్నది. నాటి మానవుడి చేతిలోనున్న సాధనాలు అభి

వృద్ధి పొందుతున్నప్పటికీ, నైసర్గికమైన అవరోధాలను తొల గించగలిగినంతటి శక్తివంతాలుగా తయారుకాలేదు. తగిన స్థావరాల నేర్పరచుకోడానికి ఆర్యులు ఒకచోటనుంచి మరో చోటికి నిత్య సంచారము చేయవలసివచ్చింది. మానవుడి చరిత్రకు పూర్వకాలపు స్మృతులలో నిలిచిన అలాంటి నైసర్గిక అవరోధాల్లో పెద్ద నదీప్రవాహాలూ మొదలైనవి కొన్ని ప్రపంచంలోని ప్రజలందరియొక్క పౌరాణికగాథల్లోనూ ఉదహరించబడియున్నవి. మనువు కాలపు నాగరికత అంతా వరదల్లో తుడుచుకుపోయింది. మనువుమాత్రం ఒక చేపవలన రక్షింపబడి యెక్కడో హిమాలయపర్వతప్రాంతాల్లో ఒడ్డుకు చేరుకున్నాడు. అక్కడనుంచి మరల సృష్టినిప్రారంభించాడు. హిబ్రూజాతిలో ఒక తెగనాయకుడైన నోవా, అతనిభార్యా బిడ్డలూ వరదలనుంచి రక్షింపబడిన (Noah's Ark) గాథ లాంటి గాథలు బైబుల్లోవున్నవి. క్రీస్తుకుపూర్వము3000ఏళ్ళ నాటి రెండవవెండిడాడ్ ఫార్గార్డు మనుష్యతెగలునివసించిన 16 ప్రదేశాలను పేర్కొన్నాడు. జనాభా పెరుగుదలవలననే కాక మరి యితర కారణాలనేకం సంభవించడంవలన కూడా ఆ తెగలు తమతమ నివాసదేశాలను వదలిపోవలసి వచ్చినదని కూడా అతడు చెప్పాడు. పార్సీమతస్థుల వేదమనబడే వెండి డాడ్ ఒక గాథ చెప్తున్నది: "అంగ్రమైన్యుడు వరదలను పంపాడు. అహుర్ మజ్దా అయిర్యానవాయిజో పరిపాలకుడైన ఇమను పిలిచి హెచ్చరిక చేశాడు. అతడు (ఇమ)నూ ప్రజా నివాసానికి మరీ యిరుకైపోయిన తన దేశపు సరిహద్దులను మూడుసార్లు పెంచిప్రజలను సంతోషపెట్టాడు. అహుర్ మజ్దా పదహారు నివాస భూములను సృష్టించాడు. వాటిసి ఒకదాని

తరువాత ఒకటిగా అంగ్రమైన్యుడు బాధించెను" (తిలక్ యొక్క "వేదాలలో ఆర్కిటిక్ నివాసము" అనే గ్రంథము నుంచి తీయబడిన కథ). ఇక్కడ ఈ వలసల వివరాల ప్రమేయం మనకు లేదు. భౌతిక జీవనాధారాలు పెరిగినకొలదీ కొత్త సమస్యలెలా పుట్టుకొచ్చినదీ, సమాజం వాటిని యెలా పరిష్కరించినదీ మాత్రమే మనం తెలుసుకోవాలి.

నిత్యాభివృద్ధిని పొంది, చీలిపోతున్న గణ గోత్రాలు వలసపోవడంలో యే విధాన మనుసరించారో తెలుసుకోవాలి. ఈవిషయాలు వెనుక మనంపరిశీలించిన అగ్నిష్టోమములోనూ, షడ్రాత్ర క్రతువులోనూ వివరింపబడినవి. అగ్నిష్టోమ సోమ యాగము చాలా దీర్ఘమైన యజ్ఞము. అది ఆర్యుల వలస విధానాన్ని వివరిస్తున్నదని శ్రీకుంతేనిర్వచిస్తున్నాడు.("ఆర్య నాగరికతలో ఒడుదుడుకులు" - కుంతే) అది ఒక్క వలస విధానాన్ని మాత్రమే వివరించేది కాదనీ, ఆర్యుల నిత్యజీవిత కార్యకలాపాలనుకూడా తెలుపుతున్నదనీ మా అభిప్రాయం.

పశువుల మేతకు బాగా పచ్చిక పట్టిన బీళ్ళూ, పువ్వులూ, పండ్లూ, పుష్కలంగా వుండే వసంత కాలంలో పౌర్ణమినాడుగానీ, శుక్లపక్షారంభమయ్యే అమావాస్యనాడు గానీ వలస ప్రయాణం ప్రారంభమవుతుంది. గణానికి నాయకులైన ఋత్విజులందరూ అగ్నిచుట్టూ సమావేశమై, యెవరు వలసపోవాలో, యేయే ముఠాలుగా వలసపోవాలో నిర్ణయం తీసుకుంటారు. వలసపోయేవారినియెన్నుకున్నవారూ, ఎన్నుకోబడినవారూ "దీక్షను" స్వీకరిస్తారు. వారికి కొత్త దుస్తులను కట్టబెట్టి, కొత్త గణ సంతానముయొక్క పుట్టుకను అనుకరించే

కర్మకాండను వారిచేత జరిపిస్తారు. క్రొత్త గణము యొక్క నివాసానికి అవసరమైన కుండలూ, పళ్ళేలూ, పశువులూ, మేకలూ, సోమరసమూ, ధాన్యమూ, గృహనిర్మాణ సామాగ్రిని మోసే బండ్లూ మొదలైనవాటి నన్నిటినీ సమకూర్చుతారు. క్రొత్త గణ గృహస్థావరంకొరకు, పాతగణగృహం నుంచి కొంత నిప్పును ఒక బండిమీద తీసికెళ్తారు. వలస బోయే సమయంలో పెద్ద విందు జరుగుతుంది. గణమంతా కలిసి, బాగా తిని సంబరం చేసుకుంటారు. వలసబోయే ముఠావారు స్నేహసహకార బుద్ధితో నడుచుకుంటామనీ, పాపకార్యాలు చేయబోమనీ ప్రతిజ్ఞ చేస్తారు. అప్పుడు దారిలో రాక్షసుల (శత్రువుల) నూ, క్రూరమృగాలనూ ఎదుర్కొనడానికి ఆయుధాలను ధరించి సర్వసన్నద్ధులై వలస ప్రయాణాన్ని ప్రారంభిస్తారు.

ఈ ప్రయాణాని కెంతకాలం పట్టుతుంది? ఎప్పుడు విడిది చేస్తారు? ఈ విషయాన్ని షడ్రాత్రక్రతువునుంచిగానీ, లేక సరస్వత సత్రయాగంనుంచిగానీ కొంత తెలుసుకోవచ్చును. ప్రపంచభూభాగమంతా అప్పటికి ప్రైవేటుగా హస్తగతంచేసుకోబడలేదు కాబట్టీ, రాజ్యాలుగా విభాగం చేయబడియుండలేదు కాబట్టీ, వలసపోయే ఆర్యులు యేదో ఫలానా రాజ్యానికి ఒక పద్ధతి, ప్లానుప్రకారం వలసపోతున్నారని చెప్పడానికి వీలు లేదు. అందువల్ల క్రొత్తగణం యేవేపు వెళ్ళాలి, ఎంతదూరం వెళ్ళాలి, ఎంతప్రదేశాన్ని ఆక్రమించుకోవాలి అనే నిర్ణయం యితర విషయాలమీద ఆధారపడి ఉంటుంది. సరస్వత సత్ర యాగంలో తెలిపినట్లు, అధ్వర్యుడు నిప్పుచేయడాని కుపయోగించే శమీదారువును (జమ్మికర్రను)పుచ్చుకుని గణానికి ముం

దుండినదుపుతూ, ఒకరోజు ప్రయాణమైనతరవాత విడిదిచేయ డానికి ఒక స్థలాన్ని నిర్ణయిస్తాడు. ఆ స్థలంలో మామూలు యజ్ఞవిధిప్రకారం విశ్రాంతి తీసుకుని మరల ప్రయాణము సాగిస్తారు. వలసపోయేవారికి ముందు జీవనం ప్రారంభం చేయ డానికి పది ఆవులనూ, ఒక ఎద్దునూ యిస్తారు. వలసదారులు నూరావులూ, కొన్ని యెద్దులూ, కొన్నివందల మేకలూ, గొర్రెలూ వాటికి సరిపడినంతమంది మనుష్యులూ జీవితం గడపడానికి అవసరమైన జీవనాధారాలూ, వైశాల్యమూ కల ప్రదేశాన్ని ఆక్రమించుకొనవచ్చును. (తరవాత యీ నివాసప్రదేశాలసైజు వెయ్యి ఆవులవరకూ పెంచబడినది. బహుశా గణసమాజవిధానం అనుగంటి నగరజీవితం ప్రారంభ మైనందు కిది గుర్తుకావచ్చును.) నూరు ఆవులుగల ప్రాచీన గణసంఘంలో జనాభా యేమాత్ర ముంటుందో యెక్కడా సూచింపబడలేదు. కొంతవరకు మనం అంచనా వేసుకొన వచ్చును. తరవాత స్మృతి నియమాలప్రకారం ఆర్ష వివాహ పద్ధతిలో భార్యవిలువ ఒక ఆవూ ఒక యెద్దూ అని చెప్పబడి నది. ఏకపత్నీకుటుంబంలో ఒక్క భార్య లేక ఒక స్త్రీని ఒక్క కుటుంబంగా పరిగణించినప్పుడు, పైన పేర్కొన్న దేవసత్రయాగం ప్రకారం గణంలో ఉండవలసిన అత్యధిక జనాభాసంఖ్య నూరు కుటుంబా లనవచ్చు. మనుస్మృతి కలి యుగ న్యాయస్థానాల్లో సాక్ష్యవిధానాన్ని వివరించే సంద ర్భంలో మనువు తన కాలంలో ప్రచారంలోఉన్న ఒక చిత్ర మైన అభిప్రాయాన్ని తెలుపుతాడు. ఒక ఆవును గురించి దొంగసాక్ష్యం చెప్పేవాడికి పదిమంది బంధువులను చంపినంత పాపం చుట్టుకుంటుందట! మనువు కాలానికి బానిసమైన

మనిషివిలువ లేనిసత్వములేని గణసమాజపు రోజుల్లోకన్నా, చాలా పడిపోయింది. దీనినిబట్టి గణంలో జనాభా ఐదువంద లకు మించి ఉండదనుకోవచ్చును. ఇలా అంచనాగట్టడానికీ మన ప్రస్తుత పరిశీలనాంశానికీ నేరుగా సంబంధమేమీ లేదు. కాకపోతే ఉత్పత్తి టెక్నిక్ వల్ల గణసమాజంయొక్క సైజు యెలా పరిమితమాతున్నదీ తెలుసుకొనవచ్చును.

ఇలా నివాసస్థలంకొరకూ, జీవనాధారాలకొరకూ వెదకులాడటంలో, ఒక్కొక్కప్పుడు వ్యాధులవలనా శత్రు వులవలనా గణానికి గణమే సర్వనాశనమైపోయేది. జనం చచ్చిపోవడంవలన సన్నగిల్లిన గణం యితర గణగోత్రాల నుంచి మనుష్యులను చేర్చుకొనియో, లేక మరొక గణాన్ని మొత్తంగా తమలో కలుపుకొనియో మరల బలగాన్ని కూర్చుకునేవి. రాకపోకలకుగానీ, నిత్యజీవిత సంపర్కానికిగానీ అవకాశాలు దుర్ఘటములైన ఆ రోజుల్లో చీలిపోయి, దూర ప్రదేశాల్లో నివాస మేర్పరచుకొన్న గణ గోత్రాలూ, తెగలూ, యెవరిభాషను వారు అభివృద్ధిచేసుకుంటూరు. ఈ భాషాభేదంవల్ల, కాలం గడచినకొలదీ యీ గణ-గోత్రాలు వాటి మాతృగణంతో యేమీ సంబంధంలేని ప్రత్యేక గణా లుగా అవుపడతాయి. వివిధ భాషారూపాల నేర్పర్చుకొన్న గణాలుకానీ, వాటినుంచి పెద్దపెద్ద భాగాలుకానీ కలిసి ఒక తెగగానో లేక గణంగానో యేర్పడినప్పుడు యీ కొత్తతెగ లేక గణంయొక్క భాష మిశ్రమభాషగా రూపొందుతుంది. సంస్కృతభాషనిండా యిలాంటి మిశ్రమభాషా విలక్షణాలు చాలాఉన్నవి. సామాజికచరిత్ర ఎరుగని వ్యాకరణపండితులు యీ విలక్షణ ప్రయోగాలవ్యుత్పత్తి రూపాలేవో తెలుసుకో

డానికి తలలు బ్రద్దలు కొట్టుకున్నా సాధ్యపడలేదు. ఉదాహరణకు మహావైయాకరణియైన పాణిని అస్మత్ (నేను) ఉష్మత్ (నీవు) అనే సర్వనామాలయొక్క యేడు విభక్తి ప్రత్యయాలనుంచి ఇరవైయొక్క (21) రూపాలను సాధించడానికి ఇరవైమూడు సూత్రాలను వ్రాయవలసి వచ్చినదీ అంటే యివి నిజంగా సూత్రాలుకావనే చెప్పాలి. ఈ రూపాల స్వభావం తెలుసుకోవాలంటే తెగలూ గణాలూ కలిసిపోవడం ప్రాతిపదికగా తీసుకుంటేనేగాని సాధ్యపడదు. అంతేగాని కాలప్రవాహంలో రూపాంతరా లేర్పడినవనుకుని పూనుకుంటే లాభంలేదు. సర్వనామాలు చాలా కష్టంమీద కాని మారేవికావు *

ఒక గణంలో కొత్తవారిని వ్యక్తులుగాగానీ, గ్రూపులుగాగానీ చేర్చుకోవడాన్ని యజ్ఞకర్మలో "ప్రత్యష్టోమ" మంటారు. ఇలా గణసమాజం దత్తస్వీకారం చేసుకోడానికీ,

---

* పాణిని ఈ సర్వనామాల కొక మూలశబ్దాన్ని నిర్దేశించాడు. రజ్వాడే యీ మూలశబ్దాన్ని వదలి మరో మూలశబ్దాన్ని నిర్దేశించి యీ సమస్యను పరిష్కరించాడు. "సంస్కృతభాషేచా ఉలగడా" అనే గ్రంథాన్ని చూడండి. ఇరోక్వాలనుగురించి ఏంగెల్స్ యిలా వ్రాశాడు: "తెగా, భాషా చాలావరకు అనుషంగికాలు. అమెరికాలో యిటీవలివరకూ తెగల చీలికవలనా, కలయికవలనా కొత్తతెగలూ, కొత్తభాషలూ యేర్పడుతూవచ్చినవి. ఈనాటివరకుకూడా యీ పరిణామం పూర్తిగా ఆగిందనడానికి వీల్లేదు. బలహీనమైపోయిన రెండు తెగలు కలసి ఒకటిగా యేర్పడ్డప్పుడు, అల్లాంటి తెగలో పరస్పరం దగ్గరసంబంధంగల రెండుభాషలు మాట్లాడబడుతూండటం జరుగుతుంది. ఇలా జరగడం మామూలుకు భిన్నం. అమెరికన్ తెగలలో జనాభాసంఖ్య సరాసరిగా 2000 లకు లోపున ఉంటుంది." (కుటుంబం పుట్టుపూర్వోత్తరాలు)

తరవాత కాలంలో ఏకపత్నీకుటుంబం ఆస్తి వారసత్వంకోసం దత్తస్వీకారం చేసుకునేదానికీ యేమీ సంబంధంలేదు. గణంలో వ్యక్తిగతకుటుంబం అనేదిలేదు. కాబట్టి దత్తుడు వ్యక్తిగతకుటుంబానికి చెందియుండటమనేదిలేదు. యజ్ఞకర్మ ప్రకారం, రక్తబంధువు కానటువంటి పరాయివ్యక్తికి గణ బంధుత్వంలో ప్రవేశమిస్తున్నారంటే, అతనిని గణము యొక్క సామాజిక ఆర్థికజీవనంలో భాగస్వామినిగాచేసి రక్షించడమే నన్నమాట. ఎందువల్లనంటే రక్తబంధువులు కాని మరోగణానికి చెందిన పరాయి వ్యక్తులు విరోధులుగా పరిగణింపబడటం, అలాంటివారు చేజిక్కినప్పుడు చంపి వేయడం అన్ని గణాలూఅనుసరించే సాధారణాచారం.

వలసపోయిన గణం పశువులను మేపుకోడానికి పచ్చిక బీళ్ళెక్కడుంటాయో వెతుక్కుంటూ పోయేటప్పుడు, శత్రు గణాలతో యుద్ధాలుచేయవలసివచ్చేది. దేవగణాలుసాగించిన యుద్ధగాథలనేకం ఋగ్వేదంలో వివరింపబడియున్నవి. మహా భారతం ఆదిపర్వంలోనూ, వంశానుక్రమణికలనువర్ణించేగాథ లున్న పురాణాలన్నిటిలోనూ, అదితి – రుద్ర – దాస్ – దితి మొదలైన వివిధగణాలమధ్య పరస్పరం జరిగిన నిరంతరపోరా టాలూ, యుద్ధాలూ అనేకం ఉన్నవి. ఇలా నిరంతరపోరాట నిమగ్నాలైన గణాలన్నీ గోత్రమాతల పేరిటనే ఉదహరింపబడి యున్నవి. కాని ఋగ్వేదకాలపు యుద్ధాలుముఖ్యంగా సుదస్, దివోదస్ వంశీకులైన పదిమంది రాజుల యుద్ధాలు గోత్రజన కులచేత (Patriarchs) నడపబడిన గణాలమధ్య జరిగినవి. ఇది బహుశా మాతృస్వామికం అంతరించి పితృస్వామికమూ,

పైగ్రివేటు ఆస్తీ, శాసనవిధానమూ, వర్గపోరాటాలూ అమలు లోకివస్తున్న పరిణామకాలానికి చెందినవి కావచ్చును. కాని పితృస్వామిక ప్రారంభంవరకూ, పితృస్వామికం అమల్లోఉన్న కాలంలోకూడా (1) ఒకగణం లేక కొన్నిగణాలు కలిసి సమిష్టిగా మరొక గణంమీద చేసిన యుద్ధాలుగానే ఉన్నవి. (2) ఆ యుద్ధాలు పశువులకొరకూ, పచ్చిక బీళ్ళకొరకూ, నీటి వసరులకొరకూ జరిగిన యుద్ధాలు (3) ఆర్యుల శత్రువులైన అసురులూ, దైత్యులూ, రాక్షసులూ, అహులూ, దాసులూ మొదలైనవారుకూడా ఆర్యులవలెనే యజ్ఞవిధాయుకమైన గణ వ్యవస్థలోనున్నవారు. వారుకూడా అగ్నినిప్రతిష్ఠించియజ్ఞాలు చేశారని చెప్పబడ్డది. అయితే వారి యజ్ఞాలవిధానం తప్పనీ, మంత్రాలూ తప్పనీ అందువల్ల దేవతలదృష్టిలో అవి దుష్ఫలితాలను కలిగించేవనీ చెప్పారు. (4) యుద్ధంచేసేవిధానమూ, యుద్ధంలో కొల్లగొట్టినసంపదను వినియోగంచేసే విధానమూ కూడా గణసమాజ విధానమే; అంటే ఒకవర్గం ప్రైవేటుగా అపహరించడంగానీ, లేక వర్గరాజ్యాంగ యంత్రంలోవలె జీతాలు పుచ్చుకునే స్థాయీ సైన్యం (Hired Standing Army) చేత యుద్ధం చేయించడంగానీ, అలాంటి సైనిక నాయకత్వం యేర్పాటు కావడంగానీ లేదు.

దితి, అదితి, దను, వస, కద్రు, వినత, భను మొదలైన గోత్రమాతల సంతానములైన వివిధగణాలు ఆదిమ కమ్యూనిస్టు జీవితాన్ని గడిపేవారు. యుద్ధాలు చేస్తూవుండేవారు. ఈ గణాలూ వీరి జీవితమూ, యుద్ధాలూ, ఆర్యుల చరిత్రలో యెక్కడో, యెప్పుడో అంటే యెంతకాలంవరకూజరిగాయో

మనకు తెలియదు. అవి రక్తబంధుత్వముమీద ఆధారపడి సమిష్టి ఉత్పత్తివిధానాన్ని అనుసరించే సమాజ వ్యవస్థలని మాత్రం మనకు తెలుసును. ప్రస్తుతం ప్రచారంలోవుండే పురాణగాథల ప్రకారం ఆ దేవతలు అసురులనీ, సర్వవ్యాప్తులనీ, ప్రపంచంయొక్క సృష్టి, స్థితి, లయాలకు కారకులనీ విశ్వసింపబడుతున్నప్పటికీ వారంతా మనుష్యులే ననే విషయంలో దాపరికమూ లేదు; మరిచిపోవమనికి వీలూలేదు. దేవతలూ మానవమాత్రులేనని అధర్వణవేదం స్పష్టంగా చెప్పుతున్నది. (11-5-19,4-11-6) అలాగే శతపథబ్రాహ్మణంలో వారొక తెగకుచెందిన మనుష్యులేయని చెప్పబడ్డది. ఇంద్రుడూ, అగ్ని, ప్రజాపతీకూడా అలాంటివారేనని ఐతరేయ బ్రాహ్మణ మంటున్నది.

వారు మానవులనేకాక వారిసమాజవ్యవస్థ గణసమాజ వ్యవస్థయనికూడా స్పష్టంగా చెప్పబడ్డది. వసువుల తెగ 8 గణాలుగాఉండేది; రుద్రగణాలు 11; మరుద్గణాలు 21, ఆదిత్య గణాలు 12, ఋభగణాలు 3 యిలా ఉండేవి. దేవగణాలు చీలి అనేకగణాలై విస్తరించినవి. కొంతకాలం గడిచేటప్పటికి వీరి బంధుత్వాలూ, భాషలూ, మారముతై చివరకు పసువుల కొరకూ, సంపదకొరకూ పోరాడుకునే పరాయివాళ్ళుగానూ, శత్రువులుగానూ మారారు. పురిదేవ, మురదేవ, శిశ్నదేవ, శూరదేవగణాలు మొదలైనవి అనేకం యిలాంటివే. ఋగ్వేదంలో దేవగణాలకూ పణిగ్గణాలకూజరిగిన యుద్ధాన్నిగూర్చి ఒక గాథ ఉన్నది. పణులు దేవగణాలకు చెందిన పసువుల మందలను దొంగిలించారు. దేవతలు 'శరమా' అనే స్త్రీ నాయకత్వంక్రింద అడవులనూ, నదులనూ దాటిపోయి పణుల

నెదుర్కొంటారు. పెద్ద యుద్ధం జరుగుతుంది. దేవాసుర యుద్ధాల్లోవచ్చే అసురులు ప్రారంభంలో దేవగణాల కుదురుకు చెందినవారేనని పురాణగాథలు చెప్తున్నవి.

గణసమాజంలో శాంతికాలపు ఆర్థికవిధానంలో అధ్వర్యులూ, హోతలూ మొదలైన యెన్నుకొనబడిన కార్యకర్త లుండేవారని యిదివరకే మనం చూచాం. నేటి రాజ్యాంగయంత్రంలో దోపిడీదారుల లాభంకొరకు ఉత్పత్తిని డైరెక్టుచేసే కార్యనిర్వాహకు లుంటారు. వీరివి పర్మనెంటు ఉద్యోగాలు; పదవులనుంచి తొలగించరాదు; జీతాలు పుచ్చుకుంటారు. అదనపు హక్కులు అనుభవిస్తుంటారు. గణ సమాజములోని కార్యకర్త లిలాంటివారు కాదు. వారు కూడా ఉత్పత్తి కార్యకలాపంలో పాల్గొనేవారే. సమిష్టి శ్రమను నిర్మాణాత్మకంగా నడిపించడానికి తాత్కాలికంగా ఎన్నుకొనబడినవారు. ఈ యెన్నుకొనబడిన వ్యవహర్త విధులను నిర్వహించినందుకు వారికి అదనంగా ముట్టేదేమీలేదు. సమిష్టినుంచి గణసభ్యుల కొక్కొక్కరికీ యెంతవస్తుందో వీరికీ అంతే.

శాంతి సమయంలో యెంతో, యుద్ధసమయంలోనూ అంతే. అనేక సందర్భాల్లో ఆహారోత్పత్తి అన్నా, యుద్ధమన్నా ఒకటిగానే భావించబడేది. అందువల్లనే సంస్కృతంలో యుద్ధానికి "గవిష్టి" అనే పర్యాయపద మున్నది. గవిష్టి అంటే గోసంపాదనకొరకు చేయబడే ఒక చిన్న యజ్ఞమనికూడా అర్థం. గణమంతా కలిసి ఒక సాయుధ నిర్మాణవ్యవస్థ కాబట్టి, అందులో యింకా శ్రమ, వైవిధ్య

కానీ, శ్రమవిభాగంకానీ లేకపోవడంవల్ల యుద్ధంచేయడం పురుషులే చేసినప్పటికీ గణమంతటియొక్క సమిష్టి బాధ్యతగా ఉండేది. అందువల్ల ప్రాథమికదశలో ఒక్కొక్కప్పుడు యజ్ఞంలో నాయకత్వం వహించే అధ్వర్యుడే యుద్ధంలో కూడా నాయకుడు కావడం సహజంగా జరిగేది. ఆ కారణం చేతనే ఆర్య చరిత్ర ప్రారంభదశల్లో యుద్ధాన్ని నడిపేవాడనీ, శాంతికాలంలో ఆర్థికకలాపాలకునాయకుడనీ అంటే క్షత్రియ రాజన్యుడనీ, బ్రాహ్మణ పురోహితుడనీ భేదాన్ని పాటించినట్లు లేదు. ఆ కారణంచేతనే, యుద్ధవీరులని ప్రసిద్ధిపొందిన బ్రాహ్మణులు సమిష్టి గణసమాజానికి నాయకులుగా ఉన్నట్లు చరిత్రగాథల్లో చూస్తున్నాం. తరవాత కాలాల్లోమాత్రం బ్రాహ్మణులకు యజ్ఞాన్ని నడిపించడమే కర్తవ్యంగా ఎంచబడ్డది.

అనాగరిక జనసమాజాలన్నిటివలెనే ప్రాచీనార్యులు కూడా ప్రతి సామాజిక కార్యానికీ, వస్తువుకూ, పరిసరానికీ దైవాంశను కల్పించి తమ మత కర్మకాండలో ఒకభాగంగా చేసివేశారు. బ్రహ్మ లేక గణసమాజం యుద్ధనాయకుణ్ణి ఎన్నుకుని అతణ్ణి బ్రహ్మణస్పతి, బృహస్పతి లేక గణపతి అని పేర్లుబెట్టారు. దేవాసుర యుద్ధాల్లో దేవతలకు ఉత్తమోత్తమమైన సలహా నిచ్చిన బుద్ధిశాలి బృహస్పతి. హిందువులు ఏ కార్యం తలపెట్టినప్పటికీ ప్రారంభంలో పూజావాహనం పొందవలసిన దేవుడు గణపతి అనే ఆచారం యీ నాటికీ [illegible]దే. ఈ మూడుపేర్లకు యుద్ధంలోకానీ శాంతి సమ[illegible]కానీ గణాన్ని నడిపే నాయకుడు అనేదే అర్థం. గణ

సమాజం తమ సమిష్టిసంపాదనలోనుంచి అతని భాగాన్ని(హవిస్సును) తీసియిచ్చి, తమకు ప్రతినిధియై, తమ నాయకుడై శత్రువును నాశనముచేసి, సంపదల నొసగూర్చుమని అతన్ని ప్రార్థించేవారు. గణపతి అధర్వశీర్షంలో యీ గణనాయకుడు యెర్రని దుస్తులు కలవాడనీ, దంతత్రిశూల పాశములు ఆయుధములుగా ధరించి శత్రువులపై పోరాడుతాడనీ వర్ణింపబడినది. ఒక గణం యుద్ధంలో శత్రువును ఓడించినప్పుడు ఓడిపోయిన గణముయొక్క పశువులనూ, వస్తుసంపదనూ, స్త్రీలనూ, బిడ్డలనూ వశపరచుకొని, పురుషులను ఖైదీలుగా బంధించి తమ గణ నివాసానికి తెచ్చేవారు.

ఈ సమయంలో గణపతికి మరో బాధ్యత యేర్పడ్డది. యుద్ధంలో కొల్లగొట్టినది ప్రైవేటుఆస్తిగా వుండదు. అంతా గణంయొక్క ఉమ్మడి ఆస్తి. వెంటనే అనుభోజ్యమైనది. గణసభ్యులకు పంచివేయబడుతుంది. పంపిణీ చేయబడవలసిన వస్తుసామగ్రిని మధ్యలో ఒక వేదిక (ఆసన్ది) పైన అమర్చుతారు. గణపతిని ఆ వేదికపై కెక్కమని గణమంతా కోరుతుంది. అదొక పెద్ద విందు, సంబరంజరిగే సమయం. వీరుడూ, విజయకారుడూ అయిన నాయకుడూ అతనితోపాటు గణ సభ్యులందరూ అభినందించబడతారు. అతడు గణపతి, ప్రియపతి, నిధిపతి. అందువల్ల అతడు గెలిచిన సంపదను పంచే సమయంలో గణమంతా కలిసి చేసుకునే వేడుకలలో అతనే ఆధిపత్యం వహిస్తాడు.

శత్రుదేశంలో మొట్టమొదట ప్రవేశించిన గుర్రము అగ్ని కర్పించవలసిన పవిత్ర హవ్యంలో మొదటిదౌతుంది. అదే అశ్వమేధయజ్ఞంలోని జవనాశ్వము. ఆ అశ్వాన్ని

స్నానంచేయించి, సభ్యులందరికీ చూపి తరువాత యూప స్తంభానికి (బలికొయ్యకు) కట్టివేస్తారు.

కాని ఆ అశ్వాన్ని బలియిచ్చేముందు గణసభ్యులందరూ మామూలు మాంసమూ, మధురరసములతో విందారగించి, స్త్రీ, పురుషులంతా కామనృత్యం (Sex Dance) చేస్తారు. ఈ నృత్యంలోకూడా గణపతియే ముందుండి నడపాలి. సాముదాయిక సంభోగంతో సహా విందుచేసుకోవడం గణసమాజాలనాటి ఆచారము.

ఈ కామనృత్య సమయంలో కొత్తగా తెచ్చిన స్త్రీ ఖైదీ లుండటంవలన కొంచెం పొరుపూ, రసభంగమూ కలిగే అవకాశ మేర్పడుతున్నది. యుద్ధంలో కొల్లగొట్టబడిన ఇతర వస్తువు లన్నిటివలెనే యీ స్త్రీలుకూడా గణాని కంతటికీ సమిష్టిగా బహూకరణ చేయబడతారు. సంకల్ప వివాహ నియమం ప్రకారం వా రందరూ గణంలో కలసిపోవలసిన వారు. కొత్త అందగత్తెలకొరకు తాపత్రయపడే యీవిందు సందర్భంలో, కొందరు గణికలకు, అనగా గణంలోఉండే మొదటిభార్యలకు మొగవుర్జీలు దొరకక విడిగా నిలిచి పోతారు. పురుషులు దొరకనందుకు ఆ స్త్రీలుపడే దుఃఖాన్నిక్కడ వర్ణించడానికి వీల్లేనంత అసభ్యంగా వుంటుంది. శుక్ల యజుర్వేదంలో దీన్ని విలాపమని చెప్పబడ్డది. ఆ ఘట్టంలో జరిగిన సంవాదము (క్షత్త-పలగలి సంవాదం) యజ్ఞంలో ఒక భాగంగా పవిత్రమైనదిగా, అంగీకారయోగ్యమైనదిగా ఎంచబడినది. దాని నిక్కడ ఉదహరిస్తే బూతుగా ఉంటుంది.

ఈ విందైన తరువాత స్త్రీ ఖైదీలను గణికలు (గణ భార్యలు)గా అంగీకరించినతరువాత గణం మరి రెండువిధులను నిర్వర్తించవలసి యున్నది. అవి పురుష మేధమూ, బ్రహ్మ మేధమూనూ. పురుషమేధమంటే మొగఖైదీలను యేమి చేయాలో తెలిపేది. బ్రహ్మమేధమంటే యుద్ధంలో చని పోయిన వీరులను పూజచేయడం.

ప్రాచీనకాలపు గణసమాజాభివృద్ధియొక్క ప్రారంభ దశల్లో గణానికుండే మొరటైన పరికరాలతో ఉత్పత్తిచేయ గలిగిన దానినుంచి, ఉత్పత్తిదారుడు తన శ్రమశక్తిని పుంజు కోడానికి అనుభవించిన తరువాత ఇంకా అదనంగా మిగిలే దేమీ వుండేదికాదు. అందువలన నాటి సామాజికవ్యవస్థలో బానిసలకు చోటుకల్పించి వారిద్వారా ప్రయోజనంపొందడం అసాధ్యమైన విషయం. యుద్ధఖైదీల్లో అందగాళ్లూ, బలవం తులూ, వైద్యంమొదలైనవాటిల్లో నిపుణులూ అయిన కొంత మందిని గణంలో కలుపుకుని వారికి సంపూర్ణమైన బంధుత్వ హక్కులను కలుగజేసేవారు. అంటే వారు గణంలో సభ్యులై పోయేవారు. మిగిలిన ఖైదీల నేంచెయ్యాలి? గణంయొక్క ఆర్థిక దరిద్రావస్థలో వారంతా "నోటి"కి వచ్చేవారేకాని "చేతి"కి వచ్చేవారుకాదు. అలాంటప్పుడు వాళ్ళను చంపి వేయడ మొక్కటే పరిష్కారమార్గం. వాళ్లు గణానికి శత్రువులు కూడా. అందువల్ల వాళ్ళను అగ్నిదేవుడికి బలియిచ్చేవారు. ఇదే పురుషమేధము. ఇది ఆటవికదశయొక్క అవశేషంకాదు. ఉత్పత్తిశక్తులు మరీ బలహీనాలుగా వుండటంవలన, తిండి చాలక ఆర్యులు అనాదికాలంలో మనుష్యులను పీక్కుతిన

వలసినగతి పట్టియుండవచ్చును. పురుషమేధయజ్ఞమే కనుక అలాంటిస్థితికి చిహ్నమై యుండినట్లయితే మిగిలిన అనేక యజ్ఞాల్లోవలె యీ కర్మకాండలోకూడా చంపబడిన మనుష్యుల మాంసమును ఏదోశాస్త్రార్థంగానైనా రుచిచూడవలెననే నియమముండేదే. ఇప్పటివరకు మన మెరిగిన పురుషమేధ కర్మకాండలో అలాంటి దెక్కడా అవుపడదు. పురుషమేధంలో మూడవరోజున పదకొండు యూపస్తంభాలకు కట్టిన యజ్ఞపశువులను మామూలు విధాయకంగానే చంపేవారు. చంపబడవలసిన మనుష్యులు (నరపశువులు) యూపస్తంభాల మధ్య నిలుచునియుంటారు. జంతుబలులైపోయిన తరువాత యజ్ఞాధ్వర్యుడైన బ్రహ్మ పురుషసూక్త మంత్రాలను పఠిస్తూ ఒక మండుతూన్న కొరివిని తీసుకుని, నరపశువులచుట్టూ మూడుసార్లు తిప్పుతాడు. ఆ తరువాత వారినందరినీ వదలిపెడ్తారు. వారినిచంపి ఆకళేబరాలను అగ్నిలో వ్రేల్చేబదులు నేతిని (ఘృతహవిస్సు) అగ్నిలో పోస్తారు.

నరపశువులచుట్టూ మండే కొరువులను త్రిప్పడం, వారిని దేవతలకర్పణ చేయడం, ఒకప్పుడు వారినిచంపిఅగ్నిలో వ్రేల్చేవార సేందుకు చిహ్నమే. కానిఆచారంలోఉన్నకర్మకాండలో వారిని చంపకవదలివేస్తున్నారు. కారణమేమిటి? దయవల్లనా? కాదు. తరువాత దశల్లో బహుస్వల్ప నేరాలకుకూడా బెత్తాలతో కొట్టడం, అవయవవిచ్ఛేదన, స్త్రీపురుష భేదంలేకుండా తలలు నరికివేయడం, యిలాంటిశిక్షలు విధించవచ్చునని చట్టాలు చేసిన ఆర్యులు, యుద్ధాలలో వేలకొలది జనాన్ని రంపపుకోత కోసిన ఆర్యులు, పూర్వపు ఆటవిక అనాగరికదశల్లో దయవుట్టిపడి 'నరపశువుల'నుచంపకా, తినకావదలిపెట్టారంటే నమ్మటా

నికి పీల్లేను. అయితే మరికారణమేమిటి? ఇప్పటి పురుషమేధం మనుష్యులను చంపివేయడం మాని బానిసలను చేసుకునే కాలానికి చెందినది. సమాజంయొక్క ఉత్పత్తినైపుణ్యా మభివృద్ధిచెంది, మానవునిశ్రమ అదనంగా ఉత్పత్తిచేయగలిగిన స్థితికివచ్చిన తరువాత, మనుష్యుడికి యజమానులైనవారు, వారిని అగ్నికి ఆహుతి చేయకుండా అట్టేపెట్టుకోడం లాభసాటిగా అవుపడ్డది. యుద్ధఖైదీలను చంపటం నిజంగా నిరుపయోగమే కాక నష్టకారణం కూడాను. అందువల్ల ఆర్యులు వారిని బానిసలుగా మార్చివేశారు. స్వేచ్ఛా సమానత్వములు గల ఆ గణ విధాన శిధిలాలమీద, బానిస విధానము గల సమాజ వ్యవస్థ నిర్మాణమైనది.

ఈ మార్పు గణంచేతికి చిక్కిన ఖైదీలను చంపే కర్మకాండలో, అంటే పురుషమేధంలో మార్పును తెచ్చింది. ఇందుకు నేటి పురుషమేధ కర్మలో పురుషసూక్త మంత్రాలను పఠిస్తూ ''నరపశు''లను దేవతల కర్పణచేయడం గుర్తు. పురుషసూక్తము ఆర్యగణాలలో వర్ణాలూ, బానిసలూ, ప్రైవేటుఆస్తీ,వర్గరాజ్యాంగయంత్రమూ ప్రవేశించినరోజుల్లో పుట్టినది. ఈ విషయానికి తరువాత వద్దాం.

ఇకను యుద్ధంలో చచ్చిపోయినవారి విషయం మామూలుగా చచ్చిపోయినవారందరి విషయంలోనూ యేంచేస్తారో, దానికిమించి యీ కర్మకాండలో ప్రత్యేకంగా యేమీలేదు. కొందరు గ్రంథకారులనుకున్నట్లు యుద్ధంలోకానీ, మామూలుగా కానీ చచ్చిపోయినవారిని దహనంచేయడం యేఒక వ్యక్తికో సంబంధించినదికాదు. అదికూడా ఒక యజ్ఞమే. దానిని బ్రహ్మమేధ మనడం గమనింపదగ్గది. నేటి కర్మ

కాండలో అగ్నిహోత్రాన్ని స్వీకరించినవారు చనిపోయి నప్పుడు మాత్రమే శ్రౌతవిధిప్రకారం (అంటే ప్రాచీన వేదోక్తవిధిప్రకారం) దహనం చేయబడతారు. దానిని బ్రహ్మమేధ మంటారు. ఇతరులకు స్మృతిధర్మంప్రకారం కర్మ జరిపిస్తారు. దీన్ని పితృమేధమంటారు. స్మృతివిధాయకమైన కర్మకాండ ఇటీవలిదని స్పష్టంగా అవుపడుతుంది. ప్రాచీన గణ సమాజంలో గణమంతా కలసి అగ్నిహోత్రిగా ఉండేది. అందువల్ల గణంలో యెవరు చనిపోయినప్పటికీ గణమంతా బ్రహ్మమేధం చేసేది. చనిపోతున్నవాడు రక్తబంధువుకాబట్టి బ్రహ్మయొక్క లేక గణంయొక్క అవయవం వంటివాడు. అతను చచ్చిపోవడమంటే గణంలో ఒక అవయవం చచ్చిపోవడమే. అందువల్ల గణమంతా బ్రహ్మమేధంలో చేరడం విధివిహితంగా సమిష్టి కర్మకాండగా పరిగణింపబడ్డది.

అనాగరిక జాతులందరివలెనే, ఆర్యులుకూడా రక్తబంధువులంతా కలిసి గణసమాజవ్యవస్థగా యేర్పడి ఉండేవారని అంగీకరించని విమర్శకులందరూ * "జెక్ పదానికి మోర్గాన్ యిచ్చిన నిర్వచనం ప్రకారం గణానికంతటికీ కలిపి ఒకే రుద్రభూమి (శ్మశానం) ఉండియుండాలనీ, కాని ఆర్యులలో అలాంటి దేదీ లేదనీ వాదిస్తున్నారు. అలాంటి విమర్శలకు పైన వివరించిన బ్రహ్మమేధమే సమాధానము.

ఈ విషయాన్ని ముగించడానికిముందు, మిగిలిన యుద్ధ సంపదను యేంచేశారో తెలుసుకుంటే సరిపోతుంది. యుద్ధంలో చేజిక్కిన పశువులనూ, పాత్రలనూ, ఆభరణాలనూ, దుస్తులనూ

---

*కరండికర్ "హిందువులలో అసగోత్ర వివాహాలు"

మొదలైనసంపద అంతటివిషయం తేల్చకుండానే,విందులూ, నృత్యాలూ, స్త్రీ పురుష ఖైదీలను తగినట్లు వినిమయం చేయడంతో పని తీరిపోయినట్లుగాదు. దీనిని 'దాన' విధి అంటారు. దానం అంటే బహూకరణమనీ లేక ఉచితంగా యిచ్చివేయడమనీకొందరుపండితులుతప్పుఅర్థంచెప్తున్నారు.

శాంతికాలపు ఆర్థికవిధానంలో సమిష్టిశ్రమవల్ల ఉత్పత్తియైన దానిని వ్యక్తుల అనుభవంకొరకు పంచి యివ్వబడినప్పుడు ఆపంపకంలో వచ్చిన భాగాలను,హవనమనీ,హవిస్సనీ, హుతశేషమనీ, యజ్ఞశిష్టమనీ పిలిచేవారు. యుద్ధంలోచిక్కిన వస్తువులనుగానీ, లేక గణమంతటి తరఫునా నిలువఉంచబడ తగిన ఆయుధాలనూ,దుస్తులనూ,పాత్రలనూ మొదలైవాటిని గానీ పండుగ సమయాల్లో పంచియిచ్చినప్పుడు అలాంటి పంపకాన్ని 'దానం' అనేవారు.*బహూకరణవస్తువులనుంచిన వేదికను (ఊతిభిః) యెక్కమని కోరబడిన బ్రహ్మణస్పతి చేయవలసిన పని యిదే.అథర్వణవేదంలో అతనిని సంపదనుపంచవలసిందని (విభాజ వసూని)కోరతారు. గణపతిని హివసో అని సంబోధించడం గమనించాలి. సంపదను"వసూని"అన్నారు. వసువులు వసుమాత సంతానమైన గణసంఘము.

తెగ నాయకుడు తన యిష్టంవచ్చినట్లు చేయడమూ, చేయకపోవడమూ అని వ్యక్తిగతంగా నిర్ణయించేది 'దానము'

---

* గణానాం త్వా గణపతిం హవామహే
కవిం కవీనాం ఉపమశ్రవస్తమమ్।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆ నః శృణ్వన్
ఊతిభిః సీదసాదనమ్॥ ఋగ్వేదం-2॥

కాజాలదు. యుద్ధంలో చిక్కిన సంపద అంతా గణానికి సమిష్టిగా చెందినది. హవనంవలె దానంకూడా ఒకసామాజిక విధి. సంఘానికి అవసరమనుకున్నప్పుడో, ప్రతియుద్ధమూ దండయాత్రా ముగిసినప్పుడో, అలాంటి ప్రత్యేకసమయాల్లో చేయవలసినది దానం. అందువలన ఆదిమ కమ్యూనిస్టు గణ సిద్ధాంతంలో 'దానము' యుద్ధనాయకులతోటీ, గణపతి లేక బ్రహ్మణస్పతితోటీ జోడింపబడియున్నది. ఋగ్వేదంలో దానం అంటే 'పంచుట' అనే అర్థంలో వాడబడినది. దానిలో ఊరకే ఇచ్చివేయడమనిగానీ, బహూకరించుట అనిగానీ సూచించబడలేదు.

సమిష్టిఆస్తీ, సమిష్టి గణసంఘ విధానమూ భగ్నమై, యుద్ధము నడపడం రాజుయొక్కా, అతని క్షత్రియ వర్గము యొక్కా బాధ్యతమై, ఆ క్షత్రియకుటుంబాల్లో సంపద అంతా చేరిపోయినప్పుడు, యుద్ధంవలన లభించినసంపద పూర్వమువలె గణానికంతటికీ సమిష్టిగాచెందక రాజుయొక్క, పాలకవర్గము యొక్క ఆస్తిగాపరిగణింపబడినది. అప్పుడు 'దానము'కూడా సామాజిక విధి కాకుండా పోయినది. ఎన్నుకొనబడిన యుద్ధ నాయకుడు లేక గణపతి నిర్వహించవలసిన విధి కాకుండా పోయింది. రాజుయొక్క పాలకవర్గంయొక్క వ్యక్తిధర్మంగా మారింది. ప్రజలమనస్సులలో దానము సామాజికధర్మంగా హత్తుకొని యుండటంవలన, దానం చేయని రాజును చెడ్డ రాజుగా చూచేవారు. రాజు 'దానం' చేయనని నిరాకరిస్తే, అతనిని ఒత్తిడిచేయగల సామాజిక హక్కుగానీ, శక్తిగానీ లేకుండాపోయింది. 'సమిష్టి' భావంనీరుగార్చిఅణచివేయబడ్డది.

ఇప్పుడది వర్గరాజ్యాంగయంత్రం. దానం అనేది యిప్పుడు రాజులకూ, క్షత్రియులకూ వ్యక్తిపరమైన సద్గుణంగానూ, అయాచితంగా యిచ్చే యీవిగానూ పరిణమించింది. అందరికీ సమానంగా యివ్వబడవలసినది అనే స్వభావంకూడా దానికి లేకుండా పోయింది. దానకర్త తన యిష్టాయిష్టాలనుబట్టి యెవరికి దానంచేయాలో నిర్ణయించుకుంటాడు. పాలకవర్గాలవారు తమ కభిమాన పాత్రులైనవారిని యేరుకుని వారికి దానసంపదను కట్టబెట్టి ప్రజల కన్యాయం చేస్తుంటారు. అందువల్ల దానంలో చెడూ, మంచీ అనేవి యేర్పడ్డాయి. భగవద్గీతలో చెప్పినట్లు దేశకాలపాత్రతల నెరిగి దానం చెయ్యాలి అనే వాడుక వచ్చింది. (దేశ కాల పాత్రతలు దానంయొక్క మంచిచెడ్డలను నిర్ణయిస్తాయి కాబట్టి, దానాన్నిబట్టి దానకర్తకు పుణ్యపాపాలు వస్తాయి.) గణసమాజపు రోజుల్లో యిలాంటి చర్చలకు తావులేదు. గణవ్యవస్థలో దానము సభ్యులందరియొక్క హక్కు—కాక వ్యాధిగ్రస్తులనూ, వృద్ధులనూ, వికలాంగులనూ, బలహీనులనూ తిండికి మాడకుండా రక్షించేది. పైగా వీళ్ళదే సామాజిక సంపదపైన మొదటిహక్కు కాని ప్రైవేటుఆస్తీ,వర్గరాజ్యాంగమూ వచ్చిన తరువాత దానము అసలు ఉద్దేశానికే వ్యతిరేకంగా మారిపోయింది. సామాజిక రక్షణసాధనంగా వుండే దానం క్షత్రియులకూ, బ్రాహ్మణులకూ, అంటే పాలక వర్గాలకు కలిమిని కూర్చేదిగా మారిపోయింది.

ఉత్పత్తిచేసినదిగానీ, యుద్ధంవల్ల లభ్యమైనదిగానీ గణానికున్న ఆస్తిఅంతా యజ్ఞవిధానంలో ప్రధానభాగం. అందువల్ల దానమూ, యజ్ఞమూ పరస్పరం విడదీయరానివై

పోయినవి. నిజానికి యజ్ఞవిధాయకమైన సమిష్టి ఉత్పత్తి విధానంలో దానమూ, హవనమూ సమిష్టి వినిమయవిధానముగా ఏర్పడ్డవి. కాని తరవాత ప్రైవేటుఆస్తీ, వర్గరాజ్యాంగ యంత్రమూ వచ్చినప్పుడు దానమూ, హవనమూ సామాజిక సంపత్తిని వ్యక్తి హరించేందుకు సాధనాలైనవి.

గణపతి గణానికి యెంత వస్తుసంపదను, యెంతమంది స్త్రీలను కూర్చిపెడ్తాడో, పంచిపెడ్తాడో దానినిబట్టి అతను వీరోత్తంసుడనీ; విప్రుడనీ గణం జ్ఞాపకముంచుకుంటుంది. ఇలాంటి గణపతుల స్మృతిని "దానసూక్తాల"లో సంతరించి పెట్టారు. ఆ దానసూక్తాలు సామాజిక చరిత్రలో భాగాలు. ఇదే దానసూక్తాల పుట్టుకకూడా.

దానం సమిష్టియజ్ఞంలో భాగంగా ఉండటం మాని, రాజుయొక్కా, అతని వర్గంయొక్కా ప్రైవేటువ్యవహారంగా యేర్పడ్డతరవాతగూడా, దానిని చరిత్రలో కెక్కించే పద్ధతి మాత్రం ఆచారంగా ఏర్పడ్డది. రాజదర్బారులో దానాన్ని స్వీకరించే పురోహితుడు "దానసూక్త" రచయితయైనాడు. కాని ఓల్డెన్‌బర్గ్ వింటర్నిజ్, కేత్కర్ మొదలైన వేదపండితులందరూ యజ్ఞకర్మ ప్రాముఖ్యతను అర్థంచేసుకోలేకపోయినట్లే, దానంయొక్క ప్రాముఖ్యతనూ, ఉద్దేశ్యాన్ని కూడా అపార్థం చేసుకున్నారు. అలాగుననే దానసూక్తాలవిషయంలోనూ, వాటిని రచించినవారి విషయంలోనూకూడా దానకర్తలైన రాజులచేత పోషింపబడే ఆస్థాన కవిపండితులు "దానసూక్తాల"ను రచించారని తప్పు నిర్వాచనం చేశారు.

వేదాలలోని దానసూక్తాలు ఇటీవల రూపంలో కాక, మూలరూపంలో అవి అప్పటి సామాజిక ఉత్పత్తి వినిమయ విధానంలో ముఖ్యమైన భాగంగా ఉండేవి. దానము దానిని పరిగ్రహించే గణ మంతటికి తరఫునా నిర్వహింపబడే సామాజిక ధర్మము. అందువలన దానసూక్త కర్తలైన ఋషి, పురోహితులకు గణపతియొక్క విజయాన్నీ, బుద్ధిశాలిత్వాన్నీ, వీరత్వాన్నీ, తత్ఫలితమైన గణసభ్యుల సంతోషానుభవాలనూ గానంచేసే ఉత్సాహాన్ని పొందారు. యజ్ఞవిధానం ప్రధానాంశాల్లో నశించిపోయి, దోపిడీదారుల రాజ్యాంగయంత్రం పట్టాభిషేకం చేసుకున్న తరువాత దానసూక్తాలకు కూడా వ్యవస్థాధర్మరూపం నశించింది. అయితే దానసూక్తాలు మట్టుకు సాంప్రదాయరూపకంగా సాగివచ్చి ప్రైవేటు ఆస్తీ, శాసన విధానమూ యేర్పడ్డ నాటి రాజుల రాజ్యాంగానికి అంటగట్టుకున్నది.

హుత శేషాన్నీ, హవనాన్నీ గణంలో సమిష్టిగా వినిమయం చేయడంకూడా మార్పుచెందింది. ఉన్న ఆహారమంతా యే భేదాలూ లేకుండా అందరూ అనుభవించడానికే ఉండేది. సత్రయజ్ఞం అలా విధించింది. ప్రైవేటు కుటుంబీకుడు, తనఅన్నాన్ని తన పొయ్యి, తానే వండుకోటం అనేది లేదు. అతడూ, 'అతనిది'కూడా లేదు. ప్రైవేటుఆస్తీ, ప్రైవేటు కుటుంబమూ వచ్చిన తరువాత యజ్ఞనియమం నిలిచిందికాని, ప్రైవేటు కుటుంబీకులను తరిమివేసే ఆస్తి విహీనులలోనూ, కుటుంబ విహీనులలోనూ మాత్రమే నిలిచింది. అందువలననే 'చుట్టూ' ఉండే అన్నార్తులను విస్మరించి ఒంటరిగా భుజించు

వాడు 'పాపభుక్కు' పాపాన్ని తినేవాడు, అనే నీతిసూత్రం బయలుదేరింది.* కాని ఆస్తిపరులవర్గం అలాంటి నీతిసూత్రా లను గణనీతిపిశాచాల ఆక్రందన లని ఎగతాళిచేసింది.

యుద్ధనాయకుడి యొక్క, గణపతియొక్క విధి, లేక కర్తవ్యమైన "దానము" నూతన వర్గసమాజంలో రాజులకూ క్షత్రియులకూ ఎలా అంటగట్టబడినదో అలాగే దానం చేసే టట్లు ఒత్తిడిచేసి స్వీకరించేహక్కు, హవనాన్ని హుత శేషాన్ని స్వీకరించే హక్కు కొత్త వర్గసమాజంలోని పాలక వర్గంలో మరొక భాగమైన బ్రాహ్మణులకూ, యజ్ఞకాండను జరిపించేవారికీ సంక్రమించింది. దానం బ్రహ్మయొక్క లేక గణముయొక్క విధి, కర్తవ్యంగా ఉండటం మానివేసింది. బ్రాహ్మణులే వేదాలనూ, తత్ఫలితమైన జ్ఞానాన్ని మిరాసీ వారసత్వంగా సంక్రమింపజేసుకుని, దానివల్ల కలిగే సంపద లను అనుభవిస్తున్నారు; బ్రాహ్మణులు తామే బ్రహ్మకు, లేక గణసమాజానికి నిజమైన వారసుల మని చెప్పుకుని దానాన్ని హవనాన్ని స్వీకరిస్తున్నారు.

ఇలా గణసమాజంయొక్క ఉత్పత్తిసంబధాలు వాటి కనుకూలమైన సిద్ధాంతాలనూ, వ్యవస్థా రూపాలనూ సృష్టిం చినవి. కాని గణముయొక్క, దాని ఆస్తి విధానముయొక్క సహజలోపము భగ్నమైనప్పటికీ, పాత సిద్ధాంతాలయొక్క నైతిక విలువల అవశేషాలు బ్రతికియుండటానికి కొట్టుకు లాడినవి. ఈ సమయంలో కొత్తవర్గాలు తమ కొత్తప్రయోజ నాలకొరకు ఆ పాత అవశేషాలను, తమకు నచ్చిన విధంగా

---

* భుంజతే తేత్వఘం పాపాః। యేపచన్తి ఆత్మకారణాత్ ॥ (గీత3-13)

స్వీకరించి రూపొందించుకున్నారు. సమిష్టి విధానంలో అందరికీ ప్రయోజనకారియై, తిండిలేక మాడవలసిన పరిస్థితుల నుంచి రక్షించేదై, గణ సభ్యులందరకూ సమానంగా వినిమయాన్నీ, అనుభవాన్నీ గ్యారంటీచేసే ఒక నైతికవిధానం వర్గసంఘంలో తనస్వభావం పోగొట్టుకొని తద్వ్యతిరేకార్థంగా పరిణమించింది. నిర్బంధానికీ, మిరాశీకీ దోపిడీదారులు కొలదిమంది చేతుల్లో ఆస్తిఅంతా కేంద్రీకరణం కావడానికి కారణమైంది; అత్యధిక సంఖ్యాకులైన కష్టజీవులూ, బలహీనులూ, వికలాంగులూ, వ్యాధిగ్రస్తులూ, వృద్ధులూ, ఆస్తిలేనివారూ, బీద కుటుంబీకులూ, బానిసలూ, పాలేళ్ళు తిండిలేకమాడుతున్నారు. ఆర్యసమాజం నూతనకలియుగాన్ని చూచింది.

# ఎనిమిదో అధ్యాయం

## వర్ణాలు, ప్రైవేటు ఆస్తి, వర్గాల అవతరణ

ఆర్యుల సమాజం సమిష్టి గణవ్యవస్థగా జీవించి సమిష్టిగా శ్రమచేసి అభివృద్ధియైనది. అగ్ని, పశువులపెంపకం అనే మహత్తర సాధనాలను కనిపెట్టి, వాటి నుపయోగించడం ద్వారా ఉత్పత్తిశక్తులను అభివృద్ధి చేసుకున్నారు. జీవితంలో నిలకడనూ, అభ్యుదయాన్నీ పొందారు. వేదాలనూ, యితిహాసాలనూ పరిశోధించడంవల్ల మన మిది తెలుసుకున్నాం.

కాని ఉత్పత్తిశక్తులు కుదురుగా ఒకచోటఆగేవికావు. అవి ఒకదశనుంచి మరొకదశకు నిరంతరాభివృద్ధిని పొందుతూ సామాజిక నిర్మాణవిధానమూ, మానవజీవితమూ, సిద్ధాంత సమామ్నాయమూ పరిణామంచెందడానికి కారణమాతాయి.

సెమిటిక్,తురేనియన్ మొదలైన జాతులవలెనే, ఆర్య జాతికికూడా జీవితధారణకొరకు మచ్చికచేసుకుని ఉపయోగించుకొనడానికి వీలైనపశువులు దొరకడం నిజంగాఅదృష్టం. ఈవిషయంలో మరికొన్ని ఇతరజాతులకన్నా ఆర్యజాతిఅదృష్టవంత మనాలి. ఆర్యులు నివసించిన ఆసియాప్రాంతాల్లో యిలాంటి పశువులు పుష్కలంగా ఉండేవి. అమెరికాఖండానికి

ఆ సౌకర్యముండేది కాదు. పశువుల పెంపకానికి పుట్టిల్లై, ప్రాచీనకాలంనుంచీ నాగరికతనూ, అభ్యుదయాన్నీ చూచినది ఆసియాఖండమే. ఏంగెల్స్ యిలా వ్రాశాడు:

"వారికి ఆసియాలో మచ్చికచేయడానికి అనువైనజంతువులు దొరికినవి. మచ్చికచేసిన జంతువులను పెంపకం చేయవచ్చును. మచ్చికయైన గేదె ప్రతియేడూ యీనుతుంది. ఆర్యులూ, సెమైట్లూ బహుశా వీరికన్నా ముందుగానే తురేనియన్లూ* పశువులను మచ్చికచేయడం మొదటి వృత్తిగా పెట్టుకున్నారు. తరవాతనే వాటిని మేపడం, పెంచడం జరిగింది. ఈ పసులకాపరి తెగలు మిగిలిన అనాగరికులనుంచి వేరుపడినవి. ఇదే మొట్టమొదటి శ్రమవిభజన. పశులకాపరి తెగలు యితర అనాగరికులకన్నా జీవితావసర వస్తువులను ఎక్కువగా ఉత్పత్తిచేయడమేకాక, అనేక రకాలైన వస్తువులనుకూడా ఉత్పత్తిచేసేవారు. మిగిలిన అనాగరికులకు లేని పాలు, పెరుగు, వెన్న, పుష్కలంగా మాంసమూ, యివేకాక చర్మాలూ, ఉన్నీ, మేకబొచ్చూ, వడుకు నేతదుస్తులుకూడా ఉండేవి. ముడివస్తువు లెక్కువైనకొలదీ వాటినుంచి యీ ఉపభోగ్య వస్తువులు యెక్కువగా తయారయ్యేవి. ఇందువల్ల మొట్టమొదటిసారి మారకం అనేది సాధ్యపడ్డది.

"ప్రాథమిక దశల్లో మారకం అప్పుడప్పుడుమాత్రమే జరిగేది. ఆయుధాలనూ, పనిముట్లనూ ఉపయోగించడానికి నైపుణ్యం అవసరం కావడంవల్ల తాత్కాలిక శ్రమవిభజన కూడా అవసరమైంది. అలా తాత్కాలిక శ్రమవిభజనకూడా

* తుర్వాసుడు యయాతియొక్క ఐదుగురు కొడుకులలో ఒకడు.

జరిగేది. కాబట్టే అనేక ప్రదేశాల్లో రెండవ రాతియుగంనాటి రాతి పనిముట్లనుచేసే కర్మాగార శిథిలాలు బయటపడ్డవి. ఈ దశలో బాగానైపుణ్యాన్ని సంపాదించిన వృత్తిదారులు బహుశా సంఘమంతటికోసం పనిచేసి ఉంటారు. ఇండియా లోని గణాల్లో ప్రతి వృత్తిపనివాడూ యిలాగే గణమంతటి కొరకూ పనిచేయడం యెరుగుదుము. ఈ దశలో మారకం అనేది జరిగే ఉండదు. జరిగే మారకం యేదైనావుంటే తెగలోపలనేజరిగేది; అదైనా ఎంతో అవసరమైనపరిస్థితుల్లో మాత్రమే జరిగేది."

ఏంగెల్స్ యీ వివరణను వెనుకటి అధ్యాయాల్లో పేర్కొనబడిన వేదసాంప్రదాయాలు బలపరచుతున్నవి. ప్రాచీన వేదమంత్రాల్లో అక్కడక్కడ వచ్చే 'క్రయ', 'విక్రయ' అనే పదాలు యిలా తాత్కాలిక శ్రమవిభజననూ, అప్పుడప్పుడు జరిగే మారకాన్నీ సూచిస్తాయి. నిత్యవ్యాపారమంటూ ఆనాడుండేదికాదు. వస్తువుల మారకం నిత్యవ్యాపారంగా జరగడం బ్రాహ్మణాలూ స్మృతులూ వచ్చిన కాలంలోనే. అయితే ఆనాటికే నిత్యవ్యాపారానికిబీజాలుపడి మొలకలెత్తుతున్నవి. ప్రాచీనకాలపు యింద్రుని వజ్రముచేసినవారూ, తక్షణులూ, రథకారులూ అని ప్రసిద్ధిపొందిన వృత్తిదారులలాంటి నిపుణులయిన పనివాళ్లు ఉన్నప్పటికీ, ఆర్యగణ సమాజంలో చేసే పనినిబట్టి వర్ణాలుగా యేర్పరచిన శ్రమవిభజన అనేది లేదు. వర్ణాలేర్పడటానికి ముందుగా పశుధనాన్ని ఆధారం చేసుకుని వివిధ వస్తువులను తయారుచేయడం, వాటిని వారిలో వారు

మారకం వేసుకోవడం, గణంయొక్క సభ్యత్వసంఖ్య తగినంత వృద్ధికావడం జరగాలి.

శ్రమవిభజన యేర్పడటానికి ముందుగా జనాభా సంఖ్యా, సాంద్రతా పెరగాలి అని మార్క్సు చెప్పాడు.* (చదరపుమైలు కింతమంది అని జనాభా సాంద్రతకు లెక్క గడతారు). ఆసియాలో గుర్రములేకాక యితర పశువులను కూడా మచ్చికచేయడం వచ్చింది. అందువల్ల ఆర్యులలో సామాజిక శ్రమవిభజనకూ, వర్ణ వ్యవస్థకూ ప్రాతిపదిక యేర్పడ్డది.

ఆర్యులసమాజంలో చారిత్రక పరిణామక్రమంయొక్క ఒక నిశ్చితదశలో వర్ణవిభాగం ఏర్పడినదని చరిత్రకారులందరూ అంగీకరిస్తున్నారు. వర్ణ వ్యవస్థ దైవసృష్టియని హిందూ ఋషులన్నారని చాలమంది ఋజువుచేయడానికి ప్రయత్నించారు. కాని, హిందూఋషులుకూడా వర్ణవ్యవస్థ చరిత్ర పరిణామక్రమంలో యేర్పడ్డదేనని చెప్తున్నారు. ఆర్యుల సమాజంలో మొదట వర్ణాలుండేవి కావు. తరువాత మూడు వర్ణాలేర్పడ్డవి. ఈమూడువర్ణాలైనా చేసేశ్రమనుబట్టీ,తయారు చేసే వస్తువులనుబట్టీ యేర్పడ్డవేకాని మరొకటికాదు అని హిందూమత గ్రంథాలలో ఆ ప్రసక్తి వచ్చినచోటల్లా స్పష్టంగా పేర్కొనబడ్డది.♦

---

* కేపిటల్ సంపుటం 1 పే 345 ఎల్లెన్ అన్విన్ ప్రచురణ. డోనటార్ సంగ్రథన. Edited by Donatorr)

♦ ఒక వర్ణానికీ మరొక వర్ణానికీ భేద మెలా యేర్పడుతున్నదని భరద్వాజుడు భృగువు నడిగాడు. రంగువల్ల వర్ణవిభాగం రాలేదు. రంగువల్లనే అయితే వర్ణాలు అసంఖ్యాకంగా వుండాలి; కోరికలూ అనుభూతులూ కానీ, శారీరక బల, బలహీనతలు కానీ, వర్ణవిభాగానికి (మిగతా ప్రక్క పేజీలో)

సామాజికావసరంవలనా, ఉత్పత్తిశక్తుల అభివృద్ధి వలనా శ్రమవిభజన యేర్పడుతుంది. వర్ణవ్యవస్థ పుట్టుకకు సంబంధించినంతవరకు, యే ప్రాచీన మతగ్రంథకారులు యేమి వ్రాసినప్పటికీ, ఏవైదికఋషికానీ, దేవతగానీ ప్రత్యేకంగా తెలివితేటల నుపయోగించి పనిగట్టుకుని వర్ణవ్యవస్థను సృష్టించలేదు.

శ్రమవిభజన యెలా యేర్పడ్డదీ మార్క్స్ యిలా వివరించాడు :

"పరిశ్రమలలో శ్రమవిభజనవలెనే, సమాజంలోకూడా శ్రమవిభజనజరగడమూ,తదనుగుణంగావ్యక్తులు ఒకప్రత్యేక వృత్తికికట్టుబడియుండటమూ పరస్పరం యెదురెదురు స్థానాల నుంచి ప్రారంభమై అభివృద్ధి చెందుతాయి. తెగలోపల స్త్రీ పురుషభేదాన్నిబట్టీ, వయస్సునుబట్టీ అంటే శారీరకనిర్మాణ

---

కారణాలు కావుగదా? అని అడిగాడు. మొదట అంతా బ్రహ్మమే. తరువాత తాముచేసే కర్మలనుబట్టీ, పనులనుబట్టీ బ్రాహ్మణు లని ఒకవర్ణం యేర్పడ్డది అని భృగుమహర్షి చెప్తాడు. భరద్వాజ ఉవాచ:—

చాతుర్వర్ణస్య వర్ణేన, యది వర్ణో విభజ్యతే।
సర్వేషాం ఖలు వర్ణానాం దృశ్యతే వర్ణసంకరః॥ 6
కామః క్రోధో భయం లోభః శోకశ్చింతా క్షుధా శ్రమః॥
సర్వేషాం నః ప్రభవతీ కస్మాద్వర్ణో విభజ్యతే॥ 7
తనుః క్షరతి సర్వేషాం కస్మాద్వర్ణో విభజ్యతే॥ 8

భృగుఉవాచ:...న విశేషో స్తివర్ణానాం సర్వం బ్రహ్మ మిదం జగత్।
బ్రాహ్మణాః పూర్వసృష్టాహికర్మభిర్వర్ణనాంగతాః॥ 10
(శాంతిపర్వం 186)

ఈ సందర్భంలో భగవద్గీత యిలా చెప్తున్నది:...
చాతుర్వర్ణ్యం మయాసృష్ట గుణకర్మవిభాగశః॥ (గీతాఅధ్యాయం 4-13)

భేదాన్ని ఆధారంచేసుకుని సహజంగా శ్రమవిభజన యేర్పడు తుంది. ఈ సహజమైన శ్రమవిభాగం సంఘం విస్తరించడం వలన, జనాభా పెరగడం వలన, ముఖ్యంగా వివిధ తెగల మధ్య పోరాటాలవలన, ఒక తెగను మరొక తెగ లోబరచు కోవడంవలన, తెగయొక్క వస్తుసముదాయం అధికం కావ డానికి దోహదమిస్తుంది. మరోవేపునుంచి వివిధకుటుంబాలూ, తెగలూ కలుసుకునేచోట్ల వస్తువుల మారకం ప్రారంభ మౌతుంది; యెందువల్లనంటే నాగరికతయొక్క ప్రారంభ దశలో స్వతంత్రమైన ప్రాతిపదికపైన కలుసుకునే అవకాశం తెగలకూ తెగలకూమధ్య వుంటుంది. కాని, ప్రయివేటు వ్యక్తులకుండదు. ఒక్కొక్క తెగకు ఒక్కొక్కవిధమైన ఉత్పత్తి సాధనాలూ, జీవనాధారాలూ ఆయా ప్రకృతి పరిసరాలను బట్టి లభ్యమౌతాయి ఇందువలన వారివారి ఉత్పత్తివిధా నాలూ, జీవితాలూ, ఉత్పత్తి అయ్యేవస్తువులూ వేర్వేరుగా వుంటాయి. ఇలా సహజంగా పుట్టిన భేదంవలన, వివిధ తెగలు కలుసుకొన్న సమయాల్లో వస్తువుల మారకానికి అవకాశం కలుగుతుంది. ఈ వస్తువుల మారకమే క్రమేణా వాటిని అమ్మ కపు సరుకులుగా మార్చివేస్తుంది. మారకంవలన ఉత్పత్తి రంగాల మధ్య భేదము లేర్పడవు. అదివరకే భేదిస్తూఉన్న ఉత్పత్తిరంగాలు పరస్పర సంబంధంలోకొచ్చి, విస్తరించిన సమాజంయొక్క సమిష్టి ఉత్పత్తిలో అంతోయింతో పరస్ప రాధారాలైన శాఖలుగా మారిపోతాయి. ఇక్కడ మొదట పరస్పరంభేదిస్తూ, స్వతంత్రంగావున్న వివిధ ఉత్పత్తిరంగాల మధ్యజరిగే మారకంలో సామాజిక శ్రమవిభజన పుట్టుతుంది.

ప్రథమపక్షంలో శారీరక నిర్మాణ భేదాన్నిబట్టి శ్రమవిభజన జరిగేచోట, అంతవరకూ ఒకే ఒక మొత్తంగావున్న శ్రమలో నుంచి ప్రత్యేకభాగాలు పెరిగి విడిపోతాయి. ఈ విడబాటు ముఖ్యముగా యితర తెగలతో వస్తువులను మారకం వేసుకోవడంవల్ల జరగడమేకాక, యిలా విడిపోయిన శ్రమభాగాలు ఒకదానికొకటి అందనంత దూరస్థములౌతాయి. ఈ వివిధ రకాల శ్రమలమధ్య వాటివల్ల తయారైన వస్తువులను సరుకులుగా మారకం చేసుకోడం తప్ప మరేవిధమైన సంబంధమూ ఉండదు. రెండవపక్షంలో మొదట విడివిడిగా పరస్పరసంబంధం లేకుండావుండే ఉత్పత్తిరంగాలమధ్య వస్తువుల మారకం జరగడంవలన సామాజిక శ్రమవిభజన మేర్పడుతుంది. మారకం ప్రారంభమయ్యేప్పుడు అంతవరకూ స్వతంత్రముగా ఉన్నదాన్ని మరోదానిమీద ఆధారపడియుండేట్లు చేయడం ఒకచోట జరిగితే, మరోచోట అదివరకే అన్యాధారమైనదానిని స్వతంత్రమైనదానినిగా చేయడం జరుగుతుంది.''*

మార్క్స్ చేసిన యీ వివరణ ఆర్యతెగల పూర్వకాల పరిణామాన్ని తెలుపుతున్నది. ఆర్యగణములలో వివిధ వస్తువులను ఉత్పత్తి చేయగలగడంవలనా, వివిధ కార్యకలాపాలూ, విధులూ యేర్పడటంవలనా ఆంతరంగికంగా శ్రమవిభాగం ప్రారంభమైనది. ఏకంగావున్న గణంలో వివిధ భాగాలేర్పడి, ఆ యా పనులకు కట్టుబడిపోయి వర్ణాలుగా రూపొందుతాయి. అయితే ప్రారంభదశలో ప్రైవేటు ఆస్తి

---

* (''మార్క్స్ : కేపిటల్ సంపుటం 1; పే. 344 ఎల్లెన్ అన్విన్ ప్రచురణ, డోనటార్ సంగ్రహన.)

లేదు కాబట్టి, ప్రధానమైన ఉత్పత్తి సాధనాలు సమిష్టియాజమాన్యంలో ఉండేవి కాబట్టి యీ వర్ణాలు తరవాత దశల్లో వలె విరోధివర్గాలుగా ఉండలేదు.

యజ్ఞవిధాయకమైన ఉత్పత్తిలో మొదట ఋత్విజులందరూ ఒకటిగా వుండేవాళ్ళు. తరువాత యజ్ఞశ్రమ అనేక ఉత్పత్తిశాఖలుగా చీలినది. ఒక్కొక్క శాఖ కొక్క ఋత్విజుడు చొప్పున పదునేడుగురు ఋత్విజులేర్పడ్డారు. ఆర్యగణాలలో ప్రాచీనతమకాలపు శ్రమవిభజన యిలాగే ప్రారంభమైనది. అయితే యీ విభజన తాత్కాలికం కాబట్టి మారకంమీద ఆధారపడినది కాదు కాబట్టి నిశ్చితమైన వర్ణాలేర్పడలేదు.

గణసమాజం అభివృద్ధియైనది. ఒక కుదురుమీదే పెరిగి, చీలి, విస్తరించిన గణాలూ, ఇతరగణాలూ విరోధంతో తలపడటమో, స్నేహపూర్వకంగా కలవడమో జరిగింది. ఈ సమయాల్లో ఆ యా గణాలవద్దనున్న అదనపు వస్తువుల మారకం ప్రారంభమైంది. వివిధగణాలవద్దనున్న వివిధవస్తువులు మారకంకావటం; ఈ మారకం తడవతడవకూ జరుగుతూండటం జరిగేది. ఈ మారకంలో కొన్ని వస్తువులకు గిరాకీయేర్పడేది. ఇందువల్ల ప్రతిగణంలోనూ గిరాకీగావున్న వస్తువులను ఉత్పత్తిచేసే శాఖల్లో మార్పులొచ్చేవి. ఇలా గణాల్లో ఆంతరంగికంగా వివిధములైన వస్తువులు తయారు కావడం, ఆ వస్తువులను బయటి గణాలతో మారకం చేసుకోవడంమూలంగా సమాజంలో శ్రమవిభజనవచ్చి నిలకడ పొంది, ఆర్యగణాల్లో వర్ణాలు పుట్టినవి.

"కాని శ్రమవిభజన నెమ్మదిగా ఉత్పత్తిక్రమంయొక్క నరనరానికీ ప్రాకిపోతుంది. ఇందువల్ల సమిష్టి ఉత్పత్తి విని

మయూలు భగ్నమౌతాయి. వ్యక్తిగతమైన అనుభవమే సర్వ సాధారణంగా ఆచరింపబడే సూత్రంగా పైకితోసుకొస్తుంది. దీన్తో వ్యక్తులమధ్య మారకం జరగడం ప్రారంభమౌతుంది" (ఏంగెల్స్). ఈ దశకు చేరింతరవాత సమాజంలో ప్రైవేటు ఆస్తీ, వర్గాలూ యేర్పడతాయి. వర్ణాలే పరస్పర విరోధవర్గాలుగా రూపొంది, అంతర్యుద్ధాలకూ, వర్గపోరాటానికీ దారి తీస్తాయి. ఆదిమగణసమాజం నశిస్తుంది. అది మరల బ్రతికి రావడం జరగదు.

చారిత్రక భౌతికవాదసిద్ధాంతంప్రకారం వివరించబడిన యీ పరిణామక్రమానికీ, హిందువులయొక్క వేద యితిహాస వాఙ్మయాలలో నిదర్శనాలున్నాయా? ఉన్నాయి. పైన వివరించిన పద్ధతిలోనే చారిత్రక పరిణామాలను వివరించక పోయినప్పటికీ, కనీసం నాటి అనాగరికదశకు అనుగుణమైన విధంగానైనా పై సారాంశాల కేవైనా ఆధారాలను చూపుతున్నాయా? చూపుతున్నాయని చెప్పాలి.

ఈ విషయాలను తెలుసుకోడానికికూడా వేదకర్తలు రచించిన సృష్టిగాథలే ఆధారాలు. నాటిసమాజాన్నెదుర్కొన్న ప్రతిసమస్య ప్రపంచాన్ని సృష్టిచేసే సందర్భంలో బ్రహ్మను, లేక ప్రజాపతిని యెదుర్కొన్న సమస్యగా పరిగణింపబడినది. వర్ణాలూ, శ్రమవిభజనా లేని సమాజంలో వర్ణాలేర్పడటం సృష్టిశాస్త్రంలో ఒక భాగమని యెంచబడినది.

ఆర్యసమాజంలో మొదట మూడువర్ణాలే ఉండేవి. తరవాత అవి నాలుగైనవి. అందువల్ల సృష్టిగాథలు కొన్నిచోట్ల మూడువర్ణాలనూ, కొన్నిచోట్ల నాలుగు వర్ణాలనూ చర్చించినవి. అయితే ప్రారంభంలో వర్ణాలే లేవనీ, లేక ఒకే

వర్ణ ముండేదనీ, తరవాత మూడూ, ఆ తరవాత నాలుగూ వర్ణా లేర్పడ్డాయనీ,నాలుగవవర్ణం ఆర్యులలో పుట్టినది కాదనీ అందువల్ల అదినిజమైనవర్ణంకాదనీ అందరూఅంగీకరించినదే.

ప్రజాపతి వేటిని సృష్టిచేశాడో శతపథ బ్రాహ్మణం (II, 1-4-11) పేర్కొంటున్నది. ♦ ప్రజాపతి మొదట యేమీ లేని సమయంలో త్రయీవర్గాలను సృష్టించాడు : (1) భూః, భువః, స్వః, (2) భూమి, ఆకాశము, అంతరాళం, (3) బ్రహ్మ, క్షత్ర, వైశ్య, (4) తాను లేక ఆత్మ, ప్రజ, పశు; యివే వివిధ త్రయీవర్గాలు. ఈగాథలో వేదత్రయం ఉదహరింపబడలేదు. అందువలన తైత్తిరీయ బ్రాహ్మణం మరొక పథకాన్ని వివరించింది. దానిప్రకారం మొట్టమొదట అంతాఒక్కటే బ్రహ్మం. బ్రహ్మనుంచే సృష్టి ప్రారంభమైనది. ఒకొక్క వేదంనుంచి ఒకొక్కవర్ణం వచ్చింది. అయితే ఇక్కడవరస మారింది. ప్రాచీనతమమైన ఋగ్వేదంనుంచి వైశ్యులు వచ్చారు. సామవేదంనుంచి బ్రాహ్మణులూ, యజుర్వేదం నుంచి క్షత్రియులూ వచ్చారు; ఈ రెండు గాథల్లోనూ నాలుగోవర్ణం (శూద్రులు) పేర్కొనబడలేదు. యజుర్వేద-తైత్తిరీయ సంహితలో (VII, 1-1-4) వర్ణవిభాగం మెక్కువ విపులంగా వివరించబడినది; ప్రజాపతికి సృష్టి చేయాలనే సంకల్పంకలిగింది; అప్పుడాతని నోటినుంచీ, యెదురొమ్మూ చేతులనుంచీ, నడుమునుంచీ పాదములనుంచీ నాలుగు

---

♦ ఇతి వై ప్రజాపతిః అజనయత। ఏతదావద్ వైఇదమ్ సర్వమ్.

(1) భూః, భువః, స్వః
(2) ఇమామ్ అజనయత అంతరిక్షమ్ దివమ్
(3) బ్రహ్మ క్షత్రం విశమ్.
(4) ఆత్మా ప్రజాః పశవః

వర్ణాలూ పుట్టుకొొచ్చినవి. ఈ గాథలో ప్రత్యేకత యేమంటే ఒకొొక్క వర్ణమూ ఒక్క దేవత, ఒక్క ఛందస్సూ, ఒక్క పశువుతో పుట్టినవి. వీటిని గురించిన వివరాల్లోకి మనం పోవద్దు. కాని గుర్తించవలసిన దేమంటే మొదటి మూడు వర్ణాలకూ, మూడు దేవతలూ పేర్కొనబడ్డారు. నాలుగో వర్ణమైన శూద్రబానిసకు దేవత ఉదహరింపబడలేదు. మిగిలిన వర్ణాలకువలెనే శూద్రులకుకూడా ఛందము, పశువు, స్తోమమూ (యజ్ఞము) ఉన్నాయి. కాని దేవతమాత్రం లేక పోవడం విచిత్రంగావుంది. ఈ వర్ణాల కీయబడ్డ పశువులు: బ్రాహ్మణులకు మేక, క్షత్రియులకు గొర్రె, వైశ్యులకు ఆవు, శూద్రులకు గుర్రము.

ఈ గాథలన్నిటికీ ఉన్న ప్రధానమైన ఉమ్మడి లక్షణ మేమిటి? ఆర్య చరిత్రకారుడు మనుష్యుడు, ప్రపంచం, పశువు వీటిమధ్య యెంత తికమకలు పడ్డప్పటికీ కొొన్ని విషయాలు మాత్రంమనకుస్పష్టంగా తెలియచెపుతున్నాడు.సృష్టికిపూర్వం అంతా ఒకే బ్రహ్మముండేది. తరవాత మూడు లేక నాలుగు వర్ణాలొచ్చినవి. మొదటి మూడువర్ణాలూ భాగభేదాలు లేని ఒకే గణగోత్ర సంఘంనుంచి వచ్చినవి. అందువలన వాటికి దేవతలున్నారు. నాలుగవవర్ణం పరాయిగణంనుంచి గెలిచి తెచ్చుకోబడిన బానిసలు కాబట్టి, దానికి దేవతలేదు. మనుష్యులూ, వర్ణాలూ, అభివృద్ధియైనకొద్దీ పశువులూ, సంపదా అభివృద్ధియైనవి. వేదాలు విభజింపబడి యజ్ఞ విధాయకమైన ఉత్పత్తి వివిధ దశలలోకి అభివృద్ధియైనకొద్దీ గణంలోవిభాగం పెరిగి,ఖచ్చితమైన వర్ణాలు రూపొొందినవి. మానవుడూ ప్రపంచమూ పరిణామం పొందటంలో ఆనాటి రచయితలు హేతు

రూపమైన క్రమబద్ధతను చూడటానికి మహాప్రయత్నాలు చేశారు. ఈ ప్రయత్నాలవల్ల శాస్త్రబద్ధమూ, చారిత్రకమూ నైన పూర్వాపరసంబంధాన్ని చూడలేకపోయినప్పటికీ, నాటి ప్రధాన సన్నివేశాలనుమాత్రం సూచించగలిగారు. ఇందుకు కారణమేమంటే ఆ రచయితలు చూచినదాన్ని చెప్పారు.

శతపథ బ్రాహ్మణం (XIV, 4-2-23) ఒకవిషయాన్ని యింకా యెక్కువస్పష్టంగా వివరించుతున్నది. ఆదిలో బ్రహ్మ యొక్కటే వుండేదనీ, అది అవిభక్తంగా వుండేదనీ నొక్కి చెప్తున్నది. ఆ బ్రహ్మము తరువాతకాలపు ఉపనిషద్ వేదాంతములో పేర్కొనబడిన బ్రహ్మముకాదని మనం గుర్తుంచుకోవాలి. అయితే యీ అవిభక్తస్థితివలన అభివృద్ధీ, అభ్యుదయమూ కలుగవు. అందువలన అది విభాగమై క్షత్రియులూ, వారికిచెందిన వరుణుడూ మొదలైన వ్యవస్థారూపాలూ పుట్టినవి.*అప్పటికి బ్రహ్మ మభివృద్ధి కాలేదు. అప్పుడు (విశ) వైశ్యులూ వారి గణదేవతలూ పుట్టారు. అలాగే మిగిలిన వర్ణాలూ వారి దేవతలూనూ.

ఆర్యగణాలు యేయే మార్గాల్లో అభివృద్ధిచెందాయో చూచిన జ్ఞాపకాలను వివరించే వేదాలు తెలిపేదేమంటే:

---

* బ్రహ్మవై ఇదం అగ్ర ఆసీత్ ఏకమేవ।
తదేకమ్ సన్నవ్యభవత్।
తత్ శ్రేయోరూపమ్ అత్యసృజత క్షత్రమ్
యాని యేతాని దేవతా క్షత్రాణి ఇంద్రో
వరుణ......మనయేవ వ్యభవత్
సవిశమ్ అశృజత......

ఉత్పత్తి పరికరాలు తెనుగుమీరినకొలదీ, పశువులూ, సంప దలూ పెరిగినకొలదీ, జనసంఖ్య యెక్కువైనకొలదీ గణాలవద్ద నున్న వస్తువులు వివిధరకాలుగా పెరగడంవలన, ఆ గణాలు యితరగణాలతో సంపర్కంలోకి రావడంవలన చారిత్రకాభి వృద్ధి నియమాల ననుసరించి శ్రమవిభజన జరిగింది. ఈ విధి నియమాలతో వర్ణ విభాగ మేర్పడింది. అంతవరకూ పరస్ప రాధారభూతులై, ఒకరికొకరు కట్టుబడియున్న సభ్యులతో ఒకమొత్తంగావున్నగణముస్వతంత్రవర్ణాలుగావిభాగమైంది. స్వతంత్రంగా అక్కడక్కడ చెదురు చెదురుగావున్న వివిధ గణాలు లొంగదీయబడి లేక ఒకపరిధిలోనికికొనిరాబడి, ప్రవర్ధ మానమైన ప్రపంచంలో, పరస్పరాధారాలుగా మారినవి. ఈమార్పుక్రమం మార్క్సు వివరణ కనుగుణంగానే వున్నది. ఈమార్పిడిలో ఉత్పత్తి వినిమయములు, జీవితావసరవస్తువుల మారకమూ ప్రధానాంశములుగా పనిచేసినవి. ఇవి పూర్వ బ్రహ్మను, లేక గణసమాజాన్ని నిర్మించినవి. ఇప్పుడువర్ణవిభా గాలేర్పడి ప్రవర్ధమానమైన నూతన సమాజాన్ని నిర్మించినవి.

సామాజిక శ్రమవిభాగమూ, మారకమూ పరస్పర ప్రభావం కలవి; రెండూకలిసి ఉత్పత్తిని అభివృద్ధిచేసినవి. ఈ దశలో రెండు కొత్త ఉత్పత్తిసాధనాలు కనిపెట్టబడినవి. ఒకటి వ్యవసాయమూ, రెండవది లోహాలను కరిగించడమూ, మగ్గంమీద నేత నేయడం.* నల్లసముద్రప్రాంత మైదానా ల్లోనూ, తురేనియన్ పీఠభూమిపైననూ, "అతిదీర్ఘమై, తీవ్ర

---

* అప్పుడీ దశలో ఋగ్వేదంలో ఉదహరించబడిన అయస్కా రులు(లోహాలుకరిగించేవాళ్ళు) తంతువాయులు (నేతపనివాళ్ళు) ఏర్పడ్డారు.

మైన చలికాలంలో గడ్డి నిలవలులేకుండా, పసులకాపరిజీవనం సాధ్యపడదు. అందువలన అక్కడ గడ్డిని పెంచడం, ధాన్యం పండించడం అత్యవసరమైనది ... ఒకసారి పశువుల కొరకు ధాన్యంపండించగానే, ఆధాన్యం త్వరలో మనుష్యులకుకూడా తిండియైనది.* అప్పుడు వ్యవసాయభూమి గణ సమాజానికి కొత్త ఉత్పత్తి సాధనంగా ఉపకరించింది.

మొదట రాగీ, తగరమూ, వాటి మిశ్రమమైన కంచూ మాత్రమే కరిగించిపోసేవారు. ఇవి రాతిపనిముట్లకు బదులుగా వుపయోగించడానికి వీలులేకపోయినప్పటికీ, యితర వుపయోగాలకు పనికివచ్చే పనిముట్లనూ, ఆయుధాలనూ చేయడానికివుపయోగించినవి రాతిపనిముట్లకుబదులు ఉపయోగించదగినది యినుము ఒక్కటే. ఆభరణాలకు వెండి,బంగారాల నుపయోగించడం ప్రారంభమైంది. ఇంకా డబ్బురూపంలో వుపయోగించడం రాలేదు. వ్యవసాయంతోపాటు వృత్తిపనులు (Handi-crafts) ప్రారంభమయినవి. అయితే యిన్ని పనులూ ఒక్కవ్యక్తి చేయజాలడు. దీన్నుంచే రెండవ శ్రమ విభజన విశాల ప్రాతిపదికమీద జరిగింది. వృత్తిపనులు వ్యవసాయము నుంచి వేరుపడినవి. ఉత్పత్తి యీవిధంగా రెండు ప్రధాన శాఖలుగా చీలడంతో, నేరుగా మారకంకొరకే ఉత్పత్తి జరగడం ప్రారంభమైంది. మారకంతో వర్తకము, వర్తకము పెరుగుదలతో వెండి,బంగారు మొదలైన విలువగలలోహాలకు ప్రాధాన్యత యేర్పడి, డబ్బు సర్వసాధారణమైన (General) సరుకుగా అమల్లోకి వచ్చింది. పూర్వం అందరికీ ఉపయోగ

* ఏంగెల్స్ (కుటుంబం పుట్టుపూర్వోత్తరాలు)

కరమైన సరుకు పశువులు. అవే మారకంలో డబ్బుగా ఉపయోగించినవి. ఇప్పుడు విలువగల లోహములు వాటి స్థానమును ఆక్రమించినవి.

ఈ అభివృద్ధిక్రమంవల్ల గణసభ్యులలో వ్యక్తి సంబంధాలూ, ఆస్తీ, ఉత్పత్తి సంబంధాలూ యెలా మారినవి?

ఈ కొత్త ఉత్పత్తిశక్తులు గణంయొక్క సామాజిక సంబంధాలలోనూ, ఆస్తిసంబంధాలలోనూ విప్లవాన్ని కలిగించినవి.

సామాజిక శ్రమవిభజన రూపమైన వర్ణవిభాగమేర్పడటంతో సమిష్టి ఉత్పత్తి భగ్నమైనదని యిా వరకే చూచాం. సమిష్టిఅగ్ని కేంద్రముగా ఉండి, సాగినసమిష్టిఉత్పత్తీ, సమిష్టి అనుభవమూ తొలగిపోయి, వేరువేరు అగ్నులతో వేరువేరు గృహకుటుంబాలేర్పడినవి. గణముయొక్క సమిష్టి అగ్ని (త్రేతాగ్ని)తోపాటు యిప్పుడు వ్యక్తిగతకుటుంబీకుల ప్రైవేటు అగ్ని "గృహ్యాగ్ని" కూడా వచ్చింది.* సమిష్టి ఉత్పత్తి నశించడంతో ఉత్పత్తి ఫలితాన్ని సమిష్టిగా అనుభవించడం కూడా నశించినది. వ్యక్తిశ్రమ, వ్యక్తి అనుభవమూ, వ్యక్తి

* ఈ దశలో అధర్వణవేదముయొక్క గృహ్యసూత్రాలూ, గృహ్యకర్మలూ వచ్చినవి. దైవదత్తమైన, వేదత్రయ విధాయకమైన సమిష్టి ఆస్తి నుంచీ, త్రేతాగ్నులనుంచీ విడివడి పోయి, పతితరూపమైన ప్రైవేటు ఆస్తి వచ్చింది. కాబట్టి ఆదశకుచెందిన అధర్వణవేదము (గృహ్యకర్మ, గృహ్యసూత్రాలు) మిగిలిన మూడువేదాలవలె పవిత్రములుగా యెంచబడలేదు. వాటి కీయబడిన గౌరవస్థానము దీనికీయబడలేదు. త్రయీవిద్యకు, త్రివిద్యలకు ప్రత్యేక గౌరవమున్నది.

గతమైన మారకమూ ప్రాబల్యాన్ని పొందినది. అంటే గణ సమాజ గర్భంలోనే ప్రైవేటు ఆస్తిబీజ మంకురించింది.

వ్యక్తిగత ఉత్పత్తి, వ్యక్తిగత అనుభవమూవల్ల ఆస్తిలో హెచ్చుతగ్గు లేర్పడుతాయి. అంటే ధనికులూ, బీదలూ, దోపిడీచేసేవారూ, దోపిడీ చేయబడేవారూ, తరువాత శీఘ్రకాలంలో బానిసలూ, బానిస యజమానులూ అని రెండువర్గాలు పుడుతాయి.

ఈ భాగ్యమూ, సంపదలూ ప్రారంభంలో ఎక్కడ కేంద్రీకరణ మౌతాయి? ఎక్కడ ప్రాబల్యం పొందుతాయి?

అభివృద్ధి చెందుతూన్న గణసమాజం మొదట్లో శ్రమ విభజన చేసుకునేప్పుడు యుద్ధాలను నడపడానికీ, గణాన్ని రక్షించడానికీ ప్రత్యేక వ్యక్తులను నాయకులుగా యెన్నుకునే వారు. వీరు క్షత్రియులైనారు. ఇలాగే ఋతుపవనాన్నీ, వరదలనూ, నదులనూ మొదలైనవాటిని పరిశీలించడం, సామాజిక శ్రమను విధ్యుక్తంగా నడపడం మరికొందరి పని యవుతుంది. వీరే బ్రాహ్మణులైనారు. మిగిలిన అత్యధిక సంఖ్యాకులైన♦ పసులకాపరులూ, వృత్తిపనివారూ, వ్యవసాయదారులూ అందరూ (విశ) వైశ్యులైనారు. ఇప్పటికీ వీరంతా ఒకే సమిష్టిగణంలో వుండేవారు. ఐతే శ్రమ విభాగంనుంచి, మారకంనుంచి ఉద్భవించే ప్రైవేటు ఆస్తి యొక్క కేంద్రీకరణ, దోపిడీ చేసేవారు–దోపిడీ చేయబడేవారు అనే రెండు శత్రువర్గా లేర్పడ్డానికి మార్గం సరిచేస్తుందిగనుక పై వర్గాలు సమిష్టిగణంయొక్క విచ్ఛిత్తిని చూచేవరకు పరిపక్వ మవుతూవచ్చాయి.

---

♦ తే భూయాంసః (తైత్తిరీ సంహిత)

తెగలమధ్య యుద్ధాలూ, వస్తువుల మారకమూ, మొదట బ్రహ్మ క్షత్రియ వర్ణాలకుచెందిన గణపతులూ, బృహస్పతులూ లేక ప్రజాపతులద్వారా జరిగేది. యుద్ధంలో చిక్కిన ఖైదీలూ, పసువులూ, సంపదా మొదట వారిదగ్గరకు చేరి, వారిద్వారా గణసభ్యుల కొచ్చేది. సహజంగా వారిద్వారానే వర్తకం అభివృద్ధిఅవుతుంది. అలాగే డబ్బుకూడా.

కాబట్టి సమిష్టివిధానం భగ్నంకావడం ప్రారంభమవడంతోనే క్రమంగా మారకం జరిగేపట్టుల్లో, ఆస్తీ, ధనమూ కేంద్రీకరణమవుతాయి. అంటే ప్రజాపతులూ, గణపతులూ లేక బ్రహ్మక్షత్రియుల చేతుల్లో కూడుతుంది. ఆస్తిగల బ్రహ్మక్షత్రియు లొకవేపునా, కష్టజీవులైన వైశ్యులొక ప్రక్కనా, భాగ్యవంతులూ, బీదలుగా సమాజం చీలే స్థితికి పరిపక్వమై యుంటుంది. వ్యాపారంలో విలువగల లోహాలు (హిరణ్యం=బంగారం) డబ్బురూపంలోకి వచ్చేసరికి ఆస్తీ, భాగ్యము ఒకచోట కేంద్రీకరణం కావడం సులభమై పోతుంది. క్షత్రియులూ, బ్రాహ్మణులూ ధనధాన్య పశువులకూ, తరువాత బానిసలకూ యజమానుల మని పలకడం ప్రారంభమౌతుంది.

అయితే యీ దోపిడీచేసే భాగ్యవంతులనీ, దోపిడీ చేయబడే పేదలనీ వర్గవిభాగము అటు బ్రాహ్మణ క్షత్రియులకూ యిటువైశ్యశూద్రులకూపరిమితమైయుండినది కాదనిగుర్తుంచుకోవాలి. బ్రాహ్మణులలోనూ, క్షత్రియులలోనూ అత్యధిక సంఖ్యాకులు దోపిడీవర్గంగా యేర్పడినప్పటికీ వైశ్య, శూద్రులతోపాటు బీదలైన బ్రాహ్మణులూ, క్షత్రియులూకూడా కొందరుండేవారు.

బానిసవర్గము లేక శూద్రవర్ణము పుట్టడంతో బాటే మిగిలిన వర్ణ త్రయము కూడా పుట్టడానికి కారణమేమిటి? వర్ణాలు పుట్టడానికి కారణమైన శక్తినుంచే బానిసవిధానము కూడా పుట్టుకొస్తుంది. శ్రమ వైవిధ్యమూ, శ్రమయొక్క-ఉత్పత్తి రేటూ, మారకమూ, ప్రైవేటు ఆస్తీ యీవర్ణాలకూ, బానిస విధానానికీ పుట్టు కారణము. "మనుష్యులు మారకం ప్రారంభంచేసిన వెంటనే మనుష్యులనే మారకం వేయడం ప్రారంభమవుతుంది." (ఏంగెల్స్)

ఏంగెల్స్ యిలా అంటున్నాడు:

"పశువుల పెంపకమూ, వ్యవసాయమూ, గృహపరిశ్రమలూ, అన్ని శాఖల్లోనూ ఉత్పత్తి పెరగడంవలన మానవశ్రమ శక్తికి, అది మరల పుంజుకోడానికి అవసరమైనదానికన్నా అదనంగా ఉత్పత్తిచేసేవీలు కలుగుతుంది దీనితోపాటు ప్రతిగణసభ్యుడూ గణ కుటుంబీకుడు కానీ, వ్యక్తిగత కుటుంబంలోవాడు కానీ చేయవలసిన నిత్యశ్రమ యెక్కువైనది. ఇలాంటి సమయంలో కొత్తశ్రమశక్తులను ఉపయోగంలోకి తీసుకురావలసిన అవసరం యేర్పడుతుంది. కొత్తశ్రమశక్తులు యుద్ధంనుంచి లభిస్తాయి. యుద్ధఖైదీలు బానిసలుగా మార్చబడతారు. శ్రమయొక్క-ఉత్పత్తిరేటూ, సంపదా పెరగడం, ఉత్పత్తిరంగము విస్తరించడమూ జరగడంవల్ల మొదట విస్తృతరంగంలో జరిగినశ్రమ విభజనయే నాటి సాధారణ చారిత్రిక పరిస్థితులలో తప్పనిసరిగా బానిసవిధానానికి దారితీస్తుంది. విశాలమైన రంగంలో జరిగిన మొదటిశ్రమవిభజననుంచి సమాజంలో మొట్టమొదట చీలిక ఏర్పడ్డది; సమాజం రెండువర్గాలుగా చీలింది: యజమానులూ-బానిసలూ, దోపిడీచేసేవారూ-దోపిడీ చేయబడే

వారూ''. యజ్ఞవిధాయకమయిన వుత్పత్తిని సాగిస్తూ వుండే ఆదిబ్రహ్మాలో లేక ఆదిమ కమ్యూనిస్టు గణంలో బానిసత్వానికి గానీ, శూద్రుడికి గానీ చోటులేదని యీవరకే చూచాం. అందువలన గణముల మధ్య యుద్ధాలు జరిగినప్పుడు పురుష మేధ విధిప్రకారం యుద్ధఖైదీలను చాలభాగంచంపివేసేవారు. కొత్త ఉత్పత్తిసాధనాలయొక్క, కొత్త ఉత్పత్తిశక్తులయొక్క సహాయంవలన మానవుడికి శ్రమశక్తి గణముయొక్క అనుభవానికీ, పునరుత్పత్తికీ అవసరమైన దానికన్నా అదనంగా ఉత్పత్తి చేయగలిగిన స్థితి వచ్చినప్పుడు, యుద్ధ ఖైదీలను చంపకుండా, ఉపయోగించడానికి వీలుకలిగింది. యజమానులుపయోగించుకోగా మిగిలిన దానినుంచి బానిసలకు తిండి పెట్టి, వారిని పనిలో నియోగించవచ్చును. బానిసవిధానము వచ్చినదనగానే యజ్ఞవిధాయకమైనజీవితంగలచారిత్రకరంగం నుంచి జనమేజయుని సర్పసత్ర యాగంలోవలె యుద్ధఖైదీలను చంపివేసే సత్రయాగం నిష్క్రమించింది. గణయుద్ధాలలో ఓడి ఖైదీలైనవారికప్పుడు ఆర్యసమాజనిర్మాణంలోశూద్రవర్ణంగా నాల్గవస్థాన మీయబడ్డది. ఆర్యసమాజం మొత్తంగా స్వేచ్ఛా స్వతంత్రాలు కలిగియుంటూరు; యుద్ధంలో ఖైదీలుగాగానీ, యితరవిధంగాగానీ చేజిక్కిన అనార్యులపైన యజమానులౌతారు. అనార్యులైన శూద్రవర్ణంవాళ్లు ఆర్యసమాజంవాళ్ళకు సేవకులు. శూద్రుణ్ణి అమ్మివేయవచ్చును, అద్దెకీయవచ్చును, చంపివేయవచ్చునుకూడా. ఆతనికి ఆస్తిగానీ, కుటుంబంకానీ, గణదేవతకానీఉండటానికివీల్లేదు. సృష్టిక్రమంలోయితరులకువలెనే అతనికికూడా జంతువునొకదానిని-యుద్ధంలో అత్యవసరమైన గుర్రం మీయబడినప్పటికీ దాని అర్థము అతను

యుద్ధనాయకుని క్రింద లేక గణసంఘ నాయకుడికింద అతను గుర్రమువంటివాడు అని మాత్రమే. అంటే క్షత్రియు డతనిని జంతువువలె గణసభ్యులమధ్య పంచివేయవచ్చును. అమ్మి వేయవచ్చును. ఆ యజమాని అతనిచేత పని చేయించు కొనవచ్చును. అంతవరకే అతని గుర్రాసికున్న అర్థము.*

బానిసవిధానం ప్రారంభదశలో పితృస్వామికరూపంలో పనిచేస్తుంది. గృహకుటుంబంతో అంటిపెట్టుకుని యుంటుంది. ఇందులో బానిసలు, పితృస్వామిక కుటుంబంలోని స్త్రీ పురుషులు, కొడుకులు కూతుళ్ళతోపాటు గృహపతి అజమాయిషీ క్రింద పనిచేస్తారు. కాని తరవాత మారకమూ, వర్తకమూ, వాటికోరకే వస్తూత్పత్తి జరగడమూ అభివృద్ధియైనప్పుడూ బానిసలు యింకా యెక్కువ కఠినమైన పనులకు వినియోగింపబడతారు. చేతిపనులలోను, గనులలోను, పొలాలలోను, మొదలైనచోట్ల పనిచేయడానికి మందలుమందలుగా మళ్ళవేయబడతారు. బానిసవిధానానికుండే పితృస్వామిక స్వభావం మారిపోతుంది. బానిసపాలిటికి ప్రాణాలుతోడే నిరంకుశత్వం, బానిస యజమానికి సంపదలను కూడబెట్టాలనే దురాశా పెరుగుతాయి. ఋగ్వేదకాలానికి బానిసవిధాన మింకా వ్యాపారసరళిలో పడలేదు. అయితే త్వరలో అది సంభవించేస్థితిలో వున్నది. ఋగ్వేదకారులకు యీ నూతనంగా వచ్చిన సాధనమంటే అపరిమితమైన ఆనందం పుట్టుకొచ్చింది;

---

* తస్మాత్ తౌ భూతసంక్రామిణౌ । అశ్వాశ్చ శూద్రాశ్చ, తస్మాత్ శూద్రో యజ్ఞే అనవక్లుప్తో నహి దేవతాః అన్వసృజ్యంత । తస్మాత్ పాదౌ ఉపజీవితః ॥ (తైత్తిరీయసంహిత 7-1-1-4)

బానిసలు వారి యజమానుల కిచ్చిన సంతోషానందాలను గురించి గొప్పగా కీర్తించాడు. బానిస విధానాన్ని గురించిన యీ పొగడ్త అంతా హిందువులకు దైవదత్తములైన వేదములద్వారా దాసత్వం సంక్రమించింది. ఈ కొత్తవిధానంలో బానిసకు లభించే దయాదాక్షిణ్యాలు లేక మెహర్బానీలు యెలాంటివి? పూర్వం బానిసను పురుష మేధాగ్నిలో ఒక్కమూకుగా కాల్చి చంపివేసేవాడు. నేడు అతని ప్రాణం పోకుండా అట్టిపెట్టి, ఆక్యద్విజుల దోపిడీ అనే సన్నసెగలో అనుక్షణమూ కాగుతూండటానికి అవకాశం కల్పించాడు. పురుషసూక్తాన్ని కమ్మగా గానంచేసే అవకాశం ద్విజులకు కలిగింది. స్వేచ్ఛనుంచి ఓటమికి, శూద్ర బానిసత్వానికీ, సర్వనాశనంనుంచి సత్యాదోపిడీకీ-ఇవి నాటి సామాజిక పరిణామదశలో ముందడుగేనని చెప్పాలిగదా? బానిసకు ప్రాణం వచ్చినది; బానిసయజమానికి సంపదవచ్చింది. అతనా సంపద నాధారంగా చేసుకొని, ఉత్పత్తిశక్తుల నింకా అభివృద్ధిచేసి, యింకా మంచిదశకు పోగలడు. నాటి పరిస్థితులలో బానిసవిధానంద్వారానే అలా జరగగలదు. ఐతే గెలిచిన ఆర్యులు అలా వాదించలేదు. బ్రహ్మ శూద్రుణ్ణి బానిసత్వము కొరకే సృష్టించాడు. మిగిలిన మూడు వర్ణాలకూ ఆర్యులకతడు దాస్యంచేయాలి. శూద్రుణ్ణి సృష్టించినందువల్ల బ్రహ్మాభివృద్ధి జరిగిందనికూడా అంటారు. ఐతే పాపం యీ బ్రహ్మ పూర్వపు ఆనందమయబ్రహ్మ కాదు.

వ్యాకరణనాటి బానిసత్వాన్ని, వర్ణత్రయాన్ని, శూద్రులనూ, వర్గభేదాన్ని, వర్గకలహాన్ని సృష్టించడమే

ఆదిబ్రహ్మ లేక యజ్ఞపురుషుడు చేసిన చిట్టచివరి ఘన కార్యము. ఇప్పుడు వ్యవసాయమూ, వృత్తిపనులూ, మారకమూ, ప్రైవేటుఆస్తీ, వర్ణాలూ వచ్చినవి. వీటివలన అనేక సంఘటనాపరంపరలు సంభవించినవి. వర్గపోరాటమూ, వర్గ రాజ్యాంగమూ వచ్చాయి. బ్రహ్మను మరల పుటక లేకుండా చంపివేసినవి. మహాభారతం (బ్రహ్మనాశక) బ్రహ్మ చనిపోయినాడని విలపించింది ఇది యెలాగో చూద్దాం.

# తొమ్మిదో అధ్యాయం

## గణ సమాజంయొక్క మరణ వేదన

### (ప్రైవేటు ఆస్తిపై పోరాటం)

ఉత్పత్తి అయ్యే వస్తువులలో రకాలూ, విధులూ పెరగడంవల్ల వర్ణరూపమైన శ్రమవిభాగం అవసరమైంది. ప్రైవేటు ఆస్తీ, మారకంకోరకే లాభంకోరకే సరుకులను చౌకగా తయారుచేయడానికి పిచ్చెత్తినట్లు పోటీపడటమూ వచ్చి సమాజాన్ని ముంచెత్తినవి. ఇది జరగనంతవరకూ సామాజిక విభాగం కేవలంవస్తువుల నాణ్యమునూ, ఉపయుక్త విలువనూ పెంచడంద్వారా ఉత్పత్తిని అభివృద్ధిచేసింది. "సామాజిక ఉత్పత్తిశాఖలు విడిపోవడంవల్ల సరుకులు ఎక్కువ నాణ్యముగాతయారౌతాయి. పనిచేసేవారు తమతమఅభిరుచులనుబట్టీ,నైపుణ్యాన్నిబట్టీ వృత్తులను ఏరుకుంటారు. ఇందులో ఎంతోకొంత అదుపు (Restrain) వుంటేనేకాని మంచి ఫలితాలు కలగడం అసంభవం. అందుచేత శ్రమవిభజనవల్ల వస్తువుల నాణ్యమూ, వాటిని తయారుచేసేవారి నైపుణ్యమూ రెండూవృద్ధిఅవుతాయి." (మార్క్సు కేపిటల్, 1 సం. ఎల్లెన్ అన్విన్) వర్ణముతో వృత్తిసామ్యతను కలిగియున్నంతవరకూ

ప్రాచీన వైదికసమాజంలోని వర్ణవిభాగంకానీ, తరువాత కాలపు వ్యవస్థగానీ నిలదొక్కుకొనగలగడానికి శ్రమవిభజనయే కారణము.

అయితే ఉత్పత్తిపరికరాలు తగినంత అభివృద్ధిపొందక కేవలం వ్యవసాయమూ, వృత్తిపనులమీద ఆధారపడి యున్న సమాజంలోనే అలాంటి శ్రమవిభాగం సాధ్యపడుతుంది. ప్రాచీన మధ్యయుగాలనాటి భారతదేశ పరిస్థితి అలాగే వుండేదని చూచాం. పనిముట్లలో విప్లవాత్మకమైన పరిణామాలు కలిగి, ఆధునికపరికరాలు లభించగానే పాత సామాజిక నిర్మాణంయొక్క ఉపయోగమూ, అవసరమూ తొలగిపోయి పతనమైపోతుంది.

బానిసవిధానమూ, ప్రైవేటు ఆస్తీ ప్రాచీన గణ సమాజంయొక్క ఆర్థికవిధానంలో ప్రవేశించి పరస్పర విరోధ ప్రయోజనాలు కలిగిన వర్గాలను సృష్టించినవి. అలా జరగక పోయియున్నట్లయితే వర్ణవ్యవస్థ సంఘర్షణకూ, వర్గపోరాటానికీ లేక వర్ణపోరాటానికీ దారితీసి యుండెడిదికాదు.

ఇది ఒక అపూర్వమైన పరిణామం. గణసమాజానికి యిది దిగ్భ్రమ కలిగించింది. అత్యధిక సంఖ్యాకులు బీదలుగా వుండే గణసభ్యులదృష్టి కిది అందని విషయం. గణసమాజ ప్రజాస్వామికంలో వర్ణాలు వాటివాటి కార్యకలాప రంగాలను అభివృద్ధిచేసుకుని, తత్ఫలితాలను అనుభవించడానికి స్వేచ్ఛ వుండేది. ఒక్కొక్క వర్ణము ఏ పనిచేయాలి; ఎంత సంపాదించాలి; ఎలాసంపాదించాలి; ఎలా నడుచుకోవాలి? ఈ విషయాల నన్నిటినీ, వర్ణాశ్రమధర్మాలు గణసమాజ

మంతటియొక్క శ్రేయస్సుకొరకూ, సౌఖ్యంకొరకూ నిర్ణయం చేసినవి. పూర్వపు కృత త్రేతాయుగాల్లో వర్ణవిభాగాలు అవసరమని తోచలేదు. ఆ రోజుల్లో యజ్ఞకర్మ ఫలితాలను అందరూ పంచుకునేవారు. దరిద్రాన్నికూడా సమంగానే పంచుకొనేవారు. అదే పావనం. సమిష్టిశ్రమలో వైవిధ్యమేర్పడటంవల్ల గణంలో వర్ణవిభాగమూ, దానికి తగిన వస్తు పంపకమూ వచ్చినవి. కాని యిప్పుడు దరిద్రాన్నీ, భాగ్యాన్నీ అందరూ సమానంగా పంచుకునే బదులు కొందరికి భాగ్యమూ, మిగిలినవారికి దరిద్రమూ పంపకమైనవి.

యజ్ఞవిధాయకమైన ఉత్పత్తిని డైరెక్టు చేయడానికి ఎన్నుకోబడ్డ బ్రాహ్మణులు సామాజిక ఆర్థిక విధానాన్ని నడిపేవారైనారు. డైరెక్టుచేయడంలోనూ, శ్రమనైపుణ్యం (టెక్నిక్) లోనూ వారికి యెక్కువ పరిజ్ఞానం వుండటంవలన వారికే సమాజంలో అధికప్రాబల్యం కలిగింది. ఇదివరకు వారి శ్రమఫలితాన్ని అందరూ పంచుకునేవారు. ఇప్పుడు వారి శ్రమఫలితం వారి సొంతసొత్తుగా దక్కింది. యుద్ధాన్ని నడపడాని కెన్నుకోబడిన క్షత్రియనాయకులు కూడా యింతే చేశారు. "విశ" అంటే సామాన్యప్రజలయొక్క ప్రజాస్వామికంలోనే, శూద్రులతో సహా అందరూకలసి దరిద్రాన్నీ, కఠినశ్రమనూ సమానంగా పంచుకునేవారు. వ్యక్తిగత ఆస్తీ, వ్యక్తిగత అనుభవమూ, వ్యక్తిగత భాగ్యమూ వచ్చేప్పటికి ఉమ్మడి ఆస్తికి చిరాకెత్తి సణిగింది. యజ్ఞవిధాయకమైన గణసమాజంలో కొందరికి తిండీ, మిగిలినవారికి పస్తులూ అనే పద్ధతిని ఎవ్వరూ యెరుగరు. నాటి గణసమాజంలో నూతనంగా ప్రత్యేకమైన విషఫలం (హిరణ్యం)

బంగారంకోరకు తాపత్రయపడటమూ యెరుగదు. ఆనాటి యింద్రుడు రాళ్ళతోటీ, యెముకలతోటీ పోరాడాడు. ఆవులనూ, పచ్చికబీళ్ళనూ, నీళ్ళనూ గెలుచుకొచ్చాడు. అతడూ తాగేవాడు; గర్జించేవాడు. అంతేకాని ఆ రోజుల్లో యెవరూ తమ స్వంతంకోరకు సంపదను కూడబెట్టలేదు. ఆ రోజులలో వారొక చిన్నగణంగా, చిన్నజనపదం (అశ్మవ్రజం)గా వుండేవారు. అందరూ గణాగ్నిచుట్టూ కూచునేవారు. గణజనని చేతులుమీదుగా భుజించేవారు. సమిష్టిగా గానంచేసేవారు. బీదతనంలోకూడా అందరూ సంతోషంగావుండేవారు.

కాని యిప్పుడో! ఋగ్వేదకవి యిలా విలపించాడు; "దేవుడు మనుష్యునికి విధించిన శిక్ష క్షుద్బాధయేనా? బీదలే ఆకలితో చావాలని దేవుడి యిచ్ఛఅయితే మరి భాగ్యవంతులెందుకు చిరంజీవులుగా ఉండటంలేదు? ఆ స్త్రీగల బుద్ధిహీనుడి చేత ఆహారమంతా చేరిపోవడంవల్ల మిగిలినవాళ్ళ కేమీ ప్రయోజనంలేదు. తనకు తాను తింటాడు. స్నేహితులకు పెట్టడు. అతడు నిందలపాలౌతాడు." (ఋగ్వేదం, X-117)

మారకమూ, మార్కెట్టూ, వ్యక్తిగతశ్రమ, వ్యక్తిగత అనుభవమూ రావడంవల్ల డబ్బుకోసం, పనికోసం, వస్తువులనూ శ్రమశక్తినీ కొనేవారికోసం తాపత్రయంగా ఎదుర్కోవలసిన పరిస్థితు లేర్పడ్డవి.

దీనిని వేదకారు డిలా నిరసించాడు :

"మన కిప్పుడు అనేక కోరికలు, అనేక పనులు, అనేక బుద్ధులు పట్టుబడ్డాయి. వడ్రంగి రంపపుమోతను చెవి కోసుకుంటాడు. వైద్యుడికి రోగికావాలి, బ్రాహ్మణునికి పూజచేసే

వాళ్ళు కావాలి, కమ్మరిడాకలి, "తిత్తులు" కొలిమీ, కొయ్యా చుట్టూ ఉంచుకుని, ధనవంతుడికోసం యెదురుచూస్తుంటాడు. నాతల్లి రోటిదగ్గర ధాన్యం దంచుతుంది. పసులకాపరి ఆవుల వెంట పరిగెత్తినట్లు మేము డబ్బుకెంబడి పరుగెత్తుతున్నాం."
(ఋగ్వేదం IX, 111-1-3)

ఇటీవలి ఋగ్వేద మండలాల్లో అప్పులపాలైన జూదరి, బానిసలూ, మనిషికీ మనిషికీమధ్య అసూయా, క్రోధము మొదలైన విషయాలనుగురించి చెప్పబడినది.

అమ్మకపు సరుకులు గణసమాజంలో ప్రవేశించి, దాని సమిష్టిజీవితాన్ని భగ్నంచేసినప్పటి దృశ్యం ఇదీ. ఇదివరకు ఉత్పత్తిదారు తా నుపయోగించటంకొరకే ఒక వస్తువును తయారుచేసినప్పుడు అతని కా వస్తువుమీద కంట్రోలుండేది. సమాజానికి సమిష్టిగా సమాజంయొక్క ఉత్పత్తిమీదా వస్తువులమీదా కంట్రోలుండేది. వారి వస్తువేదో వారికి తెలిసి వుండేది. దానిని వా రనుభవించేవారు. అది వారి చేతులనుంచి జారిపోవడంగాని, వారిని మాయచేయడంగాని జరిగేదికాదు.

కాని సరుకుల ఉత్పత్తీ, మారకమూ రావడంవల్ల వస్తువులు చేతులు మారేవి. ఉత్పత్తిదారు తనవస్తువును మారకంలో వదులుకునేవాడు. తరవాత దాని గతేమాతుందో వానికి తెలియదు. ఈ పద్ధతిలో కొత్తగా డబ్బూ, కొత్తగా వర్తకులవర్గమూ, మార్కెట్టు అనే ఒక కొత్తశక్తీ వస్తాయి. వీటిని యిదివర కెవ్వరూ యెరుగరు. మార్కెట్టుకూ, డబ్బుకూ, గిరాకీకీ, ఛాన్సుకూ ఉత్పత్తిదారు లొంగిపోతాడు; అతను తయారుచేసిన వస్తువుకూడా లొంగియి

పోతుంది. ఉత్పత్తిదారు తన శ్రమఫలితాన్ని నేరుగా అనుభ వించడు. అంతా "కర్మ"మీద ఆధారపడివుంటుంది. అతని జీవితాన్ని, శ్రమ శక్తులనూ చూడరాని, తెలియరాని, కంట్రోలు కందని విరోధశక్తి లేవో కబళించివేశాయి. ప్రాణమున్నా, బలమున్నా వాటివల్ల అతనికి తిండి గడవ వచ్చు, గడవకపోనూవచ్చు. ఈ విధంగా భాగ్యవంతులకూ, పేదలకూ, కొత్తగావచ్చిన దోపిడీవర్గాలకూ దోపిడీ చేయ బడేవర్గాలకూ మధ్య ఘర్షణ పెరుగుతుంది.♦

యజ్ఞవిధాయకమైన గణసమాజము ముందెన్నడూ కలలోనైనా ఎరుగని సంఘర్షణలు గణసమాజ గర్భంలో పెరిగి బలవంతంగా బయల్పడతాయి. గణసమాజం సృష్టిం చిన సంపదపై కంట్రోలుసహించడానికి ఆర్థికప్రాబల్యంకల వర్గంలోని రెండు బలవత్తరమైన ముఠాలు దౌర్జన్యయుత మైన ఘర్షణలోకి దిగుతాయి. అసంఖ్యాకులైన వ్యవసాయ దారుల ప్రజాస్వామికమూ, శూద్రులూ ఉత్పత్తిచేసిన సంప దను వశంచేసుకోడానికి బ్రాహ్మణ, క్షత్రియ వర్ణాలు పర స్పరం పోరాటాల్లోకి దిగుతాయి. దోపిడీలో మిరాశీహక్కు కొరకు వారిలో వారు కలహించుకుంటూనే, ప్రాచీన సాంప్ర దాయకమైన గణజీవితం కొరకూ, ధర్మం, నీతినియమాల

♦ ఇప్పుడు హిందూసంఘంలో "కర్మ", "కర్మవిముక్తి" మోక్షమూ మొదలైన వేదాంతసమస్యలు తలెత్తుతాయి. వైదికగణంలో యిలాంటిసమస్య లుండేవి కావు.

కింతు కర్మస్వభావోఽయం జ్ఞానం కర్మేతి వా పునః ।
పౌరుషం కారణం కేచిదాహుః కర్మసు మానవాః ।
దైవమేకే ప్రశంసంతి స్వభావ మపరే జనాః ॥
(మహాభారతం శాంతి; 244-4)

కోరకూ, ఆర్థిక నిర్మాణ విధానాలకోసమూ యింకా పోరాడుతూండే ప్రజాసామాన్యంపై సమాత్రం కలిసి దాడిచేస్తారు. ఉమ్మడిభూమిమీద, సమిష్టివుపయోగంకోసం జరిగే ఉమ్మడి వ్యవసాయంమీద ఆధారపడ్డ సమిష్టి జీవితవిధానం, పోరాడ కుండా ప్రైవేటుఆస్తికి లొంగదు. ప్రాబల్యంగల వర్ణాల యొక్క-వర్గాలయొక్క వ్యక్తిగత ప్రయోజనాలకు అవిభక్త బ్రహ్మ (గణం) లొంగక ప్రతిఘటిస్తుంది. అంతర్యుద్ధం ప్రారంభమౌతుంది. ఈ అంతర్యుద్ధం చరిత్రలో అనేక సంవత్స రాలు నడిచినవని వేదాలూ, యితిహాసాలూ తెలుపుతున్నవి.

బాగా అభివృద్ధికాక యింకా ప్రారంభదశలోనే వున్న దోపిడీవర్గము మొదట యీ పోరాటాల్లో ఓడిపోయింది. కృష్ణ యజుర్వేదంలోని తైత్తిరీయారణ్యకం(V-1)యొక్క-ఆఖ్యాయి కలో విష్ణువుకూ, దేవతలకూ మధ్య యుద్ధం జరిగినట్లు ఒక గాథ వున్నది. ఆ యుద్ధం పైన పేర్కొనబడిన అంతర్యుద్ధ స్మృతిచిహ్నమై యుండవచ్చును. పౌరాణిక సాంప్రదాయ కమూ, అనాగరికమూ అయిన తొడుగుల నన్నిటిని వొలి చేస్తే, ఆ గాథ ఉభయ శత్రువర్గాలమధ్య జరిగిన పోరా టాన్ని యీ క్రిందివిధంగా వర్ణిస్తూంది :

పూర్వకాలంలో దేవతలు ఒక సత్రయజ్ఞం చేశారు. ఇది యజ్ఞవిధాయకమైన సమిష్టి ఉత్పత్తివిధానమని యీ వరకే చూచాం. యజ్ఞం ప్రారంభం చేసేముందు వారొక ఒప్పందాని కొచ్చారు. సత్రలభ్యమైన వస్తువుల నన్నిటినీ అందరూ సమంగా పంచుకోవాలి. (సత్రయజ్ఞమంటే యిదే అయినప్పటికీ, విస్పష్టంగా ఉండటం కోసం తరవాతికాలపు

రచయిత యిలా ఉదహరించాడు. ఇలా స్పష్టంగా ఉండడం చరిత్ర కుపయోగకరము.) యజ్ఞంలో చేరినసంఖ్యా, యజ్ఞాగ్ని హోత్రమూ చాలా పెద్దవై చాలా స్థల మాక్రమించినవి. కురుక్షేత్రము వేదికయైనది. వేదికకు దక్షిణదిక్కున ఖాండవ దేశమున్నది. వేదికకు పడమటి అంచు నానుకుని పరిణత మున్నది. (పరిణతమంటే చక్కగా పెంచిన పచ్చికబీడు) ఉత్తరాన తుఘ్నభూమి, అంటే తురుఘ్న లేక తూర్వస గణాలు నివసించే దేశమున్నది నీటిసదుపాయంలేనిమరుదేశం లేక మార్వార దేశం సత్రసమయంలో ఎరువుదిబ్బ కుపయోగించారు. సత్రయజ్ఞంలో పాల్గొనే ప్రతివారూ ఋత్విజులేననీ, ప్రతివారూ గృహపతులూ యజమానులూననీ మన మెరుగుదుం కాబట్టి, శ్రమచేయడంలోనూ, అనుభవించడంలోనూ అందరికీ సమానహక్కు లుంటాయి. కాని, అక్కడ చేరినవారందరూ ఒక యజమానిని యెన్నుకుంటారు. దేవసత్రంలో విష్ణువును గృహపతిగా, లేక యజమానిగా యెన్నుకున్నారు. యజ్ఞం ప్రారంభమైంది. నిజంగా అది సమిష్టి కార్యమైనప్పటికీ "విష్ణువు సత్రయజ్ఞంచేస్తున్నాడని" ప్రతీతి వ్యాపించింది. విష్ణువు తన "కర్తృత్వం" లో జరుగుతున్న సత్రయజ్ఞ ఫలాన్నంతటినీ తానే కాజేయాలనుకున్నాడు. అతనికి గర్వమెక్కింది. వెంటనే దేవతలకు బహిరంగ శత్రువైపోయినాడు. అందువలన దేవతలు తమపాలు తాము లాక్కోడానికి విష్ణువుపై దాడిచేశారు. కాని, విష్ణువు వేదమంత్రనియుక్తుడై పవిత్రుడైన నాయకుడు కాబట్టి యజ్ఞశ్రమ నియమాన్నిబట్టి అతని కొక్కడికే ఆయుధాలున్నవి.

ఆయుధ రహితులైన దేవతలు ఆయుధాలుకల విష్ణువును చూచి పారిపోయారు. విష్ణువు జయించానుగదా అన్న గర్వంతో తర్వాత రక్షణ జాగ్రత్తలు తీసుకోక నిర్లక్ష్యం చేశాడు. అతడు ప్రమత్తుడైనాడు. అతనికి పూర్వమున్న "యజ్ఞ తేజస్సు" (పోరాడటానికీ, జయించడానికీ అవసరమైన శక్తి)పోయింది. యజ్ఞతేజస్సు విష్ణువును వదలిపెట్టడంతోటే, దానిని దేవతలు శ్యామత ఓషధులలో పూడ్చివేశారు. దేవతలు యెక్కడి వారక్కడికి పోవడంచూచి, విష్ణువు తన విల్లును నేలపైబెట్టి దాని చివరను గడ్డమానించుకుని పడు కున్నాడు. దేవతలు చెదపురుగులనుపంపి ఆవింటినారిని కొరికి వేయమన్నారు. నారి తెగగానే విల్లు తటాల్న అదిరిపడ్డది. ఆ అదురుతాకుడు విష్ణువుతల తెగి యెగిరిపోయింది. అప్పుడు యజ్ఞ పురుషుడైన విష్ణువుయొక్క కళేబరాన్ని అగ్ని, యింద్రుడూ విశ్వేదేవులు పంచుకున్నారు. అయితే అది వట్టి మొండెమే కాబట్టి, దాన్నుంచి యజ్ఞఫలం పొందడానికి వీల్లేకపోయింది. అప్పుడు వారు దేవవైద్యులైన అశ్వినీదేవతలను పిలిపించారు. వారూ యజ్ఞఫలంలో భాగం వాగ్దానం చేయించుకుని, కళే బరానికి తల నతికించారు. యజ్ఞం ఫలించింది.

పైన యిచ్చిన అంతర్యుద్ధగాథ బహుశా ఆర్యసమా జంలో ప్రాచీనతమమైన అంతర్యుద్ధాన్నిగురించిన దనడానికి సందేహంలేదు. సమిష్టి ఉత్పత్తి వినిమయాలలోని సమా నత్వము పదచ్యుతమై నాశనము చేయబడుతున్నది. అసమా నతా, ధనికులకూ, బీదలకూమధ్య సంఘర్షణ, గణసమాజం (గాథలో పేర్కొనబడిన యజ్ఞపురుషుడు) మూడు వర్ణాలుగా విభాగం కావడం అమల్లోకి వస్తున్నాయి. గాథలో అగ్ని

దేవుడు బ్రాహ్మణ వర్ణానికీ, యింద్రుడు క్షత్రియవర్ణానికీ, విశ్వదేవుడు వైశ్యులకూ సంకేతం (గుర్తు)గా ఉపహరించ బడ్డారు. పవిత్ర మంత్రనియుక్తుడైన నాయకుడిరూపంలో, నూతన చట్టము, లేక నూతనమైన రాజ్యాంగయంత్రము అమల్లోకి రావడానికి పోరాడుతున్నది. సమాజం ఉత్పత్తి దారులనీ, వారి అదనపు ఉత్పత్తిని హరించేవారనీ రెండు వర్గాలుగా చీలిపోయినది. దోపిడీ చేయబడే బీదలు తమయొక్క సత్రయజ్ఞ విధాయకమైన హక్కులనూ, సమిష్టి విధానాన్నీ వదులుకొని, దోపిడీదారులకు లొంగిపోవడమో, లేక యెది రించి పోరాడటమో, రెండే మార్గాలున్నవి. దీన్నిబట్టి ఆ సమాజం ఐక్యతకు అవకాశంలేని రెండు శత్రుశిబిరాలుగా చీలిపోయినట్లు అంగీకరింపబడింది. ఇది ఐతరేయ బ్రాహ్మణం లోని కథకుడు చెప్పదలచిన కథావిశేషము. అంతర్యుద్ధం మొదట్లో గణసమాజంచేత సమిష్టిగా ఎన్నుకొనబడిన నాయ కుడు విష్ణువు సామాజిక శ్రమఫలితాన్ని స్వంతంగా కాజేయ డంలో విఫలుడైనప్పటికీ-అంటే మొదటిపోరాటాల్లో "సత్ర" యజ్ఞ విధానమే గెలిచినప్పటికీ, నూతన వర్గాధికారమూ, దాని సాయుధబలములతో కూడిన రాజ్యాంగమూ దోపిడీ చేయబడే కష్టజీవులను అణచివేసే శక్తిగా, సాధనంగా యెలా రూపొందుతున్నదీ యీ గాథవలన తెలుసుకొనవచ్చును. ఈ కథకుడు పోరాటాలు జరిగిన కాలానికి చాలాదగ్గరివాడు; కాబట్టి సత్రవిధాయకమైన శ్రమలోనూ, నాటి గణసమాజం లోనూ చెలరేగిన ఆర్థిక వర్గవైషమ్యాల వివరాలను దాచ లేక పోయినాడు.

గణసమాజంయొక్క పూర్వదశలలో సోదరుడికీ సోదరుడికీమధ్యరక్తబంధువులమధ్య యుద్ధాలుజరగడంమెరుగరు. ఒక తెగ మరో తెగతో యుద్ధంచేసేది. అదితి కొడుకులు దితి కొడుకులతో పోరాడారు. వినత కొడుకులు కద్రువ కొడుకులతో పోరాడారు. కాని అదితి కొడుకులు తమలో తాము కలహించుకోవటం యెవ్వరూ విన్నదికాదు. వసుగణాలు తమలోతాము తమ గణగోత్రీకులతో, తమ యజ్ఞసంఘీయులతో కలహించారనేది యెక్కడా అవుపడదు. వర్గకలహం వర్ణకలహంలాంటి అంతర్యుద్ధమనేదానికి ప్రాచీనకాలపు యజ్ఞసంఘంలో తావులేదు. ఎందుకంటే నాటి గణసమాజాలలో ప్రైవేటు ఆస్తీ, దోపిడీ అనేవిపుట్టలేదు. ఇవి పుట్టగానే గణానికీ గణానికీ మధ్య యుద్ధాలకుతోడు, గణాలలోనే అంతర్యుద్ధాలు ప్రారంభమైనవి. బానిసలకొరకూ పశువులకొరకూ, సంపదలకొరకూ ఒకగణం మరొకగణంతో పోరాడింది. అదైన తరువాత దానిని ప్రైవేటుఆస్తిగా మార్చుకొని స్వీయగణంలోనే ఉండేకష్టజీవులను బానిసలనుగా మార్చటానికి, వర్ణయుద్ధాలూ, వర్గయుద్ధాలూ సాగించారు. విష్ణుపురాణగాథ యిలాచెపుతున్నది:భగవంతుడు వివిధవర్ణాలనుసృష్టించాడు. కాని ప్రారంభంలో అవి సద్దుగా అణగియుండేవి. అన్ని వర్ణాలవారూ సుఖంగావుండేవారు. కాని కాలంగడచినకొలదీ వారిని "కోరికలు"బంధించినవి. నగరాలనూ,కోటలనూ నిర్మించారు. దండయాత్రలుచేశారు. అప్పుడు వారిని దుఃఖమావరించింది. మహాభారతంలో భీష్ముణ్ణి రాజ్యాలూ, అంతర్యుద్ధాలూ యెలా సంభవించిన వని అడిగారు. అందుకు ప్రత్యుత్తరంగా మొట్టమొదట రాజులూ,రాజ్యాలూ అనేవి లేవనీ, అలాంటి ఆదిమ

గణసమాజం కొత్తగా కోరికలూ, క్రోధాలూ మొదలైనవి పుట్టడంవలన నశించినదని భీష్ముడన్నాడు. గణ సభ్యులు మోహావేశితులై మంచి చెడు విచక్షణను కోల్పోయారు. అప్పుడు వారిని పేరాశ ఆవేశించింది. తమకు లేనిదానికొరకు ప్రాకులాడటమొక్కటే ఆలోచనయైనది. కొత్తకోరికలతోపాటు క్రోధమూ, మాత్సర్యమూ యేర్పడ్డవి. బంధుత్వమనీ, బంధువిధులనీ మరచారు. ధర్మవిహీనులైనారు. చేయరానిపనులు చేశారు. తమలో తాముపోరాడుకున్నారు. బ్రహ్మము(గణము) నశించింది. పూర్వపు ఆనందమయమైన, శాంతియుతమైన కృతత్రేతాయుగ ధర్మాన్ని నాశనంచేసి, అంతర్యుద్ధానికీ, కొత్తరాజ్యాంగానికీ దారితీసిన దుర్గుణాలను హిందూమత గ్రంథాలన్నీ దాదాపు యిదేవరసలో పేర్కొన్నవి.

కాని, దీనికి కారణమేమిటో ఆ మత గ్రంథాలు పేర్కొనలేదు. దితి, అదితుల సంతానమూ, క్రోధోన్మత్తుడై పోరాటావేశంతో ఆక్రోశించే యింద్రుడూ మొదలైనవారు తమ శత్రువులపైన పోరాడి, ధనధాన్య పశుసంపదలను గెలిచిన రోజుల్లో, కామ లోభ మోహాది దుర్గుణాలు వారి నావేశించలేదు; తమ బంధువర్గంపైనసే అంతర్యుద్ధం కొనసాగించలేదు. ఇందుకు కారణమేమిటి? అనాగరిక యుగపు రచయితల కిది అంతుపట్టలేదు. వారు సద్గుణవంతులనీ, వీరు దుర్గుణవంతులనీ ఒకే కారణంచెప్పారు. కాని, వారు దుర్గుణవంతులవడమే కాదు; దుర్గుణాలే ప్రాణంపోసుకుని రెక్కలు కట్టుకునివచ్చి మనుష్యులను పట్టుకున్నట్లున్నది. పాపం, మనుష్యులొకప్పుడు యెంత అనాగరికంగా, దరిద్రంగావున్నా సంతోషంగా

కాలం గడిపేవారు. ఇప్పుడో? పరస్పరం చంపుకోడం తమ వారినీ, పెరవారినీకూడా హానిసలను చేసుకోడం, సంపదలను కూడబెట్టుకోడం మొదలుపెట్టారు. దీనికి గణసమాజాలయొక్క ఉత్పత్తిశక్తులలో కలిగిన విప్లవమే అసలు కారణమని కనుక్కున్నాం. నూతనోత్పత్తిశక్తులు నూతనమైన ఉత్పత్తిసంబంధాలను నిర్మిస్తాయి. మహాభారతం, పురాణాలూ, ఇతర గ్రంథాలూ పేర్కొన్న దుర్గుణాల వెనుక, నూతన ఉత్పత్తి సమశాల మార్గమూ, ఉత్పత్తిదారుడు నేపగా తానుపయోగించని వస్తువులను అమ్ముకొని తనకులేని వస్తువులను, తాను తయారుచేయజాలని వస్తువులను కొనుక్కోవడమూ,♦ ప్రైవేటు ఆస్తిని కూడబెట్టడమూ వీటినుంచి దురాశా, స్వార్థమూ మొదలైనవి పెరగడమూ, దౌర్జన్యం, యితరులకష్టఫలితాన్ని హరించడం, దీన్నుంచి సంపదను స్వంతానికి కూడబెట్టుకోవాలనే కోరిక ఒక వెర్రిగా పెరిగిపోవడము - యివన్నీ నూతనమైన సామాజిక శక్తులుగా పనిచేసినవని చూచాం. సంచారస్థితిలో వున్నప్పటికీ, ఐక్యంగావుండే గణము చీలి, వ్యవసాయమూ, చేతివృత్తులనుఅవలంబించింది; పట్టణాలనూ, మహానగరాలనూ నిర్మించింది. కొత్త అనుభూతులనూ, సుగుణ దుర్గుణాలనూ అలవరచుకున్నది; పాలకులూ, పాలితులూ, దోపిడీదారులూ, దోపిడీచేయబడేవారూ అనే చీలికలతోకూడిన కొత్తజగత్తు నిర్మించబడటం ప్రారంభమైంది. ప్రైవేటు ఆస్తిని రద్దుచేసి

---

♦ మహాభారతంలో దుర్గుణాలీక్రిందివరసలో పేర్కొనబడినవి:

దైన్యమ్, మోహః, అప్రాప్తస్య, అభిమర్షం, కామః, రాగః (శాంతి 57 రక్తస్య అనిభిజ్ఞానమ్-విప్లవః:- బ్రహ్మనాశ విప్లుతే నరలోకే బ్రహ్మనాశః॥

మరల కొత్తపునాదిమీద సర్వసమృద్ధి కలిగిన సమాజాన్ని, నూతన కమ్యూనిస్టు జగత్తును సృష్టించేవరకూ. మానవుడికి పాతజగత్తులో అలవడిన దుర్గుణాలూ, అంతర్యుద్ధాలూ నశించి అసలు యుద్ధాలనేవే లేకుండాపోవు. అది భవిష్యత్తు.

ఈ వర్గయుద్ధం యెలా అభివృద్ధిచెంది, యెలా పరిణమించినదో తెలుసుకునేముందు, ఉత్పత్తిశక్తులు పెరిగి, ప్రైవేటు ఆస్తీ, బానిసత్వమూ వచ్చినతరువాత గణసమాజంలో వచ్చిన యితర ప్రధానమైన మార్పులేవో చూడాలి. కొత్త ఆస్తిసంబంధాలు గణసమాజ నిర్మాణాన్ని అన్ని విధాలా మార్చివేసినవి. ప్రైవేటుఆస్తీ పూర్వపు బంధుత్వ నిర్మాణాన్నీ, వ్యక్తిసంబంధాలనూ భగ్నంచేసింది. మాతృస్వామికాన్నీ, మైథున వివాహపద్ధతివరకూ వచ్చిన గణ కుటుంబాన్నీ నాశనం చేసింది. గణసమాజంలో రక్తబంధువులు కానివారికి ప్రవేశ ముండరాదనే నియమాన్ని తొలగించింది. పితృస్వామిక కుటుంబాన్నీ, తండ్రి హక్కునూ, ఆస్తి వారసత్వమునూ దానిపైన ఆధారపడిన వంశక్రమ విధానమునూ, వాటిఫలితాలనూ అన్నిటినీ తెచ్చిపెట్టింది. గణ గోత్రంలో ఐక్యతను భగ్నంచేసి, ప్రైవేటు కుటుంబాలనూ, వర్గాలనూ, వాటి పరస్పర సంఘర్షణలనూ, సృష్టించింది. పరాయిగా దెచ్చుకున్న బానిసలే కాక, స్త్రీలు కూడా స్వేచ్ఛను కోల్పోయారు. స్వేచ్ఛగా, సగర్వంగా తలెత్తుకుని తిరిగిన ఆర్య ప్రజాసామాన్యానికికూడా సంకెళ్ళను తగిలించి మార్కెట్లో అమ్మకానికి తెచ్చింది.

# పదో అధ్యాయం

## మాతృస్వామిక పతనమూ - స్త్రీ బానిసత్వమూ

"పసుల మందలూ, యితర నూతన సంపదలవలన కుటుంబంలో విప్లవపరిణామం కలిగింది. జీవితావసర వస్తువులను సేకరించడం యెప్పుడూ పురుషుడి పనిగా వుండేది. అందు కవసరమైన పనిముట్లను (వేటకు పనికివచ్చే ఆయుధాలూ మొదలైనవాటిని) అతడే తయారుచేసుకునేవాడు. అతడే వాటికి యజమానికూడా. ఈ జీవితావసరవస్తువులను ఉత్పత్తి చేసే సాధనాలు పశువులమందలు. మొదట పశువులమందలను మచ్చికచేయడం, తరువాత వాటిని కాయడం పురుషుని పనిగా వుండేది. అందువల్ల పశువులమందలు అతనివే, వాటివల్ల వచ్చిన సరుకులూ అతనివే; ఆ సరుకుల మారకంలో లభించిన బానిసలుకూడా అతని యాజమాన్యంలోనే వుంటాయి. జీవితావసర వస్తువుల సేకరణలో అదనంగా మిగిలినవన్నీ అతనివే. వాటిని అనుభవించడంలో మాత్రం స్త్రీ భాగం పంచుకునేది. కాని వాటిపైన యాజమాన్యంలో ఆమెకు భాగంలేదు. ఆటవికదశలో యుద్ధవీరుడూ, వేటకాడూ యింటిలో స్త్రీ తరువాత రెండవస్థానం ఆక్రమించి

య్యుండేవారు. దానితోనే తృప్తిచెందియుండేవాడు. అతని కన్నా సాధువైన పశువులకాపరి, తనకు సంపద కలదుకదా అనే గర్వంతో మొదటిస్థానంలోకి నెట్టుకొచ్చాడు. స్త్రీని రెండవస్థానంలోకి నెట్టివేశాడు. ఆమెయెదురాడలేకపోయింది. కుటుంబంలోని శ్రమవిభాగం స్త్రీ పురుషుల మధ్య ఆస్తి పంపకాన్నికూడా రెగ్యులేట్ చేసింది. ఆ శ్రమవిభాగం పూర్వాంవలెనే వున్నది; కాని పూర్వపు కుటుంబ సంబంధాలను తలక్రిందులుచేసింది. దీనికి కుటుంబం వెలుపల యేర్పడ్డ శ్రమవిభాగం మారడమే కారణం. ఒకప్పుడు స్త్రీకి యింటిలో ఆధిక్యతను కలుగజేసిన కారణమే♦—ఆమె శ్రమ గృహకృత్యాలకు కట్టుబడియుండటమే—ఇప్పుడు పురుషుడికి యింటిలో ఆధిక్యత నిచ్చింది. పురుషుడు జీవితావసరములను సేకరించడంలో సమానమైనదిగా స్త్రీయొక్క గృహశ్రమ పరిగణింపబడటంలేదు. పురుషుడి పని సర్వప్రాముఖ్యమైనది. స్త్రీపని అప్రధానమైనది.

"పురుషుడిప్పుడు కుటుంబంలో అధికుడైనాడు. అతని సర్వాధికారిత్వానికున్న ఒక్క అడ్డంకీతొలగిపోయింది. మాతృస్వామికం పడిపోయి పితృస్వామికం వచ్చింది; మైథునవివాహపద్ధతి క్రమంగా ఏకపత్నీ వివాహపద్ధతిగా మారింది; ఇందువల్ల పురుషుడి సర్వాధికారిత్వము స్థిరపడి శాశ్వతంగా కొనసాగింది. అయితే దీనివల్ల గణసమాజ నిర్మాణంలో గండి పడ్డది. ఏకపత్నీ కుటుంబం ఆధిక్యతకు రావడంవలన గణ

---

♦ సత్రయజ్ఞ విధాయకమైన శ్రమవిధానాన్ని అనుసరించే గణ కుటుంబంలో స్త్రీయైన అదితి గోత్రజనని, సర్వాధికారిణికూడా.

29

సమాజంయొక్క ఉనికికే విపత్తు సంభవించింది" (ఏంగెల్స్: "కుటుంబం పుట్టుపూర్వోత్తరాలు").

నే నెరిగినంతవరకూ వేదవాఙ్మయంలో ఎక్కడామాతృస్వామిక విధానాన్ని పడద్రోసి, పితృస్వామికవిధానం అమల్లోకి రావడం వర్ణింపబడియుండలేదు. కాని ఈ మార్పును కుటుంబ పరిణామంలో సులభంగా గుర్తించవచ్చును.

ఒకటి: వర్ణాలూ, మారకమూ, ప్రైవేటు ఆస్తీ అభివృద్ధికావడంతో పురుషులైన ప్రజాపతులూ, గృహపతులూ, వారి అంతర్యుద్ధాలూ, గణయుద్ధాలూ, చరిత్రలో ముందుకొచ్చినవి. అదితి, దితి మొదలైన గణసంతానము సాగించిన గణయుద్ధాలూ చరిత్రలో మరుగుపడినవి.

రెండు: గోత్రాపత్యాలయొక్క అంటే గణముయొక్క సమిష్టిసంతానానికుండే స్థానాన్ని తండ్రులయొక్క కొడుకులు ఆక్రమించారు. గోత్రమాతల పేరనే కొడుకుల పేర్లేర్పడటం చరిత్రలో చాలాకాలంవరకూ, దక్షిణ భారతంలో యిటీవలి వరకూ వున్నప్పటికీ మొత్తంమీద చరిత్రలో అరుదైనది.

మూడు: గణాల సైజు పెరిగినకొలదీ విశాలభూభాగాలకు విస్తరించినకొలదీ ప్రైవేటు ఆస్తీ, పితృస్వామికమూ పెరిగినవి. గణాలలో మాతృస్వామిక వంశానుగతమైన సంబంధాలకు విలువపోయింది; పితృస్వామికత్వానికి చెందిన ప్రవరలు దాని స్థానాన్నాక్రమించినవి. సమిష్టిభగ్నమై సాముదాయిక గోత్రవివాహాలు పోవడంవల్ల ఏకపత్నీవివాహపద్ధతిలో యేర్పడిన వ్యక్తిగత కుటుంబాలకు ఆస్తి, సంతానము, వారసత్వము సంక్రమించాయి. గణ బంధుత్వము చెదురుగా విస్తరించి, మరువబడుతుంది. రక్తబంధువులతోపాటు, కొత్తగా పైనుంచి

వచ్చిన బానిసలూ, వర్తకులూ మొదలైనవాళ్ళుకూడా గణ గోత్రంలో చేరుతారు. యుద్ధపద్ధతులు అభివృద్ధియైనకొలదీ, వివిధగణాలు ఒకటిగా కలుస్తాయి; సమాఖ్య లౌతాయి; వంశానుక్రమణిక, బంధుత్వము మొదలైన పూర్వస్మృతులకు కట్టుబడి యుండి పెద్ద తెగలౌతాయి. ఇలా అక్కడక్కడా చెల్లాచెదరైన ఆర్యబంధుగణగోత్రాల కలయికలే ప్రవరలుగా రూపొందుతవి. గోత్రమాతల వంశములైన పూర్వపు గణ గోత్రములవలెగాక యీ పవరలు ఊహోనూ తుడైన గోత్ర జనకుని వంశస్థులమని చెప్పుకుంటారు. గోత్రాలు బాగా విస్తరించిపోయిన తరువాత చాలాకాలానికి యేర్పడిన ప్రవర వ్యవస్థ కంతటికీ తొమ్మిదిమంది ప్రజాపతులు మూలపురుషులైనారు. సమిష్టి గోత్ర జనకత్వము గణాలను కొన్నిటినికలిపి పెద్ద తెగగా చేయడానికి మాతృస్వామికత్వాన్ని విస్మరించి కృత్రిమంగా యేర్పాటు చేసుకున్నదే. కాబట్టి సగోత్రిక వివాహాలు నిషేధింపబడినంత ఖచ్చితంగా సప్రవర వివాహాలు నిషేధింపబడలేదు. అయితే యీ విషయంలో పితృస్వామికాలైన ప్రవరలు గోత్రపద్ధతులను అనుకరించడానికి కొంతవరకు ప్రయత్నించినట్లు కనబడుతున్నది. అయితే మాతృస్వామికమైన రక్తబంధుత్వంలో సగోత్ర వివాహనిషేధం, సంకల్ప సంస్పర్శ వివాహాలనుంచి సహజంగా వచ్చిన పరిణామం కాబట్టి నిర్దుష్టమయినది. సప్రవర వివాహ నిషేధము అలా కాదు నూతనంగా వచ్చిన సమాజంలో కృత్రిమమైన ఐక్యతను కుదుర్చుకోడానికని సప్రవర వివాహ నిషేధం వాస్తవమైన పూర్వపద్ధతుల జ్ఞాపకాలకు కృత్రిమమైన రూపకల్పన చేయడం తప్ప మరొకటికాదు. కాబట్టి నూతనంగా వచ్చిన

యేకపత్నీ వివాహము, పితృస్వామికము, ప్రైవేటు ఆస్తిపేర్పడ్డ సాంఘికపరిస్థితుల్లో గతించిపోయిన గణసమాజ శిథిలాలకు సిద్ధాంతరీత్యా కట్టుబడియుండటానికి కృత్రిమంగా చేసిన ప్రయత్నమే ప్రవరలుగా రూపొందినది.

గోత్ర-ప్రవర నిర్మాణంవల్ల బంధుత్వాలలో క్రమబద్ధమైన వావి వరుస లేర్పడ్డవి. బంధు తెగలకూ, బంధుత్వము లేని తెగలకూ మధ్య హద్దులేర్పడ్డవి. ఆర్యులకూ, అనార్యులకూ భేదనిర్ణయం స్థిరపడ్డది. పరాయిజాతులు ఆర్యసమాజంతో సంపర్కం గలిగి, ఆర్యులలో కలిసిపోవడం ప్రారంభమైన సమయంలో యిలాంటి భేదనిర్ణయం చేయబడ్డది. అంతే కాదు, వర్ణ విభాగము, వర్గాలూ, వర్గరాజ్యాంగమూ వచ్చిన నూతన పరిస్థితులలో సామాజిక మతవిషయక వ్యవహారాలను రక్తబంధుత్వ పునాదులపై వ్యవస్థీకరించడంకూడా దీని ఉద్దేశ్యమైయున్నది. ఈనూతన పరిస్థితు లేర్పడిన సమాజంలో అందరూ రక్తబంధువులుకారు. అందరికీ యజన, యాజన అధికారాలు లేవు. గోత్ర ప్రవర నిర్మాణము ఈ భేదానికి నిర్మాణ స్వరూపమేర్పరచింది. ఒకనూతనసమాజం సృష్టియౌతున్నది. నిశ్చితమైన సరిహద్దులుగల రాజ్యము, రాష్ట్రము, లేక రాజ్యాంగయంత్రము వర్తించే సరిహద్దులలో శాశ్వతంగా నివశించేవారు అందరూ ఈ నూతన సమాజంగా గుర్తించబడ్డారు. పూర్వపు గణసమాజ సభ్యత్వానికి రక్తబంధుత్వమే షరతూ, సరిహద్దూకూడా. కాని యీ గోత్ర ప్రవర సంఘంలోనో రాజ్యాంగపు ఎల్లలలో శాశ్వత నివాసమే షరతూ, సరిహద్దూను. ఇప్పుడు ఆర్థికసంబంధాలూ, బంధుత్వ సంబం

ధాలూ ఒకదానినుంచి ఒకటి విడగొట్టబడినవి. శూద్రులకూ, పరాయిగా వచ్చినవాళ్ళకూ గోత్రప్రవరలో స్థానంలేదు. కాని రాజ్యంలోమాత్రం వారికి చోటున్నది.

భారతీయపండితులకు హిందూ ఆర్యులలోని యీ ప్రవర నిర్మాణం తలబ్రద్దలుకొట్టుకున్నా అర్థంకావడంలేదు. ఇలాగే యూరోపియన్ పండితులు గ్రీకుసమాజంలోని ప్రవర విధానాన్ని అర్థంచేసుకోలేకపోయినారు. గోత్ర ప్రవరలు నేటికీ నిలిచివున్నవి. కాని మన పండితులు యీ గోత్ర ప్రవరలకు వంశఘనాదులు గణసమాజమూ, గోత్ర-సాము దాయిక వివాహాలేనని అంగీకరించడంలేదు. అందువలన గోత్రప్రవరలు అర్థంపర్థంలేని కల్పితాలని తోసేస్తున్నారు.

ఇలా గోత్ర ప్రవరలను విమర్శించేవారికి జవాబుగా, మోర్గాన్ తనను విమర్శించినవారి కిచ్చిన ప్రత్యుత్తరాన్ని ఉదహరిస్తే ఉత్తమంగా ఉంటుంది. ఈ ప్రత్యుత్తరాన్ని మార్క్సు యీ క్రింది విధంగా క్లుప్తీకరించాడు :

"మిగిలిన మనుష్యజాతు లందరివలెనే గ్రీకులుకూడా ఒకప్పుడు రక్తబంధువులుమాత్రమే గల "జెన్" సంఘాలుగా వుండేవారు (హిందూ ఆర్యులలో గోత్రాలు "జెన్" ల వంటివే).♦ జెన్ సంఘాల ప్రాథమికరూపమైన రక్తబంధుత్వ విధానము జెన్‌లోని సభ్యులు తమ పరస్పరసంబంధమును మరచిపోకుండా కాపాడినది. అది వారికి చాలా ముఖ్యమైనది. కాబట్టి చిన్నతనంనుంచి మరచిపోకుండా అలవాటుచేసేవారు (హిందువులలో ప్రతిరోజూ సంధ్యావందనంలో ప్రవర చెప్పుకుంటారు). ఏకపత్నీ కుటుంబంలో యీ రక్తబంధుత్వం

♦ బ్రాకెట్లలోనివి నేను చేర్చినవి. ఎస్. ఎ. డాంగే.

మరుగునపడి మరచిపోయారు. జెన్ పేరిట నిర్మాణమైన వంశవృక్షంతో పోల్చితే, వ్యక్తికుటుంబం చాలా అప్రాముఖ్యమైనది (హిందువులలో ఉపనయనమైన మొగపిల్లలకు చెప్పే గోత్ర లేక ప్రవరనామంవంటిదే "జెన్"నామధేయం).♦ ఈ పేరును జ్ఞాపకంపెట్టుకుంటంలో వుద్దేశ్య మేమంటే ఆ పేరుకలవాళ్ళందరిదీ ఒకే వంశమనీ, ఒకే మూలపురుషుడనే సత్యాన్ని మరచిపోకుండా వుండటమే. కాని జెన్‌ల వంశక్రమ పునాదులు యెంత ప్రాచీనకాలానికి పోయినవంటే యీనాడు 'జెన్' సభ్యులు తమ పరస్పర బంధుత్వం యిది అని (ఏవో యిటీవలి మూలపురుషులద్వారా ఏర్పడిన బంధుత్వాల విషయంలో తప్ప) ఖచ్చితంగా చెప్పలేకున్నారు. అయితే వారంతా ఒక వంశవృక్షానికి చెందినవారని 'జెన్' నామధేయం రుజువుచేస్తున్నది......రక్తబంధుత్వ సంబంధాలు ముఖ్యంగా ఏకపత్నీకుటుంబం వచ్చినతరువాత, కాలగతిలో చాలా వెనక్కు నెట్టివేయబడినవి. వాటి వాస్తవికత్వము పౌరాణిక గాథాకల్పనలలో ప్రతిబింబమాత్రాలుగా వున్నాయి. అందువల్ల మన పాషండవాదులు (ఫిలిస్టిన్‌లు) యీ వూహామాత్రమైన వంశ నామధేయమునుంచే వంశమంతా వచ్చినదని పర్యవసానం తేల్చుతున్నారు."
(ఏంగెల్స్: కుటుంబం పుట్టుపూర్వోత్తరాలు.)

---

♦ కరండికర్ వ్రాసిన "హిందువులలో అసగోత్రవివాహం" అనే గ్రంథంలోనూ, "మహారాష్ట్ర జ్ఞానకోశం"-వేదవిద్య సంపుటిలో కేత్కార్ వ్రాసిన "ప్రవర" అనే వ్యాసంలోనూ చర్చించిన చర్చలుమాస్తే మన భారతీయ పాషండవాదుల ధోరణు లెలావుంటాయో తెలుసుకోవచ్చును. ఒక్క రజ్వాడే మాత్రమే కొంతకు కొంతైనా మోర్గాన్‌కు దగ్గరగా వస్తాడు.
(మిగతా తరువాత పేజీలో)

పితృస్వామికమూ, ప్రైవేటు ఆస్తీ, వారసత్వమూ ఈ మూడూకూడా స్త్రీ యేకభర్తృకగా వుండాలనే నిర్దేశిస్తాయి. స్త్రీకి ఒకే భర్త వుండాలనే నియమం లేకపోతే, తండ్రికి పుట్టిన సంతానమెవరో గుర్తించడానికివీల్లేదు. ఏకపత్నీవివాహమూ, దానితోపాటు శీలవతీత్వమూ, పతిభక్తీ—వీటివలన ఆస్తికివారసు లెవరో గుర్తించడం సులభమైందని యిదివరకే చూచాం.

కాని మొదట పురుషుడే కోరినందువలన యిది రాలేదు; స్త్రీ కోరినందువలననే వచ్చినది. ఆ రోజుల్లో, (నిజానికి ఈ రోజుల్లోకూడా) పూర్వపు సాముదాయక వివాహపద్ధతినుంచి వచ్చిన అలవాట్లనూ, హక్కులనూ పురుషులు వదులుకోడానికి యిష్టపడలేదు. సాముదాయక వివాహం ఇంకా బహుభార్యాత్వ రూపంలో నిలిచేవుంది. పురుషుడికి అలవాట్లూ, హక్కులూ యింకా దేవదాసి, మురళి, చివరకు వ్యభిచారంలోకూడా నిలిచియేయున్నవి. సమాజం పెరిగింది; ఇదివరకు రక్తబంధువు లుగావున్న చిన్నచిన్న గోత్రాలు దూరప్రాంతాలకు చెల్లాచెదు రుగా విస్తరించినవి. కొత్త ఆర్థికవిధానం అభివృద్ధియైనది. దీనికి ఏకపత్నీ కుటుంబం పునాదియైనది. ఈ పరిస్థితుల్లో ఒక గోత్రానికిచెందిన పురుష సభ్యులు తాము వియ్యమందటానికి వీలున్న మరోగోత్ర స్త్రీలు యెక్కడున్నాసరే వారిమీద తమహక్కును చెలాయించేవారు ఈ పురుషహక్కులు స్త్రీలకు నానాటికి బరువై యేవపుట్టించినవి. పూర్వపు చిన్నగోత్ర

---

వివాహమూ, గోత్ర-ప్రవరలు, ఆస్తివారసత్వమూ మొదలైనవాటిని గురించిన సనాతనులు హిందూధర్మశాస్త్ర సవరణబిల్లు ఉపసంఘానికి పంపిన అర్జీలు చదవదగినవి. ఈ సమస్యలింకా యెంతబలంగా పాదుకునివున్నాయో తెలుపుతాయి.

కుటుంబంలోనూ, అశ్మవజంలోనూవున్న సభ్యులంతా ఒకరి నొకరు యెరిగినవాళ్లు. తేనెపట్టులోని తేనెటీగలవలె యేమీ నిర్బంధంలేని సమిష్టిశ్రమద్వారా పరస్పరం అంటిపెట్టుకుని యుండేవారు. కాని ఇప్పుడో మొగమెరుగనివాడూ, బంధువు కానివాడూ, దూరదేశస్థుడూ అయిన పగాయిగణసభ్యుడొకడొచ్చి స్త్రీపైన హక్కును చెలాయించడమంటే ఆమెకది అవమానకరంగా తోచింది. పూర్వపు రోజుల్లో సాముదాయక వివాహపద్ధతినుంచి గృహస్తు 'అతిథికి' తనభార్యను అప్పగించే ఆచార మేర్పడ్డది. పరాయివాడొకడొచ్చి స్త్రీపైన సంభోగ హక్కును చెలాయిస్తాడు. గతించిపోయిన గణసమాజంనాటి ఈ ఆచారబంధనంనుంచి స్త్రీ విముక్తిపొందాలి.

ద్వంద్వ వివాహంగా పరివర్తనచెందిన దశలో యిది గోచరిస్తున్నది. "స్త్రీచే ద్వంద్వవివాహపద్ధతి అను పరివర్తన దశ రూపొందింపబడ్డ తర్వాతనే పురుషుడు ఖచ్చితమైన ఏకపత్నీ వివాహపద్ధతిని ప్రవేశపెట్టగలిగాడు. ఈ ఏకపత్నీ వివాహం స్త్రీకిమాత్రమే సంబంధించివున్నదని జగద్విదితం" కాని ధనికుల ప్రైవేటు ఆస్తి రాజ్యంచేస్తూ కోట్లకొలది స్త్రీ పురుషుల జీవితాలను నాశనం చేస్తూన్న వర్గసమాజంలో ఏకపత్నీ వివాహమంటే స్త్రీని అపహాస్యం చేయడమే కాని వేరుగాదు. గణసమాజం గతించిపోయి, వర్గ రాజ్యాంగము వచ్చిన తరువాత, వ్యభిచారం సమాజాన్ని వెన్నంటి తరుముకొస్తూనేవున్నది. స్త్రీ ఆర్థికంగా బానిసయైన వెంటనే ఆమె శారీరకంగానూ, నైతికంగానూ పురుషుడికీ, అతని ఆస్తికీ బానిసయైనది.

"మాతృస్వామిక పతనం స్త్రీజాతియొక్క పరాజయం. ప్రపంచ చరిత్రమీద యీ ఘటనయొక్క ప్రభావం చాలా ఉంది. పురుషుడు యింటిలోకూడ తన అధికారాన్ని స్థాపించాడు. స్త్రీ బానిసయై అధఃపతనమును పొందినది. ఆమె పురుషుడి కామానికి దాసురాలైనది. కేవలం బిడ్డలను కనే యంత్రమై పోయినది." (ఎంగెల్స)

ఏకపత్నీ కుటుంబంలో పురుషుని ఆస్తికి వారసుణ్ణికనే అవసరానికి పతి పత్నీ పరస్పర విశ్వాసాన్నీ, స్త్రీయొక్క అనుభూతులనూ, శీలాన్నీ ప్రైవేటు ఆస్తిదారుల "పవిత్రస్మృతికర్తలు" బలియిచ్చారు. ప్రత్యేకవ్యక్తిత్వంగల మనిషిగా చూడబడటానికి ఆమెకుగలహక్కు తొలగించబడ్డది. ఇప్పటినుంచీ భర్తవల్లకాక మరొకరివల్ల పుట్టిన సంతానం ఎవరికి చెందాలి అని చర్చలు బయల్దేరినై. ఈ స్మృతికర్తలకు స్త్రీ యెడలగల నిర్లక్ష్యభావం వీటిల్లో బాగాకనబడుతుంది. భారతం అనుశాసనపర్వంలో యుధిష్ఠిరు డిలా ప్రశ్నిస్తాడు:

"తన క్షేత్రంలో పుట్టినవాడు తనకొడుకు అని కొందరంటారు. తన బీజంవల్ల పుట్టినవాడే తన కొడుకని మరికొందరంటారు. ఈ రెండు విధాలుగాను పుట్టిన కుమారులు సమానులేనా? చివరకు కుమారు డెవరివాడు?"

ఈ మాటలు బానిస యజమానియైన భూస్వామి తన భార్యను పొలంగానూ, తనకొడుకును పొలంలో పంటగానూ చూచుకుని మాట్లాడేమాటలుగా వున్నాయి. పంటయెవరిది? కౌలుకు తీసుకుని యెదపెట్టి వ్యవసాయం చేసినవాడిదా? లేక వ్యవసాయదారు డెవడైతేనేమి, పంటమాత్రం భూఖా

మందుకు చెందవలెనా! నేటి బానిస యజమానులకన్నా యెక్కువగానే ప్రజలకొరకూ, సంతానాభివృద్ధికొరకూ ప్రాకులాడిన యజ్ఞగణసమాజంలో నేటి బానిస యజమానులకు స్త్రీనిగురించివున్న అభిప్రాయాలూ, సిద్ధాంతాలూ వుండడం అసంభవం. వేదకారుడు స్త్రీని "జాని" అంటే "బిడ్డలనుకనేది" అని నిస్సంకోచంగా పిలిచాడు. కాని పుట్టినవారంతా ఆమె సంతానమే (జన). కొడుకు క్షేత్రానికి చెందినవాడా, బీజానికి చెందినవాడా అని నాటి వేదకారునికి తట్టలేదు. ఎందువల్ల? ఇతరులకుకాకుండా, తనకే వారసత్వం రావాలని పట్టుపట్టడానికి అతనికి ఆస్తి ఏమీలేదు. కాబట్టి పితృస్వామిక పరిపాలన అప్పటికింకా పుట్టలేదు. స్త్రీని చెంబుతప్పాలా భోగిగానూ, బిడ్డలను కనేసాధనంగానూ చూచేసిద్ధాంతం బానిస యుగానికి చెందినది. అప్పటికి యజమాని సంపదను ఉత్పత్తిచేయడానికిగాను మనుష్యుణ్ణి అమ్మడం, కొనడం వచ్చింది. అలాగే స్త్రీ కూడా ఆ సంపదకు వారసుణ్ణి కనవలసివచ్చింది.

"ఎవరిబీజంవల్లనైతే కొడుకుపుట్టాడో అతనికే ఆకొడుకు చెందుతాడు" అని యుధిష్ఠిరుని ప్రశ్నకు జవాబు చెప్పబడ్డది. పితృస్వామికహక్కే నిజమైనహక్కు అని శాసించబడ్డది.

"ఒకవేళ బీజానికి యజమానియైనవాడు పుట్టినకొడుకు తనవాడుకాడని నిరాకరించేపక్షంలో, అలాంటి కొడుకు ఎవరి బీజంవల్లపుట్టాడో అతనికిచెందుతాడు. "అధ్యూఢుడని" పిలువబడే కొడుకుకుకూడా యిదే నియమం వర్తిస్తుంది. అయితే ఒకవేళ బీజాధికారికూడా నిరాకరిస్తే, అలాంటికొడుకు తల్లి యొక్క భర్తకు చెందినవాడౌతాడు. ధర్మమిలా శాసిస్తున్నదని తెలుసుకోవలసినది."

హిందూ సనాతనుల ప్రామాణికుడైన మనువుకూడా యిదే చెప్తున్నాడు :♦

సమిష్టిజీవితమూ, ద్వంద్వవివాహ కుటుంబమూ వుండే కాలంలో సంతానం గోత్రజననికి చెందియుండేది. తండ్రి, తల్లిని విడిచివెళ్ళినప్పుడు బిడ్డ తల్లిదగ్గరే వుండేది. అర్జునుడూ భీముడూ మొదలైనవారి గాథలనుబట్టి యీ విషయం తెలుసుకున్నాం. కాని బానిసవిధానం వచ్చిన కాలంలో తన ఆస్తికి వారసుడు కాగల "విశుద్ధ" సంతానాన్ని కనడానికీ, తన ఆస్తిని పెంపుచేయడానికీ, శ్రమ చేసే బానిససంతానాన్ని కనడానికీ స్త్రీని పశువువలెనే అమ్మడం, కొనడం అద్దెకీయడం జరిగింది. ఒక్క భార్యవిషయంలోనేకాక, కూతుళ్ళు మొదలైనవారి విషయంలోకూడా యిదేపద్ధతి అనుసరించబడ్డది. భారతం ఉద్యోగపర్వంలో గాలవ మహామునిని గురించిన దీర్ఘగాథలో యిలా కూతురును అద్దెకిచ్చే ఆచారం విలక్షణంగా వర్ణించబడినది. గాలవుడు గురుదక్షిణ నీయాలనుకున్నాడు-బీదవాడు కావడంచేత యయాతి సహాయాన్ని అర్థించాడు-యయాతి తన కూతురైన మాధవిని గాలవుని పరంచేశాడు-గాలవుడామెను ముగ్గురు రాజుల కప్పజెప్పి ఒకొక్కరివద్దనుంచి రెండువందల గుఱ్ఱాలను శుల్కంగా

---

♦ భర్తృః పుత్రం విజానంతి శృతిద్వేధంతు భర్తరి ।
ఆహురుత్పాదకం కేచిత్ అపరే క్షేత్రిణం విదుః ॥ (మను 9-32)
సర్వభూత ప్రసూతిర్హి బీజ లక్షణలక్షితా ॥ (మను 9-35)
ఔఘవాతాహృతం బీజం యస్యక్షేత్రే ప్రరోహతి
సక్షేత్రీ లభతే బీజం నబీజీ భాగమర్హతి ॥ (పరాశరస్మృతి (4-32)

అందరూ ఆడిపోసుకునే భౌతికవాదులుకూడా యింత పచ్చిగా చెప్పలేదు.

తీసుకున్నాడు - వారొక్కొక్కరూ ఆమెతో సంభోగించి ఒక్కొక కుమారుణ్ణి కన్నారు. చివరకు గాలవుడు ఆమెనూ, గుఱ్ఱాలనూ, యింకా వచ్చిన యితర సంపత్తినీ తన గురువుకు గురుదక్షిణక్రింద యిచ్చివేసి ఋణం తీర్చుకున్నాడు. గురువైన విశ్వామిత్రుడుకూడా ఆమెవలన ఒక కొడుకును కన్నతరువాత ఆమెను మరల గాలవుని వశంచేస్తాడు. గాలవుడు ఆమెను, ఆమె తండ్రియైన యయాతికి తిరిగి అప్పగించి వేస్తాడు. మాధవియొక్క యీ విషాదగాథ యింతటితో ముగియలేదు. ఈ దాస్యమంతా అయినతర్వాత యయాతి ఆమెను స్వయంవరంలో తన యిష్టమొచ్చిన భర్తను పొందమంటాడు. కాని యీపాటికే జీవిత మంటేనూ, పురుషుడి కింద దాస్యమంటేనూ మాధవికి భరింపలేనంత యేవగింపు పుట్టింది. ఆమె స్వయంవరానికొచ్చిన రాజులకూ, ధనవంతులకూ ఒక్క నమస్కారం చేసి స్వయంవర మందిరాన్ని వదలి ఉపవాసాలతోనూ, తపస్సులతోనూ వర్గసమాజ బానిసత్వం నుంచి విముక్తి పొందడానికై అడవులకు వెళ్ళిపోతుంది.

(మహాభారతం-ఉద్యోగపర్వం-120)

గోత్రజనకునియొక్కా, బానిసయజమానియైన భర్తయొక్కా హక్కులు భార్యనూ, కూతురునూ, కొడుకునూ అందరినీ శుల్కంకొరకు చేతులు మార్చడంతోటే పరిమితములై యుండలేదు. వాళ్ళ ప్రాణాలమీద అతనికి సంపూర్ణాధికార మున్నది. తన యిష్టంవచ్చినప్పుడు వారిని చంపివేయవచ్చును. పైన వివరింపబడిన ప్రవర్తనకూ గోత్రవివాహస్వేచ్ఛగల పూర్వపు గణసంఘకాలంలో స్త్రీ యెడల

అనుసరింపబడిన ప్రవర్తనకూ ఉత్తరదక్షిణ ధృవాలకున్నంత తేడావున్నది. ఆనాడు స్త్రీ గౌరవింపబడినది. తల్లి ప్రాణదాత, పవిత్రురాలు ; తల్లిని చంపడంకన్నా మించిన పాపంలేదు. ఆనాటిసిద్ధాంతాలను బానిసయుగంలోకి సాగదీశారు. వాటికీ, కొత్త బానిసయజమాని వర్గ ప్రయోజనాలకూ వైరుధ్య మేర్పడ్డది. ఈ యజమానివర్గం "ఆస్తి"పైన సంపూర్ణాధికారాన్ని కోరుతున్నది. వీరి దృష్టిలో ఆస్తి అంటే బానిసలతోపాటు భార్యా బిడ్డలూ మొదలైన వారందరూకూడా అని అర్థము.

స్త్రీ తనస్థానాన్ని కాపాడుకోడానికీ, పూర్వపు గణ సమాజ సాంప్రదాయాలను నిలుపుకోడానికీ పోరాడింది. కాని యీ ప్రయత్నాలను బానిసయజమానియైన పురుషుడు అమానుషమైన హింసాదౌర్జన్య ప్రయోగంతో అణచివేశాడు. ఈ విషయం ఓఘూవతీ - సుదర్శనులూ, గౌతమీ - గౌతములూ, రేణుకా - జమదగ్నుల గాథలలో విపులంగా వర్ణింపబడినవి. ఈగాథలు గోత్రసమాజ కాలంలోని ఆచారములూ, సిద్ధాంతములూ బానిసయుగకాలంలోకి యెలా పరివర్తితమైనాయో తెలుపుతున్నాయి. సుదర్శన మహాముని తన భార్య ఓఘూవతిని ఆశ్రమంలో విడిచి యెక్కడికో వెళ్ళాడు. అప్పుడు ఒక బ్రాహ్మణుడు అతిథిగా వచ్చాడు. అతనికి ఆతిథ్య నియమాల ప్రకారం భోజనాదికములతో తృప్తిపరచడమేకాక, గణగోత్రాచారాన్ననుసరించి అతిథికోరగా ఆమె ఆతనితో సంభోగించింది. సుదర్శనుడు తిరిగివచ్చి యిదంతా తెలుసుకుని తనభార్య గృహస్థధర్మాలను చక్కగా నిర్వర్తించినందుకు ఆనందభరితుడైనాడు. ఈదశలో పూర్వపు సంకల్ప సంస్పర్శ వివాహాములంటే స్త్రీకి యేవగింపు పుట్టినది. ద్వంద్వ

వివాహ విధి ప్రకారము ఒక్క భర్తతో టిస్వతంత్రకుటుంబాన్ని నిర్మించుకుంటున్నది. అందువల్లనే సుదర్శనుడు తానాశ్రమంలో లేనప్పుడు తనభార్య గృహస్థవిధులను నిర్వర్తించదేమోనని ఆదుర్దాపడ్డాడు. తీరా ఆమె సముచితంగా ప్రవర్తించినదనీ "తిరుగుబాటు" చేయలేదనీ తెలుసుకోగానే తృప్తిపడ్డాడు.

తరవాత గాథనాటికి కాలంమారింది. గౌతముడింట లేనప్పుడు ఇంద్రుడతిథిగావచ్చి, గౌతముని భార్యతో సంభోగిస్తాడు. గౌతముడికి కోపమొస్తుంది. కొడుకు చిరకారిని పిలిచి తల్లి తలనరకమని ఆజ్ఞాపించి వెళ్ళిపోతాడు. కొడుకు వూగిసలాటలో పడతాడు. పూర్వాచారమూ, నీతి, ధర్మమూ చూస్తే తల్లిది తప్పుగాదు. తానామె కొడుకు. తల్లినిచంపడం మహాపాపం. కాని, కాలంమారి కొత్తవర్గ సంబంధాలూ, కుటుంబ నియమాలూ, వర్గశాసనాలూ వచ్చినవి. వీటి ప్రకారం తాను తండ్రికి విధేయుడై నడుచుకోవాలి. ♦

---

♦ పితురాజ్ఞా పరోధర్మః స్వధర్మో మాతృరక్షణమ్ ।
అస్వతంత్రం చ పుత్రత్వం కిం తు మాం నా సపద్యత్ ॥
స్త్రియం హత్వా మాతరం చ కోహి జాతు సుఖీ భవేత్ ।
పితరం చాప్యవజ్ఞాయకః ప్రతిష్ఠామవాప్నుయాత్ ॥ 12

ఇందులో విపర్యాస్తములైన (Contra-posed) విషయాలు గమనింపదగినవి. పితృవాక్య పరిపాలన పరధర్మము. మాతృరక్షణము సహజమైన స్వధర్మము. కాని బానిసయుగంలో కొడుకుకు స్వతంత్రంపోయింది. అందువల్ల అతడు సహజసిద్ధమైన గణధర్మాన్ని అనుసరించకూడదు. తండ్రిని ధిక్కరించి తల్లిపక్షముండజాలడు. తల్లినిచంపడం అతని సహజానుభూతులకు విరుద్ధము; కాబట్టి విషాదకరమైనది. కాని తండ్రిని ధిక్కరిస్తే, ఆతనికి సంఘంలో ప్రతిష్ఠ

అతను ఆజ్ఞాపిస్తాడు. ఆలోచిస్తుంటాడు. గౌతముడు తిరిగి వస్తాడు. అతని కోపము చల్లారిపోయినది తల్లిని చంపకుండా వుండటానికి వొప్పుకుంటాడు. ఇక్కడ తల్లీ, కొడుకులు తమ హక్కులోనున్న పటుత్వమువలన కాక కొత్త నియమములింకనూ సర్వాధికారంతో పాదుకొనలేదుకాబట్టి నెగ్గుతారు.

మూడవగాథలో—జమదగ్ని భార్య రేణుక చిత్రరథ గంధర్వునివైపు ప్రేమపూర్వకముగా చూస్తుంది. జమదగ్ని తన కొడుకైన పరశురామునితో తల్లిని నరికివేయమంటాడు. అతడు వెంటనే నరికివేస్తాడు. ఇక్కడ భార్య ప్రాణాలపైన పురుషుడి హక్కు సంపూర్ణంగా స్థిరపడ్డది. ఆమెకు వ్యక్తిత్వమూ, స్వేచ్ఛా, ఆలోచనాస్వాతంత్ర్యమూ నిరాకరించబడినవి. బానిస యజమానియొక్క క్రూర భయం

---

నిలవదు. చచ్చిపోతూన్న గతానికి చెందినది తల్లి; అభివృద్ధియై శాసించగల భవిష్యత్తుకు చెందినవాడు తండ్రి.

కొత్తవిధానంలో తల్లిని చంపడమా? తండ్రిని ధిక్కరించడమా? ఏది యెక్కువ విషఫలితాలకు దారితీస్తుంది? తల్లి ప్రాణానికీ, తండ్రియొక్క కేవలం ఒక్క మాటకు పోటీపెట్టబడినది. ఇందులో బానిసయజమానియొక్క దౌర్జన్యపూరితమైన నియంతృత్వము నగ్నంగా అవుపడుతున్నది.

పూర్వపు రోజుల్లో చూస్తే దీర్ఘతమసుడు దుర్మార్గుడై, అసభ్యంగా తయారైనప్పుడు తల్లియాజ్ఞ ననుసరించి ఆతనికొడుకులాతణ్ని గణగృహం నుంచి వెళ్ళగొడ్తారు. అలాగే శ్వేతకేతు తనతల్లి ఒక గోత్రహితునితో సంభోగించినప్పుడు ఆమెను మందలించబోగా, ఆతని నోరు మూయిస్తారు. గణ సమాజం భగ్నం కావడంతో స్వేచ్ఛా సంతోషాలు కల మాతృత్వం నశించింది. ఆమె బానిస, భర్త ఆ బానిసకు యజమాని. కొడుకులు ఆతని ఆజ్ఞ నమలుపరచే కింకరులు. దైవదత్తమైన న్యాయధర్మములు పురుషుడి పక్షమై రాగల శతాబ్దాల పర్యంతము స్త్రీని శక్తిహీనముగా నిరస్త్రను గా చేసినవి.

కర దౌర్జన్య నియంతృత్వము వచ్చి ఆమె వ్యక్తిత్వాన్నీ స్వేచ్ఛనూ హరించివేసింది.

ప్రైవేటుఆస్తీ, ఏకపత్నీకుటుంబమూ, పురుష ప్రాబల్యమూ, స్త్రీ బానిసత్వమూ వచ్చినందువల్ల కలిగిన ఫలితమేమిటో యీ మూడుగాథలూ తెల్పుతున్నాయి. ఈనాడు హిందూస్త్రీ హక్కులూ, ప్రతిష్ఠా, వ్యక్తిత్వమూ, స్వేచ్ఛా లేక నలిగి నీరసించియుండటానికి కారణము సంస్కృతీకాదు, ప్రేమా కాదు. వ్యక్తి నీతిగానీ, సాంఘిక నియమము కానీ కావు. ఆధ్యాత్మిక వేదాంతముకానీ, భారతదేశముయొక్క ప్రత్యేకమైన "ఆధ్యాత్మికశక్తి" గానీ కావు. బానిసయజమాని వర్గంయొక్క దౌర్జన్యయుతమైన నిరంకుశత్వమే హిందూ స్త్రీని యీ నికృష్టస్థితికి తీసుకునివచ్చినది.

ఈ పరిణామాని కంతటికీ వెనుక నున్న శక్తి యేది? ఒక్క దౌర్జన్యమే యింతా చేయలేదు. పురుషుడియొక్క దౌర్జన్యమూ, ఆతనిపక్షంగావున్న న్యాయ, ధర్మ చట్టాలూ వీటిని అమలుపరచడానికి నిర్మించబడ్డ నూతన రాజ్యాంగ యంత్రమూ—వీటన్నిటికీ యీ బల మెక్కడనుంచి వచ్చింది? ఉత్పత్తిశక్తులనుంచీ, కొత్త ఆస్తిసంబంధాలనుంచీ, కొత్త సామాజిక శక్తులనుంచీ వచ్చింది. గణసమాజం పతనమైంది. ప్రైవేటు ఆస్తీ, వర్ణాలు, వర్గాలూ పుట్టినవి. ఇవి కొత్త కుటుంబం ఏర్పడటానికి కారణమైనవి. ఈ కొత్తకుటుంబంలో స్త్రీయొక్క గృహకృత్యశ్రమకు సామాజికమైన విలువలేదు. ఈ సమాజంలో పొలంపైననూ, కార్ఖానాలలోనూ పనిచేసే బానిసల సామాజిక శ్రమకే ప్రాధాన్యత

వచ్చినది. ఈ బానిస శ్రమఫలితాన్ని పురుషుడు మాత్రమే స్వంత ఆస్తికింద అపహరించాడు.

ప్రైవేటుఆస్తి వచ్చినతరువాత శూద్ర బానిసతో పాటు స్త్రీకూడా స్వేచ్ఛను కోల్పోతుంది. శతాబ్దాలుగడిచి బానిసవిధాన మంతరించిపోయినప్పటికీ దాని స్థానంలో మరొకవిధమైన ప్రైవేటుఆస్తి-ఫ్యూడల్ భూస్వామియొక్క ఆస్తి వచ్చింది. అదీ అంతరించి పెట్టుబడిదారీ ఆస్తి వచ్చింది. ఈ పరిణామానికి అనుగుణంగా స్త్రీయొక్క బాని సత్వ పరిస్థితులలో మార్పులు వచ్చినవే కాని ఆమె బాని సత్వముమాత్రము రద్దయిపోలేదు. ఆమె బానిసనుంచి పాలే రైనది. పాలేరునుంచి శ్రామికురా లైనది. అంతవరకే.

కాబట్టి ఆమె స్వేచ్ఛను పొందడమనే సమస్య నీతి నియమాలకుగానీ, ఆత్మశక్తికిగానీ సంబంధించినదిగాదు. అది వర్గరాజ్యాంగ పరిపాలనకు సంబంధించిన విషయము.

పైన వివరించినదానినిబట్టి సామాజిక వుత్పత్తి శ్రమలో స్త్రీకి చోటివ్వకుండా, గృహకృత్యాలకు మాత్రమే కట్టివేసి యున్నంతకాలమూ, ఆమెకు స్వేచ్ఛగానీ, పురుషుడితో సమాన ప్రతిపత్తిగానీ కలగటం అసంభవం. ఆమెకున్న వ్యవ ధిలో బహుకొద్దికాలం మాత్రమే గృహకృత్యాలకు వినియో గించే అవకాశం కలిగినప్పుడే ఆమె స్వేచ్ఛను పొందగలదు. ఇప్పు డిప్పుడే ఆమె కలాంటి స్వేచ్ఛ లభించడం ప్రారంభిం చింది. నేడు పెద్దయెత్తున నిర్మాణమయ్యే ఆధునిక పరిశ్రమ లలో స్త్రీలను యెక్కువగా నియోగించడానికి వీలుకలగడమే.

కాక అవసరంకూడా యేర్పడ్డది. ఆమె యొక్క ప్రైవేటు గృహ కృత్యశ్రమను రద్దుచేసి, అందులోని దుర్భరమైన కష్టాన్నంతటినీ పబ్లిక్ పరిశ్రమలోకి చొప్పించడం జరుగుతున్నది కూడా. పరిశ్రమల నన్నిటినీ సమాజపరం చేసి, వర్గభేదాన్ని రద్దుచేసినప్పుడే స్త్రీకి గృహ బానిసత్వంనుంచీ, పురుషుడి క్రింద బానిసత్వంనుంచీ సంపూర్ణమైన స్వేచ్ఛ లభించగలదు.

భారతదేశంలో బూర్జువా నాయకత్వం ఒకవేపున గృహ్యాశ్రమ యొక్క ఔచితినిగురించి గొప్పగా పొగడుతున్నారు. మరో వేపున పరిశ్రమల కధికారులైన బూర్జువా వర్గం చౌకకూలీ గిట్టుబాటుకావడానికి స్త్రీలను ఫ్యాక్టరీల్లోకి తరుముతున్నారు. బూర్జువావర్గమూ, వారి ప్రతినిధులైన నాయకులూ యిద్దరూకూడా స్త్రీకీ, సమాజానికీ కండ్లగంతలు కట్టి వారి ముక్తికి నిజమైన మార్గమేదో కానరాకుండా చేస్తున్నారు. కేవలం గృహ్యాశ్రమలో స్వేచ్ఛవుండదు; లేక మధ్యతరగతులవలె విద్యాధికురాలై నాలుగురాళ్ళు సంపాదించుకోగానే స్వేచ్ఛ వచ్చినట్లుగాదు. సామాజిక విప్లవం జయంపొంది, ఉత్పత్తి సాధనాలపైన ప్రైవేటు ఆస్తిహక్కూ, వర్గరాజ్యాంగయంత్రమూ, వాటితోపాటు పురుషుని ప్రాబల్యమూ రద్దయిపోయినప్పుడే స్త్రీకి నిజమైన స్వేచ్ఛ కలుగుతుంది. అయితే యీ విషయం యిక్కడ చర్చనీయాంశము కాదు.

# పదకొండో అధ్యాయం

## విరోధశక్తుల సంఘర్షణ

ప్రాచీన ఆర్యగణసమాజం శీఘ్రగతిని శిథిలమైపోతు న్నది. సమాధానపడుపరాని వైరుధ్యాలతో అది యదాయద లైపోయినది. యజ్ఞవిధాయకమైన వుత్పత్తి భగ్నమైనది. అందువలన పాతబడిపోయిన యజ్ఞవిధాయక జీవితధర్మము యొక్క పరిమితులకు కట్టుబడి, యీ వైరుధ్యాలను పరిష్క రించడానికి వీల్లేదు. కొత్తవుత్పత్తి సాధనాలూ, కొత్త వుత్పత్తి సంబంధాలూ వచ్చి ప్రాచీన యజ్ఞగణ-గోత్ర సంబంధాలకు వ్యతిరేకంగా ప్రాబల్యముకొరకు పోరాడు తున్నవి. దానిస విధానముపై నాధారపడిన ప్రైవేటుఆస్తి, స్వేచ్ఛా సమానత్వములపైన ఆధారపడిన వుమ్మడి ఆస్తిని త్రోసిరాజంటున్నవి. ఆర్యగణాలలో తీవ్రమైన అంతర్యుద్ధము చెలరేగినది. ఈ అంతర్యుద్ధాన్ని, తత్ఫలితంగా గణనిర్మాణం చచ్చిపోయి, దాని స్థానంలో రాజ్యాంగయంత్రం ఏర్పడ టాన్ని పరిశీలించేముందు, వెనుకటి అధ్యాయంలో అభివృద్ధి చూతున్నామని పేర్కొన్న వైరుధ్యాలనుగురించి కొన్ని సారాంశాలను తేల్చుకోవాల్సి వున్నది.

సమిష్టి యజ్ఞశ్రమ ననుసరించుతూ వచ్చిన చిన్నచిన్న గణాలు పెద్దవిగా పెరిగి, అనేక భాగాలుగా చీలినవి. గణముల సంఖ్య పెరిగినది. అగ్నివలన, పశువులవలన ఒకటిగా నున్న గణమే అనేక గణాలైనది. ఇది ప్రజాపతి యిచ్ఛ. చిన్నదిగా వున్న గణం పెద్దదైంది.

గణం ఒక్కటిగావున్నప్పు డేర్పడిన సంబంధాలనే అనేక గణా లేర్పడినప్పుడుకూడా వర్తింపచేయవలసి రావడంతో అనేక సమస్య లుదయించినవి. కృతయుగంనాటి ఆటవికసంచారగణమే విశాలంగా విస్తరించి త్రేతాయుగం నాటికి బంధుగణ-గోత్రంగా అభివృద్ధియైనది. సమిష్టి యజ్ఞాగ్నిని ప్రతిష్ఠించి, సమిష్టిగా శ్రమచేసి, వస్తూత్పత్తిని, సంతానోత్పత్తిని సాగించడం; లభ్యమైనదానిని సమిష్టిగా అనుభవించడం-యివి సహజసిద్ధమైన యజ్ఞనియమములు. ఆదిమ గణగోత్ర కమ్యూనిస్టు సమాజనియమములు. ప్రవర్థమానములైన గణము లనుసరించిన సులభధర్మమూ, స్వయంవర్థకమైన ధర్మమూ ఇదే. ఈ ధర్మము అనాగరికయుగ ప్రారంభదశలో వుత్పన్నములైన సమస్యలన్నిటినీ పరిష్కరింపజాలినది.

కృషి పెరిగినది, సంపద పెరిగినది; పెరుగుదలవలన శ్రమవిభజన అవసరమైనది. చేతివృత్తులూ, లోహాలూ, వ్యాపారయమూ వచ్చినవి. మరల క్రొత్తసమస్యలు పుట్టుకొచ్చినవి. ఇప్పుడు గణసమాజాల్లో అంతరంగికమైన వర్ణవిభాగ మేర్పడినది. ఈవర్ణాలు ఆర్థికంగా నూతనపాత్రను నిర్వహించినప్పటికీ, ఇంకా సమిష్టిజీవన పరిస్థితులలోనే యిమిడియున్నవి. పూర్వపు అవిభక్త గణసమాజముయొక్క ఆర్థిక వ్యవస్థాగర్భంలోనే అనేకంగా విభాగింపబడిన వర్ణ ఆర్థికవ్యవస్థ అంకు

రించినది. గణధర్మానికీ, వర్ణధర్మానికీ ఘర్షణ ప్రారంభ మైనది.

సంపద పెరుగుతున్నది; వివిధరకాల సంపదలు పెరుగుతున్నవి. ఒక ప్రదేశంలో నివసిస్తూ, ఆ ప్రదేశానికి సహజ విలక్షణమైన వస్తువులను వుత్పత్తిచేసే గణానికి, మరొక ప్రదేశంలో నివసిస్తూ ఆ ప్రదేశానికి విలక్షణమైన వేరు వస్తువుల నుత్పత్తిచేసే మరొక గణంతో సంపర్కమేర్పడి, వస్తువులను మారకం వేసుకోవడం ప్రారంభమైనది. మారకంకొరకే వుత్పత్తిచేసే విధానంవచ్చి, అనుభవంకొరకే వుత్పత్తిచేసే పద్ధతిని భగ్నంచేసినది. హిరణ్యంకొరకే వుత్పత్తిచేయడం వచ్చి, హవనం కొరకే వుత్పత్తి చేయడాన్ని వెనుకకు నెట్టివేసినది.*

వస్తువుల మారకం వచ్చింది-సమిష్టి వుత్పత్తినీ సమిష్టి అనుభవాన్నీ భగ్నంచేసింది. ప్రైవేటు వుత్పత్తీ, ప్రైవేటు అనుభవమూ, అంటే ప్రైవేటుఆస్తీ వచ్చినవి. బంధునిర్మితమైన గణసమాజంలో అదివరకెన్నడూ ఎరుగని కొత్త విభాగాలూ, కొత్త వైరుధ్యాలూ - బీదలకూ భాగ్యవంతులకూ మధ్య వైరుధ్యములు-వచ్చినవి. గణజీవితంలో చిరాకు రేగిపోయినది. ఇది ఆర్థిక సమస్య. ఈ సమస్యను పరిష్కరించడానికి వేరేమార్గం దొరకక నీతిబోధనతో పరిష్కరించడానికి గణసమాజము ప్రయత్నించింది. వస్తువుల వుపయోగం కొరకూ, అనుభవంకొరకూ తరతరాలుగా అనుసరించ

---

* కార్మారో అశ్మభిర్ద్యుభి హిరణ్యవంత మిచ్ఛంతీ
బ్రాహ్మణో.పరిస్రవ॥ ఋ 9-111.

బడుతూ వచ్చిన ఆర్థిక వినిమయవిధానము హావన, దాన నియమము. ఈ హావన దాన నియమాన్ని ఖచ్చితంగా అనుసరించాలని పట్టుపట్టి విఫలమైంది. ఈనియమాన్ని ఆచరణలో పెట్టించగల శక్తియేది? బ్రాహ్మణులూ, క్షత్రియులూ వుల్లంఘించారు; దానమూ, హావనమూ మొత్తం తమకే చెల్లాలని పట్టుబట్టారు. దాదాపుగా వర్ణవిభాగాను గుణంగానే ఆస్తికూడా కేంద్రీకృతమైనది. నిజానికి ప్రతి వర్ణంలోకూడా బీదలూ, భాగ్యవంతులూ అని వున్నప్పటికీ మొత్తంమీద బ్రాహ్మణులూ,క్షత్రియులూ—బానిసలకూ, పశువులకూ యజమానులైనారు. త్వరలో వర్ణవిభాగాలు సామాజిక వర్గవిభాగాలుగానూ,పరస్పర విరోధశక్తులుగానూ మారినవి. "ఒకే 'జెన్' (గణ సమాజం)లో యేర్పడ్డ ఆస్తి హెచ్చుతగ్గులు గణంయొక్క ఐక్యప్రయోజనాన్ని గణ సభ్యులమధ్య విరోధ ప్రయోజనాలుగా మార్చివేసినవి". (మార్క్స్) బ్రహ్మ, క్షత్రియుల ఆస్తికీ విశాలప్రజా సామాన్యం (విశ)యొక్క ప్రజాతంత్రానికీ ఘర్షణ ప్రారంభమైంది.

మారకం డబ్బునుసృష్టించింది. డబ్బువల్ల కూడబెట్టడం (Accumulation) సులభమైంది. వర్ణహక్కులు, ఆచారాల వల్ల ఆయుధాలనూ, అధికారాన్ని కలిగియుండి యుద్ధాన్ని, ఆర్థికవిధానాన్ని నడిపే నైపుణ్యమూ, విజ్ఞానమూ కలవారే డబ్బును కూడబెట్టగలిగారు. బీదలకూ - భాగ్యవంతులకూ, దోపిడీ చేయబడేవారికీ - దోపిడీచేసేవారికీ ఘర్షణ పెరిగింది. గణవ్యవస్థయొక్క సమిష్టిఆస్తికీ-వర్ణవ్యవస్థయొక్క ప్రైవేటు ఆస్తికీ పోరాటంసాగింది. సంపదయుజ్ఞంకోరకా లేక యేఒక్కనో

కూడబెట్టుకుని భోగాలను అనుభవించడానికా అనే ప్రశ్న ఉదయించింది.♦

ఉత్పత్తీ,సంపదలూ పెరగడంవల్ల యుద్ధఖైదీలు చంప బడక, బానిసలుగామార్చివేయబడ్డారు. ఆర్యగణసమాజంలో శూద్రబానిసత్వము ప్రవేశించింది. సమాజం రెండు విరోధ కూటాలుగా విభాగమైనది; బానిసలకూ, సంపదలకూ యజ మానులూ - ఆ యజమానులకొరకు బానిసచాకిరీ చేసే వారూనూ.

రక్తబంధువులైన గణసభ్యులలోకి యితర గణాలనుంచి శూద్రవుత్పత్తిదారులూ,వర్తకవ్యాపారులూ, పరాయివాలైన అతిథులూ మొదలైనటువంటి వారు-అంటే రక్తసంబంధమూ, బంధుత్వమూ లేనివారు - వచ్చిచేరారు. ప్రాచీన గణసమా జములోకి, గణనివాసములోకి యిలా పైనుంచి వచ్చేవారికి వర్తించే అంశాలు గణనిమమాల్లో లేకపోయినవి. అందువల్ల గణనియమాలతోపాటు కొత్త ఆర్థిక వైవాహికాదిసంబంధా లను క్రమబద్ధంచేయడానికి కొత్త నియమాల నేర్పరచడం అవసరమైనది. ఈ కొత్తనియమాలు, ప్రైవేటు ఆస్తీ, సరుకుల మారకంపైనా ఆధారపడియున్నవి. కాబట్టి పూర్వపు సమిష్టి

---

♦ "వదలుకొనడంలో ఆనందాన్ని అనుభవించుము. ఇతరుల సంపదల కాశించవద్దు" అని ఉపనిషత్తు బోధించడం మొదలుపెట్టింది.

"తేన త్యక్తేన భుంజీథా మా గృధః కస్యస్విద్ధనమ్" ఈశోపనిషత్ ॥

గణనియామాలకు వ్యతిరేకంగాకూడా వున్నాయి.* గణ - గోత్రం ప్రక్కనే గణ - రాష్ట్రం ఏర్పడ్డది. గోత్రం బంధు వర్గానికే వర్తిస్తుంది. బంధువులనీ, బంధువులు కానివారనీ భేదంలేకుండా ఒకనిశ్చితప్రదేశాని(Territory) కీ,అందులో చలామణీ అయ్యే ఆర్థిక విధానానికీ కట్టుబడియుండేవారందరికీ గణరాష్ట్రం వర్తిస్తుంది.

ప్రైవేటు ఆస్తి గణ కుటుంబాన్నీ, గణ గృహాన్నీ విచ్ఛిన్నంచేసింది. గణగృహంలోనే యేకపత్నీ కుటుంబం పెరిగింది. ఆస్తీ, వారసత్వమూ మొదలైన లక్షణాలుకల యేకపత్నీ కుటుంబం గణకుటుంబానికి వ్యతిరేకమైనది. గణానికీ - కులానికీ, ప్రజాపతికీ - గృహపతికీ ఘర్షణ యేర్పడ్డది. వ్యక్తి కుటుంబం యొక్క గృహ్యాగ్ని ముందు గణ కుటుంబం యొక్క త్రేతాగ్నికి ప్రాముఖ్యతపోయింది. సమిష్టి హవనాన్ని త్రోసివేసి వ్యక్తిగతమైన వంట ఆచరణలో కొచ్చింది. దేవతలనూ,గణాన్నితృప్తిపరచడానికీ,మోసగించడానికీ ఈప్రైవేటు వంటకు పాకయజ్ఞమని పేరుపెట్టారు. ధనవంతుడైన గృహపతి యొక్కస్వార్థంకొరకు వ్యక్తులుజరిపే చిన్న "యిష్టులు"వచ్చి

---

* లక్షణసామ్యత గలిగిన గణ గోత్ర నిర్మాణములో లేని కొత్త ధర్మమూ, కొత్తశాసనమూ ఈ దశలో పుట్టినవి.

జాతి జానపదాన్ ధర్మాన్ శ్రేణీధర్మాంశ్చ ధర్మవిత్ ।
సమీక్ష్య కులధర్మాశ్చ స్వధర్మే ప్రతిపాదయేత్॥ · మను 8-41.

ఇప్పుడు శృతులకూ, యితర ప్రమాణాలకూ వ్యత్యాస మేర్పడినట్లయితే శృతులే ప్రమాణంగా యెంచబడాలని నిర్ణయించబడ్డది. కాని శృతేతర ప్రమాణాలే కొత్తపరిస్థితులకు అనుగుణమైనవిగా వున్నాయి. కాబట్టి అవే ప్రాబల్యాని కొచ్చినవి. వాటికి అనుగుణంగావుండేట్లు శృతులకు వక్ర భాష్యం చెప్పబడ్డది.

సమిష్టిగా జరగవలసిన మహాయజ్ఞాలను త్రోసివేసినవి. ఇవియే "కామ్యేష్టు" లైనవి.* గణసమాజ సభ్యులందరూ సమిష్టి గృహంలో అగ్నిచుట్టూ కూర్చుని చేసుకునే సమిష్టి గణ సంతర్పణ భగ్నమైంది. ఇప్పుడు దాని స్థానంలో దేవతలకు సాంకేతికంగా బలుల నివ్వడమూ, ప్రైవేటుగా అతిథితో పాటు మెక్కడమూ, బిచ్చగాడికేదో యింత పారవేయడమూ ఆచారంలో కొచ్చినవి. ఈ బిచ్చగాడు గతించిపోతున్న గణ సమాజానికి ఏకైక ప్రతినిధిగా మిగిలాడు. స్వార్థపరుడైన కుటుంబ యజమాని "అతిథిపూజాపరుడ"నే పేరు గడించ డానికి యీ బిచ్చగాడికింత తిండి వేశాడు.

ప్రైవేటుకుటుంబమూ, గృహమూ, ప్రైవేటుఆస్తీ పెరగ డంతోపాటు పితృప్రాబల్యమూ, పుత్ర వారసత్వమూ వచ్చి నవి. పితృస్వామికం మాతృస్వామికాన్ని అణచివేసింది.

---

* పూర్వం సమిష్టిగా జరుపబడగల యజ్ఞయాగాలు వ్యక్తి కుటుం బముచేత జరుపబడగల చిన్న యిష్టులుగా మారడం, గణ సమాజంయొక్క సమిష్టి ఆర్థికవిధానం ప్రైవేటుఆస్తి, ఆర్థికవిధానంగా మారడానికి ప్రతి బింబమే. దరిద్రుడైన సామాన్యగృహస్థు (విశ్) పూర్వపు గణ సమాజ యజ్ఞంలోవలె పశువులను చంపే తాహతుగలవాడు కాకపోవడంచేత, పూర్వయజ్ఞానికి పరిహాసప్రాయమైన చిన్న యిష్టిని చేసేవాడు. ఇప్పుడు "ఇష్టిలో" పశువులను చంపడానికిబదులు పిండిబొమ్మలను హవనాగ్నిలో వేల్చడం మొదలెట్టాడు. పశువులను ధనవంతులు కాజేశారు. అందువల్ల బీదకుటుంబీకుడి తృప్తికీ, అతని దేవతాతృప్తికీ, పిండిబొమ్మలే గతియైనవి. దర్శపూర్ణమాసాలలో పురోడాశమూ, అగ్నిహోత్రంలో అనుష్టరణీ, మధు పర్కమూ యిలాంటివే. గోవధ ఆగిపోవడం గోవు పవిత్రమైనందువల్ల కాదు; దొరకనందువల్ల. అది యిప్పుడు ధనవంతుల గుత్తసొమ్ము. దానిని చంపి తినే తాహతు పేదరైతు (విశ్) కు లేదు.

స్త్రీమీద పురుషుడి అధికారం స్థిరపడ్డది. భార్యా భర్తల మధ్య, తల్లీకొడుకులమధ్య ఘర్షణ బయలుదేరింది.

సమిష్టి ఆస్తిహక్కులకు వ్యతిరేకంగా వచ్చిన ప్రైవేటు ఆస్తిహక్కులు వేదసూక్తాలకు వ్యతిరేకంగా గృహ్యాసూత్రాలను సృష్టించినవి. ఈ గృహ్యాసూత్రాలు ప్రైవేటు ఆస్తి నుంచి పుట్టినవని వాటి పేరే తెలుపుతున్నది. వేదాలు నిర్జీవమైన మత తంత్రకాండగా మారి, పెరుగుదల ఆగిపోయి విస్మరింపబడుతున్నవి. అందువలన వాటిని గ్రంథస్థము చేయవలసివచ్చినది.* సూత్రాలు అధికారంలో కొచ్చినవి. సూత్రాలకూ, వేదాలకూ ఘర్షణ యేర్పడ్డది. ప్రైవేటుఆస్తి వాస్తవికమై ప్రాబల్యములో కొచ్చి, సమిష్టిఆస్తి అవాస్తవికమై యింకా సంపూర్ణంగా గతించిపోలేదుగాని, గతించిపోతూ వున్నది. దీనికి అనుగుణంగానే గృహ్యము వాస్తవికమై నిలిచినది. వేదము అవాస్తవికమైపోయినది. స్మృతిమాత్రంగా లేక జ్ఞప్తిమాత్రంగా మాత్ర మున్నది. అందువల్ల శాసనకర్తలు సూత్రాలూ, స్మృతులూ మాత్రమే అనుసరణీయాలనీ శాసించారు. ఒకవేళ నూతనధర్మానికీ, పూర్వపు శృతులకూ వివాద మొచ్చినట్లైతే పూర్వశృతులే

* త్రేతాయాం సంహతా వేదా యజ్ఞావర్ణాస్తథైవచ ।
సంరోధాదాయుష స్త్వేతే వ్యస్యంతే ద్వాపరే యుగే ॥

శాంతి 238-104

ద్వాపరే విప్లవం యాంతి యజ్ఞాః కలియుగే తథా ॥ శాంతి 238-101

ఇక్కడ శ్రమవిభాగమూ, వర్ణవిభాగమూ, వాటివల్లవచ్చిన ఫలితాలూ కారణంగా, వేదాలు సంహితల రూపంలో క్రోడీకరింపబడినవని చెప్పబడ్డవి. వేదాలను క్రోడీకరించడం జరిగిందంటే అర్థం యజ్ఞం సామాజిక జీవితవిధానంనుంచి అంతర్థానమైపోతున్నదని అర్థం.

ప్రమాణంగా అంగీకరించా లన్నారు. కాని కేవలం సిద్ధాంతానికిమాత్రమే. ఆచరణలో కొత్తశక్తులదే రాజ్యము. వాటి ధర్మమే చెల్లింది.

పూర్వపు గణసమాజంలో తాత్కాలికంగా యెన్నుకొనబడే విధినిర్వాహకుల పదవులు, పారంపర్యంగా సంక్రమించేవై, త్వరలో గణసమాజానికి వ్యతిరేకమైన వ్యక్తిప్రయోజనాలుగా నిలిచి బలపడినవి. బానిసల బిడ్డలు బానిసలైనారు. ఆస్తికి ఆస్తివారసత్వమూ, దరిద్రానికి దారిద్ర్యవారసత్వమూ లభ్యమైనవి. ఆర్థికంగా బలవంతులైన వర్గాలవారు నానాట పెరుగుతూన్న వైరుధ్యాలు సమసిపోకుండా చిరస్థాయిగా వుండేట్లూ, చివరకు అత్యధిక సంఖ్యాకులుగా వుండే కష్టజీవులు అల్పసంఖ్యాకులుగావుండే దోపిడీదారి యజమానులకు లొంగిపోయేట్లుగా-అంటే బ్రహ్మక్షత్రియులకు వైశ్యులూ, శూద్రులూ లొంగిపోయేట్లుగా-సమాజాన్నంతటినీ అదుపుచేసి నడిపారు. ఈ రెండువర్గాలకూ ఘర్షణ పెరిగి తీవ్రరూపం వహించింది.

కొత్త ఉత్పత్తిశక్తులలో భూమి, పశువులు చేతివృత్తులతోపాటు ప్రప్రధానమైన వుత్పత్తిసాధన మైనది. పూర్వగణసమాజపు రోజుల్లో పశువుల కొరకూ, ప్రజకొరకూ పోరాడారు; ప్రార్థించారు. అప్పుడు వ్యవసాయమూ, భూమీ రెండవ పక్షంగా వుండేవి. కాని జనాభా పెరుగుదలవలన పశువులమీదనే బ్రతకడం కష్టమైపోయినది. అందువలన వ్యవసాయానికి ప్రాముఖ్యత హెచ్చినది. అడవులను నరికివేసి,

భూమిని వ్యవసాయంలోకి తీసుకురావడం అవసరమైనది. *కంచుపనిముట్లతో అడవులను నరకడం సాధ్యమైన పనిగాదు అందువల్ల యినుము కరగడం కనిపెట్టబడ్డది. శూద్ర బానిసలా, వైశ్య వ్యవసాయదారులా సహాయంతో అడవులను నరికివేసి భూమిని దున్నించారు.

గణసమాజ జీవితములో యిప్పటివరకూ ప్రధాన స్థానమాక్రమించియున్న పశువులు రెండోస్థానానికి నెట్టివేయబడ్డవి. నూతనయుగానికి ప్రధానమైన ఉత్పత్తి సాధనంగా, భూమి మొదటిస్థాన మాక్రమించింది. చేతివృత్తులు వ్యవసాయంనుంచి వేరుపడ్డవి. పట్టణం పల్లెప్రాంతంనుంచి వేరుపడ్డది. భూ సంపాదనకొరకు పోరాడటమే క్షత్రియ నాయకత్వానికి ప్రబలమైన వ్యావర్తిగా పరిణమించినది. భూమితోపాటు బానిసలను సంపాదించడంకూడానూ. ఈ యుద్ధాలవలన గణసమాజ నిర్మాణం కుదురంటా దెబ్బతిన్నది. పూర్వపు శాంతియుతమైన సమిష్టి ప్రజాతంత్రమే నేటి సైనిక ప్రజాతంత్రము (Military Democracy) గా మారినది. ఈ మార్పువలన గణంలోని సైనిక శాఖలు క్రమేణా గణసమాజంయొక్క నెత్తినెక్కి చివరకు గణసమాజాన్నంతటినీ అణచివేసి లోబరచుకున్నవి.

"జనాభా సాంద్రత యెక్కువైనకొలదీ, తెగలోపలగానీ, బయటగానీ సన్నిహితమైన ఐక్యత వుంటేగాని కార్యసాధనజరగదు. ప్రతిచోట సంబంధంకలిగిన తెగలు సమాఖ్యగా

---

* 'చెట్లను నాటడం' అడవులను పెంచడం నేటిధర్మమైతే అడవులను కొట్టివేయడం నాటి ధర్మమైనది. అందువల్లనే మహాభారతంలో ఖాండవ వనదహనం మహత్కార్యంగానూ, గొప్ప సేవగానూ యెంచబడ్డది.

యేర్పడటం అవసరమౌతుంది. త్వరలో ఆ తెగలు కలిసి పోవడం, దానివల్ల ఆయా తెగలు నివసించే ప్రదేశాలుకూడా కలిసిపోయి ఒకజాతి రాజ్య (Territory) మౌతుంది. ప్రజల సైనిక నాయకుడు-రెక్స(రాజన్) వదల్చుకోరాని శాశ్వతో ద్యోగి అవుతాడు. ఇదివర కొకరూపం లేని ప్రజాసమూ హానికిప్పు డొకరూప మేర్పడుతుంది. మిలిటరీ నాయకుడు (రాజన్) కౌన్సిల్ (సభ) ప్రజల ఎసెంబ్లీ(విదత) యివి సైనిక ప్రజాతంత్రము (గణ-సంఘము)గా అభివృద్ధిచెందిన గణ సమాజంయొక్క నిర్మాణశాఖలు, యుద్ధమూ, యుద్ధాని కవసరమైన నిర్మాణమూ జాతిజీవనంలో నిత్యవిధులవుతాయి. కాబట్టి దాన్ని సైనిక ప్రజాతంత్రమంటారు. ఈపాటికే సంపదను పోగుచేసుకోడమే ప్రధానజీవితాశయాల్లో ఒకటిగా చూస్తున్నజాతుల్లో పొరుగుజాతి సంపదనుచూస్తే, కన్నెర్ర పుట్టూన్నది. వారిదృష్టికి కష్టార్జితంకన్నా కొల్లగొట్టి సంపా రించడం ఎక్కువ సులభంగానూ, నిజానికి యెక్కువ గౌరవ ప్రదంగానూ అవుపడుతుంది. వారు అనాగరికులు. ఇదివరకు పగదీర్చుకోడానికో, వుండటానికి చోటుచాలక విస్తరించ డానికో యుద్ధాలుజరిగేవి. ఇప్పుడు కొల్లగొట్టడానికిమాత్రమే యుద్ధం జరుగుతున్నది. నిజానికి యుద్ధంకూడా ఒక పరిశ్ర మయే మైనది'' (ఏంగెల్స).

బీదదైన విశా ప్రజాతంత్రానికీ, శూద్రబానిసత్వానికీ యెదురుపోటీగా భాగ్యవంతులైన బ్రాహ్మణ,క్షత్రియకుటుం బాల భాగ్యసంపదలు పెరిగిపోతూంటాయి. తమ భాగ్యసంప దలను పరాయి దండయాత్రాపరులనుంచే కాక, తమ క్రింద నున్న కష్టజీవు లేనాడేనా తిరుగుబాటు చేస్తారేమోననే

భయంనుంచికూడా రక్షించుకోడానికి పట్టణాలనూ, దుర్గాలనూ నిర్మిస్తారు. పట్టణానికీ పల్లెలకూ వైరుధ్యం నిశితంగా పెరిగిపోతుంది.

ప్రైవేటుఆస్తి పునాదిమీద ఉత్పత్తీసంపదా పెరుగుతూన్నకొలదీ, కష్టజీవులైన ప్రజలకూ, కలవారైన బ్రాహ్మణ క్షత్రియ వర్గాలకూ మధ్య అఖాతం యింకా పెరిగిపోతుంది. ప్రజల దరిద్రం పెరిగినకొలదీ, వారంతకంతకూ శూద్రబానిసలకు దగ్గరగాచేరుతుంటారు. విశాప్రజ(వైశ్యులు)పూర్వము విజేతలైన త్రివర్ణ ఆర్యజాతిలో భాగంగా వున్నంతకాలమూ వారుకూడా శూద్రబానిసల నట్టిపెట్టుకోడాన్ని హర్షించారు. గౌరవప్రదమని యెంచారు. కాని ప్రైవేటుఆస్తియొక్క, బానిసవిధానముయొక్క పరిణామస్వభావ మెలాంటిదంటే, వైశ్యప్రజాసామాన్యంకూడా వాటివలలో చిక్కుకుని బానిసతనంలోనికి నెట్టబడ్డారు. ఒకప్పుడు గర్వంగా తలెత్తుకుతిరిగిన విశయే బ్రహ్మము; సర్వవ్యాప్తమైనగణసమాజము. వారినుంచే బ్రాహ్మణ, క్షత్రియవర్ణాలుపుట్టి విడిపోయినవి. అలాంటివారు దరిద్రులై, శూద్రులవలెనే దరిద్రబానిసలై అమ్మివేయబడ్డారు. వారొకప్పుడువిజేతలైనఆర్యులలోనివారు కాబట్టి, వారి జననమూ, వివాహమూ, అంత్యక్రియలూ వేదోక్తంగా జరిగే హక్కేర్పడ్డది. పరాయివాడూ, అనార్యుడూ అయినశూద్రుడెన్నటికీ ఆగతులుపొందే అవకాశంలేదు. కాని వైశ్యప్రజ సిద్ధాంతరీత్యా పాలకవర్గానికి చెందినవాడైనప్పటికీ, నిత్యజీవితాచరణలోమాత్రంవారుశూద్రబానిసలలోవాళ్లే. ఒకప్పుడు యితరులను బానిసలను చేసికొని,ధనధాన్యసమృద్ధిగా అభ్యుదయంపొందిన ఆర్యులకే చివరకు బానిసలై అమ్మబడేగతి,

కొనబడేగతీ పట్టింది. ఇలా భూమిమీద శానిస్ప్రబతుక్కు దిగ లాగబడిన తరువాత, కనీసం స్వర్గాన్నయినా దక్కించుకుందా మని ఆశపడ్డారు. కాని అదికూడా త్వరలో వూడిపోయింది. పాలకవర్గాలవారు బ్రాహ్మణనాయకత్వంక్రింద స్వర్గాన్నికూడా గుత్తకుతీసుకున్నారు.విశాప్రజాతంత్రం మొదట భూమిమీద నశింపు అవుతున్నది. తరువాత స్వర్గంలోనూ నశిస్తుంది.

"కొల్లగొట్టడానికి జరిగే యుద్ధాలవలన సర్వసేనాని అధికారమేకాకుండా, ఉపసేనానుల అధికారంకూడా యెక్కు వైంది. వారి తరవాత అధికారం వహించవలసినవారిని వారి కుటుంబాలనుంచే యెన్నుకొనే ఆచారం, క్రమేణా ముఖ్యంగా పితృహక్కు వచ్చింతరవాత పారంపర్య వారసత్వంగా మారి పోయింది. మొదట ఈమార్పును ఉదాసీనంగా పోనిచ్చారు. తరవాత అదే హక్కుగా కోరబడింది. ఆ తరవాత, చివరకు ధర్మవిరుద్ధంగా దురాక్రమించబడింది. ఇలా వంశానుగతమైన రాజరికానికి పునాది యేర్పడింది. గణసంఘ నిర్మాణశాఖలు యీవిధంగా ప్రజాబాహుళ్యంనుంచీ, గణంనుంచీ, తెగనుంచీ విడబడిపోయాయి. చివరకు గణ వ్యవస్థా నిర్మాణం తనకు వ్యతిరేకమైన వ్యవస్థగా మారిపోయింది. స్వంతకార్యకలాపా లను యిచ్ఛాపూర్వకమైన క్రమవిధానంలో నడుపుకొనడాని కేర్పడిన తెగల నిర్మాణం పొరుగువారిని కొల్లగొట్టడానికీ, అణగద్రొక్కడానికీ పనికివచ్చే నిర్మాణంగా మారిపోతుంది. ఇందు కనుగుణంగానే దాని నిర్మాణశాఖలు పూర్వం ప్రజాభి ప్రాయాన్ని అమలుజరిపే శాఖలుగా వుండేవల్లా ప్రజలనెత్తి

కెక్కి అణగద్రొక్కడానికి వుపయోగపడే శాఖలుగా మారి పోయాయి" (ఏంగెల్స్).

బ్రాహ్మణ - క్షత్రియులు ప్రజలను అణగద్రొక్కడం మొదలెడతారు. ఒకవేపున ప్రజల నణగద్రొక్కుతూనే, కొల్ల గొట్టినదానిని పంచుకునేచోట, దోపిడీపై సర్వాధికారంచెలా యించడానికి తమలోతాము కలహించుకుంటారు. ఇదివరకు అన్యరక్తస్పర్శ అంటే సమాజంభయపడేది. ఇప్పుడు, 'సమా జానికి' అంటే పాలకవర్గానికి వర్ణసంకరమాతుందేమో నని, కష్టజీవులైన శూద్రబానిసలూ, దరిద్రులైన వైశ్యప్రజలూ యేకమై ప్రస్తుతసమాజాన్ని తలక్రిందులు చేస్తారేమోననీ, పూర్వకాలపు గణసమాజ సమిష్టి సమానత్వాలను తిరిగి నెల కొల్పుతారేమోననీ, ప్రైవేటు ఆస్తినీ, పితృస్వామికాన్నీ, రాజపాలననూ కూలదోస్తారేమోననీ కొత్తభయం పట్టుకు బాధించింది. అదేగనుకసంభవించిందా ప్రపంచంకూలిపోయి నట్లూ ప్రళయంవచ్చినట్లూపాలకవర్గాలుగడగడలాడుతాయి. దోపిడిదారులకూ, దోపిడీచేయబడేవారికీ మధ్య యుద్ధాలు చెలరేగినవి. పూర్వపు గణసమాజంయొక్క అవశేషాలూ, ఆచార సాంప్రదాయాలూ కనీసం మతకర్మల రూపములో నైనా వుండకుండా నాశనంచేయడం దోపిడీదారుల ఆశయం. ప్రైవేటు ఆస్తీ, వ్యక్తిగత భోగభాగ్యాలూ, రాజుల అధి కారమూ, ఆయుధబలమూ అన్నీ అత్యధికసంఖ్యాకులైన కష్టజీవుల నెత్తినెక్కకుండా అరికట్టడం దోపిడీచేయబడేవారి ఆశయం. ఈ పరస్పర విరుద్ధాశయాలకొరకు పరస్పర విరోధ వర్గాలు పరస్పరం యుద్ధాలు సాగించాయి.

# పన్నెండో అధ్యాయం

## గణ సంఘాలు

(పాణిని, కౌటిల్యుడు, గ్రీకులు మొదలైనవారి అభిప్రాయాలు)

ఆర్యగణాలలో మనమింతవరకూ చూచిన పరిణామం ఎక్కడ జరిగింది? ఎప్పుడు జరిగింది? వెనుక అధ్యాయాల్లో వర్ణింపబడిన గణములలాంటివి నిజంగా ఒకప్పుడుండేవనీ, అవి దండయాత్రలకూ, అంతర్యుద్ధాలకూ గురియై భగ్నమై వాటి స్థానాన్ని రాచరికసామ్రాజ్యా లాక్రమించుకున్నవనీ ఋజువు చేసేందు కేమైనా వ్రాయబడ్డ చరిత్రాధారా లున్నాయా? ముందీ సమస్యను పరిశీలించి, గణాలలో వర్గకలహ పరిణామ మెలా జరిగిందో తరువాత చూద్దాం.

ప్రాచీన గణాల అభివృద్ధిని గురించి లభ్యమైన కాల క్రమానుగతిక వివరాలు చాల అస్పష్టంగా వున్నాయి. అగ్నినీ, పశువుల పెంపకాన్నీ కనిపెట్టిన నాటినుంచీ, అంటే ఆటవిక స్థితినుంచి, యజ్ఞవిధాయకమైన ఆదిమ కమ్యూనిస్టు తెగలేర్పడి లోహాలు కరగడమూ, నేత, మారకమూ, వర్ణ విభాగరూపమైన శ్రమ విభజన, ప్రైవేటుఆస్తీ, శూద్రబానిసత్వమూ యివన్నీ వచ్చిననాటికీ మధ్య అనేక వందలసంవత్స

రాలకాలం గడచివుంటుంది. ఈవిషయాన్ని వైదిక ఋషుల ఖగోళపరిశీలనలనూ, వాటినివివరించిన తిలక్, దీక్షిత్, కేత్కర్ మొదలైన ఆధునిక భారతీయపండితుల చర్చలనూ చూస్తే తెలుసుకోవచ్చును. ఆర్యగణాలలో వర్ణవిభాగమూ ప్రైవేటు ఆస్తీ, శూద్రదాసీసత్వమూ నిలకడమైన సంపూర్ణరూపంలో ఏర్పడటం ఆర్యులు భారతదేశానికివచ్చిన తరువాత చాలా కాలానికి గాని జరగలేదని కొంత నిర్ధారణగానే చెప్ప వచ్చును. కాలానుక్రమణిక ననుసరించి చూస్తే మహాభారత యుద్ధానికి పూర్వమే యీ పరిణామం పూర్తయిందనీ, అను శృతిగా చెప్పుకుంటున్నట్లు భారత యుద్ధానంతరం కలి యుగం ఆరంభమైనదనీ చెప్పవచ్చును. దేశంలోని సామాజిక నిర్మాణానికి చెందిన వివరాలుకూడా దీన్నిఋజువుచేస్తున్నవి.

మధ్య ఆసియాలో ఆదిమార్యగణ సమాజం చీలి, ఒక శాఖ తూర్పువైపునకు వలససాగించిననాటికి వ్యవసాయము గానీ, శ్రమవిభాగముగానీ, సైనిక నాయకత్వముగానీ అభివృద్ధి కాలేదు. దేవగణాలకు సోదర గణాలైన అసురగణాలలో మొట్టమొదలీ పరిణామం ప్రారంభించింది. మొదట అసురులు ధాన్యపు మొక్కలను పెంచినప్పుడు దేవతలు నిరసించారని ప్రాచీనగాథలు చెప్తున్నవి తీరా ఆ మొక్కలనుంచి ధాన్యం పండటంప్రత్యక్షంగాచూచి దేవతలుభయపడిపారిపోయారు. దేవతలెప్పుడూ యుద్ధనైపుణ్యం (Technique)లో అసురుల కన్నాలోజుగా వుండేవారనీ, వారినుంచే దేవతలు నిలకడమైన నిపుణమైన సైనిక నాయకత్వాన్ని నిర్మించుకోడం నేర్చు కున్నారనీ, అటుతరవాతనే వారుఅసురలనుజయించగలిగారనీ

దేవాసుర యుద్ధగాథలు తెలుపుతున్నవి. దీనినిబట్టి ఆర్యులు మొదట తమఆదిమనివాసంనుంచి చీలివచ్చిననాటికి వారింకా యజ్ఞవిధాయకమైన వుత్పత్తినీ, జీవితాన్నీ గడిపే మాతృస్వామిక గణాలుగానే వుండేవారని వూహించవచ్చును.

ఆఫ్ఘనిస్థాన ప్రాంతాల్లోనూ, ముఖ్యంగా సింధునదీ లోయ, పంజాబులోని హిమాలయ దక్షిణ ప్రాంతాలలోనూ ఆర్యగణాలు వర్ణాలనూ,ఆస్తినీ,వర్గాలనూ, బానిసవిధానాన్నీ అభివృద్ధిచేసినవి. ప్రాచీన వైదిక కార్యకలాపాల్లో యీప్రదేశాలే వుదహరింపబడియున్నవి.

తూర్పుదిశకుజరిగిన ఆర్యగణదండయాత్ర ఒక్కతరంగంగా జరగలేదు. అనేకవందల సంవత్సరాల కాలంలో అనేకతరంగాలుగా యీ తూర్పు దండయాత్రలు సాగినవి. అందువల్లనే వెనుకవచ్చిన ఆర్యులు ఒక్కొక్కప్పుడు వారికన్నా ముందువచ్చి వలసలేర్పరచుకున్న ఆర్యులతో పోరాడవలసి వచ్చింది. సాధారణంగా ఆర్యులకందరకూ నాయకుడనబడే యింద్రుడు ఒక ఆర్యగణానికి వ్యతిరేకంగా మరొక ఆర్యగణానికి సహాయంచేయమని కోరబడటం యిదేకారణంవల్లననాలి. ఆ సందర్భాల్లో వేదమంత్ర రచయిత ఆర్యులూ దశ్యులూ యిద్దరూ తనకు శత్రువులేననీ, యింద్రుణ్ణి సాయంచేయమనీ అర్థించాడు.

సింధులోయనాక్రమించడం, అక్కడి ప్రథమనివాసులనోడించడం, వర్ణాలూ, బానిసత్వమూ అభివృద్ధికావడం-యివన్నీ క్రీ. పూ. 3000 – 2000 మధ్యకాలంలో జరిగినట్లవుపడుతుంది. ఆ తరువాతగాని వివిధ గణ సంఘాలు సైనిక

ప్రజాతంత్రాలుగా లేక పాలకవంశ ప్రజాతంత్రాలుగా(Closed aristocracies) మారి, వర్గరహిత సమాజ విధివిధానాలను భగ్నంచేసి వాటిస్థానే ఆస్తీ, బానిసత్వమూ, రాజ్యాంగ యంత్రమూ, వర్గపరిపాలనా యేర్పడటం జరగలేదు.

పశుసంపద, వ్యవసాయము, చేతివృత్తిపనులు, వైశ్యుల యొక్క, బానిసలయొక్క శ్రమను దోచుకోడంమూలంగాగణ సంఘ సైనిక ప్రజాతంత్రాలు శక్తిసంపదలను పెంచుకుని యింకా తూర్పుకు గంగానదీ లోయవరకూ విస్తరించినవి. గణ సంఘాలలో అంతర్యుద్ధాలు (పరశురాముడూ, హైహ యులమధ్య యుద్ధం మొదలైనవి) ప్రబద్ధలైనవి.

గంగానదీలోయకు చేరిన తరవాతనే మధ్యయుగపు హిందూబానిస ప్రభుత్వయంత్రము పరిపక్వదశకు వచ్చినది. ఆ దశలోనే మహాభారతయుద్ధం జరిగింది. ఇది క్రీ.పూ.2000-1500 మధ్య జరిగినది. మహాభారత యుద్ధకాలము క్రీ. పూ. 1500, కొందరు క్రీ.పూ. 3000 అంటారు కాని సర్వసామా న్యంగా అంగీకరింపబడలేదు.

మహాభారత యుద్ధంవల్ల రెండుపార్టీలూ అపారంగా నష్టమునుపొందిన కారణంచేత, యుద్ధానంతరం కొంతకాలం వరకూ, యెక్కడా బలమైన ప్రభుత్వ మేర్పడలేదు. బానిస రాజ్యాంగ యంత్రాభివృద్ధి కొంతవరకు అరికట్టబడ్డది. గణ సంఘాలకు మరల తలెత్తే అవకాశం కలిగింది. అయితే బహు స్వల్పకాలం మాత్రమే. గంగానదీలోయలో భూస్వామ్యవిధా నపు బానిస రాజ్యాంగయంత్రాలు కేంద్రీకృతమైన బలసంపద లతో పెరిగివచ్చి గణసంఘాలను మ్రింగివేసినవి. పాటలీపుత్ర,

హాస్తినాపుర సామ్రాజ్యాలయొక్క పుర్రితాళ్ళ కందకుండా, దూరంగా వింధ్య హిమాలయప్రాంతాలలోనూ, సింధులోయ లోనూ కొన్ని గణసంఘాలు ప్రాణాలు నిలుపుకున్నవి. అలె గ్జాండరు నాయకత్వాన గ్రీకు దండయాత్రలు జరిగిననాటి వరకూ యీ గణసంఘాలు నిలిచియున్నవి. అలెగ్జాండరుతో వచ్చిన గ్రీకు చరిత్రకారులు, నాటి గణసంఘాలు మనం వెనుక వర్ణించిన తీరుననే జీవితము వెళ్ళబుచ్చేవనడానికి తగిన నిదర్శనాలను వుదహరించారు.

గ్రీకు లుదహరించిన నిదర్శనాలేకాక, ప్రాచీన భార తీయ గ్రంథకారులుదహరించిన నిదర్శనాలుకూడా వున్నవి. ఈ రెండు ఆధారాలనూ జోడించి పరిశీలిస్తే కొన్ని ప్రాచీన గణసంఘాల పేర్లనూ, అవి నివసించిన ప్రదేశాలనూ గుర్తించ వచ్చు. ఈ ఆధారాలనుంచి మహాభారత యుద్ధకాలానికి పూర్వము, అంటే బానిస రాజ్యాంగయంత్రము సంపూర్ణ విజయాన్ని పొందడానికి పూర్వము, గణసంఘాలలోని జీవిత పరిస్థితులెలా వుండేవో తెలుసుకొనవచ్చును.

ఆదిమ కమ్యూనిస్టుదశలో వుండే గణాలు, ఆదశ గడచిన తరువాతకాలాల్లో వుండకపోవడం సహజం కాని, యిటీవల ప్రాచీనకాలంలోకూడా అలాంటిగణాలుండేవనీ, అవి చాలా ఆనందంగాజీవించినవనీ తెలుస్తున్నది. ఈగణాలు అరాజక పరిస్థితులలో జీవించుతూండేవని వర్ణింపబడినది. కాని యీఅరాజకాన్ని కట్టుబాటులేని గందరగోళ పరిస్థితిగా తప్పునిర్వచనాలు చేస్తున్నారు. బానిసయుగ రచయితలూ, రాజరికవాదులూ ఆగణాలనుచాలానీచంగా వర్ణించారు. కొటి

ల్యుని అర్థశాస్త్రంలో వైరాజ్యగణాలంటే-నీదీ-నాదీ అనేభేద ము పాటించనిసమాజాలని వర్ణించబడ్డట్లుయీవరకేచూచాం. అరాజకం కౌటిల్యుడి "వైరాజ్యం" కన్నా హేయమైనదిగా వర్ణింపబడ్డది. పూర్వము ప్రజలు అరాజకంలో వున్నప్పుడు ఒకరిగొంతు లొకరుకోసుకొని సర్వనాశనమైనారని మహాభార తం ప్రాస్తున్నది. అప్పుడు వారు పితృదేవతను సలహా అడి గారు. పితృదేవత రాజరికపాలనను యేర్పాటు చేసుకోమని సలహాయిచ్చాడు. అప్పుడు కొన్నిగణాలవారు పితృదేవత సలహాలనూ,ఆయన బానిసరాజ్యాంగాన్నితృణీకరించి,పోయి, తమ అరాజక జీవితాన్నే కొనసాగించారని కూడా తెలుపు తున్నది. ఆచారాంగ జైనసూత్రాలలో ఈ క్రిందివిధమైన గణాలుండినవని పేర్కొనబడినది: అరాయణి, గణరాయణి, జూవరాయణి. దోరజ్జని, వేరజ్జని, విరుద్ధరజ్జని. ఈఆరుగణాల్లో మొదటిది అరాయణి అంటే అరాజకగణం. పైరివేటు ఆస్తీ, వర్గాలూ, బానిసలూ, దోపిడీ లేకపోవడం యీ గణ లక్షణాలు. అందువల్లనే కౌటిల్యునికీ, మహాభారత కర్తకూ యిపంటే యేవగింపు. వాళ్ళింకా పాతపద్ధతుల ప్రకారమే సమిష్టిగా పనిచేసి, సమిష్టిగా తినేవారు. ఈవిధమైన గణాన్ని అధర్వాణవేదం యిలా వర్ణించింది :

"...మీరిక్కడికి పరస్పర సహకారులై, పరస్పర ప్రియభాషులై ఒక కాడివెంట వచ్చారు. మీరు ఒకేమధుర రసమును త్రాగుదురుగాక! మీరు సమిష్టిగా భుజింతురు.

గాక! మిమ్ములను ఒకే బాటలో, ఒకేకాడికి కట్టుచున్నాను.*
(బ్లూం ఫీల్డ్ భాషాంతరీకరణం)

సరిగ్గా పైన వర్ణింపబడినటువంటి సమాజాన్ని జైన యాత్రికుడు దక్షిణహిందూస్థానంలో చూచాడు. అలెగ్జాండరునాటి గ్రీకు చరిత్రకారుడు వారు కొరతలేని జీవనం గడిపేవారని చెప్పాడు. అధర్వణవేదంలో చెప్పినట్లు వారు సమిష్టిగా భుజించేవారు.♦ వారు యే వృత్తినేనా (ఉదాహరణకు-యుద్ధం అలాంటిది) అదే న్యాయవృత్తిగా అనుసరించడం దుష్టత్వమని భావించారు" (స్ట్రాబో. XV 34 జయస్వాల్ గ్రంథంలో ఉదాహృతం.) గ్రీకులు వీరిని ముచికనులని పేర్కొన్నారు. ఇదే ముచికర్ణిక గణమని గుర్తింపబడ్డది.

భారతదేశంలో బానిసరాజ్యాంగాలూ, ప్రైవేటుఆస్తీ వచ్చి ఆదిమ కమ్యూనిస్టు గణసమాజాలను మింగివేసే రోజుల్లో తప్పించుకుని బ్రతికి చరిత్రలో నిలిచిన అరాజక సంఘాలు స్వల్ప సంఖ్యలో వుండటం సహజమే.

తరువాత ముఖ్యమైన గణాలు "వైరాజ్య" నిర్మాణం కలిగిన గణాలు. వైరాజ్యగణంలోకూడా రాజ్యాంగయంత్రం కానీ రాజరికముకానీ లేవు. కాని, యిందులో వర్ణవిభాగ

---

* జ్యాయస్వన్తశ్చిత్తినో మావియౌష్ట సంరాధయన్తః సధురాశ్చరన్తః।
అన్యో అన్యస్మై వల్గు వదన్త ఏవ సధ్రీచీనాన్వః సంమనసస్కృణోమి।
సమానీ ప్రపాసహవోఽన్నభాగః సమానేయోక్త్రే సహవో యునజ్మి॥
(అధర్వ 3-30-5-6-)

♦ గణం సమిష్టిగా భుజించేది అనగానే అది యేదో తాత్కాలికంగా జరుపుకునే ఒకటి రెండునాళ్ళ విందుభోజనంలాంటిది కాదు. ప్రైవేటుఆస్తీ, బానిసత్వమూ యెరుగని ఆదిమకమ్యూనిస్టు జీవితంలో సమిష్టి భోజనము అవసరమైన నిత్యవిధి.

రూపమైన శ్రమవిభజన యున్నది. ఆస్తి హెచ్చుతగ్గులూ కొంతవరకు పితృస్వామిక బానిసత్వము కూడా వున్నవి. ఇలాంటి వైరాజ్య సమాజనిర్మాణము గల ప్రజ లుండేవా రనీ ఐతరేయ బ్రాహ్మణమూ, యజుర్వేదమూ చెప్తున్నవి.

ఉత్తరహిందూస్థానంలోని ఉత్తరకురు, ఉత్తరమద్ర గణాలు యిలాంటి వైరాజ్యగణాలే. దక్షిణభారతంలోకూడా యిలాంటి గణాలు కొన్ని ఉన్నవి. ఈ కురుమద్రగణాలు హిమాలయ పర్వతప్రాంతాలలో నివశించేవి.

ఈ కురుమద్రగణాల లక్షణా లేమిటి? వీరిలో జానపద♦మంతా పరిపాలకవర్గమే. అంటే అది ప్రజాస్వామికము. అయితే యెవరి ప్రజాస్వామికము? పూర్వపు సహజసిద్ధమైన గణప్రజాస్వామికం కాదు. జనపదమంతటికీ పట్టంగట్టినంత మాత్రాన కురుమద్ర ప్రజాస్వామికాలు వైరాజ్యాలు కాలేరు. వైరాజ్యంలో ఒక విలక్షణమైన సమాజనిర్మాణం జరుగుతున్నది. పురుషసూక్తకారుడు యీ విలక్షణత్వ మేమిటో వర్ణిస్తున్నారు. ఇంతవరకూ మూడువర్ణాలే వుండేవి. ఇప్పుడు నాలుగవవర్ణంకూడా గుర్తింపబడినది. ఉత్తరకురులు నాల్గవదైన శూద్రవర్ణాన్ని కనిపెట్టి అభివృద్ధిచెంది, భూమి నంతటినీ ఆక్రమించ మొదలుపెట్టారు. వారు విరాట్టులైనారు. శూద్రబానిసలపైన త్రివర్ణధనికులు చలాయించే రాజ్యాంగ యంత్రాన్ని సృష్టించడానికి ప్రథమప్రయత్నాలు జరుగు

♦ సామాన్యంగా "జనపదమం"టే ప్రజలని అర్థంచెప్తున్నారు. కాని ఆ అర్థంతప్పు. పూర్వకాలంలో "జనపద"మంటే తెగలో మొదటి గణం వారని అర్థం. వీరిలో కొత్తగావచ్చిన శూద్రబానిసలూ, పరాయిగా వచ్చినవారూ చేరరు.

తున్నవి. ఇది పురుషసూక్తంలో వర్ణించినట్లు గణసమాజ సభ్యులు పొందుతూన్న కొత్త పురుషరూపము. ఈ కొత్త రూపంలో ధనధాన్యసంపదల అభివృద్ధీ అభ్యుదయ భవిష్యత్తూ ఉరుకులూ పరుగులతో వచ్చినవని వేదకారుడుపొంగిపోయాడు. ఆర్యబానిస యజమాని అప్పుడప్పుడే బానిసలను సంపాదించుకుని బలపడుతున్నాడు. అయినా, అప్పటికింకా అతడు తానూ, తన కుటుంబమూ శూద్ర బానిసతోపాటు పనిచేసే పితృస్వామిక కుటుంబీకుడుగానే వున్నాడు. ఈ స్థితిలో శీఘ్రంగా అభ్యుదయ పరంపరాభివృద్ధిని పొందుతూన్న బానిసయజమానియొక్క అదృష్టాన్ని కీర్తించిందే పురుషసూక్తం. అంటే యీపాటికి వైరాజ్య గణప్రజాస్వామికము బిగిసిపోయిన ప్రభువర్గ పరిపాలనమైనది (Closed Aristocracy). అందులో ప్రజాసభ ప్రభుత్వాధికారం చెలాయిస్తుంది. ఆ ప్రజల (జనపదం)లో శూద్రులకు చోటులేదు. కాబట్టే, అది బిగిసిన ప్రభువర్గపాలన అయినది. తరువాత తరువాత దరిద్రులైన ఆర్యవైశ్యులుకూడా యీ ద్విజ ప్రభువర్గాలనుంచి గెంటివేయబడ్డారు.

వైరాజ్యగణం తరువాతగాని, దానికి సమకాలికంగానే కాని పశ్చిమ భారతదేశంలో స్వరాజ్యగణ వుండేది. ఈ స్వరాజ్యగణాన్ని ఐతరేయబ్రాహ్మణం వర్ణించింది. గణం పనిచేయడానికి వీల్లేనంత పెద్దదిగా పెరిగిపోవడంవలన, సభయొక్క సమిష్టి కార్యకలాపాలను నడిపించడానికి ఒకచిన్న కౌన్సిలును యెన్నుకుంటారు. గణ నిర్మాణంలో లేక కొన్ని గణాలుకలిసిన గణసంఘ నిర్మాణంలో ఈకౌన్సిలుగా యెన్ను

కొనబడిన పెద్దలయొక్క వంశాలు, కాలంగడచినకొలదీ వార సత్వంద్వారా ప్రభువర్గాలుగా మారిపోతాయి. అందువల్లనే తరువాత తరువాత గణమంటే కులములయొక్క లేక కుటుంబ ములయొక్క సమాఖ్యగా నిర్వచింపబడినది. * స్వారాజ్యం యొక్క స్వభావ మేమిటి? స్వపరిపాలన అని దీని ప్రతిపదా ర్థము. కాని యది స్వపరిపాలన కానేకాదు. స్వారాజ్యమంటే గణముయొక్క వ్యవహారాలను నడపడానికై యెన్నుకొనబడి, అలా అధికార మీయబడిన నాయకత్వమని అర్థం. ఈనాయ కత్వానికి యెన్నుకునేవారి (''ఓటర్లు'')తో నిమిత్తం లేకుం డానే స్వతంత్రించి పనిచేసే హక్కున్నది. ఇది ''పెద్దల'' నాయకత్వము. ఇదివరకు యెన్నుకొనబడిన ''స్వరాట్టు'' గణసభ్యులతో సమానహోదానే ఉండేవాడు. ఇప్పు డాతడు ''పెద్ద''యై అందరికీ పైవాడౌతాడు. తైత్తిరీయ బ్రాహ్మణ మిలాగే వర్ణించింది. ♦

దీన్నిబట్టి,ఆదిమ కమ్యూనిస్టుగణంలో ప్రైవేటుఆస్తీ- వర్గాలూ, ధనికులూ-బీదలూ, స్వతంత్రులూ-బానిసలు అని భేదాలేర్పడగానే దాని స్వభావం మారిపోతుంది. ఇక నది ఇంద్రాది దేవతలనాటి సహజ ప్రజాతంత్రంగా వుండజాలదు. దానిలో క్రమేణా నూతనాంగాలు పెరిగి, వర్గ వైరుధ్యాలు

* కులానాం హి సమూహస్తుగణః సంపరికీర్తితః॥ (వీరమిత్రోదయ)

♦ ఏతస్యాం ప్రతీచ్యాం దిశి యేకేచ నీచ్యానాం రాజనో
యేఽపాచ్యానాం స్వారాజ్యాయైవ తేఽభిషిచ్యన్తే స్వరాడ్
ఇత్యేనాన్ అభిషిక్తాన్ ఆచక్షత (ఐ-బ్రా. 8-4)
య ఏవ విద్వాన్ వాజపేయేన యజతి । గచ్ఛతి స్వారాజ్యమ్।
అగ్రం సమానానాం పర్యేతి । తిష్ఠన్తేఽస్మై జ్యైష్ఠ్యాయ॥
(తై. బ్రా. 1-3-2-2)

నిశితమై, తీవ్రమైన పోరాటాలు ప్రబద్ధలౌతాయి. చివరకు వర్గ పరిపాలనాసాధనమైన ప్రభుత్వయంత్రం స్థాపించబడుతుంది. ఈపాటికే గణాలు గణగోత్ర పరిభాషను వదలిపెట్టి గణ సభ్యులూ యితరులూ నివశిస్తూండే ప్రాదేశిక, రాజకీయపర మైన రాజ్యాన్ని గురించిన పరిభాషను వాడుతున్నారు.

గణాలు చిన్నవిగావుండే ప్రాథమికదశలో గణ (విశ) సభ్యులందరూ చేరి సమిష్టిగా కార్యకలాపాలను నడుపుకునే వారు. యుద్ధనాయకుణ్ణి యెన్నుకోవాలంటే, అందరూ చేరి యెన్నుకునేవారు. యుద్ధంకూడా ఒక వృత్తియైన తరువాత యెన్నుకొనబడిన నాయకత్వమే స్థిరస్వభావమును పొందినది. 'సమితి' లేక 'సరష్ట' అనబడే గణసభ్యు లందరూ పాల్గొనే సమావేశం అంతరించి, దానిస్థానే "సభ" యేర్పడ్డది. అయితే యెన్నుకొనబడిన నాయకత్వ మప్పటికింకా వంశానుగతిక మైనరాజరికముగా మారలేదు. కాని ప్రత్యేకహక్కులుకలిగిన ప్రభువులవర్గంగా మారినది. దానిఅధికారం మాత్రం ఎన్నిక ద్వారా సంక్రమించినదే. నాయకుని యెన్నికయైన తరువాత అతనినింకా గణమే అధికారంలో నియమించవలసియున్నది. గణంలో ప్రైవేటు ఆస్తీ, వర్ణాలూ, బానిసత్వమూ అభివృద్ధి యైన తరవాత అది రాజ్యమైనది. పాలించుటకై యెన్ను కొనబడిన నాయకబృందం రాజులైనారు.

ప్రభువుల కులాలు రాజకులాలుగా మారిపోతాయి. చరిత్రలో వర్గపోరాటాలు జరిగి, బానిసయజమానులు జయిం చినతరువాత యీ రాజకులాలలో యెవరికెక్కువ భూమీ యెక్కువమంది బానిసలూవుంటే వారివంశంవారువంశపారం

పర్యంగా రాజులయ్యేవారు. అప్పుడు యెన్నిక స్వభావంలో మార్పువస్తుంది. పూర్వపు అధికార ప్రధానవిధియే కొద్ది మార్పులతో పట్టాభిషేక మహోత్సవమైపోతుంది. సమితిలో గణప్రజాస్వామికం సంపూర్ణంగా పనిచేసేది. ఇప్పుడు సభలో ఆస్తికి అధికారులైన పెద్దలకూటమియే యెన్నుకొనబడి విధి నిర్వహణను సాగిస్తుంది. 'సభ' సమితికన్నా సంకుచిత మయినది. పట్టణమూ పల్లె విడిపోగానే, వృత్తిపనులూ, వర్త కమూ ఒకవేపూ, వ్యవసాయం మరోవేపూ చీలిపోయి, ఉత్పత్తీ, సరుకుల మారకమూ, ఆస్తీ కేంద్రీకరణమయ్యే రెండు కేంద్రాలౌతాయి. జనపదమూ, పురమూ యేర్పడ తాయి. జనపదము వ్యవసాయపుటాస్తికి కేంద్రము. పురము ధనవంతమైన వృత్తిసంఘాలకూ వర్తకులకూ కేంద్రము. వర్త కులూ, ధనవంతులైన వృత్తిపరిశ్రమయజమానులూ పట్టణా లలో రాజుల కొలువుకూటాలచుట్టూ చేరతారు. సమితినీ సభనూ, జనపదమూ పురమూ త్రోసివేసినప్పుడు గణం పతనమైపోతుంది. అప్పటికే రాజ్యాంగయంత్ర మేర్పడి, దోపిడీదారులకొరకు దోపిడీ చేయబడేవారిపైన అధికారం సాగిస్తూ ఉంటుంది. పౌరజానపదశబ్దాల వర్గస్వభావాన్ని మన చరిత్రకారులు చూడటంలేదు.

మహాభారతయుద్ధకాలం తరువాతివాడూ, గొప్ప వ్యాకరణ పండితుడూఅయిన పాణినిగ్రంథాలలోనూ,ఇటీవలి కాలంలో రచింపబడిన మహాభారత అధ్యాయాలలోనూ గణ విధాయకమైన జీవితాన్ని గడుపుతూవుండేప్రజలు పేర్కొన బడ్డారు. కాని యీ గణాలు ఒకవేపున ఆస్తిగల కులాలు తమలోతాము ఆధిపత్యముకొరకు పోరాడే యుద్ధాలలోనూ,

మరోవేపున గణప్రజాస్వామికాన్ని నాశనంచేయడానికి వారందరూ కలసి సాగించిన యుద్ధాల్లోనూ చిక్కుకుని యున్నవి.

పాణిని అనేక గణసమాఖ్యలను పేర్కొన్నాడు, వాటికి ఆయన గణసంఘాలని పేరుబెట్టి, రెండుగా విభజించాడు. (1) ఆయుధజీవి సంఘాలు ; వీటినే కౌటిల్యుడు శస్త్రోపజీవి సంఘాలన్నాడు. రెంటికీ ఒకటే అర్థము. ఆయుధ జీవులకు వార్తా - శాస్త్రోపజీవులని మరొక పేరు. ఈ గణసంఘాలకు యెదురుముఖంగా భేదించియుండేవి (2) రాజశబ్దోపజీవి సంఘాలు. ఇంతవరకూ యేభాష్యకారుడుకూడా ఈపర్యాయ పదాలవల్ల సూచితమయే సామాజిక నిర్మాణా లెలాంటివో సరిగా నిర్వచించలేదు. భారతదేశచరిత్రలో గణాలకు ఉచిత స్థాన మీయడానికి ప్రయత్నించిన జయస్వాల్ కూడా యీపని చేయలేకపోయినాడు. వీటికి సామాజిక-ఆర్థిక లేక సామాజిక రాజకీయ పరమైన ప్రాధాన్యత వున్నవి. అయితే, ఈ రెంటికీ మధ్య భేదమేమిటో ఈరెంటికీ-వీటికి పూర్వమున్న గణాలకూ మధ్య భేదమేమిటో యింతవరకూ గుర్తింపబడలేదు.

ఆయుధజీవి సంఘాలు, లేక శస్త్రోపజీవి సంఘాలు అంటే సభ్యులందరూ సాయుధులుగా వుండేగణాలని అర్థము. అయితే, యిది ప్రత్యేకలక్షణంగల నిర్మాణంగా యెందుకు పేర్కొనబడినది? ఎందువల్లనంటే గణంలో యింకా శాశ్వత వర్గవిభాగమూ, వర్గపరిపాలనా యేర్పడలేదు. ఇవి యేర్పడిన గణంలో పాలకవర్గానికిమాత్రమే ఆయుధాలుధరించే అధికారముంటుంది. లేక నిరాయుధులుగా చేయబడిన కష్టజీవులకు వ్యతిరేకంగా, వారిపైన వర్గపరిపాలన చెలాయించడానికి

స్థాయీసైన్యాల (Standing Armies)ను యేర్పాటుచేసు కునే అధికారముంటుంది. అంతేగాక ఆయుధజీవి గణసంఘా లలో యెన్నుకోబడ్డ నాయకత్వము యింకా ప్రత్యేక,సాయుధ వంశానుగతమైన ప్రభువులవర్గంగా మారలేదు. రాజరికవర్గ రాజ్యాంగ చరిత్రకారులైనవారికి యీగణంయొక్క ప్రత్యేక స్వభావం దృష్టిని పడకపోలేదు. .అది సైనికప్రజాస్వామికము. అయితే అది ప్రాచీనగణములవలె వర్గరహితమైనది కాదు. ఆస్తి హెచ్చుతగ్గు లందులో ప్రవేశించినవి. వ్యవసాయమూ (వార్త్తా), వర్తకమూ డబ్బూ, భాగ్యమూ, పితృస్వామిక బానిసత్వమూ వచ్చినవి. కాని, దరిద్రులూ, కష్టజీవులూనైన ఆర్య (విశ) ప్రజాసామాన్యాన్ని అణగద్రొక్కి నిరాయుధు లను చేసేవరకూ వర్గవైరుధ్యాలింకా పెరగలేదు. గణంలో అందరూ పనిచేసేవారు. శూద్రబానిసకుతప్ప మిగిలివా రందరికీ ఆయుధా లుండేవి. సాయుధులూ, కష్టజీవులూనైన గణసభ్యులకు నాయకులుగా ధనికు లెన్నుకోబడేవారు. వార్త్తా శస్త్రోపజీవి సంఘము లేక ఆయుధజీవి సంఘు మిలాంటిది. ఈ సంఘాలు క్రీ. పూ. 300 వరకూ భారత దేశంలో నిలిచినవి. వీటిలో కొన్నిటి పేర్లిస్తున్నాను. (1) వృక (2) దమని (మొదలైనవి) (3-8) అర్గుమ త్రిగర్త్తల సమాఖ్య (కౌండోపరథ, దాండకి, కౌష్టకి, జాలమాని, బ్రహ్మ గుప్త, జానకి)♦ (9) యౌధేయ(మొదలైనవి) (10) పార్శ్వ (మొదలైనవి) (11) క్షుద్రకులు, (12) మాళవులు, (13) కఠ

♦ ఆహుస్త్రిగర్తషష్ఠాను కౌణ్డోపరథదాణ్డకీ।
కౌష్టకిర్జాలమానిశ్చ బ్రహ్మగుప్తోఽథజానకిః॥

(14) సౌభూతి, (15) శిబి, (16) పాటల, (17) భాగల, (18) కాంభోజ, (19) సురాష్ట్ర, (20) క్షత్రియ, (21) శ్రేణి, (22) బ్రాహ్మణిక, (23) అంబష్ట.

గంగానదీ లోయలో బలపడియున్న బానిసరాజ్యాల ఒత్తిడివలనా, గణసంఘాలలోనే అభివృద్ధియౌతున్న వ్యవసాయము వ్యాపార ఆర్థికవిధానమువలన యీ గణాలు నిల్చివుండాలన్నా, యుద్ధాలు సాగించాలన్నా, అభివృద్ధి కావాలన్నా సమాఖ్యలుగా యేర్పడటం అవసరమైనదని స్పష్టపడుతున్నది. కాని, సనాతన ఆర్యుల బానిసరాజ్యాల తాకిడికివి అంతంకాక తప్పదని చరిత్ర శాసించింది.

ఈ గణాలలో ఎక్కువభాగం ఏప్రాంతాలలో వున్నవి? వాహికదేశంలో అంటే పంజాబునుంచి దక్షిణాన సింధుదేశంవరకూ సింధు నదీలోయలో వ్యాపించి యుండెడివని పాణిని వ్రాశాడు. క్షుద్రకులూ, మాళవులూ, సింధుదేశానికి సమీపంగానూ, ఆగ్నేయ త్రిగర్తులూ జమ్ముప్రాంతపు హిమాలయమండలాలలోనూ వుండేవారు. భారతదేశంలో పశ్చిమ నైరుతీభాగములో వింధ్యశ్రేణివరకూ పైన పేర్కొన్న గణసంఘ సైనిక ప్రజాతంత్రాలు వుండేవి. ఒక వర్గము యొక్క దౌర్జన్యంమీద ఆధారపడిన రాజ్యాంగయంత్రాలు బానిస యజమానుల, ప్రైవేటు ఆస్తిదారుల నియంతృత్వాలు. ఇవి రాజరికాలై యుండవచ్చును; లేక ప్రజాతంత్రపు ముసుగులను తొడిగియుండవచ్చును. మొత్తంమీద యివి నిజానికి నియంతృత్వాలు. ఈ నియంతృత్వాలు పైన చెప్పిన గణసంఘాలను మ్రింగివేయడానికి వందల సంవత్సరాలతరబడి యుద్ధాలు చేయవలసివచ్చినదని చరిత్ర చెప్తు

న్నది. ఆస్తి హెచ్చుతగ్గులవలనా, శాసనవిధానమువలనా యీ గణసంఘాలలో అంతరంగికంగా ఐక్యత సళ్ళుబారి పోతున్నప్పటికీ అలెగ్జాండరునూ, అతని గ్రీకు బలగాలనూ సింధునదీతీరంలో యెదుర్కొని ఓడించగలిగినంత బలంగానే వున్నవి. కాక యెక్కడైనా ఓడిపోయారంటే, యీ గణ సంఘాలలో యీపాటికే ప్రాబల్యంలోకి వచ్చియుండిన ఆస్తి దారు వర్గాలు యుద్ధంచేసి నశించిపోయేకన్నా రాజీపడి సంధి చేసుకుంటే మంచిదనుకున్న చోట ఓడిపోవడం జరిగింది.

సౌభూతి, కఠగణసంఘాలతో స్త్రీలు తమ యిష్టం వచ్చినవారిని వివాహమాడేవారని గ్రీకులు వ్రాస్తున్నారు. బహుశా అవి గాంధర్వ, స్వయంవర వివాహాలు కావచ్చును. గణసభ్యులలో అందానికీ బలపరాక్రమాలకూ యెక్కువవిలువ వుండేది. బిడ్డల పోషణనుగురించి యిలా వ్రాశారు:

"ఇక్కడ తలిదండ్రుల యిష్టప్రకారం బిడ్డలను స్వీకరించడం, పెంచడం జరగదు. తలిదండ్రుల ఆరోగ్య స్థితిగతులను పరీక్షించడానికి నియమింపబడిన ఉద్యోగుల సలహాప్రకారం బిడ్డలపెంపకం జరుగుతుంది. ఒకవేళ బిడ్డలకు అంగవైకల్యమేదైనావున్నట్లువారు గుర్తుపెడితే, ఆ ఉద్యోగులు అలాంటి బిడ్డలను చంపివేయమని ఆజ్ఞాపించవచ్చును."

అతినికృష్టమైన దరిద్రముగానీ, అమితమైన సంపదలు కానీ లేక సాధారణంగా ఆరోగ్యవంతులైన సంతానాన్ని కని పెంచే గణాలలోనే పై పద్ధతి సాధ్యపడుతుంది. ఇలాంటి గణాలలో అంగవైకల్యముగల బిడ్డలు పుట్టడం అరుదు. ప్రైవేటు ఆస్తీ, కుటుంబమూ వారసత్వమూ సంపూర్ణంగా బలపడక

పోవడమూ, యుద్ధప్రవృత్తి యెక్కువగా వుండటమూ, జీవితావసరాలు దొరికే వనరులూ, ఉత్పత్తి నైపుణ్యమూ అనాగరికయుగపు మొరటుదశలోనే వుండటమూ-యీ కారణాలవలన బిడ్డలను యుద్ధసైనికులుగా తర్ఫీదు చేయవలసియుంటుంది. అందువలన బిడ్డలను పెంచడంలో యిలాంటి నిర్బంధా లవసరమౌతాయి.

పాణినీ, కౌటిల్యుడూ, గ్రీకులూవర్ణించిన గణసంఘాల కాలానికి వాటిల్లో ఆస్తి హెచ్చుతగ్గులూ,వర్గభేదాలూ ప్రవేశించినవని స్పష్టంగా అవుపడుతుంది. ఈ భేదాలు భాషా నిర్మాణంలోకూడా ప్రతిబింబించినవి. మల్లదేశంలోని స్వతంత్రపౌరులు మాలవులైనారు. అయితే శూద్రబానిసలూ, వృత్తి పనివారూ మాలవ్యులని విడిగా పిలువబడ్డారు. యౌధేయులు తమ గణసంఘ కార్యకలాపాలను నిర్వహించడానికి 5000 మంది ప్రతినిధులుగలసభను యెన్నుకునేవారు. అయితే యెలాంటివారు ప్రతినిధులు కాగలరు? ఎవరైతే యెన్నుకొనబడినతరువాత గణానికి ఒక యేనుగ నివ్వగలరో అలాంటివారే ప్రతినిధులుగా యెన్నుకొనబడటానికి అర్హులు. అంటే యౌధేయులలో యేనుగులుకలవారూ, యేనుగులులేనివారూ అనే బీద, ధనికవర్గా లేర్పడ్డవన్నమాట. ఈవర్గవిభేద ఫలితం యేమిటో అంబష్ఠులవిషయంచూస్తే స్పష్టపడుతుంది. వీరిలో ధనవంతులైనపెద్దలు మిగిలినవారిని పాటించకుండా, లొంగిపోవాలని నిర్ణయించినందువలన అంబష్ఠులు అలెగ్జాండరుకు లొంగిపోయారు. స్వార్థపూరితమైన పై ్రవేటు ఆస్తిదారీవర్గం

తన వర్గప్రయోజనాలకొరకు జాతినంతటినీ శత్రువు కమ్మి వేయడాని కెప్పుడూ సిద్ధంగా వుంటారు.

చరిత్రలో ఉదహరింపబడిన రెండోవిధమైన గణసంఘాలు రాజశబ్దోపజీవిసంఘాలు. వీటిలో ఆస్తిహెచ్చుతగ్గులూ యుద్ధనైపుణ్యమూ చాలా ఉచ్ఛదశకుపోయి గణప్రజాస్వామికము చాల బలహీనంగా ఉంటుంది. ఈగణాలలో యెన్నుకొనబడిన నాయకత్వం పారంపర్య వారసత్వంగల ప్రభుకూటంగా మారిపోయివుంటుంది. ఈ ప్రభువంశాలవారే పరిపాలనా సంఘాల కెన్నుకోబడే అర్హత కలిగివుంటారు. వీరే గణసంఘాలలో రాజన్యులు. లిచ్ఛవి, మల్ల, మౌర్య, కుకర, కురు, పాంచాల మొదలైనవి ప్రచారంలో మన కెరుకయైన రాజగణాలు.

వైరాజ్యనిర్మాణంలో శూద్రబానిసత్వాన్ని మొదటగా స్థాపించిన కురు, మద్రగణాలలో కొన్నిశాఖలు పారంపర్య ప్రభుకూటములను అభివృద్ధిచేసిరాజన్యగణసంఘాలుగా మారాయి. ఇవే తరువాత బానిసరాజ్యాంగాలుగా మారినవి. ఈపరిణామం చివరకు మహాభారత యుద్ధంలోకి దించింది. అయితే మద్రగణ సంఘశాఖలలో కొన్నిమాత్రం పట్టయిన శ్రమవిభాగంగానీ, స్పష్టమైన ఆస్తి వర్గ భేదాలుకాని అభివృద్ధిచేయక వెనుక నిలిచిపోయినట్లపుపడుతున్నవి. అందువల్లనే బానిసయజమానిప్రతినిధులైన స్మృతికర్తలూ, శాంతిపర్వరచయితా 'సరియైన బ్రాహ్మణుడెవ్వడూ మద్రవాహిక దేశాలకుపోగూడ'దని, నిషేధించారు. మద్రవాహిక దేశాల్లో వర్ణవిభేదం స్థిరంగా వుండక, ఒకడొకనాడు బ్రాహ్మణుడు

గానూ, మర్నాడు క్షత్రియుడుగానూ, ఆమర్నాడు వైశ్యుడుగానూ, తరవాత శూద్రుడుగానూ, ఆశూద్రుడే యింకోరోజు మరల బ్రాహ్మణుడుగానూ మారుతూంటారట. శూద్రులూ, వాహీకూలూ చేసిన మహాపాప మిదే. అదీకాక వారిలో స్త్రీ స్వాతంత్ర్యమున్నది. అందరూ తాగుతారు, తింటారు, ఆనందిస్తారు. బానిస యజమానుల దృష్టిలో యిది నిజంగా మహాపాతకమే. శూద్రబానిసలపైన స్వారీచేయడానికీ, ఆనందించడానికీ అనుభవించడానికీ బానిస యజమానుల కొక్కరికే హక్కున్నదని స్మృతికర్తల సిద్ధాంతం.

ఒక గణం మొత్తంగా, రాజ్యంలోని యితర ప్రజలందరికీ వ్యతిరేకంగా, "దుష్టప్రభుకూటమి" (Malign Aristocracy) గా మారిపోయిన ఉదాహరణకూడా మన చరిత్రలో వున్నది. అది వైశాలికి చెందిన 'లిచ్ఛవీ' గణం. లిచ్ఛవులలో 7,707 రాజన్యు లుండేవారు. వైశాలీ నగరంలో పాలకవర్గం వీరే. వీరే పరిపాలనా వ్యవహారాలను నిర్వర్తించడానికై ఉద్యోగులనూ, కార్యనిర్వాహకులనూ యెన్నుకునేవారు. పౌరజనాభా 1,68,000. ఈ 1,68,000 మందీ బైటిపౌరులనీ, లోపలిపౌరులనీ రెండుగా విభాగమై యున్నారు. ఈ లోపలిపౌరులే వైశాలీయులనే పేరు గలవారు.

ఈ కొలది ఉదాహరణలనుంచీ ప్రాచీన గణ సమాజాలలో కాలక్రమేణా వర్గవిభేదాలూ, వర్గవైరుధ్యాలూ ఏర్పడి, వాటి నిర్మాణంలోనూ, స్వభావంలోనూ సిద్ధాంతంలోనూ అనేక మార్పులు వచ్చినాయనే విషయం భారతదేశ చరిత్రలో సత్యమైనదనీ, కల్పితంకాదనీ స్పష్టమౌతున్నది.

# పదమూడో అధ్యాయం

## బంధుయుద్ధాలు

(దండనీతి, రాజ్యాంగయంత్రాల పుట్టుక)

గడచిన అధ్యాయాల్లో విష్ణువుకూ, యితర దేవతలకూ మధ్య జరిగిన యుద్ధాన్నిగురించిన దేవసత్రగాథలో ఆస్తిదారులు పాలకవర్గంగా పాదుకునిపోవడానికి తీవ్రమైన పోరాటం ప్రారంభించారని సూచిస్తుంది. ఆ దశ అలాగే అపరిసమాప్తంగా నిలిచిపోయేదిగాదు. ఉత్పత్తిశక్తులయొక్క గతితార్కిక పరిణామంలో ఆదిమ కమ్యూనిస్టుగణంయొక్క విషాదకర పతనగాథను దాపరికంలేకుండా వర్ణించిన భీష్ముడు గణసమాజంలో మారకమూ, ప్రైవేటుఆస్తీ, లాభాపేక్షా, ధనాన్ని కూడబెట్టడం అనే దుర్గుణాలవలన విరోధశక్తులేర్పడి, భయంకరమైన పోరాటం ప్రారంభమైందని చెప్పాడు. దేవతలలో అశాంతి పుట్టినది. ఈ అశాంతికి కారణం విచిత్రమైనది. ఈ దేవతలూ మనవంటి మనుష్యులే; జనన మరణములు కలవారే. ఐనా వారు "మనుష్యులతో సమానమైన స్థితికి" కుంగిపోతున్న కారణంగా వారిలో అశాంతి పుట్టిందట. అంతట వారు సృష్టికర్తయైన బ్రహ్మవద్దకు వెళ్ళారట. అంతకు పూర్వపు గాథలో బ్రహ్మ నశించాడని చెప్పిన ఆ

భీష్ముడే నాలుగు పంక్తుల తరవాత దేవతలు బ్రహ్మదగ్గరకు వెళ్ళారని చెప్పడం గమనించదగ్గ వింత. ఈ బ్రహ్మ ఊహామాత్రరూపుడైన సృష్టికర్తయే గాని, గణమనే అర్థంగల వాస్తవికబ్రహ్మ కాదు. ఈ బ్రహ్మయొక్క సలహా యేమిటి? ప్రపంచాన్ని క్రమబద్ధంగా నడపడానికి యీయన ఒక కొత్త చట్టాన్ని ప్రసాదించాడు. పూర్వపు చట్టంలో మనుష్యులు స్వయం ప్రవర్తకమైన ధర్మంప్రకారం పరస్పర రక్షణ చేసుకుంటూ జీవితం గడిపేవారు. ఒక వర్గం సామాజిక సంబంధాలను నియమిస్తూ, మరోవర్గంమీద పెత్తనం చెలాయించే దండంకానీ, రాజ్యాంగయంత్రంకానీ వుండేవికావు. రాజూ వుండేవాడు కాడు. అప్పుడు అలాంటి అవసరంకూడా లేకపోయింది. మరి కొత్తచట్టంయొక్క స్వభావ మేమిటి? కొత్త ఆర్థిక సంబంధాలనూ, కుటుంబ సంబంధాలనూ దండంద్వారా నిలువబెట్టవలసివచ్చింది. ఇప్పుడుధర్మం, అర్థం, కామం అనే నూతనత్రివర్గాలు దండనీతి సహాయం లేకుండా వాటంతటఅవి పనిచేసేస్థితి పోయింది. భారత దేశంలో యీ మొదటి బానిసయజమాని పరిపాలనాచట్టాన్ని "విశాలాక్ష"యని పిలిచేవారు. *బాహుదండకుడు, బృహస్పతి, కలి వీరిచేతుల్లో విశాలాక్ష రాజ్యాంగం అనేకమార్పులను పొందినదని మహాభారతం చెప్తున్నది.

---

* తతోధ్యాయ సహస్రాణాం శత చక్రే స్వబుద్ధిజమ్
యత్రధర్మస్తథైవార్థః కామశ్చైవానువర్ణితః ||29||
త్రివర్గ యితి విఖ్యాతో గణ యేష్య స్వయంభువా||30||
త్రివర్గశ్చైవ దణ్డజః||31|| (మహాభారతం-శాంతిపర్వం)

ఈ దౌర్జన్యాధారమైన బానిసయజమాని రాజ్యాంగ యంత్రం భగవంతుడైన సృష్టికర్తయొక్క ఆశీర్వచనాన్ని పొందిన దైనప్పటికీ యింకా నిలకడకుదరలేదు. ఐదారుగురు రాజులు పరిపాలించారో లేదో వెంటనే కొత్తఘర్షణ ప్రారంభ మైనది. విశా ప్రజాతంత్ర పక్షపాతుడుగా మారిన ఒక రాజే బ్రహ్మక్షత్రియులకు వ్యతిరేకంగా యీ పోరాటాన్ని నడిపాడు. ఇతడే వేనరాజు. ఈ పోరాటంలో వేనుడికి సలహాసంపత్తి నిచ్చినది అతనిభార్య సునీత. మాతృస్వామికమూ, స్త్రీ ప్రజా తంత్రమూ అణగద్రొక్కబడటంవల్లయీమె క్రోధపూరితమై యుంటుంది. కానిసునీతా వేనులెంత గొప్పవాళ్ళయినప్పటికీ నూతన యుగంలోకి వచ్చిన సామాజికశక్తులను ఆదిమగణ సమాజయుగంలోకి వెనుకడుగు వేయించజాలరు. ఆ యుగం శాశ్వతంగాగతించినది. కాకపోతే వేనుడూ, అతనిబోటి వాళ్లూ చేయగలిగిం దెంతవరకంటే, పాలకవర్గాలను వేరంట కదిపి 'ఉత్పత్తి శక్తులు మరో విప్లవదశకు పరిపక్వమయ్యేలోపల, దోపిడీతీవ్రతను కొంతసౌమ్యం చేయడంమాత్రమే. అయితే ఆదశ యింకారాలేదు. బానిసవిధానంయొక్క చారిత్రకపాత్ర యింకా ముగియలేదు. అడవులను నరికివేయడం, వ్యవ సాయం, వృత్తిపనులు, మారకము, వ్యాపారము, అప్పుడే పుట్టిన బానిససమాజంలోనే పెరిగి అభివృద్ధి కావడానికి ఇంకా చాలవిశాలమైన అవకాశాలున్నవి. వేనుడువోడిపోయినాడు. బ్రాహ్మణులతనిని హత్యచేశారు. వేనుడికి సహాయంగా బయటి నుంచి వచ్చిన గణాలూ, తెగలూకూడా అణచివేయబడినవి. బ్రాహ్మణులు వేనుణ్ణి చంపినప్పుడు, అతని దేహంనుంచి నల్లని తలలూ, ఎర్రనికన్నులూకలిగిన నిషాదాదులు పుట్టుకొస్తుంటే

దానిని నిరోధించడానికి, అతని శరీరాన్నంతటినీ గట్టిగా రాచివేశారని మహాభారతగాథ చెపుతున్నది. వేనుడి కుడి చేతినుంచి పుట్టిన ఒక్క వ్యక్తి మాత్రం బ్రాహ్మణులకులొంగి, వారి ఆజ్ఞలను పాలిస్తానన్నాడు. అతనిని పృథువైన్యుడనే పేరిట రాజుగా పట్టాభిషేకం చేశారు. యుద్ధం తాత్కాలికంగా ఆగిపోయింది.

యుద్ధఫలిత మేమిటి? పృథువైన్యుడు బ్రాహ్మణుల ఆజ్ఞ ప్రకారం పాలకవర్గాలను రాజ్యాంగ శాసనానికి అతీతులను చేశాడు. * వర్గవిభేదాలకు అంతరాయం కలుగనీయనని వాగ్దానంచేశాడు. ఆనాటినుంచీదౌర్జన్యప్రయోగం—దండం, ప్రపంచాన్ని శాసిస్తూ వచ్చిందని హిందూ రాజ్యాంగనీతి చెప్తూన్నది.

విశా ప్రజాతంత్రాన్ని అణగద్రొక్కి బానిస యజమానులు జయంపొందిం తరవాత, దోపిడీ, ఆర్థికాభివృద్ధీ విపరీతంగా పెరిగిపోయినవి. విశాలమైనభూములు వ్యవసాయంలోకి తేబడినవి. మొట్టమొదటిమారుగా రాజ్యాలకు నిశ్చితమైన ఎల్లలేర్పడినవి. ఈ ఎల్లలలోపల ఆర్యులతోపాటు అనార్యులూ, నిషాదులూ, సూతమాగధులూ మొదలైన వారంతా నివసించేవారు. ♦ పృథువైన్యుడు వ్యవసాయాన్ని

---

* అదండయా ద్విజాశ్చేతిభిప్రతిజానీష్వ చాభిభో।
లోకం చ సంకరాత్ కృత్స్నంత్రాతాస్మీతి పరంతప॥శాంతి58-117

♦ తస్మాన్నిషాదాస్సంభూతాః క్రూరాశ్శైలవనాశ్రయాః।
యే చాన్యే విన్ధ్య నిలయాః మ్లేచ్ఛాః శతసహస్రశః॥ 1061
ప్రీతోరాజాదదౌ...
అనూపదేశం సూతాయ మగధం మాగధాయ చ॥ శాంతి 58-122

బాగా అభివృద్ధిచేశాడనీ, అనేక కొత్తపంటలను ప్రచారం లోకి తెచ్చాడనీ ప్రశస్తికలిగింది. * భూమీ, బానిసలూ కొత్తగావచ్చిన ముఖ్యమైన ఉత్పత్తిసాధనాలు ఇవి పూర్వపు ఉత్పత్తిసాధనాలైన పశువులనూ, స్వతంత్ర మానవులనూ వెనక్కు త్రోసివేసినవి. ఒకవర్గం మరొకవర్గాన్ని దౌర్జన్యంగా దోచుకునే విధానంమీద ఆధారపడిన రాచరిక ప్రభుత్వ యంత్రము శాంతియుతమైన పరస్పర సహకారంమీద ఆధార పడిన గణకమ్యూనిస్టు సమాజాన్ని రూపుమాపినది.

పరస్పరంగా పొందుపొసగించరాని వైరుధ్యాలమధ్య ఘర్షణవల్ల. రాజ్యమూ రాజ్యాంగయంత్రమూ యేర్పడినవి. ఈరాజ్యాంగయంత్రముఆర్థికప్రాబల్యముగలవర్గానికిచెందినది; అంటే బ్రాహ్మణ, క్షత్రియులకు చెందినది. వీరికనుంచీ విశా ప్రజాతంత్రాన్ని నిరాయుధంచేసి, వైశ్యప్రజనూ, శూద్రులనూ అణచిపెట్టి అంతులేని దోపిడీనిసాగించారు. పాలకవర్గాలుతమ ఆజ్ఞలను భగవదాజ్ఞలనే పేరుపెట్టి ఓడిపోయిన ప్రజలపైన రుద్దుతారు. ఇకనుంచీ జీవితయాత్రకంతటికీ వెనుక ప్రభుత్వ దౌర్జన్యము లేక దండముయొక్క భయమే కీలకంగావున్నది. బానిస యజమానులయొక్క ప్రైవేటుఆస్తీ,లాభదుర్గాహమూ,

---

* సమతాం వసుధాయాశ్చ స సమ్యగుదపాదయత్ ।
వైషమ్యం హి పరం భూమేరితి నః పరమాశ్రుతిః॥ 123॥
మన్వంతరేషు సర్వేషు విషమా జాయతే మహీ ।
ఉజ్జహార తతో వైన్యః శిలాజాలాన్సమంతతః॥ 124॥
తేనేయం పృథివీం దుగ్ధా సస్యాని దససప్త చ॥ శాంతి 58-125॥

దార్జన్యమూ, వీటిక్రింద పరస్పర సహకారమూ, శాంతీ, ప్రేమా నలిగి నశించినవి. పూర్వము ప్రజలను సరియైన మార్గంలోకి దిద్దుబాటుచేయాలంటే ఒక్కమాట సరిపోయేది. ప్రజాభిప్రాయమూ, బహిరంగంగామందలించడమూ(దిగ్దండ). ఇప్పుడో! ప్రజలు దోపిడీని సహించేట్లురాజభక్తులై యుండేట్లు, పాలించే ఆస్తిదారువర్గాలయెడల గౌరవం కలిగియుండేట్లు చేయాలంటే రాజ్యాంగ యంత్రమూ, సైన్యమూ, పోలీసు జలగాలూ కావలసివచ్చినవి. ఇవీ చాలకపోతే మరణమే (వధదండ) శాసనంప్రకారం చివరిశిక్ష. కొత్తరాజ్యాంగ యంత్రము పుట్టింతరువాత హిందూవాఙ్మయం యీ కొత్త దార్జన్యయంత్రాన్నిగురించి గొప్పగా కీర్తించడం ప్రారంభించింది. ఈదార్జన్యం లేకపోతే అరాజకం, అంటే రాజ్యాంగ యంత్రంలేనిసమాజం మరలస్థాపింపబడుతుంది; పైగావేటుఆస్తీ, కుటుంబమూ, మతమూ, ఒకటేమిటి, ప్రపంచమే నశిస్తుంది. ఆస్తిపేరిట, కుటుంబంపేరిట, మతంపేరిట పాలకవర్గాలు కష్టజీవులైనవిశాలప్రజాసామాన్యంయొక్క, శూద్రబానిసలయొక్క స్వతంత్రాన్నీ, ఆస్తినీ, కుటుంబాన్నీ అణగద్రొక్కారు. యజ్ఞాలూ, దానాలపేరుతో బ్రహ్మక్షత్రియపాలకులు ప్రజాసామాన్యంయొక్క పశువులనూ, సంపదలను అపహరించారు. కష్టజీవులైన వైశ్యులూ, శూద్రులూ దున్నిసాగుకుతెచ్చిన విశాలభూములను దురాక్రమణచేశారు. దీర్ఘకాలం యుద్ధాలు చేసి ఓడి, నిరాయుధులుగా చేయబడినప్రజాసామాన్యంలొంగిపోయి కొత్త విధానాన్నంగీకరించారు. కాని తరువాత మాటిమాటికీ తిరుగుబాటుచేశారు; మాటిమాటికీ అణచివేయబడి,

బానిసత్వంలోకి నెట్టబడ్డారు. చివరకు కొత్తసమాజంలోనే కొత్త వుత్పత్తిశక్తులూ, కొత్త విప్లవశక్తులూ పుట్టుకొచ్చేంత వరకూ యిలాగేజరిగింది. బ్రాహ్మణ-క్షత్రియవర్గాలు కష్టజీవులపైనయుద్ధాలు సాగిస్తూనే, మరోవేపున వైశ్యులనూ, శూద్రులనూ దోపిడీచేసి సంపాదించిన సంపదలను యెవరికి వారే రెండవవారికి లేకుండా అపహరించాలనే దురాశతో వారిలో వారే పోరాడుకోవడం కూడా ప్రారంభమైనది. ఈపాలకవర్గ అంతర్యుద్ధ గాథలనేకం హిందూపురాణాలు వివరిస్తున్నవి. పరశురాముడు క్షత్రియులపైన చేసిన దండయాత్రలూ, హైహాయుడు, సహస్రార్జునుడు, వైతహవ్యుడు, సృంజయుడు, నహుషుడు ఇంకా యితరులనేకమందినిగురించిన యీఅంతర్యుద్ధగాథలెన్నో వున్నవి. వందలెకరాల విస్తీర్ణంలో పశువులూ, గణాలూ, శిష్యకోటీ, వైశ్య-శూద్రఅనుచరులూ వెలలేని సంపదలనుత్పత్తిచేస్తూండగా, వృద్ధియైన బ్రాహ్మణాశ్రమాల చరిత్రచూస్తే బ్రాహ్మణులు భిక్షాటనజీవులనీ, దరిద్రులనీ, సత్యవర్తనులనీ చెప్పే కథలన్నీ గాలిబుడగల్లా మాయమౌతాయి. క్షత్రియకుటుంబాల గాథలుకూడా యిలానే ప్రజలను పరిపాలిస్తామనీ, దండయాత్రాభయంనుంచి రక్షిస్తామనీ అంటే విదేశదండయాత్రనుంచీ, ఆంతరంగిక వర్గవిప్లవంనుంచీ రక్షిస్తామని పేరుబెట్టి, ప్రజలను దోపిడీచేశారనీ, వారి ఆస్తులను అన్యాయాక్రమణచేశారనీచెప్తున్నవి. ఇక్కడమనం రాజులయొక్క, వారి వంశాలయొక్క చరిత్రనుగానీ, వారి పాలనలోని మంచి చెడుగులనుగానీ, అలాగే ప్రఖ్యాత బ్రాహ్మణ కుటుంబాల చరిత్రనుగానీ, వారిలో యెవరెవరి ఆశ్రమాలు పెద్దవో, ఎవరెవరు యుద్ధాలుచేశారో, ఎవరెవరు

సేనాపతులైనారో, రాజులైనారో మొదలయిన విషయాల నన్నిటినీ పరిశీలించబోవడంలేదు. ఆ సామాగ్రి నంతటినీ వ్యస్తంచేసి, మన మిప్పటివరకూ అనుసరిస్తూవచ్చిన చరిత్ర పరిణామ సూత్రాలప్రకారం క్రమబద్ధమైన చరిత్రను రచించడం మన ప్రస్తుత కార్యక్రమంకాదు. ప్రస్తుతానికి గతించిపోతూన్న గణసంఘ సభ్యులమధ్య చెలరేగిన వర్గకలహాల పర్యవసానంగా ఆర్యుల సమాజంలో వచ్చిన కొత్తసామాజిక నిర్మాణరూప మేలాంటివో చూడ్డమే మన కర్తవ్యం.

గణసమాజం బంధుత్వ నిర్మాణాన్ని యెంత అయిష్టముగానైనావదలివేసి, నూతనంగావచ్చిన రాజ్యాధికారానికీ, రాజ్యాంగ యంత్రానికీ యెందువల్ల లొంగవలసివచ్చింది? గణానికీ, రాజ్యాంగానికీగల ముఖ్యభేదాలేమిటి? గణసంఘం గతించి, రాజ్యాంగయంత్రం అమల్లోకివచ్చిన చారిత్రక పరిణామక్రమాన్ని ఏంగెల్స్ క్రిందివిధంగా వర్ణించాడు :

"ఈ సామాజిక పరిణామపు వెల్లువవలన జెన్‌టైల్ నిర్మాణం (గణ బంధు నిర్మాణం) యేమైపోయింది? కొత్త శక్తుల అభివృద్ధిలో జెన్‌టైల్ నిర్మాణం నిర్వహించదగిన పాత్రలేకపోయింది. అందువల్ల అది నిరాశ్రయమైపోయింది. అది బ్రతకాలంటే దానిలోని సభ్యులందరూ, కనీసం అది యున్న తెగలోని సభ్యులందరూ ఒకనిశ్చితమైన ప్రదేశంలో కూడగట్టుకుని యుండటం, ఆ ప్రదేశంలో వారే యేకైక నివాసులుగా వుండటం అవసరం. కాని ఆస్థితి గతించి చాల కాలమైంది. ఇప్పుడుప్రతినిశ్చితప్రదేశం (Territory)లోనూ

అనేక తెగలకూ, జెన్నులకూ చెందిన కలగాపులగం జనాభా నివసిస్తున్నది. ప్రతిచోటా బానిసలూ, రక్షణకలిగిన వ్యక్తులూ, పరాయివాళ్లూ, పౌరులతోపాటుగా ప్రక్క ప్రక్కనే నివశిస్తు న్నారు. *మరలమరల కుదుపులు కలుగుటవలన వ్యాపారము లోనూ, వృత్తులలోనూ మార్పులు కలుగుటవలన, నివాస ప్రదేశాలు మార్చుకోవలసి రావడంవలన, భూమిపై యాజ మాన్యం మారడంవలన అనాగరికయుగ మధ్యకాలంనాటికి నిలదొక్కుకున్న జీవితపరిస్థితులలో మరల సంచలనం బయలు దేరింది. పూర్వంవలె బంధుగణ సభ్యులు తమ కార్యకలాపా లను చూచుకోవడానికి ఒకచోటచేరే అవకాశం పోయింది. (పూర్వపు సమితి, నరీష్టలలోవలె : డాంగే) కాకపోతే మత విషయకమైన పండుగలవంటి అప్రాముఖ్య కార్యాలనుమాత్రం ఏదో శ్రద్ధవున్నా లేకపోయినా కలిసిచేసేవారు. బంధుగణాలు సాధారణంగా చూచుకోవలసిన అవసరాలూ ప్రయోజనాలూ వున్నవి. ఇవి చూచుకోడానికి తగినట్లు వాటి నిర్మాణం కూడావుంది. ఈ అవసరాలూ, ప్రయోజనాలేకాక, వుత్పత్తి సంబంధాలు తారుమారు కావడంవలన యేర్పడిన నూతన

* షౌండూకాశ్చౌడూద్రవిడాః కాంభోజ యవనాశ్శకాః
పారదాపహ్లవశ్చీనా కిరాతాః దరదాః ఖశాః॥ మను 10-44॥

పరాయివాళ్ళతో సంపర్కంవల్లకలిగిన దోషపరిహారార్థమై పునష్టోమ యజ్ఞం చేయవలసి వచ్చింది.

అరట్టాన్ కారస్కరాన్ పుండ్రాన్ సౌవీరాన్, వంగకళింగాన్
ప్రాణూనాన్ ఇతి చ గత్వా, పునష్టోమేన యజేత సర్వపృష్ఠయా॥
(బోధాయనుడు 1-2-14)

సమాజనిర్మాణంనుంచి నూతనావసరాలూ, ప్రయోజనాలూ కూడా యేర్పడ్డవి. ఈ నూతనావసరాలూ, ప్రయోజనాలూ పూర్వగణసంఘ విధానానికి దూరమైనవేకాక, అడుగడుగునా వ్యతిరేకమైనవికూడా. శ్రమవిభజనతో యేర్పడిన వృత్తిదారు సముదాయములయొక్క ప్రయోజనాలూ, పల్లెపట్టులకు వ్యతిరేకంగావుండే పట్టణప్రయోజనాలూ, వీటిమూలకంగా కొత్త నిర్మాణాంగాల అవసర మేర్పడ్డది. (పౌర, జనపదాలలాంటి నిర్మాణాంగాలు: డాంగే) అయితే యీ సముదాయాలలో వివిధ గణస్థులూ, బంధువర్గాలూ, వివిధ తెగలకు చెందినవారూ, యింకాపరాయివాళ్ళూకూడావుండే వాళ్ళు. అందువల్లకొత్తనిర్మాణాంగాలను జెన్‌టైల్ సంఘానికి వెలుపల, దానికి పక్కపక్కనే, అందువల్ల దానికివ్యతిరేకంగానే యేర్పరచవలసి వచ్చింది. ప్రతి జెన్‌టైల్ నిర్మాణాంగ శాఖలోనూ యీ ప్రయోజన వైరుధ్యము ప్రతిబింబించింది. ఒకేగణంలో, ఒకే తెగలో బీదలూ, భాగ్యవంతులూ, వడ్డీ వ్యాపారులూ, అప్పులపాలైనవారూ కలిసియుండటంలో యీ పరస్పర ప్రయోజన వైరుధ్యం తీవ్రరూపంలో ప్రతిఫలించింది. అంతేగాదు, జెన్‌టైల్ నిర్మాణాంగాల వెలుపలనున్న కొత్తజనాభా రోమ్‌లోవలె (వైశాలీ, మగధ, పాటల మొదలైన పట్టణాలలోవలె) అధికసంఖ్యాకులుగా వుండటం వలన వీరినందరినీ బంధువర్గాలలోకీ, తెగలలోకీ జీర్ణించుకోడంకూడా సాధ్యపడ్డదికాదు. ఈ వెలుపలి ప్రజాసముదాయంతో పోల్చుకుంటే జెన్‌టైల్ సంఘాలు ప్రత్యేకప్రయోజనాలు కలిగిన కార్పొరేషన్‌లలాగా వ్యతిరేకస్థానాలను ఆక్రమించినవి. స్వతస్సిద్ధమైన ఆదిమ ప్రజాస్వామికం "దుష్ట

ప్రభుకూటంగా" (Malign Aristocracy) మారిపోయి నది. (ఈమార్పు యిటీవల బుద్ధుడికాలంనాటి మల్ల, లిచ్ఛవీ గణాల్లో అవుపడుతుంది: డాంగే) అదీకాక జెన్‌టైల్ అంగ నిర్మాణము ఆంతరంగిక వైరుధ్యాలు లేని సమాజంలో అభి వృద్ధియైనదికాబట్టి,ఆనిర్మాణముఆలాంటిసమాజానికిమాత్రమే పనికివస్తుంది. దానిలో ప్రజాభిప్రాయముతప్ప ఒత్తిడిచేయ డానికి మరొకసాధన మేమీలేదు. కాని మొత్తంమీద ఆర్థికజీవితపరిస్థితులవలన తప్పనిసరిగా ఆ సమాజం స్వతం త్రులూ, బానిసలూఅనీ, దోపిడీచేసే భాగ్యవంతులూ, దోపిడీ చేయబడే బీదలూఅనీ చీలిపోయిన సమాజంగా రూపొం దింది. ఈ సమాజం యీ వైరుధ్యాల నిక నెన్నడూ సమాధానపరుపలేని స్థితిలోకి రావడమేకాక, తప్పనిసరిగా యీ వైరుధ్యాలను తీవ్రతరంచేసిందికూడా.ఇలాంటిసమాజం బ్రతకాలంటే, అందులోనే పరస్పరం మెడ తెగకుండా పోరా డుతూనైనా బ్రతకాలి; లేదా యీ వర్గపోరాటాన్ని ఆర్థిక రంగానికి మాత్రమే అంటే చట్టసమ్మతమార్గాలకుమాత్రమే పరిమితముచేయగల మరొక మూడవశక్తి పరిపాలనకైనా లొంగిపోవాలి. గణసమాజనిర్మాణం నశించింది. దానిని శ్రమవిభజన, తత్ఫలితమైన వర్గవిభజనాకలిసి భగ్నంచేసి నవి. దాని స్థానాన్ని రాజ్యాంగయంత్రం ఆక్రమించింది.

"అందువల్ల రాజ్యాంగయంత్రంయెక్కడోబైటనుంచి తెచ్చిసమాజంనెత్తినయెక్కించబడ్డదికాదు. హెగల్‌అన్నట్లు (సనాతన అధునాతన హిందూరచయితలన్నట్లు - డాంగే) "అది నైతికభావానికి ప్రత్యక్షరూపం"గానీ,"కారణంయొక్క

ప్రతిబింబమూ, వాస్తవికరూపమూ" కానీ కాదు. అది సమాజంయొక్క ఒకానొక అభివృద్ధిదశలో వచ్చిన పరిణామ ఫలితము. సమాజం పరిష్కరింపరాని అంతర్వైరుధ్యాలలో చిక్కుకున్నదనీ, సమాధానపరుపరాని విరోధవర్గాలుగా చీలినదనీ వాటినిపారద్రోలేశక్తిఆ సమాజానికి లేదనీ చెప్పుకో గలగడానికి రాజ్యాంగయంత్రంపుట్టుక ఒక నిదర్శనము."

వర్గసమాజంయొక్క నూతనాంగమైన యీ రాజ్యానికీ లేక రాజ్యాంగయంత్రానికీ, పూర్వపు గణ-గోత్రనిర్మాణానికీ భేదాన్నిచూపే లక్షణాలేవి ?

1. రాజ్యాంగ యంత్రము నిశ్చితమైన సరిహద్దులుగల ప్రదేశంలో నివశించేవారందరికీ వర్తిస్తుంది. పూర్వపు గణ గోత్ర నిర్మాణానికి ప్రాదేశికమైన నియమమేమీ లేదు రక్తబంధుత్వంమీద ఆధారపడి నిర్మించిన పూర్వపు గణ-గోత్రాంగశాఖలు ఒక్క ప్రదేశంలో నివశించేవారందరికీ వర్తించాలనే ఉద్దేశ్యంతో ఏర్పడినప్పటికీ, అలాంటి ప్రాదేశిక నియమ మెప్పుడో పనిచేయడం మానివేసింది. కాబట్టి, గణ-గోత్ర నిర్మాణాంగశాఖలు చాలవరకు సంకుచితములైపోయినవి. అవి నివసించిన ప్రదేశ మెప్పటివలె నిశ్చితమైన సరిహద్దులతో అలాగే వున్నది. కాని అందులో నివసించే ప్రజలుమాత్రం సంచారులై పోయినారు. అందువలన ప్రాదేశిక విభాగాన్ని ప్రాతిపదికగా తీసుకుని, అందులో నివసించే ప్రజలందరికీ గణభేదం, తెగభేదం లేకుండా పౌర హక్కులను వర్తింపచేసే విధానం ప్రవేశపెట్టబడినది. ఇలా నివాసంమీద ఆధారపడి పౌరసత్వనిర్మాణం చేయడం రాజ్యాంగయంత్రా లన్నిటికీ సర్వసాధారణంగా వున్నది.

కాబట్టి మన కీ నిర్మాణం సహజంగా అవుపడుతుంది. కాని యీ నిర్మాణం పూర్వపు బంధుత్వంమీద ఆధారపడిన నిర్మాణాన్ని త్రోసివేసి, దాని స్థానంలో నిలదొక్కుకోడానికి గణాన్ని తోసేసి "రాజ్యం" నిలదొక్కుకోడానికి తీవ్రమైన దీర్ఘపోరాటం సాగించవలసివచ్చింది.

2. పూర్వపు గణ-గోత్రంలో సభ్యులందరూ సాయుధులు. అది స్వయంప్రవర్తకమైన (Self acting) సాయుధ సభ్యనిర్మాణవ్యవస్థ. కాని రాజ్యంలో ప్రజలకు వెలుపలగా ప్రజల కతీతంగా బలప్రయోగసాధన మొకటి వుంటుంది. (సైన్యమూ, పోలీసూ వగైరా) ప్రజలు వర్గాలుగా చీలారు. అందువల్ల స్వయంప్రవర్తకమైన సాయుధ ప్రజానిర్మాణం యిప్పుడు సాధ్యంకాదు. అందువల్ల యీ రెండువర్గాలకూ పైన అతీతంగా అవుపడే ప్రత్యేకమైన సాయుధబలగం అవసరమైనది. దోపిడీచేయబడే వర్గాన్ని దోపిడీకీ, శ్రమకూ కట్టుబడి వుండేట్లుచేసే చట్టాన్ని అమలుపరచడానికి ఇప్పుడు రాజులవద్ద స్థాయీసైన్యమూ, పోలీసుసిబ్బందీ వున్నవి. చతురంగసేనలూ, రాజపురుషులూ, బ్రాహ్మణ, క్షత్రియ వంశాలుమాత్రమే ఆయుధాలుధరించగల హక్కు లిప్పుడు చరిత్రరంగంలో కెక్కినవి. ఈ బలప్రయోగసాధన మంటే ఒక్క సాయుధ బలగాలేకాదు. దీనితోపాటు జైళ్ళూ, కోర్టులూ, అన్నివిధాలా రాపిడిపెట్టే యితరసంస్థలూ కలిసి వుంటాయి. వీటన్నిటియొక్క సారమూ "దండమే." పూర్వపు గణసమాజంలో వర్గవైరుధ్యాలు లేవు. అందువల్ల ఒకవర్గానికి అనుకూలంగా మరియొకవర్గాన్ని వొత్తిడిచేసే చట్టాలూ, ఒకవర్గంపైన మరొకవర్గం నియంతృత్వాన్ని చలాయించే

చట్టాలూ అయినశాస్త్రాలకు గణసమాజంలో తావులేదు. వర్గసమాజం యేర్పడినందువల్లనే శాస్త్రాలొచ్చినవి. అందు వల్ల బానిసవిధానమూ, బానిసరాజ్యాంగ పరిపాలకులైన రాజులూ వచ్చినప్పుడే శాస్త్రముకూడా వచ్చింది. అందు వల్లనే శాస్త్రముబత్తిడిచేసేసాధనమనీ, అణగద్రొక్కేసాధన మనీ నిర్వచించబడింది. ఆపస్తంబధర్మసూత్రాల్లో "పనీ,విధి నిర్వహణా యిష్టపూర్తిగా సాగేచోట శాస్త్రముండదు" అని స్పష్టీకరించబడ్డది. అయిష్టమూ, వ్యతిరేకతా వున్నచోటనే శాస్త్రం అవసరమౌతుంది. *ఈ రాజ్యాంగబలగాన్ని అట్టి పెట్టాలంటే రాజ్యంలోని ప్రజలనుంచి పన్నులు వసూలు చేయాలి. పన్నులు వసూలనేది గణసమాజ మెరుగనే మెరు గదు. గణాలూ, గణపతులూ ఉత్పత్తిచేసినదంతా నిర్బంధం లేకుండా, అందరూ సమానంగా పంచుకునేపద్ధతి నెరుగుదురు. అర్థశాస్త్రంలో పాలకవర్గ ప్రయోజనాల కనుకూలంగా ప్రజ లను దొంగదోపిడీ దోచుకునే పద్ధతిని (కర్భర) వారెరుగరు. నిద్రపోయే మనిషిని యెలుకపట్టుకుని నెత్తుకుపీల్చితే ఆబాధ అతనికి మర్నాడు మెలకువ వచ్చినప్పుడుగాని తెలియదు. రాజ్యాంగయంత్రము చేసే దొంగదోపిడీ అంత సున్నితం

---

* యత్రతు ప్రీతి ఉపలబ్ధితః ప్రవృత్తిః న తత్ర శాస్త్రం అస్తి ।
(4-12-11 ఆపస్తంబ సూత్రాలు)

యస్మిన్ ప్రీతిః పురుషస్య తస్య లిప్సా లక్షణావిభక్తత్వాత్ ।
(జైమిని పూర్వ మీమాంస)

గానూ, అంత తక్కువ బాధాకరంగానూ ఉండాలని భారతం చెప్తున్నది ♦

పంటలో ఆరవవంతు రాజభాగమని నియమముండేది. రాజ్యాంగయంత్రమూ, పన్నులు వసూలుచేసే అధికారమూ ఉండటంచేత, యిప్పుడు ప్రభుత్వాధికారులు సమాజమంతటి పైన నిలిచిన మరొక సమాజవ్యవస్థకు చెందినవారుగా అవుపడతారు. తమను సమాజంనుంచి వేరుచేసిన రాజ్యాంగయంత్రానికివీరుప్రతినిధులు. కాబట్టియీఅధికారులకు ప్రత్యేక చట్టాలద్వారా గౌరవాన్నీ, అంతస్థునూ కలిగించాలి. దీనివల్ల వీరి కొక విచిత్రమైన పవిత్రత, అనుల్లంఘనీయతా సంక్రమిస్తాయి. అంతేకాక దాదాపు అన్నీ చారిత్రకరాజ్యాంగాలలోనూ ప్రజల కివ్వబడిన హక్కులు ఆస్తినిబట్టి యివ్వబడతాయి. అంటే లేనివారికి వ్యతిరేకంగా, కలవారికి రక్షణనిచ్చే సాధనమే రాజ్యాంగయంత్రము. బానిసరాజ్యాలు పరిపక్వదశకొచ్చినప్పుడు రాజరిక ప్రభుత్వాలలోని పౌర - జనపద సంఘాలు ఆస్తిగలవారితోనేయేర్పాటుచేయబడినవి. రాజ్యంచేసే రాజుకు "ఆస్తిదారువర్గాన్నే కొలవవలసింది, గౌరవించవలసింది"అని మంచిసలహా యివ్వడం జరుగుతుంది.*

---

♦ యథా శల్యకవానాఖుః పదం ధూనయతే సదా ।
అతీక్ష్ణేనాభ్యుపాయేన తథా రాష్ట్రం సమాపిబేత్ ॥
(శాంతిపర్వం 88-6)

* ధనినః పూజయేన్నిత్యం 29 శాంతిపర్వం॥ కాత్యాయన శ్రౌతసూత్రాల్లో పేర్కొనబడిన మహాజనులూ, మహాజానికులలో యిటీవల చరిత్రలో నిషాదులుకూడా వున్నారు. వీరి నిదివరకు చంపివేయనైనా చంపి

ఇలా ఉత్పత్తిశక్తుల అభివృద్ధివలన వుత్పత్తిసంబంధాలు మారినవి. ప్రైవేటుఆస్తీ, దోపడీదారులూ, దోపిడీచేయబడేవారూ అనే వర్గవైరుధ్యమూ యేర్పడతాయి. మానవ సమాజానికి వ్యాధిగా పరిణమించిన రాజ్యాంగయంత్రము పుట్టి సమాజాన్ని రక్షించే పేరుతో దోపిడీదారుల ప్రయోజనముకొరకు, దోపిడీ చేయబడే వర్గాన్ని బలవంతంగా అణచివేస్తుంది.

---

వేశేవారు; లేదా బానిసలుగానైనా చేశేవారు. ఇప్పుడు వారు భాగ్యవంతులైతేసరి మహాజనులైపోతారు.

# పద్నాలుగో అధ్యాయం

## బానిస యజమానులకూ - గణ సంఘాలకూ మధ్య అంతర్యుద్ధం

**బా**నిసవిధానపు పునాదులమీద ఆర్యసామ్రాజ్యాలు పెరిగిన మొదటి పుణ్యభూమి గంగానదీలోయ. మహాభారత యుద్ధానికి పూర్వము, పడమట కురుక్షేత్రంనుంచి తూర్పున నేటి బీహారులోని పాటలీపుత్రం (పాట్నా) వరకూ ఆర్యగణ సమాఖ్యలు నిలదొక్కుకుని భాగ్యవంతమైన రాజరిక బానిస రాజ్యాలుగా అభివృద్ధియైనవి. ఇవి ఉత్తర దక్షిణాలుగా హిమాలయ పర్వతప్రాంతంనుంచి నేటి మధ్యభారతంలోని "అవంతి" వరకూ విస్తరించినవి. కొన్ని వింధ్య పర్వతాలను దాటి విదర్భవరకూ సాగివచ్చినవి.

ఆనాటికి ఇండియాకు హిందూస్థానమనిగాని, సింధుస్థానమనిగాని (రెంటికీ ఒకే అర్థము) పేరులేదు. మన దేశానికి సింధునది పేరిట హిందూదేశమని పేరువచ్చినది. మధ్యాసియా నుంచి శక-పల్లవులూ, యితర తెగలూ సింధునదిని దాటి మనదేశానికి చాల యిటీవల వచ్చారు. వీరే మనదేశానికి సింధునది పేర హిందూదేశమని పేరుపెట్టారు. వీరిలో 'స' అక్ష

రాన్ని 'హ' గా పలుకుతారు. పూర్వ గ్రంథకారులూ, ప్రజలూ తాము నివసిస్తున్న ప్రదేశాన్ని అక్కడ నివసించే తెగలపేరిటగానీ, జాతిపేరిటగానీ పిలిచేవారు. ఉదా:-మత్స్య దేశం మత్స్యతెగలు నివసించే దేశం. మహాభారతం భీష్మ పర్వంలో యిలాంటివి 200 పేర్లున్నాయి. తరువాత తరువాత ప్రాదేశికమైన రాజ్యాలూ, రాజవంశాలూ, ముఖ్యపట్టణాలు నెలకొల్పబడినప్పుడు, పరిపాలకుల యిష్టాన్నిబట్టీ, యితర అంశాలనుబట్టీ ముఖ్యపట్టణాలకు పేర్లుపెట్టేవారు. కాని సాధారణంగా ఒక రాజ్యంలో నివసించే ప్రాబల్యంగల జాతినిబట్టి గానీ, లేక దానిలో నివసిస్తూ వ్యవసాయము, పరిపాలనా సాగిస్తూవుండే గణసంఘాన్నిబట్టిగానీ, ఇండియాలో వివిధ భాగాలకు పేర్లేర్పడినవి. అంగ, వంగ, కళింగ, కిరాత, ద్రవిడ, కాంభోజ, మత్స్య, కురు, మద్ర, వాహిక మొదలైనవి యిలా వచ్చిన పేర్లే. ఒక్క సింధుదేశం తప్ప మరొక యేప్రాంతానికీ నదినిబట్టి పేర్లేర్పడక పోవడం గమనించవలసిన విషయం. పవిత్ర గంగానదికికూడా ఆ అదృష్టం పట్టలేదు.

పురూరవగణసంఘాలకుచెందిన దుష్యంతుని కుమారుడు భరతుణ్ణిబట్టి భరతవర్షమని పేరువచ్చింది. సరిగా ఆకాలానికే పూర్వపు ఆదిమప్రజాస్వామికాలు బానిసరాజ్యాల తాకిడికి నిలువలేక గతించిపోయి, పారంపర్యమయిన రాజరికాలతో ప్రాదేశిక రాజ్యాలుగా రూపొందుతున్నవి. కాని పురువంశీకుడైన భరతుణ్ణిబట్టి వచ్చిన యీ పేరుకూడా * హస్తినా

* హస్తినాపురం:— భరతుడి తరవాత ఐదవ పురువంశరాజైన హస్తినుడి పేరిట నిర్మించిన పట్టణము.

పురానికిచెందిన పురువంశ రాజులు చుట్టుప్రక్కలరాజ్యాలనూ, సైనిక ప్రజాతంత్రాలనూ, గణసంఘాలనూ నాశనం చేసి అప్పటికి విశాలతమమయిన సామ్రాజ్యాన్ని స్థాపించడానికి చేసే ప్రయత్నాల పర్యవసానంగా మహాభారత యుద్ధమూ, దాని సర్వనాశనకర ఫలితాలూ సంభవించిన రోజుల్లోనే ఈ భరతవర్షమనే పేరు ప్రచారంలోకి వచ్చింది. మనువూ, యితర ఫ్యూడల్ రాజ్యాంగ స్మృతికర్తలూ మధ్యదేశమనీ, బ్రహ్మర్షి దేశమనీ, ఆర్యావర్తమనీ పిలిచినప్పటికీ, వారిదృష్టి తూర్పుపడమరలుగా గంగానదీలోయనుగానీ, దక్షిణానవింధ్య పర్వతాలనుగానీ దాటలేదు. కాకపోతే వంగదేశాన్నిమాత్రం పేర్కొన్నారు. కాబట్టి ఇండియా కంతటికీ వర్తిస్తూవచ్చిన హిందూస్థానమనే పేరు ఆధునికయుగంలో మన నాగరికత లోనే వచ్చింది. కురువంశీకులుగానీ, అయోధ్యరాముడుగానీ, అంధకవృష్ణి గణసంఘాలకు చెందిన కృష్ణవాసుదేవుడుగానీ మనదేశానికి హిందూస్థానమని పేరుబెట్టలేదు.

మహాభారత యుద్ధంతో ప్రాచీన భారతదేశం విస్పష్టమైన మరొక చారిత్రకఘట్టంలో ప్రవేశించింది. కాబట్టిప్రాచీన భారతదేశచరిత్రను భారతయుద్ధానికి పూర్వఘట్టమనీ, భారత యుద్ధానికి తరువాత ఘట్టమనీ రెండు స్పష్టమైన ఘట్టాలుగా విభజింపవచ్చును. జనవాడుకా, చరిత్ర సాంప్రదాయమూ, పౌరాణిక గాథా అన్నీ మహాభారత యుద్ధఘటనతో చరిత్ర గతిమారినదనీ, నూతనయుగారంభమైనదనీ అంగీకరిస్తున్నవి. మహాభారతయుద్ధంతో కలియుగారంభమైనదని సాంప్రదాయం చెప్తున్నది. భారతదేశ సాంప్రదాయక చరిత్రంతా ఈ

సంఘటనతోటే కాలపరిణామపు హద్దులను నిర్ణయిస్తున్నది. ఎందువల్ల ? కాలానుక్రమణికనుబట్టి చూస్తే రామరావణ యుద్ధం మహాభారతయుద్ధంకన్నా 500 ఏండ్లు ముందుగా జరిగింది. కాని దురదృష్టవశాత్తూ, ఆనాటి వాస్తవికచరిత్రి పరిస్థితులు మహాభారత యుద్ధకాలంనాటి పరిస్థితు లంత స్పష్టంగా తెలియరావడంలేదు. వాల్మీకి రామాయణం చాల యిటీవల వ్రాసినది. మహాభారతయుద్ధం తరువాతకాలపు ఫ్యూడల్ పరిస్థితులనూ, వాటి సిద్ధాంతసమామ్నాయాన్నీ. రామాయణకాలానికి దిగలాగి చిత్రించిన కవితాగ్రంథమే వాల్మీకిరామాయణము. నిజానికి తనసిద్ధాంతాలకు, భారతీయ పౌరాణిక వీరులు పనికిరారనుకున్నాడు. కాల పరిస్థితులను గురించీ, జీవితపరిస్థితులనుగురించీ యేదిబడితేఅది చెప్పడానికి వీలైనకథానాయకుణ్ణి ఏరుకున్నాడు. ఎందువల్లనంటే, ప్రజలకు రాముణ్ణిగురించి స్పష్టమైన అభిప్రాయాలేవీలేవు. వాల్మీకి రాముణ్ణి ఆదర్శవీరుడుగానూ, దైవాంశ సంభూతుడుగానూ చిత్రించదలచుకుని విఫలుడైనాడు. చివరకు ఆయనచేతుల్లో రాముడిచరిత్ర ఒక ప్రేమపూరితుడైన యువకుడు నిరంకుశ రాజ్యనిర్మాత యెలా అయినాడో తెలిపే గాథగా తయారైంది. వాలిని చాటుమరుగునుంచి వధించడంలో రాముని సత్యసంధత వెల్లడయింది. ఆర్య సంస్కృతీపరుడై, స్వేచ్ఛను పొందాలని ప్రయత్నించిన శూద్రునిహత్యచేయడంలో ఆతని మానవత్వముబయటపడ్డది. ఆతని ఏకపత్నీవ్రతాదర్శమును కూడాసాంప్రదాయంరచ్చకీడ్చింది. ఆదిమవాసులలోయింకా అన్నచెల్లెండ్రవివాహము నిషేధింపబడనికాలమునాటివాడనీ,

రాముడూ, సీతా అన్న-చెల్లెళ్ళు అవుతారనీ జైనసూత్రాలు చెప్తూన్నవి. సీత "అయోనిజ" అంటే కుటుంబంలో పుట్టినదికాదనే సత్యాన్ని వాల్మీకికూడా దాచలేకపోయినాడు.

ఈ కారణాలవలన రామరావణయుద్ధానికి చరిత్రలో యుగప్రాముఖ్యత లేకుండాపోయింది. కాని ఉన్న కొద్దిపుదాహరణలనుబట్టి చూచినా, రఘువంశంవాడైన దశరథుని కాలంలో అయోధ్యలో ప్రాచీన గణప్రజాస్వామిక మంతరించినదని తెలుస్తుంది. దశరథునితరువాత రాముడు పట్టాభిషిక్తుడు కావడం ఆచారం ప్రకారం రాజసభ అంగీకరించవలసియున్నది. కాని ఆ ఆచారంలో అప్పటికే వంశ పారంపర్యమైన రాజరిక లక్షణాలు ప్రవేశించినవి. శూద్రబానిసలుండటం, వారిని రఘువంశ పాలకవర్గాలు తీవ్రంగా అణచివేయడం, చుట్టుప్రక్కల వుండే తెగలను వారిలోని అంతరంగిక వైషమ్యాలను ఆధారంగా తీసుకొని, అణచివేయడానికి రాముడు దండయాత్రలు చేయడం యివన్నీ దాశరథీరాముడి రాజ్యం భరతుడికి పూర్వం గంగానదీలోయలో స్థాపింపబడిన బానిసరాజ్యాలలో ఒకటియని తెలుపుతున్నవి. కాకపోతే పాపులైన ధనవంతులూ,దుఃఖభాజనులైన దరిద్రులూరాముని పూజకు మతవిషయకమైన లక్షణాన్నీ, విలువనూ ఆపాదించుతున్నప్పటికీ రాముని అవతార పురుషత్వాము మధ్య, ఆధునిక యుగాల చరిత్రలో యెన్నివిధాల వుపయోగించినప్పటికీ, అదంతా పై చారిత్రక సత్యాన్ని మరుగుపరుస్తుందే కాని మరొకటికాదు.

రాముడివంశం చరిత్రలో చాలాకాలం పరిపాలించింది. అయినప్పటికీ, తరువాతవచ్చిన హస్తినాపురపు పురువంశము

మాటున మరుగుపడిపోయినది. వీరికితోడు కాశీ, మగధ, విదేహ,మధుర, యాదవ మొదలైన ప్రఖ్యాతరాజ్యాలున్నవి. వివాహ సంబంధాలద్వారానో, లేక యుద్ధాలద్వారానోగంగా నదీప్రాంత రాజ్యాలు కొన్నికొన్నికలసి పెద్దసామ్రాజ్య వ్యవస్థలుగా యేర్పడుతున్నవి. పురాణాలనుంచి ముఖ్యంగా హరివంశంనుంచీ, మహాభారతంనుంచీ యీ సామ్రాజ్యస్థాపనాది వివరాలను తెలుసుకొనవచ్చును. కృష్ణుణ్ణి మన మతసాంఘిక చరిత్రల్లో కెక్కించినసాత్వతులూ, యాదవులూఅనిపర్యాయ నామాలతో పిలువబడే అంధకవృష్ణులలాంటి గణసంఘాలు యుద్ధంలోకి లాగబడి, ఓడించబడి, స్థానభ్రష్టతనొంది వలస పోతున్నవి. శిసుపాలుడి దండయాత్ర గాథలు వీటినిగురించే. యాదవుల గణసంఘం మొత్తంగా పడమటికి వలసపోయింది. రాజకుటుంబాలు పరస్పరం యుద్ధాలుచేస్తున్నాయి. ఇలాంటి పరస్పరయుద్ధాలు గణ ప్రజాతంత్రాల్లో పాపకార్యాలుగా యెంచబడేవి. మధురరాజైన కంసుడూ, మగధాధిపతియైన జరాసంధుడూ, హస్తినాపుర కౌరవులూ, పూర్వపు తెగల యొక్క సైనికప్రజాతంత్రాలను నామరూపాలులేకుండాచేసి, పెద్దసామ్రాజ్యాలనూ; రాజరిక పరిపాలననూ యేర్పరచడానికి చుట్టుప్రక్కల తెగలతోనూ, తమలో తాముగూడానూ యుద్ధాలు చేస్తున్నారు. ఇలా నిత్యాభివృద్ధిని పొందుతున్న బానిసరాజ్యాలు ఆదికాలంనుంచీనివసిస్తున్న గణసంఘాలతో పోరాడడం, బానిస ప్రభువుల వంశాలు తమక్రింద నున్న వైశ్యులూ, శూద్రులూ వుత్పత్తిచేసే సంపదలను మరొకరికి దక్కకుండా యెవరికి వారే హరించడానికి అంతర్యుద్ధాలు

సాగించడం, ఈపోరాటాలన్నీ చివరకు మహాభారతయుద్ధంగా పరిణమించడం జరిగింది. హ_స్తినాపుర కౌరవులలో గణ ప్రజాతంత్ర మెప్పుడో నశించినది. పురుషసూ_క్త కాలంనాటి ప్రాచీన కురువంశజులు మొదటగా పితృస్వామిక బాని సత్వాన్ని స్థాపించారు. ఇప్పుడువారు గొప్ప బానిసరాజ్యాన్ని నిర్మి_స్తున్నారు. గణసభ్యుల ప్రజాతంత్రం పెద్దల ప్రభుత్వ-కూటంగా (ధనికకులాల ప్రభుత్వకూటంగా) సంకుచితమై పోయినది. ఇదికూడ యిప్పుడు రాజరిక నిరంకుశంక్రింద నలిగి నాశనమైపోతున్నవి. అందువల్ల కౌరవ కులపతుల సభలో వారి రాజకుమారులు ప్రాచీన ప్రజాస్వామికావ శేషాలను రూపుమాపటంలో మహోదూకుడుగా పోతున్నారనీ, వారిని కులపతు లదుపు చేయలేకపోతున్నారనీ కృష్ణుడు గోల పెట్టాడు. దీనికి కారణం గణసంఘ ప్రజాతంత్రాన్ని రక్షించ వలసిన యీపెద్దలే, దానిపాలిట వినాశకారులైనారు. వారు కూడా భోగభాగ్యాలకొరకూ, భూమికొరకూ, బానిసల కొరకూ ప్రాకులాడుతున్నారు. యుద్ధమే వారి వృ_త్తియైనది. సంపదలు కేంద్రీకృతములై పోతున్నవి. యుద్ధశాస్త్రాచార్యు డైన ద్రోణుడే తనకొడుకు అశ్వత్థామ పాలుకావాలని ఏడ్చి నప్పుడు, పాలుదొరకక నీళ్ళలో పిండికలిపియిచ్చి పిల్లణ్ణి సము దాయించాడు. అతనికే అంత దరిద్రం పట్టిందంటే సంపద ఎంతత్వరగా కేంద్రీకృతమైపోతున్నదో స్పష్టపడుతుంది. అందు వల్లనే అతడు ఏ బానిసయజమానిదగ్గరనైనా వుద్యోగానికిసిద్ధ పడ్డాడంటేఆశ్చర్యంలేదు. ధనవంతులైన బానిసయజమానులు తమరోడించిన తెగలనుచూచినా, వారినుంచివచ్చినబానిసలను చూచినా గడగడ వణకిపోతున్నారు. వారిలో యెవరైనా

ఆయుధాలు ధరించడానికిగానీ, సామాన్య మానవహక్కులను పొందడానికిగానీ ప్రయత్నించారా, తీవ్రంగాఅణచివేయబడు తున్నారు. నిషాదబాలుడైన ఏకలవ్యుడు తన యజమానుల సిద్ధాంతాలకుకట్టుబడియుండకపోయినట్లయితే,బొటనవ్రేళ్లను ద్రోణుడికిచ్చివేసి యుండేవాడుకాదు. ఆశూద్రుడుఅర్జునుడికి పెద్ద పోటీఅయ్యేవాడు. సంపదలను పోగుచేసే దాహం యీ బానిస యజమానులను తీవ్రంగా పట్టుకుంది.ఇందుకోరకువీరు భారతదేశచరిత్రలోకల్లా పెద్ద మానవ మారణహోమాన్ని-మహాభారతయుద్ధాన్ని ప్రారంభించడానికి వెనుదీయలేదు.

బానిసవిధానమూ,ధనమూ, వర్గరాజ్యాంగమూ పెరిగి నందువల్ల వచ్చిన ఫలితాలు బానిసయజమానులనే ఎదురు తన్నినవి. ఆదిమనివాసులైన రాక్షసులనూ,నాగులనూ,నిషాదులనూ,ద్రవిడులనూ మొదలైనవారిని జయించడానికి బానిస యజమానులుగణసంఘాలలోఅభివృద్ధిచేసినయుద్ధతంత్రమూ, అలవరచుకున్న వీరత్వమూ,గంగా-సింధునదీ పరిసరప్రాంతాలను ఆక్రమించిన తరువాత గుడిసెందుల్లోప్రవేశించింది. ఇక దానికిముందు త్రోవలేదు. పూర్వం గుర్రం, విల్లు, యినప ముల్లుగల అమ్ములూ వుంటే యుద్ధంలో గెలవడం సులభమయ్యేది. ఇవి దండెత్తివచ్చిన ఆర్యులకున్నవి.స్థానికవాసులకుండేవికావు. గణాలు పెరిగి విస్తరించి నివాసభూమిని ప్రాదేశికంగావిభాగం(Territorial Division) చేసుకున్నవి.కాని ప్రైవేటు ఆస్తి, బానిసత్వమూ, వ్యాపారమూ, సంపదల కేంద్రీకరణమూ పెరిగిపోయి గణప్రజాతంత్రము విరోధవర్గాలుగా చీలినది. అంతర్యుద్ధము చెలరేగినది. బానిసలకొరకూ,

భూమికొరకూ విస్తరణ రోజురోజుకూ కష్టమైపోయినది. ఇక ప్రభువంశకూటములు తమలోతాము పరస్పర దురాక్రమణలకు పూనుకున్నారు. ఆస్తి కేంద్రీకరణము రక్తబంధువులయొక్క, సన్నిహిత బంధువులయొక్క ప్రయోజనాలకు విరుద్ధము. పూర్వపు గణప్రజాతంత్రములోవలె శాంతియుతమైన పంపకం అసంభవమైపోయింది. బానిసలకొరకూ, సంపదలకొరకూ పరాయితెగలపై యుద్ధంచేసే అలవాటు యెదురుతన్నింది. బంధువులలోనే అంతర్యుద్ధం ప్రారంభమైంది. దోపిడీలో భాగంకోసం బానిసయజమాని తనసోదరయజమానితో కలహించాడు. ఓడింపబడినవారి బానిసత్వంమూలంగా గెలిచినవారు ధనాశాదుర్గ్రాహానికి దాసులైనారు. ఇందువల్ల వారియొక్క పూర్వపు గణప్రజాతంత్రం నశించింది. కాకపోతే సోదరులతో ఆడిన జూదంలో సోదరులనూ, భార్యనూ పందెమొడ్డటం యెవరైనా కన్నారా? విన్నారా? కుంతి నిష్షేపంవంటి కర్ణుణ్ణి పారవేసినట్లుగా యజ్ఞగణసమాజంలో యేతల్లియైనా కన్నకొడుకును పారవేసినదని వినగలిగామా? అయినప్పటికీ విశుద్ధసంతానం కాడన్న కర్ణుడే అంగదేశపు పల్లెకారులచేత పెంచబడినప్పటికీ శుద్ధ సంతానమనబడిన తన సోదరులకన్నా వుదారుడూ, పరాక్రమవంతుడూ అయినాడు. పాండురాజుయొక్క అర్ధవిశుద్ధపుత్రుడైన అర్జునుడు, తాను బానిసయజమానియైన రాజపుత్రుడునని డప్పాలుకొట్టుకుంటేగాని సామాన్యమైన నిత్యక్రీడలలో గెలిచేవాడుకాదు. అతనితో పోటీగా నిలిచినకర్ణుడు అలాతండ్రిపేరుచెప్పుకోలేకపోయేవాడు. ప్రాచీనగణముయొక్క మానవత్వం బానిస

యజమానుల భాగ్యగర్వానికీ యీర్ష్యకూ లొంగిపోవలసి వచ్చింది. ఫలితం మహాభారతయుద్ధమైంది.

మహాభారతయుద్ధం మొట్టమొదటి హస్తినాపుర రాజ కుటుంబంలోని రాజకుమారులమధ్య అంతర్యుద్ధంగా ప్రారంభ మైంది. బంధువులమధ్య యీ అంతఃకలహం యజ్ఞగణ నియ మాలప్రకారం నిషేధమయినది; సోదరుడూ సోదరుడూ చంపుకోకూడదు.

ఇక రెండుపక్షాలూ కూర్చుకున్న బలగాల్లో కొన్ని గణసంఘాలు అంతరంగికంగా చీలి ఒకటి ఒకపక్షమూ, యింకోటి మరోపక్షమూ చేరినవి. సాత్వతులు యిలా చీలి రెండుపక్షాల్లో చేరినవారే. అది గణసంఘ ప్రజాస్వామికా లన్నీ సాధారణంగా భగ్నమైపోతున్నకాలం.

అనేక రాజ్యాలకు చెందిన రాజబంధువులు కూడా మగధరాజులవలె చీలి రెండుపక్షాల్లోనూ చేరారు. ప్రతి పాలకవర్గ కుటుంబంలోనూ అంతర్యుద్ధం ప్రవేశించినది. అలాగే ఆదిమనివాసులైన తెగలు అనేకంకూడా తమనాయ కులు పాలకవంశాలతో ఒడంబడికలు చేసుకోవడంవల్లగానీ, లేక వారికి ఓడి లొంగిపోవడంవల్లగానీ అంతర్యుద్ధంలో ఏదో ఒకపక్షం చేరారు. ఉదాహరణకు రాక్షసుల్లో కొన్ని తెగలవారుమాత్రం తమను ఓడించి, దాస్యంపాలుచేస్తున్న యీ రాజ్యాలపీడ వదల్చుకోడానికి యీ అంతర్యుద్ధం మంచి అదనను కున్నారు. నాగులూ, ద్రావిడులూ మొదలైన తెగ లీ తరగతికి చెందినవి. ఈ బానిసరాజ్య శిథిలాలమీద మరల

తమ పూర్వపు జీవితాలను నిర్మించవచ్చుననుకున్నారు. కాని వారి ఆశలు వృథా ఆశలైనవి.

యాదవ గణ సమాఖ్యలోని ముఖ్యనాయకులు కౌరవులకు బంధువులైనప్పటికీ, యుద్ధంలో చేరడానికి ఒప్పుకోక, కృష్ణుని నాయకత్వంక్రింద మధ్యవర్తులుగా పనిచేశారు. కాని యుద్ధం మొదలుపెట్టిన వెంటనే వారిలో యే కొద్దిమందో తప్ప, మిగిలినవారందరి మధ్యవర్తిత్వమూ, కృష్ణుడి మధ్యవర్తిత్వమువలె నామమాత్రమై పోయినది. కృష్ణుడు వ్యక్తిగతంగా పాండవులపక్షం; అతని సైన్యాలు కౌరవులపక్షం, అంటే అంధకవృష్ణులుకూడా చీలి యుద్ధంలో యిరుపక్షాల వైపునా చేరారు.

ఇలా ఉత్తరహిందూస్థానమంతా మహాభారత యుద్ధమారణహోమంలో చిక్కుకున్నది. గణసంఘాలు, సైనిక ప్రజాతంత్రాలు, ధనవంతుల కులసంఘాలు, బానిస రాజ్యాంగాలు అన్నీ అందరూ యీ యుద్ధాగ్నిగుండంలో దూకారు. పూర్వ ప్రపంచానికిచెందిన గణాలకూ, వాటి విలువలకూ, నీతినియమాలకూ, ఆర్థిక విధానానికీ, సాంఘిక సంబంధాలకూ సర్వానికీ యీ యుద్ధం వినాశనఘట్టం. కొత్తప్రపంచ మొకటి దురాశ, భాగ్యము, శూద్రులపైనా, వైశ్యులపైనా, దోపిడీ చేసే బానిసయజమానుల కేంద్రీకృతాధికారము కరడుకట్టుకున్న కొత్తప్రపంచం నిలదొక్కుకోడానికి పోరకాడుతున్నది.

సాంఘిక సంబంధాలలోనూ, వాటిని ప్రతిబింబించే సిద్ధాంత విలువలలోనూ వచ్చిన యీ మహా సంక్షోభం "భగవద్గీత"లో సూచనప్రాయంగా అవుపడుతుంది. భగవ

గీతలోని వివిధ తాత్విక సిద్ధాంతచర్చలను ఒక ప్రక్కకు తోసివేస్తే,అసలలాంటిగ్రంథంపుట్టడమే సమిష్టి గణసంబంధాలకూ; సిద్ధాంతాలకూ సమాధి కట్టబడ్డదనీ, ఆసమాధిమీద ప్రైవేటుఆస్తికీ, వర్గసంబంధాలకూ ఒకవిపరీతమైన పద్ధతిలో పట్టాభిషేకం చేయబడ్డదనీ – తెలుపుతుంది. కొత్త సంబంధాలు స్థాపనమైనమాట ప్రత్యక్ష సత్యం. గీత వాటి కొక సిద్ధాంతాన్ని సృష్టించింది;పూర్వగణ ప్రజాస్వామికంధృష్ట్యా వాదించే విమర్శకుల నోళ్లు మూయించింది. కొత్త భగవదవతారం పేరిటా, కలియుగం పేరిటా గీత బంధుత్వమూ, సమిష్టి గణప్రజాతంత్రమూ బ్రతికేకాలం గతించినదనీ, వర్గవైరుధ్యాలూ, దోపిడీ చెలామణిఅయ్యే నూతనయుగం ప్రారంభించిందనీ స్పష్టపరిచింది. గణ నీతినియమాలు నశించినవి. వర్గ సమాజ నీతినియమాలు ప్రాబల్యంలో కొచ్చినవి.

నిజానికి గాథలో చెపుతున్నట్లు పద్దెనిమిదధ్యాయాల గీతా,భారతయుద్ధంమధ్యంలోకృష్ణార్జునులసంవాదరూపంలో పుట్టినది కాదు. కృష్ణు డలాంటి హాస్యాస్పద సన్నివేశంలో కెక్కడానికి అంతవాస్తవికజ్ఞానంలేనివాడూకాడు.భారతకర్త దానిని ఎక్కడోమూల శాంతంగా కూర్చుని రచించాడు. ఈభగవద్గీతారచన తరువాత పుట్టిన ఊహయే కాక, అది ఏదో యుద్ధసందర్భం చూచుకుని రచయితతనకాలపుతాత్విక సిద్ధాంతాల నన్నిటినీ యేకరువు పెడదామనుకోడం కూడా కాదు. అదేనిజంగా ఉద్దేశ్యమైతే, శాంతిపర్వములోనేయితర సమస్య లన్నిటితోపాటు యివీ వచ్చివుండవచ్చును.విజ్ఞులైన వారంతాభారతయుద్ధాన్నిగురించిసాధారణంగావేసేప్రశ్నయే గీతకూడా ప్రస్తావించి సమాధానమిస్తున్నది. ఆప్రశ్న సన్యా

సానికిగానీ,కర్మయోగానికిగానీ సంబంధించినది కాదు. అయితే గీత జీవితానికీ, లేక అస్తిత్వానికీ, చైతన్యానికీసంబంధమేమిటన్న ప్రధానసమస్యను చర్చించింది. ఆలోచనకూ, నడవడికకూ, ఆహారానికీగల సంబంధమేమోకూడా వివరించింది. కాని యిన్నిచర్చలు చేసినప్పటికీ అర్జునుడివ్యాధిఆహారాన్ని గురించీ కాదు; యేతత్వమార్గాన్ననుసరించాలా అనే అనుమానమూ కాదు. ఇది చరిత్రకారులందరికీ తెలుసును. అర్జునుడు ఒక్కటే సూటియైనప్రశ్న వేశాడు. నాటికింకా పూర్వపుగణ సంబంధాలను పాటించాలనే నీతికి కట్టుబడియున్న సామాన్య మానవులందరి మనస్సులనూ కలచివేస్తూవుండినప్రధానమైన ప్రశ్నే అది. తాను రాజ్యంలో భాగాన్ని – కనీసం ఐదూళ్ళయినా యిమ్మనికోరాడు. ఈ కోరికకోసంయిప్పుడు తాను గురువులనూ, తాతలనూ, అన్నదమ్ములనూ, పినతండ్రీ పెదతండ్రులనూ కాస్త తెలిసినబంధువులందరినీ చంపడానికితయారైనాడు. పూర్వయుగ నియమాలప్రకారం యిది యే కారణాలవల్ల జరిగినా మహాపాపంగా పరిగణించబడ్డది. సంపూర్ణంగా నిషేధించబడ్డది. * పూర్వపు గణప్రజాతంత్రంలో అలాంటి బంధుమారణంఅంటే అసహ్యించుకోడంచిన్ననాటినుంచీ నేర్పేవారు. మరి అలాంటిదిప్పుడు అనుసరణీయమెలా

---

* ఆచార్యాః పితరః పుత్రాస్తథైవ చ పితామహాః ।
మాతులాః శ్వశురాః పౌత్రాః శ్యాలాః సంబంధినస్తథా॥ 34

ఏతాన్నహన్తు మిచ్ఛామిఘ్నతో౽పి మధుసూదన ।
అపి త్రైలోక్య రాజ్యస్య హేతోః కిం ను మహీకృతే॥ 35

అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయం।
యద్రాజ్య సుఖలోభేన హన్తుం స్వజనముద్యతాః॥ గీతా॥ అ. 1-45)

అయింది? పాపమెందుకు కాలేదు? పూర్వపు నీతే యింకా చెల్లేట్లయితే కులాల సర్వనాశనానికి దారితీసే యీ నరకానికి కారణమైన యిరుపక్షముల నాయకులూ దోషులే. ఆ స్త్రీకీ, రాజ్యానికీ హక్కును వదలుకుని యీ మారణ హోమాన్నీ, దానివల్ల రాగల పాపాన్నీ నివారించు; సన్యాసాన్ని స్వీకరించు. ఇది గణసంఘాలయొక్క, కులసంఘాలయొక్క నీతి. అయితే యుద్ధమే చేయడం తప్పకపోతే, దాని నంగీకరించడం తప్పకపోతే దానిని సమర్థించేదీ, పాపరహితం చేసేదీ అయిన కొత్తనీతి యేది? కొత్త సాంఘికవిలువ యేది? గణ సభ్య సామాన్యం అలా అభిప్రాయపడ్డది. సమాధానం కోరింది. అర్జునుడుకూడా ఆ ప్రశ్నే లేవదీశాడు. గీతా సిద్ధాంతకారుడు సమాధానిమిచ్చాడు. ఆయన సమాధానంలో చిక్కుకుని యున్న, తప్పుకోరాని వైరుధ్యాలు ప్రతిబింబిస్తున్నవి. ఈ వైరుధ్యాలకు పరిష్కారంగా 'యిదంతా కర్మ; నీవర్గ విధి నిర్దేశం; విశ్వసించాలి; శిరసావహించాలి' అని చెప్పడంకన్నా యెక్కువ యేమీ సూచించలేకపోయినాడు. దీనికిచ్చిన కారణాలయొక్క బలహీనతను కప్పిపుచ్చడానికన్నట్లు, అంటే కొత్త వర్గశాసనాన్ని అనుసరించడానికి అవసరమైన భయ భీతులు కలిగించడానికా అన్నట్లు సకల చరాచర జగత్తు యొక్క భవిష్యత్తునూ తన విరాట్స్వరూపంద్వారా చూపించాడట. అర్జునుడు నిరుత్తరుడైనాడు. సమాధానపడ్డానన్నాడు. మామూలు ప్రజల విషయం మాటల్లో తేల్చివేయబడినది. వారినోళ్ళు కట్టివేసి భయభీతులను కలిగించి, మత్తుచల్లి కొత్త సంబంధాలతోనూ, తాత్విక సిద్ధాంతంతోనూ, శాసనాల

తోనూ పవిత్రం చేయబడిన అపవిత్రయుద్ధంలోకి లాగివేయబడ్డారు. మతసంబంధమైన భ్రమలను వదలిపెట్టి సహేతుకమైన చారిత్రకదృష్టితో దీని సంతటినీ పరిశీలిస్తే గీతాతత్వమంతటినుంచీ తేలే సారాంశమిదే.

గణబంధు సమిష్టిసంఘనీతికి వ్యతిరేకంగా నూతన ప్రాదేశిక, వర్గ రాజ్యాంగయంత్రాన్ని సమర్థించిన నైతిక సిద్ధాంతాన్ని 'గీత' యెలా వివరించింది?

సమిష్టిశ్రమా, సమిష్టి అనుభవమూ ఉన్న పూర్వపు గణసమాజంలో వస్తువైవిధ్యమూ శ్రమవైవిధ్యమూ పెరుగుకొచ్చినందువల్ల శ్రమవిభాగం-వర్ణవిభాగం యేర్పడ్డది. ఏ వర్ణాని కావర్ణం ప్రత్యేక కార్యవిధులను కలిగియుండేది. అయితే ఉత్పత్తియైనదంతా సమాజానికి చెందియుండేది. సమిష్టిగా అనుభవింపబడేది; ఒకవర్ణంలో పనిచేయడంవలన గణసభ్యునికి ప్రత్యేక బహుమతులుగానీ, ప్రత్యేక న్యాయంగానీ, ప్రత్యేక ఆస్తిహక్కుగాని లభ్యమయ్యేవి కావు. వర్ణవిభాగంవల్ల శ్రమనైపుణ్యమూ, వస్తునాణ్యమూ, సామాజిక నిర్మాణవిధిలో అభివృద్ధీ కల్గేవి. కాని మారకమూ, వ్యాపారమూ, ప్రైవేటు ఆస్తీ, డబ్బూవచ్చేటప్పటికి ప్రతివ్యక్తిగతకుటుంబమూ ప్రైవేటు ఆస్తినీ, వర్ణాన్నిబట్టి హక్కులను పొందినది. యుద్ధమూ, మారకమూ, ఉత్పత్తిని డైరెక్టుచేయడమూ-వీటితోసంబంధమున్న వర్ణాలు సహజంగా ఆర్థిక ప్రాబల్యము గలవైనవి. ప్రాబల్యం గల బ్రహ్మ క్షత్రియ వర్ణాలలో బీదలైనవారందరూ వృషలత్వంలోనికి, కష్టజీవి వర్ణాల్లోకి నెట్టివేయబడ్డారు. వర్ణాలే వర్గాలైనవి, వర్ణసంబంధము వర్గసంబంధముగా, వర్గ విశ్వాస

ముగా, విధిగా, వర్గ బహూకరణగా మారిపోయినది. పై రెండు వర్ణాలూ దోపిడిదారీవర్గాలైనవి. మిగిలిన రెండువర్ణాలూ దోపిడిచేయబడే వర్గాలైనవి. శూద్ర బానిసతప్ప మిగిలినవర్ణాల వారు ఒక వర్ణంనుంచి మరో వర్ణంలోకి మారవచ్చును. అంటే ఆస్తినిబట్టి ఒకవర్గంలోనుంచి మరొకవర్గంలోకి మారవచ్చును. వర్గహక్కులూ, వర్ణహక్కులూ గణసమాజ హక్కుల పైన ప్రాబల్యాన్నిపొంది వాటిని అణచివేసినవి.

యుద్ధంచేయడం, శత్రువులను రూపుమాపడం క్షత్రియుల వర్ణధర్మము. అయితే గణయుగంలో శత్రువు యెప్పుడూ పరాయివాడుగావుండేవాడు. గణంలోవర్గవైరుధ్యాలులేనంత వరకూ క్షత్రియుడు రక్తబంధువులైన గణసభ్యులపైన యుద్ధం చేయడమనేదే వుండదు. ప్రైవేటు ఆస్తీ, బానిసవిధానమూ గణంలో ప్రవేశించగానే క్షత్రియ బ్రాహ్మణ వర్గాలు దోపిడీదారులై, అప్పటికింకావిడిపోకుండావున్న గణంలోని బానిసల పైనా, బీదలపైనా దౌర్జన్యం చలాయించే సామాజికాంగాలుగా తయారైనారు. ఇప్పుడు నూతన ఆర్థికవిధానాన్నీ వర్గసంబంధాన్నీ,దోపిడీనీనిలవబెట్టడానికై,బంధువులనీ, పెరవారనీ భేదంలేకుండాఅందరిపైనా యుద్ధంచేయడం వీరి వర్ణధర్మమైనది. సంపదలనూ,పశువులనూ, గ్రామాలనూ,భూమినీ, బానిసలనూ,రాజరికాలనూ ఇప్పుడువ్యక్తియొక్కా,కుటుంబముయొక్కా ఆస్తిగా వుండగలిగిన దానినంతటినీ నిలుపబెట్టడానికీ, పెంచడానికీ, యెక్కువ ఆదాయాన్ని రాబట్టడానికీ శత్రువనీ మిత్రుడనీ భేదంలేకుండా, అందరిపైనా పోరాడటం బ్రాహ్మణ క్షత్రియుల కొత్తధర్మమూ,కొత్తహక్కూఐనది. సహోదరుడు కావచ్చును,

రక్తబంధువు కావచ్చును, పరాయివాడు కావచ్చును, ఆస్తి రక్షణకోసం ఎవరిమీాదనైనా పోరాడాలిసిందే. ఇదీక్షత్రియుడైన అర్జును డనుసరించవలసిన గీతాధర్మము. ఇది నూతన వర్గ - వర్ణవైరుధ్యాలపైన ఆధారపడిన నూతనధర్మము. ఇది పూర్వపు స్వయం ప్రవర్తకమైన ఆదిమ కమ్యూనిస్టు సమాజ ధర్మముగాదు. నీవు పోరాడిగెలిస్తే రాజ్యమూ, భోగమూ లభిస్తాయి; చస్తే స్వర్గం వస్తుంది. ఇదే కొత్తగా వచ్చిన ధనికపాలకవర్గాల నిత్యజీవితాన్నిదిద్దే సూత్రం. రాజ్యాంగ యంత్రము స్థాపింపబడిన తరువాత మొదటిరోజుల్లో వైశ్యుణ్ణి, శూద్రుణ్ణి దోచుకునేప్పుడు, తెగలను బానిసలనుగా చేయ డానికి పోరాడేప్పుడూ క్షత్రియుడు వ్యక్తిగతంగా కొంత అపా యానికి గురి కావలసివచ్చేది. కానితరవాతరోజుల్లో ఆకొంచెం అపాయంకూడాజీతపురాళ్ళకొచ్చినస్థాయీసైన్యాలపై పడ్డది.

గణంయొక్క సమిష్టిధర్మాన్నీ, విధులను రద్దుచేసి, ఒక వర్గంపైన మరొకవర్గంయొక్క దౌర్జన్యానికి పట్టాభిషేకంచేసిన గీతకూడా దోపిడిదారులూ, దోపిడిచేయబడేవారూ, ఆ దోపిడి పరిణితులలోనే సంక్షోభ మెరుగని జీవితమూ, జీవనమూ కలిగి క్రమబద్ధముగావుండే వర్గసమాజమైనా స్థిరంగా వుంటుందనే గ్యారంటీ చేయలేకపోయింది. పూర్వపు గణసమాజంలో ఉత్పత్తిశక్తులెంతదరిద్రంగావున్నప్పటికీ, సమిష్టివుత్పత్తివల్ల లభ్యమైనదానిలోతనభాగంతనకు తప్పకుండా వస్తుందని ప్రతి సభ్యుడికీ గ్యారంటీవుండేది. అతడు తా ననుభవించడానికి ఉత్పత్తిచేసేవాడు. దానిని సమాజం అతని అనుభవంకొరకై యిచ్చేది.తయారైనవస్తువుతయారుచేసినవాడిచేతినుంచిజారి

పోయి, ఆ వస్తువుతో సంపూర్ణంగా భేదించే మరోరూపంలోకి అంటే డబ్బుగామారి హిరణ్యమనే మాయదుప్పటిమీద వ్యాపారప్రపంచమంతటా సంచారంచేసేదికాదు. ఇప్పుడు వస్తువుయొక్క మాయరూపమైన బంగారం వివిధరూపాల్లో వివిధనాణేలుగా ప్రతిచోటా ప్రతివర్ణంలో, ప్రతివర్గంలో వస్తువులకు బదులుగా చలామణీ అవుతున్నది. ఈవిధంగా సర్వశక్తివంతమూ, సర్వవ్యాపకమూ కాగలగడానికీ, అందినట్లుండి ఇట్టేమాయమైపోవడానికీ ఈహిరణ్యంలోవున్న అగోచరశక్తియేమిటి? ఒకడు తన ఆనందంకొరకు ఒక వస్తువును తయారుచేసుకుని, డబ్బులేనిదే- మాయదారి బంగారంలేనిదే- ఆవస్తువును అనుభవించి ఆనందించలేకపోవడానికి కారణమేమిటి? అతడావస్తువును ఒకరోజున అమ్మివేసి ఆడబ్బుతో ఓ మర్నాడావస్తువును కొనబోతే చాలకపోవడానికి కారణమేమిటి? బానిస కష్టించాడు. యజమాని అనుభవించాడు; ఒకడు వ్యాపారంచేసి లాభంతీశాడు; మరొకడు నష్టపడ్డాడు. మనిషి చిత్తశుద్ధిగా పనిచేస్తే, న్యాయమైన ఫలితం అనుభవించడానికి మానవజీవితాన్నినియమించేసజీవమైనధర్మమేదైనావున్నదా లేదా? భగవంతుడా! నీవుకూడా బంగారంనుంచి పుట్టినవాడివేనా - అందుకనేనా నిన్ను హిరణ్యగర్భుడంటున్నారు.♦

---

♦ ఋగ్వేదంలోని చివరి అధ్యాయాలలో సృష్టికర్త విశ్వకర్మ - హిరణ్యగర్భ అని వర్ణించబడ్డాడు. బ్రహ్మ, ఆత్మ ఈ రెంటి ఏకత్వాన్ని స్థాపించే అద్వైతభావవాదానికి కొంతవరకూ పై వర్ణనలే పునాది.

(ఋగ్వేదం 10-121 పేజి చూడుము)

ఆదిమ గణసమాజంలో యిలాంటి సమస్యలు పుట్ట లేదు. పరస్పర వ్యతిరేకములైన మానవ సంబంధాలను సమాధానపరచవలసిన తాత్వికసిద్ధాంతంతో వారికి పనిలేదు;ఆదిమ గణసంఘాన్నిగురించిన వేదవాఙ్మయం ప్రార్థించింది; కేకలు వేసింది; నృత్యంచేసింది;గారడిచేసింది; గోవునుంచి యెక్కువ పాలు యెలాలభిస్తాయియా అనే ఆలోచనతో తల గోక్కున్నది. పచ్చనిగడ్డి నల్లటి ఆవులోకిపోయి తెల్లటిపాలుగా వస్తుంటే చూచి ఆశ్చర్యపడ్డాడు ఆనాటి వేదాంతి. విత్తనం నేలలోకి పోయి మొక్క-మొలిచి అనేక విత్తనాలు మరల వచ్చేటప్పటికి ఆశ్చర్యపడ్డాడు. ఇదంతా యేమిటి? ఈ ప్రకృతి అంతా యెలా పనిచేస్తున్నది? దీనిని నడిపేదెవరు? చెట్టునుపడగొట్టాడు, ఒక పుల్లనుచెక్కి- అమ్ముగాచేశాడు;ఆలోచించాడు; ప్లానువేశాడు; కారణ కార్యరూపంగా వాదించుకున్నాడు. వెంటనంటి ఒక జంతువును చంపాడు;తిన్నాడు;ఆనందమయుమైనాడు.ప్రకృతి యిచ్చిన చెట్టుపుల్ల అమ్ముగా యెలా అయింది? జింక అతని ఆహార మెలా అయింది? అతను ప్లానువేసుకుని శ్రమచేశాడు కాబట్టి. కాని చెట్టూ, జింకా యెక్కడనుంచి వచ్చినవి? జింక ఒకరోజు అవుపడుతుంది. మరోరోజు అవుపడదు; ఎందుకని? ప్రకృతినిఅర్థంచేసుకోడం,అనుపుచేసుకోడం,బ్రతకడం,ఆనందించడం-యిదీ అతని ముఖ్యసమస్య. ప్రతి వస్తువులోను అతడు తన జీవితాన్నేచూచాడు. తనకుతానే యెగిరినట్లూ, విచిత్రమైన ప్రదేశాల్లో తిరిగినట్లూ కలగన్నాడు. కల జరిగేప్పుడు అతను యజ్ఞగృహంలోనే, యజ్ఞాగ్ని ప్రక్కనేవున్నాడు కూడా. తనకు వెలుపలనున్నదేదో తనలో నున్నదా? అదే

ఆలోచిస్తున్నదా? అదేప్లాను వేస్తున్నదా? అతడుదయ్యాలనూ, భూతాలనూ మనసులో ఊహించుకున్నాడు. ప్రతిదానిలోనూ తన ప్రతిబింబాన్నే, తననేచూచాడు. అతను తన అనుభవాలను సాధారణీకరణంచేస్తున్నాడు; నేర్చుకుంటున్నాడు; ప్రపంచంలో జరిగేవృత్తానికంతటికీరహస్య మేమిటాయని "తాత్విక సిద్ధాంతీ"కరణ చేస్తున్నాడు. అతడుతర్కం, హేతువూ, ఆలోచనా, అనుభూతీఅన్నిటినీతరచుతున్నాడు. చైతన్యానికీ, అస్తిత్వానికీ సంబంధమేమూఅని వెతుకుతున్నాడు. ఆదశలోఒకే ఒక వేదాంతసూక్తం – నాసదీయసూక్తం – ఋగ్వేదంలో పుట్టింది. అంతవరకూ వేదాలూ, వాటికాలపు యజ్ఞగణాలూ దానిని దాటిపోలేదు. అయినా యీవిధంగా మొదటిఉపనిషద్వేదాంతానికి దారులు తీయబడ్డవి.

కాని నాటి మానవుడు తనుసృష్టించినదానిపైన, తన సామాజికశక్తులపైన పోరాడవలసి రాలేదు. అక్కడ సమాధానపరుపవలసిన వైరుధ్యమేమీ పుట్టలేదు. అతనితిండిఅతని పొట్టను నింపింది. ఆతిండికి శ్రమచేయని మరొకరిపొట్టనింపలేదు. అతనిగుడ్డ అతణ్ణేకప్పింది. వెచ్చగావున్నది; సంతోషపడ్డాడు.

ఇప్పుడో! వైరుధ్యాలూ, దోపిడీగలసమాజమొచ్చింది. అతనితిండి అతని వదలిపెట్టింది. శ్రమచేయని మరొకరిపొట్ట నింపింది. అతనిగుడ్డ అతణ్ణి వదిలింది. యజమాని శరీరాన్ని అది కప్పింది. అతనుమాత్రం చలితో వణకిపోయాడు. ఇది యేమని అన్నాడా, దెబ్బతిన్నాడే! అతడు ఉత్పత్తిచేయనని నిరాకరిస్తే "సమాజం" యొక్క దౌర్జన్యమంతాఅతనినిఉత్పత్తి

చేసేట్లు బలవంతంచేస్తుంది. ఉత్పత్తిచేయడం అతని ధర్మ మన్నారు. అందులో బ్రతకడానికిఅవసరమైనంతభాగమిమ్మని కోరాడా, అతణ్ణి దురాశాపరుడన్నారు. అణకువగావుండటం నేర్పారు. ఇలావచ్చింది ఉపనిషత్తు, భగవద్గీతల వేదాంత ధర్మము.

"జీవితంలో నీఅంతస్తునిబట్టి నీకొరకు నిర్దిష్టమైనకర్మ లను నీవు నిర్వర్తించాలి, నిర్వర్తిస్తూవుండాలి. నీకర్మఫలితం పైన నీకు అధికారంలేదు. ప్రతిఫలాపేక్షతో కర్మలనాచరించ వద్దు. కర్మలు చేయడం యెన్నడూ మానవద్దు."*

యుద్ధంచేయడం నావల్లగాదని వారించిన అర్జునుడికి గీతయిచ్చిన ఉపదేశ మిది. మహాభారత యుద్ధకాలంనుంచీ సామాన్యమానవుడి కిస్తూవచ్చిన ఉపదేశమూ యిదే. వైరుధ్యాలలోనూ, గందరగోళంలోనూ యాదృచ్ఛికసంఘటనల లోనూ తగుల్కున్నందువలన సామాజిక జీవితంలో ప్లాను ప్రకారం ఫలితాలను గ్యారంటీచేయలేని వర్గసమాజంయొక్క తాత్వికసిద్ధాంతాల సారాంశమూయిదే. ప్రైవేటుఆస్తి ఉత్పత్తిలో అరాజకత్వమూ, ఉత్పత్తిదారుకూ, అతను ఉత్పత్తి చేసిన వస్తువుకూ సంబంధం లేకపోవడమూ, వీటివలన పైన ఉదహరింపబడిన వర్గరాజ్యాంగంలోనిమతతాత్వికనినాదాలు ఉత్పత్తిదారును బానిసత్వానికీ, దరిద్రానికి కట్టివేయడానికీ, పాలకవర్గంచేసేదోపిడినీ,నిర్బంధాన్నీసమర్థించడానికీపుట్టినవి.

---

* కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషుకదాచన ।
మాకర్మఫలహేతుర్భూర్మాతే సంగోஉస్త్వకర్మణి॥ (గీత 2-46)
నియతం కురు కర్మ త్వమ్॥ (గీత, అ 3 - 8)

ఆదిమ కమ్యూనిస్టుగణంలో కానీ భవిష్యత్కాలపు సోషలి జంలో కానీ యిలాంటి పరిస్థితు లుండటం అసంభవం.

కాని ధర్మమనీ, లోక సంగ్రహార్థమనీ చెప్పిన యింత ఆర్గ్యుమెంటూ కూడా, ఊగిసలాడుతున్న అర్జునుడు మారణ కృత్యానికి ఒడిగట్టేట్లు చేయలేకపోయినది. అతనిలోని అను భూతులు ఉద్రేకించినవి. తానుగాని, ఇతరులుగాని ఒకమారు చస్తే అంతాఅంతమైనట్లే మరి అలాంటి వాదనవచ్చినప్పుడు గీత యిచ్చిన సమాధాన మేమిటి? మానవులంతా ఆత్మ మాత్రులే. ఆత్మ దేహాన్ని ధరించియున్నప్పటికీ దేహం నుంచి వేరైనది అదీ అనుభవించదు, ఆలోచించదు, పుట్టేది కాదు, చచ్చేదికాదు. అనుభూతీ, అనుభవమూ దేహము యొక్క తాత్కాలిక గుణములు. వాటిని తరించవచ్చును, జయించవచ్చును. వాటిని జయించినతరువాత మానవుడు తన కర్మలతో తనకు నిమిత్తములేనివాడూ, ఆ కర్మఫలితము లతో కట్టుబడనివాడూ అవుతాడు. అంటే స్థితప్రజ్ఞుడౌతాడు. అతనా స్థితిలో చంపినప్పటికీ అతనిని ఆ పాప ముంటదు. కారణం; చంపినవాడిలోనూ, చచ్చినవాడిలోనూ వుండే ఆత్మసాక్షిభూతము, అనశ్వరము, చావు లేనిది. అంటే యేమీ జరగలేదన్నమాట. అలాంటి వ్యక్తికి బాధగానీ, సంతోషంకానీ, వేడిగానీ, చలిగానీ అంటవు. అతనికి బ్రతికి యుండగానే దేహవిముక్తి గలిగింది. అతడు చనిపోయిన తరువాత పూర్వజన్మ కర్మయొక్క పుణ్యపాపముల ననుభ వించడానికి పునర్జన్మ యెత్తడు. ఇలాంటి వాదనతో భారత

మహాయుద్ధ మారణహోమా న్నంతటినీ ఊహాకల్పితంగానూ మృగతృష్ణగానూ మార్చివేశారు.

ఈ సిద్ధాంతాన్ని పాలకవర్గం మరల అందుకున్నతరువాత శతాబ్దాలతరబడి కష్టజీవులపైన ప్రయోగించారు. వారు తిరుగుబాటుతత్వాన్నీ, దుఃఖభావాన్నీ, క్రోధాన్నీ పొందకుండా చేయడానికి ప్రయత్నించారు. ఈ సిద్ధాంతమే జనకుడి అద్భుత గాథను సృష్టించింది. ఆ జనకమహారాజు ధనవంతుడు; మంచి ఆహారం తినేవాడు. కాని అతడు రుచి, సౌఖ్య మెరుగడు. మంచిగుడ్డలు కట్టుకునేవాడు; కాని ఆ సంతోష మెలాంటిదో అతనికి జ్ఞాతలేదు. అలాగే కష్టజీవియైన బానిసకూడా సంతోషంగా వుండాలి. అతను ఉద్రేకాలనూ, అనుభూతులనూ కంట్రోలుచేసుకోవాలి. అతని దేహాన్ని, విధి నిర్వర్తించే యంత్రంగా మార్చుకోవాలి. అందరూ ఆ స్థితికి వచ్చినప్పుడు దరిద్రమూ, దుఃఖమూ మాయమౌతాయి. మనిషికి సంబంధించినంతవరకూ అవి అర్థరహితములైపోతాయి. దోపిడీ, బానిసత్వమూ, ఉత్పత్తిఫలితంలో భాగమూ, రాజ్యాంగయంత్రమూ, బలప్రయోగమూ—వీటినిగురించిన సమస్యలు సమాజంలో తలయెత్తవు. అవును, ప్రతివ్యక్తీ యీ సిద్ధాంతపు గారడీతో సంతోషం పొందగలుగుతాడుగదా!!

మహాభారత యుద్ధానంతరకాలపు వర్గసమాజసిద్ధాంతకారుడుకూడా యిలాంటి వాదనలవలన మానవసహజమైన జీవితానికీ, అనుభూతులకూ వ్యతిరేకమైన నడవడినీ, సామాజిక సంబంధాలనూ మానవుడికి అంగీకృతాలుగా చేయగలనని విశ్వసించలేదు. అందువల్ల పాలకవర్గాల నాయకత్వా

లన్నిటివలెనే అతడుకూడా కష్టజీవిజనసామాన్యముయొక్క వ్యక్తిత్వమును చంపివేసి, వారిలో పాలకవర్గాలయెడల అంధ విశ్వాసాన్నికలుగ జేయడానికి చివరిసలహా ఇస్తాడు: "సర్వధర్మాలనూ వదలిపెట్టి నన్నే భక్తిశ్రద్ధలతో అనుసరించవలసినది"* ఇకను ప్రపంచములో అరాచకాన్నీ, సంక్షోభాన్నీ తొలగించడానికి తగిన ఆశను ప్రత్యక్షంగా యేమీ చూపలేక, భగవంతు డప్పుడు అవతారమెత్తి వీటిని పరిష్కరిస్తాడు. ఈ విషయం దుర్బలమానవుని కతీతం. ప్లానులేని ప్రపంచానికి ప్లానివ్వడం మానవునిచేతగాదు.

ఇక్కడ ఉపనిషత్తులూ, భగవద్గీతా ప్రతిపాదించే తాత్విక సిద్ధాంతాలను చర్చించడం ప్రస్తుతంగాదు. వేదాంత శాస్త్రంలోని ఆధ్యాత్మిక తత్వసిద్ధాంతాలు, ఆర్యసమాజం వర్గవైరుధ్యాల్లో బద్ధలై, అంతర్యుద్ధంలో చిక్కుకొనియున్న సమయంలో పుట్టినవనిమాత్రమే చెప్పదలుచుకున్నది. దీనితో పాటు, ఒక్కవిషయంలో జాగ్రత్తగా యుండాలి. ఈ సిద్ధాంతాలను పరిశీలించేటప్పుడు, ప్రపంచవృత్తాన్ని తెలుసుకునేందుకు చిత్తశుద్ధిగా ప్రయత్నము చేసేవారనీ, నాటి సామాజిక సంబంధాలకు అనుగుణములై, వాటివల్ల పరిమితములైనటువంటి ఆ భావాలను పాలకవర్గ ప్రయోజనాలకొరకు ఉపయోగించేందుకు ప్రయత్నించేవారనీ విడమర్చి పరిశీలించాలి. రెండవ విషయం సామాజిక భావాలనూ, ధర్మాలనూ, మత సిద్ధాంతాలనూ పాలకవర్గాలవారే క్రోడీకరించారు. కాబట్టి విప్లవవర్గాలూ, దోపిడీచేయబడే ప్రజలూ స్వేచ్ఛను పొందడానికి చేసిన ప్రయత్నాల్లో వేరే తాత్విక సిద్ధాంతాలూ,

---

* సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ॥ గీత॥ 18-66

శాఖలూ, మతాలూ పుట్టినవి. కాబట్టి ప్రతి సిద్ధాంతాన్నీ, సామాజిక శాఖనూ, ఆ కాలంలోనున్న వర్గపోరాట పరిస్థితుల దృష్ట్యా విచక్షణతో పరిశీలించడం నేర్చుకోవాలి. దీనిలోకూడా భారతయుద్ధ సిద్ధాంతకారుడూ, అతని తరువాత సిద్ధాంతకారులూ సామాజిక ప్రాముఖ్యమైన పాత్రలను నిర్వహించారు. వర్గసమాజంయొక్క ఆధ్యాత్మిక తత్వసిద్ధాంతానికి కట్టుబడియే బానిసత్వములోని నికృష్ట పరిస్థితులను సామాజిక సంబంధాలలో మార్పులు లేకుండానే, సౌమ్యమొనర్చడానికి కొంత రాజీమార్గం చూపారు. ఈ విషయంలో బానిస యజమానులయొక్క కరడుగట్టిన అభివృద్ధినిరోధక ధోరణి కన్నా గీతలోని భక్తియోగం కొంత నయం. దీనికి కారణమేమిటి? భారతయుద్ధం తరవాత వచ్చిన పరిస్థితులే ఇందుకు కారణం. కాబట్టి భారతయుద్ధం తరవాత యేమి జరిగిందో చూద్దాం.

# పదిహేనో అధ్యాయం

## బానిస విధానం బలహీన పడ్డది

### (కొత్తశక్తులు—కొత్తదశ)

భారత యుద్ధకాలంలో దూరదృష్టికలిగిన విజ్ఞులూ, మామూలు ప్రజాసామాన్యమూ, యుద్ధంతరువాత యేమవుతుంతా అని పడ్డ ఆదుర్దాలన్నీ నిజమైనవి. రెండు పక్షాలూ ఊహించినదానికి భిన్నంగా జయించినవారూ, ఓడిపోయిన వారూ కూడా తీవ్రంగా నష్టపడ్డారు. మానవ సంహారం భీభత్సమైపోయింది. గెలిచిన పాండవులు గెలుపుతోపాటు దివాలా తీశారు. నాయకులూ, రాజులూ, రాకుమారులూ, ప్రసిద్ధ యోధులూ, సేనాపతులూ, అందరూ యుద్ధంలో మరణించారు. యుద్ధంలో పాల్గొన్న బానిసరాజ్యాలూ, వాటికి తోడుగా వచ్చిన గణసంఘాలూ యుద్ధనష్టంవల్ల బలహీనపడి, భగ్నమైపోయినవి. నాగ, నిషాదాది కొన్ని తెగలకు ఊపిరిపీల్చుకునే అవకాశం వచ్చింది. ఆర్యకులాల పైనా, వారిసైన్యాలపైనా దాడులుచేయడం ప్రారంభించారు.

నాగులు మొదలైన తెగలు ప్రారంభించిన దండయాత్రలు సర్వతోముఖంగా సాగినవి. గంగానదీ ప్రాంతపు

బానిసయజమాని రాజ్యాలపైన తూర్పు పడమరలనుంచీ, దక్షిణంనుంచీ ఒక్కుమ్మడిగా విరుచుకుపడ్డారు. బానిసరాజ్యాంగాలూ, గణసంఘాలూ అంత బలహీన పడినవన్నమాట. ధర్మరాజు విజయచిహ్నంగా అశ్వమేధయాగాన్ని చేయాలనుకుంటే బొక్కసంలో కానీకూడా లేకపోయింది. ఎక్కడో దాచిన నిధులను పెళ్ళగించుకురావలసి వచ్చిందంటే యీ రాజ్యా లెంత నీరసించిపోయాయో అర్థం చేసుకోవచ్చు.* అతని సత్కార్యాలు యుద్ధపీడితులైన ప్రజాసామాన్యాన్ని ఉత్సాహపరచలేదు. ప్రజ లెవరికితోచినట్లు వారు యీ విజయోత్సవాలను అపహాస్యం చేశారు. ఒక చిట్టెలుక సగం బంగారు శరీరంతో యజ్ఞశాలలోకి వచ్చింది. దాని విచిత్ర శరీరాన్ని చూచి ఆశ్చర్యపడ్డారు. దాని కేమి కావాలో, దాని శరీరంలో సగమే బంగారంగా ఉన్న దెందుకో ప్రశ్నించారు. చిట్టెలుక అటూయిటూ మూచూచి తన శరీరం పూర్తిగా బంగారం కాలేదని తెలుసుకున్నది. ఇలా ప్రత్యుత్తర మిచ్చింది: "ఒక బీదవాడు తినడానికి రెండు మెతుకులు పడేశాడు. ఆ మెతుకులు పడ్డచోటు తాకినందు వల్ల నా శరీరంలో ఆ భాగం బంగారమైంది. ఇక్కడ భాగ్యం కొల్లలుగా ప్రవహిస్తున్నది. బ్రాహ్మణ సంతర్పణలూ, సంభావనలూ పుష్కలంగా జరుగుతున్నవి. కాని యిది బానిసయజమానుల విజయోత్సవ ప్రదేశం. కాబట్టి,

---

* దానమల్పం న శక్నోమి దాతుం విత్తం చ నాస్తి మే॥ — 12
స్వయం వినాశ పృథివీం యజ్ఞార్థం ద్విజసత్తమ।
కరమహారయిష్యామి కథం శోకపరాయణః॥
(మహాభారతం అశ్వమేధ పర్వం 3-13)

ఇక్కడ నా మిగిలిన దేహభాగం బంగారమైపోవడంలేదు.''
ఈగాథ గెలిచినవారి "సద్గుణాల''నుగురించి సాధారణప్రజలు చేసిన విమర్శన అనాలి. పాలకవర్గానికి చెందిన వర్గాలు తుగిడీలు తుగిడీలుగా నిష్టదరిద్రులైపోయి, కాసుకోసం ఎవరి దగ్గరనైనా చాకిరీచేయడానికి తయారౌతున్నారు. ఇక కరువు కాటకాలు సంభవించిన ప్రాంతాల్లో గర్వంగాతలెత్తితిరిగిన బ్రాహ్మణులే తమ అరణ్యవాసప్రాంతాల్లో "చండాలు'' లనబడేవారినే మెతుక్కోసం దేబరించారు. ఓడిపోయి బానిసమైన చండాలునికి, గెలిచినఆర్యజాతికి చెందిన విశ్వామిత్ర మహర్షికి ప్రాణాలు నిలుపుకునేందుకైనా కుక్కమాంసం తిన తగదని బోధించేఅదృష్టం పట్టింది. పెద్దరాజ్యాల దర్పం, దౌర్జన్యం తగ్గిపోవడంచేతనూ, పాలకవర్గాలధనాశా,అధికార లోభమూ యుద్ధంమూలకంగా బాగా వెల్లడియైపోవడము వల్లనూ, వారు వల్లించే ధర్మపన్నాలూ, నీతిసూత్రాలూ సద్గుణభూషణాలూఅన్నీ భూమినీ, బానిసలనూ, భోగభాగ్యాలనూ, ఇతరుల కష్టఫలితాన్నీ హరించడంవల్లసంపాదిస్తున్నారనే సత్యాన్ని మరుగుపరచే పట్టుతెరలేనన్నసంగతి అందరికీ తెలిసిపోయింది. దీనితోవీరిసిద్ధాంతాలనుభౌతికవాదంసవాలు చేసింది. కాని, పాండవులు విసిగివేసారియున్నప్రజలకుభౌతిక వాదులు నాయకత్వంవహిస్తారేమోనని భయపడి,వారినినరికివేశారు. (మహాభారతం-శాంతిపర్వం 37) ఇందులో పాండవుల వర్గస్వభావం వెల్లడియౌతున్నది! ఇంతచేసినప్పటికీ విజృంభిస్తూన్న తెగలను అణచలేకపోయారు. యుద్ధంలో నశించక మిగిలిన గణసంఘాలలో అంతర్యుద్ధంతీవ్రతరమైనది.

యాదవగణ సంఘంలోనే తనస్థానంఅస్తుబిస్తుగా ఉన్న దని కృష్ణుడు గోలపెట్టడంచూస్తే, బానిసయజమానిసమాజం సర్వత్రా పతనావస్థకువచ్చిందని తెలుస్తుంది. (మహాభారతం-మౌసలపర్వం.)

అంధకవృష్ణి గణసంఘమువారైన యాదవులుఅత్యధిక భాగం యుద్ధంలోచేరలేదు. వారు శిశుపాలాదుల దాడినుంచి తప్పుకుని పారిపోయారు. సౌరాష్ట్రప్రాంతపుద్వారకలో వలస లేర్పరచుకుని సురక్షితంగావున్నారు. అలాఅంటే యాదవ, గణసంఘ ప్రజాస్వామికం, పతనమై దుష్టప్రభుకూటంగా మారి పోలేదని అర్థంకాదు. యాదవుల్లో అప్పటికే ధనికకుటుంబాల మధ్య స్పర్థలు విపరీతంగా పెరిగిపోయి వున్నవి. కృష్ణుడు వారెన్నుకున్న అధ్యక్షుడు. అతడుకూడా యాదవులను తన అదుపులోనికి తెచ్చుకోలేక పోతున్నానని విస్తుపోయాడు. నాయకత్వం కాపాడుకునేందుకు నారదుడు కృష్ణుని కిచ్చిన సలహా గమనింపదగినది. అతడు కృష్ణుడిలో అడకువా, మట్టు మర్యాద లక్షణాలు తక్కువగా ఉన్నాయనీ సంతర్పణా, సంభావనలూ చేయడంలో పిసినారిగా ఉన్నాడనీ వేలెత్తి చూపుతాడు. గణంలో నాయకత్వంకోసం యీ పద్ధతులను సూచించడంలో వర్గవిభేదంవలన గణసంఘ మెలా విచ్ఛిన్న మైపోతున్నదో స్పష్టపడుతుంది. మౌసలపర్వములో యాదవులు మామూలుగా తిని, తాగి సంతోషంగా కాలంగడిపే సమ యంలో మహాభారత యుద్ధాన్నిగురించీ, అందులో కొందరు పెద్దలుచేసిన కుట్రలనుగురించీ వాదులాడుకుని దెబ్బలాటకు దిగుతారు. దీనికి ధనవంతులమధ్య అదివరకే రాజుతూన్న

కార్పణ్యాలు తోడైనవి. ఇకనేం, గుద్దులాటల్లా అందరు ఒకరి కుత్తుకలొకరు నరుక్కునే స్థితికి వచ్చింది. ఈ అంతఃకలహ సమయంలోనే సముద్రతీరంనుంచి నాగులు ద్వారకపై దాడి చేశారు ఈ దాడిలో కృష్ణుడూ, యితర యాదవనాయకులూ చంపివేయబడ్డారు. ఈ అంతర్యుద్ధమైన తరువాత 'యాదవి' అనేమాటకు అంతర్యుద్ధము అని అర్థమేర్పడ్డదంటే యీ అంతర్యుద్ధం యెంత భీభత్సమైనదో తెలుస్తుంది.

అంధకవృష్ణి యాదవులకు పాండవులు సహాయంగా పోతారు. కాని లాభంలేకపోయింది. గంగాప్రాంత రాజ్యాల యొక్క, కురు, పురు రాజవంశాలయొక్క దర్పమూ, దౌర్జన్యమూ అణగారిపోయినవి. అర్జునుడు నాగులపై యుద్ధం చేయడానికి పోయినప్పుడు "తన ఆయుధాలే తనచేతికి రాక పోయిన"వని వెక్కిపడ్డాడు. వాళ్ళ యుద్ధనైపుణ్యం కూడా నశించింది. యేవో కొన్ని కుటుంబాలు మారణాన్ని తప్పిం చుకొని హస్తినాపురం చేరుకున్నవి.

కాని హస్తినాపురం ప్రవర్థమానమైన రాజకేంద్రంగా లేదు. యుద్ధంతరువాత పాండవులు కొంతకాలం బ్రతికి, చివర కొక కుక్కను వెంటబెట్టుకుని స్వర్గం చేరుకున్నారని భారతం చెప్తున్నది. వారి మనుమడైన పరీక్షిత్తునునాగులు చంపారు. పరీక్షిత్తుపై నాగులు దాడిచేయబోతున్నారని ముందుగానే తెలిసిన బ్రాహ్మణనాయకుడు కశ్యపుణ్ణి, నాగులనాయకుడైన తక్షకుడు బంగారం లంచమిచ్చి కొనివేశాడు. అతనికొడుకు జనమేజయుడు నాగులను కొంతకాలంవరకూఅరికట్టగలిగినట్లు తోస్తున్నది. కొంత, మళ్ళీఊపిరిపీల్చుకునేఅవకాశంకలిగింది.

దీంతో చరిత్రలో మహాభారతయుగం అంతమవుతుంది. తరువాత చరిత్ర కొంతకాలంవరకూ అనామయంగా, అంధకారంగా గడిచింది. మరల గంగానదిలోయలో పెద్దరాజ్యాలు తలెత్తినవి. ఈరాజ్యాలకుత్సాహమిచ్చిన కేంద్రం హస్తినాపురం కాదు; మగధలోని పాటలీపుత్రము.

కాని అప్పటికే బానిసవిధానం క్షీణగతిలో పడ్డది. పల్లెటిప్రాంతపు పాలేరూ, పట్టణంలోని వృత్తిపనివాడూ, అతనివెనువెంటనేవర్తకుడూముందుకొచ్చారు.వీరందరిపైనా నిరంకుశ రాజరికకిరీటము ప్రాబల్యానికొచ్చింది. బానిస యజమాని కుటుంబాలనుంచి సగం విముక్తిపొందిన బానిసలూ, చెదురుచెదురుగా పారిపోయి తాత్కాలిక స్వేచ్ఛను పొందిన బానిసలూ తమతాత్విక సిద్ధాంతాన్ని ప్రచారంలోకి తెస్తున్నారు.వీరికి భూస్వాములుగా ఉంటూనే, వర్తకం చేసే యువకులు సాయపడ్డారు.వీరేబౌద్ధమతానికిదారితీసిన తాత్విక సిద్ధాంతప్రచారకులుకు అనుయాయులూ, శిష్యులూనూ. ఈ విషయాన్నిక్కడ చర్చించబోవడంలేదు. ఒక్కటే చెప్పదలచింది. మహాభారతయుద్ధంమూలంగా బానిసవిధానాన్ని నిలబెట్టేశక్తులు బలహీనపడ్డవి. ఇక నవి పాతపద్ధతిలో చెలాయించే దశ పోయింది. అయితే బానిస విధానం యింకా కొనసాగుతూనేవుంది. బానిసయజమాని రాజ్యాంగాలు పునర్నిర్మాణమై పెరుగుతున్నవి కాని యుద్ధంలో అవి సాగించిన పరస్పరమారణంవల్లనూ, నాగ నిషాదాది తెగల తిరుగుబాటు, ప్రతిఘటనవల్లనూ, బానిసయజమానుల రాజ్యాలు పెరగడంపూర్వమంతసులభంగానూ,వ్యయప్రయాస తక్కువ

గానూ జరగడంలేదు. అంతేకాక నాగులకు పారిపోవడానికీ, తలదాచుకుని జీవితం గడపడానికీ సముద్రతీర ప్రాంతంలో కావలసినంత ఖాళీస్థల మున్నది. అందువల్ల కఠినతమమైన బానిసవిధానంసాగడం దుస్సాధ్యమైంది. చాకిరీవల్లకృశించిన బానిసలకూ, పారిపోయిన బానిసలకూ బదులు భర్తీగాకొత్త బానిసలు దొరకడం కష్టమైపోయింది. బానిసయజమానుల ఆర్థికశక్తిని మించినదండయాత్రలు జరుగుచున్నవి.వీటివ్యయ భారంవలన ప్రజలలో దరిద్రం పెరిగిపోతున్నది. పరిసర ప్రాంతాల నదీలోయలూ, కొండలోయలూ విశాలములూ, సారవంతములూ కావడంతో, బానిసయజమానులచేతఓడింప బడినవారూ, పారిపోయిన బానిసలూ దీర్ఘకాల పోరాటాలు సాగించడానికి తగినశక్తి సంపదలు లభించినవి. చివరికారణం, ముఖ్యకారణంకూడా మరొకటున్నది. ఉత్పత్తి పెరుగుదల, మారక, వ్యాపారమూలంగా కొత్తగా వ్యాపారస్థులవర్గం పుట్టుకొచ్చింది. వీరు ఆర్థికవిధానంలో కొత్తశక్తిగా రూపొం దారు. పారిపోయిన బానిసలు పట్టణాలకు చేరి వృత్తిదారులు కావడంకూడా వీరికి లాభించింది. పట్టణాలలోని వ్యాపార, పారిశ్రామిక పెట్టుబడిదారులూ పల్లెకూ - పట్టణానికీ, బానిస యజమానియైన భూస్వామికీ - వ్యాపారస్తుడికీ మధ్యచేరి బల పడుతూన్న రాజులూ యీ పారిపోయిన బానిసలకు రక్షణ యిచ్చారు.

వ్యవసాయంవిస్తృతంగాపెరిగినదనియీావరకేచెప్పాం. భూమిపై ప్రైవేటు యాజమాన్యము తీవ్రమైన సమస్యయైనది. పైన వివరింపబడిన కొత్తపరిస్థితులలో అది బానిసవిధానపు

పునాదులపై ననిలవడంకష్టమైపోయింది. చేతివృత్తిపరిశ్రమలు కూడా అదేస్థితిలో ఉన్నవి. బానిసతనంయొక్క కఠినత్వం తగ్గిపోయి, పాలేరువిధానం అమల్లోకిరావడానికి అవసరమైన పరిస్థితులు పరిపక్వదశకు వస్తున్నవి. ఈ పరిణామానికి మహాభారతయుద్ధం యెంతగానో దోహదంచేసింది.

ఈ పరిస్థితులవలన దోపిడీవర్గాలకూ, వారి సిద్ధాంతకారులకూ ప్రతినిధులైన స్మృతికర్తలూ, చట్టనిర్మాతలూ బానిసవిధానంపట్ల కొత్తదృక్పథంఅవలంబించవలసివచ్చింది. భారత యుద్ధానంతర కాలపు సిద్ధాంతకారుడు దీని కనుగుణంగానే "స్త్రీ, వైశ్యుడూ, శూద్రబానిసా - వీరు బానిసత్వం చేయడానికి పుట్టినవాళ్లైనప్పటికీ నన్ను నమ్ముకునియున్నట్లైతే వారికి స్వర్గలోకప్రాప్తి కలుగుతుంద"ని సిద్ధాంతీకరించాడు. ఇలా పూర్వము స్వతంత్రుడుగావున్న వైశ్యుడుకూడా భారత యుద్ధకాలానికి బానిసయైపోయినాడు. ప్రాచీన ఆర్యగణ సమాజంలో గర్వంగా తలెత్తి తిరిగిన (విశ) కష్టజీవి ప్రజాసామాన్యమేమైన యీ వైశ్యులనూ, స్త్రీజనసామాన్యమంతటినీకూడా బానిసరాజ్యాంగయంత్రం శూద్ర బానిసల స్థితిలోకి దిగలాగివేసింది. వీరికిభూమిమీద స్వేచ్ఛలేదు. చస్తే స్వర్గ ప్రాప్తికూడాలేదు. పితృస్వామిక బానిసత్వపు ప్రాథమిక దశలలో బ్రాహ్మణులూ క్షత్రియులూ బానిసస్త్రీలను పెండ్లాడవచ్చును. ఉంపుడుకత్తెలుగా వుంచుకోవచ్చును. అలాపుట్టిన సంతానానికి ఆస్తిలో సమానభాగ మున్నదికూడా. కాని బానిసమాత్రం స్వతంత్రుడు కాజాలడు; ఆస్తినికూడబెట్టుకొనరాదు. అయితే ఆర్యగణాలలో ఆస్తి హెచ్చుతగ్గులు పెరిగి,

వైశ్యుడు బానిస శ్రేణిలోకి నెట్టివేయబడ్డప్పుడు; అతడు తిరుగబడి అంతర్యుద్ధానికి సిద్ధమైనాడు. విజేతలైన బానిసయజమానుల నియంతృత్వము, నలిగిపోయిన వైశ్యులనూ, వారికి సహాయంగావున్న నాగ, నిషాదాది తెగలనూ భయంకరమైన హింసానిర్బంధ విధానంద్వారా అణచివేసినది. ఈ కాలంలోనే ఆర్యవైశ్యుడు శూద్రుని అంతస్తులోకి నెట్టివేయబడ్డాడు. స్త్రీ యిదివరకే ఆ స్థితికి వచ్చినది. బానిస స్త్రీతో గలసంబంధాలకు ఇదివరకున్న పితృస్వామికలక్షణంపోయింది. ఆ సంబంధంవల్ల పుట్టిన సంతానానికికూడా పూర్వపు అంతస్తు ఊడిపోయింది. పితృస్వామిక విధానంలోనే పూర్వపు స్వతంత్రుడైన తండ్రియొక్క వర్ణంలో బానిసస్త్రీ యొక్క సంతానానికి స్థానముండేది. ఇప్పుడా సంతానం బానిసమైన తల్లి వర్ణంలోకి నెట్టివేయబడ్డారు. అంటే కొంతకుకొంతైనా స్వతంత్రులయ్యే అవకాశాలుకూడా పోయినవన్నమాట.

ఇంకా లొంగుబాటుకు రానటువంటి జనాభా, కొంత లొంగిన జనాభాసంఖ్య యెక్కువై బానిసయజమానులైన ఆర్యకులాలను నిద్రపట్టనీయడంలేదు. వర్గవిభేదం పదునెక్కిన కొలదీ, ఆర్యవైశ్యులే ఆర్యత్వంలోనుంచి బానిసత్వంలోకి పడిపోయారు. వేగంగా అభివృద్ధియౌతున్న ఉత్పత్తిశక్తులకు అనుగుణంగా కొత్త వుత్పత్తి సంబంధాలేర్పడవలసియున్నవి. మారకం, వ్యాపారం, చేతివృత్తులూ,వ్యాపారస్థులూ, తత్సంబంధమైన సామాజికశక్తులూ అన్నీకలసి మొట్టమొదట బానిసత్వ కాఠిన్యతను తగ్గించాలని ఒత్తిడిచేసినవి. ఈ ఒత్తిడి గీతలో కృష్ణుని పేరుతో ప్రచురణకొచ్చింది. యుద్ధం తరు

వాత నిలిచిన నాటి గణసంఘాలన్నిటిలోనూ పెద్దగణసంఘా నికి కృష్ణుడు ప్రతినిధీ, పలుకుబడికలవాడు. అతడే యీ బాని సత్వ కాఠిన్యాన్ని తగ్గించడంలో రాజీమార్గాన్ని సూచించ దగినవాడు. "స్వర్గంలో ముక్తి" అనే నినాదం ఆయనిదే. భూమిమీాద దోపిడీవర్గాల శాంతి భద్రతలకు భంగంకలుగ కూడదు; స్త్రీలూ, బానిసలూ పనిచేయవచ్చును. కూలీ తీసుకోవచ్చును. స్వర్గంలోమాత్రం వీరు యజమానునితో పాటు సమానహోదా పొందవచ్చునని వాగ్దానం చేశాడు. ఈ రోజుల్లో యిది విచిత్రంగా అవుపడ్డా నిజానికంత విచిత్ర మైనదికాదు. బానిసయజమానులు పాలేరుతనానికీ, భూస్వామ్య విధానానికీ పరుగులెత్తుతూన్న కొత్తశక్తులతో రాజీపడ్డ విధమిది.

బానిసవిధానం దోపిడీయొక్క మొదటిరూపం. పూర్వ ప్రపంచానికిది ప్రత్యేకంగాతగియున్నది దానితరువాత మధ్య యుగంలో పాలేరు విధానం వచ్చినది. ఇటీవలి కాలంలో దిన కూలీ(Wage labour)పద్ధతివచ్చింది. అవి నాగరికతయొక్క మూాడుదశలకూ అనుగుణంగావచ్చిన మూడుచాకిరీ పద్ధతులు. వీటిల్లో పూర్వం బహిరంగంగానూ, యిటీవలి కాలంలో మరుగుగానూ యిమిడివుంటూ వచ్చింది బానిసత్వమే. ఈ పుస్తకంలో సామాజికాభివృద్ధిలోని యీ రెండవదశను పరిశీ లించబోవడంలేదు. ఆదిమకమ్యూనిస్టు గణసంఘం యెలా పుట్టింది? యెలా అభివృద్ధి చెందింది? యెలా భగ్నమైంది? బానిసత్వమూ, ఆ బానిసత్వాన్ని దండవిధానంతోనూ, ప్రైవేటుఆస్తికీ, బానిసకూ యజమానులైనవారి నియంతృత్వ

విధానంతోనూ పోషించిన రాజ్యాంగయంత్రమూ యెలా వచ్చినవి? ఈ విషయాలను పరిశీలించడమే యీ పుస్తకం ఉద్దేశ్యం. నిప్పుచేయడం యెలాగో తెలియని ఆటవిక మానవుడు సంఖ్యలో పెరిగాడు; భూఖండాలనాక్రమించాడు; పట్టణాలను నిర్మించాడు; రాజ్యాలను స్థాపించాడు. ప్రకృతిని అదుపులోకి తెచ్చుకుని ఉపయోగపెట్టుకోడానికి బ్రహ్మాండమైన ఉత్పత్తిశక్తులనుఅభివృద్ధిచేశాడు. ఆటవికదశనుంచిఅనాగరిక దశకూ, అనాగరిక దశనుంచి నాగరికదశకూ అభ్యుదయం పొందాడు. యుద్ధానికీ, శాంతికాలానికీ తగిన ఆయుధాలను నిర్మించాడు. కళనూ, సారస్వతాన్నీ సంతరించాడు. ప్రకృతి రహస్యాలలోకీ, పరిణామగతి నియమాలలోకీ తరచిచూచి లోతులుతీశాడు. అసంఖ్యాకమైనభూతపిశాచాలూ, దేవతలూ వున్నారనే నమ్మకనుంచి (ఏకేశ్వరత్వం) దేవుడొకడే అనే స్థితికి అధిగమించాడు. వస్తు సంఘటనలను విడివిడిగాచూచి ఆ అనుభవంనుంచి సాధారణీకరణం(Generalise) చేయడం నేర్చాడు. వ్యక్తికీ-విశ్వానికీ, కర్తృత్వభావనకూ-భౌతిక ప్రపంచానికీ సంబంధమేమో పరిశీలించాడు.

కాని యీ ముందడుగులకుతోడు, వెనకడుగులుకూడా అనేకం వేయవలసివచ్చింది. అనాగరిక యుగంనాటి ఆదిమ కమ్యూనిస్టు గణంలో వర్గవైరుధ్యంలేదు, బానిసత్వంలేదు, దురాశలేదు, ప్రైవేటు ఆస్తిలేదు. బంధువూ, బంధువూ పోరాడుకోడంలేదు. అలాంటి గణసమాజం బానిసత్వానికీ, వర్గ కలహానికీ, సహోదరుడు సహోదరుడిపై చేసే దౌర్జన్యానికీ గురియైనది.

"ఒకవర్గం మరొకవర్గాన్ని దోచుకోడం నాగరికతకు పునాదియైనది. అందువలన నాగరికతయొక్క అభివృద్ధిఅంతా వైరుధ్య ఘర్షణద్వారా జరిగింది. ఉత్పత్తిలో వేసిన ప్రతి ముందడుగూ, అధికసంఖ్యాకులైన పీడితులకు వెనుకడుగైనది. కొందరికి లాభదాయకమైనది, యితరులందరికీ తప్పకుండా నష్టదాయకమైనది. ఒక వర్గానికి లభించిన ప్రతి స్వేచ్ఛా తప్పనిసరిగా మరో వర్గానికి కొత్త నిర్బంధమైనది......" అనాగరికులలో హక్కులకూ, విధులకూ ఆట్టే తేడా వుండేది కాదని మనం చూచాం. కాని నాగరికతలో యీభేదమూ, వైరుధ్యమూ యెంత మందమతికైనా అవుపడుతుంది. హక్కు లన్నీ ఒకవర్గానికీ, విధులన్నీ మరొకవర్గానికీ సంక్రమించినవి.

కాని యీ పద్ధతి కొనసాగకూడదు. పాలకవర్గానికి కేదిశ్రేయస్సో, సమాజానికంతటికి అదే శ్రేయస్సు కావాలి. పాలకవర్గం సమాజమంతటితో సమానమైన స్థితికి రావాలి. అందువలన నాగరికత అభివృద్ధియైనకొలదీ అది సృష్టించిన చెడుగులను ప్రేమపేరిట, దాతృత్వంపేరిట కప్పిపుచ్చడానికీ, సౌమ్యంగా అవుపడేటట్లు చేయడానికి ప్రయత్నించడం నాగరికతకు తప్పనిసరియైనప్పుడు—అంటే క్లుప్తంలో; పూర్వసమాజ రూపాల్లో లేనటువంటీ, నాగరికతయొక్క ప్రాథమికదశల్లో గూడా లేనటువంటీ కుత్సిత సాంప్రదాయాన్ని ప్రవేశపెట్టిందన్నమాట. ఈ సాంప్రదాయం చివరకు, దోపిడీచేయబడే వర్గాలశ్రేయస్సుకొరకే దోపిడీవర్గాలు దోపిడీచేస్తున్నారనీ, దోపిడీచేయబడేవర్గా లిది గ్రహించకపోతే పైగా తిరుగుబాటును ప్రదర్శించినట్లైతే మేలుచేసినవారియెడల అంటే

దోపిడిదారుల యెడల అంతకన్నా కృతఘ్నత మరొకటి వుండబోదు!-అన్నట్లు తేలింది.

కాని సమాజంలో వర్గవిభాగంగానీ, రాజ్యాంగ యంత్రంగానీ అనాదినుంచీ వున్నవికావు.

"ఇది (వర్గవిభాగము) లేని సమాజాలు, రాజ్యాంగ యంత్రమూ, రాజ్యాంగ యంత్రాధికారమూ అనేవియేమిటో యెరుగని సమాజాలుండేవి. ఆర్థిక పరిణామాభివృద్ధియొక్క ఒకానొక దశలో సమాజం తప్పనిసరిగా వర్గాలుగా చీలుతుంది. ఈ చీలికవలన రాజ్యాంగయంత్రంయొక్క అవసరం యేర్పడుతుంది. మనమిప్పుడు, యీ వర్గాలయొక్క అవసరం తీరిపోయి, ఉత్పత్తికి ప్రత్యక్ష ప్రతిబంధకంగా తయారయ్యే మరో అభివృద్ధిదశకు శీఘ్రగతిలో చేరుకుంటున్నాం. వర్గాలు ఒకప్పుడు తప్పనిసరియై పుట్టినట్లే, తప్పనిసరిగా నశించిపోతాయి. దానితోపాటు రాజ్యాంగయంత్రముకూడా నశించిపోతుంది. స్వేచ్ఛా సమానత్వాల పునాదిపైన సంఘటితులైన ఉత్పత్తిదారుల ద్వారా, ఉత్పత్తిని నూతనంగా నిర్మాణంచేసే సమాజం రాజ్యాంగ యంత్రాన్నంతటినీ దాని స్వస్థానంలో, అంటే పురావస్తు ప్రదర్శనశాలలో చర్ఖాకూ కంచుగొడ్డలికీ ప్రక్కన చేర్చుతుంది." (ఏంగెల్స్)

కాని మానవజాతియొక్క గతానికిచెందిన యీ పురావస్తుప్రదర్శనశాలను నిర్మించడం ప్రపంచంలోని అత్యధిక సంఖ్యాక దేశాల్లో వర్గరహిత సమాజాన్నీ, కమ్యూనిజాన్నీ స్థాపించినప్పుడే జరుగుతుంది. ప్రపంచ మిప్పటికే ఆ యుగంలో ప్రవేశించింది.



★

# అనుబంధం

## భారతంలో ఉదహరింపబడిన మాతృస్వామిక గణాలు.

(ఈ గణాలనుంచే ప్రపంచజనాభా అభివృద్ధియైనది)

| గణమాత | గణము |
|---|---|
| 1. అదితి | ఆదిత్యులు |
| 2. దితి | దైత్యులు |
| 3. దను | దానవులు |
| 4. కల | కాలకేయులు |
| 5. వినత | వైనతేయులు |
| 6. కద్రు | కాద్రవేయులు |
| 7. ముని | మౌనేయులు |
| 8. ప్రధ | ప్రాధేయులు |
| 9. కపిల | కాపిలులు |
| 10. కృత్తిక | కార్తికేయులు |
| 11. సింహిక | సైంహికేయులు |
| 12. పులోమ | పౌలోములు |
| 13. వసు | వాసువులు |
| 14. విశ్వ | విశ్వ్యులు |
| 15. మరుత్వతి | మరుత్వంతులు |
| 16. భను | భానవేయులు |
| 17. ముహుర్త | ముహూర్తులు |
| 18. సాధ్య | సాధ్యులు |

ఈ గణాలే తరువాత ప్రసిద్ధపురుషులను కన్నవి; గణయుద్ధాలు సాగించినవి అని మహాభారతం చెప్తున్నది.

# పాఠకుల సందేహాలు : గ్రంథకర్త సమాధానాలు

**1949** లో ఈ గ్రంథం ప్రథమముద్రణ వెలువడింది. ఈ గ్రంథంలో నేను ఉపపాదించిన విషయాలపైన అనేక ప్రశ్నలను పాఠకులు లేవదీశారు. విషయాలను బాగా లోతుగా తరచి, చర్చించితేనేగాని, ఆ ప్రశ్నలన్నింటికి సమాధానా లివ్వటం సాధ్యంకాదు. అలా చర్చించటానికి ఇక్కడ అవకాశం కూడా లేదు. అయితే వాటిలో కొన్ని ప్రశ్నలకు మాత్రం సూచనప్రాయంగా ఇక్కడ సమాధానమివ్వటం జరుగుతుంది.

వైదికసాహిత్యం( వేదిక్ లిటరేచర్ )లో మనకు కనిపించే మనుష్యులు ఆర్యజాతి అని పిలువబడుతున్న ఒక ప్రత్యేకజాతికి చెందినవారేనా? వారు ఇతరప్రజలపై దండెత్తుతుండేవారా? అయితే ఆ ఇతర ప్రజ లెవ్వరు?

వైదికసాహిత్యంలో మనకు అగుపడే ప్రజలు నేటిమన చరిత్రగ్రంథాలలో 'ఆర్యులు' అని సాధారణంగా పిలువబడు తున్నారు. వైదికసాహిత్యసృష్టికర్తలుకూడా వారే. ఏంగెల్స్ వారినిగురించివ్రాస్తూ, హైందవ యూరపియన్లనీ (ఇండో -

యూరపియన్స్), ఆర్యులనికూడా ఉదహరించారు. అయినా పేర్లనుగురించి అంత మొండిగా వాదించవలసినఅవసరంలేదు. వారి సాంఘికజీవిత నిర్మాణంగురించీ, వారిసామాజికాభివృద్ధి యొక్క వివిధదశలనుగురించీ వైదికాది గ్రంథాలలో మనకు ఎలాంటి సమాచారం లభిస్తోంది అన్న విషయమే మనకు అత్యంత ప్రధానం.

ఆ గ్రంథాలలో పేర్కొనబడిన యుద్ధాలు రెండురకాలుగా కనిపిస్తున్నాయి. ఒకే కోవ(స్టాక్)కు చెందిన గణాల మధ్యా, తెగలమధ్యా జరిగినయుద్ధాలు కొన్ని; హైందవఆర్య తెగలకూ, మరొకకోవకుచెందిన నిషధనాగ తెగలకూ మధ్య జరిగినయుద్ధాలు మరికొన్ని, కొన్నిసందర్భాలలో యుద్ధంలో పాల్గొన్న ఉభయపక్షాలూ, ఒకేగణానికి చెందినవారనీ, ఒకరి భాషను మరొకరు అర్థంచేసుకోగల్గినవారనీ,అంతేకాక, ఒకే రకమైన యజ్ఞయాగాదులు చేసేవారని మనకు కనిపిస్తోంది. ఎలాంటిసంబంధంలేని తెగలమధ్యగూడా యుద్ధాలు జరిగిన మాట నిజం.

అందువల్ల అన్నియుద్ధాలను "దండయాత్రలు"గా పరిగణించటానికి వీలులేదు. "బయటనుంచివచ్చినఆర్యులు" భారతదేశమంతటా అప్పటివరకు నివసిస్తున్న ద్రావిడులపై దండెత్తి, ఓడించి, దక్షిణాదికి తరిమికొట్టారని యూరపియన్ చరిత్రకారులు అంటారు.

ఆవిషయం అంత తేలికగా తేల్చతగినది కాదని నేననుకొంటున్నాను. 'విదేశఆర్యులు' రాకపూర్వం, భారతదేశాన్నంతటినీ ద్రావిడులు ఆక్రమించుకొనిఉన్నారాఅన్న

సమస్య మన కింకా తేలనేలేదు. మొహంజదారో, హారప్పా నాగరికతలు ద్రావిడులకు చెందినవేనా? ఆర్యులు దండెత్తి వచ్చి ఆ నాగరికతలను నాశనంచేశారని చెప్పగలమా? మొదలైన ప్రశ్నలకు నేటికీ సరియైన సమాధానం దొరకటంలేదు.

బ్రిటిషు చరిత్రకారులు అనేకవిషయాలలో మనలను పెడమార్గాలు పట్టించారు. అందువల్ల ఈసందర్భంలో మనం జాగ్రత్తగా పరిశోధనలు సాగించి, ఒక నిర్ణయానికి రావలసి ఉంటుంది.

ఉదాహరణకు మరొక విషయంకూడా చూడండి: ద్రావిడులకు పూర్వం, 'ముండా–మన్–ఖ్మేర్' ప్రజలు నివసిస్తుండేవారనీ, తర్వాత ద్రావిడులు వచ్చి వారిని తూర్పు దిక్కుకు తరిమారనీ చెప్పబడుతోంది.

నామట్టుకు నాకు, యీ విషయాలపై యిప్పటివరకూ ఎలాంటి నిర్దిష్టాభిప్రాయాలూ ఏర్పడ లేదు. అయితే ప్రస్తుతానికి నాకు కావలసినదల్లా ఒకే ఒక విషయం: వారు ఆర్యులే కావచ్చు; ద్రావిడులే కావచ్చు. లేదా 'ముండా–మన్–ఖ్మేరులే' కావచ్చు. వారెవరయినప్పటికీ, వారి సాంఘిక నిర్మాణం ఎలా ప్రారంభమైంది? ఎలా అభివృద్ధిచెందింది? అన్న విషయాలనే ప్రధానంగా తీసుకొని, శ్రద్ధగా పరిశీలించాలి. అయితే వారి సాంఘిక జీవితపరివర్తనలో యుద్ధాలూ, దండయాత్రలూ తప్పనిసరిగా తమతమ పాత్రను నిర్వహించి ఉంటాయి.

ఆర్యులతో ఘర్షణపడిననాటికి ద్రావిడుల నాగరికత, ఆర్యుల నాగరికతకన్నా ఉన్నతంగా ఉందా? లేక అధమంగా

ఉన్నదా? ఆదిమ కమ్యూనిజంనుంచి బానిస సమాజదశకు ద్రావిడులు చేరుకొన్నారా? లేదా? అని పాఠకులు ప్రశ్నిస్తున్నారు.

ద్రావిడకోవకు (నేను సాధారణంగా ఉపయోగిస్తున్న ఆపద ప్రయోగార్థంలో) చెందిన ప్రజలు బానిససమాజందశకు చేరుకొన్నారని చెప్పటానికి కొంతవరకు ఆధారాలు లేకపోలేదు. అయితే ఈవిషయంలో నిర్దిష్టమైన అభిప్రాయా లేర్పరచుకోటానికి, ప్రస్తుతం అందుబాటులోవున్న ద్రావిడసాహిత్యంలో మాత్రం తగినంత సమాచారం లభించటంలేదు.

సామాజికాభివృద్ధిలోని వివిధదశలు, భారతచరిత్రలో వాటి స్థానం మొదలైన విషయాలపై పాఠకులు మరికొన్ని ప్రశ్నలువేశారు.

భారతచరిత్రలోవివిధదశలవివరణపై బూర్జువాచరిత్ర కారులు చేసిన విమర్శలను నేనిక్కడ ప్రస్తావించటం లేదు. ఎందుకంటే మార్క్సిజం కనిపెట్టిన చారిత్రక సూత్రాలను ఆ బూర్జువా చరిత్రకారులు అసలు ఆమోదించరు ; కనుక మార్క్సిస్టు పాఠకుల ప్రశ్నలనే ఇక్కడ ప్రస్తావిస్తాను.

ఆదిమ కమ్యూనిజం ఎప్పుడు అంతమైంది? బానిస సమాజం ఎప్పటినుంచి ప్రారంభమైంది?ఫలానాసంవత్సరంలో నని నిక్కచ్చిగా సమాధానం చెప్పటం సాధ్యంకాకపోయినా, కనీసం మతైకసాహిత్యంలో లభించే ఆధారాలనుబట్టి, ఘటనలనుబట్టి లీలామాత్రంగానైనా ఉదహరించగలమా?

ఆటవికదశ, అనాగరికదశ, నాగరికదశ – ఈ మూడు దశలూ వైదికసాహిత్యంలో మనకు కనిపిస్తాయి. బానిస

(పితృస్వామికం, తదితరం) సమాజావతరణ, వర్గాల పుట్టుక, రాజ్యాంగయంత్రపు బీజాంకురం ఆ వైదికసాహిత్యంలో అగుపిస్తాయి.

అది వైదికవ్యవస్థీకరణ(ఎర్లీ వేదిక్ ఇన్‌స్టిట్యూట్స్)తో ఆదిమకమ్యూనిజందశ అంతమైందని చెప్పుకోవచ్చు. అటు తర్వాతవచ్చిన స్మృతులతోను, ఐతిహాసిక సాహిత్యము తోనూ బానిససమాజదశ, నాగరికదశ ప్రారంభమైనట్లు భావించుకోవచ్చు.

మహాభారతయుద్ధానంతర పరిస్థితులనుగురించి నేను వ్రాసిన విషయాలపైన పాఠకులు కొన్ని విమర్శలు చేశారు.

గ్రంథంలోని ఆ భాగానికి సంబంధించినంత వరకూ కొంత సవరణో లేదా మరికొంత వివరణో అవసరమని నేను భావిస్తున్నాను.

మహాభారత యుద్ధానంతరం 'బానిసవ్యవస్థ బలహీన పడింది' అని ఒకచోట వ్రాశాను. అదే సమయంలో, అదే పేరా చివర 'బానిసయజమానుల రాజ్యాలు పునర్వ్యవస్థీక రించబడి అభివృద్ధిచెందటం, బానిసవ్యవస్థ కొనసాగటం నిర్వి వాదాంశం' అని వ్రాశాను. (తెలుగు ప్రతి ప్రథమ ముద్రణ- పేజీ 280)

మహాభారతయుద్ధంతో అప్పటివరకు ఉన్న బంధుత్వ సంబంధాలు అంతరించి, ఖచ్చితమైన వర్గరాజ్యాంగయంత్రం అవతరించింది. వివిధ తెగల అధిపతులు, సైనిక ప్రజా స్వామ్యాలు, బానిసరాజ్యాలు ఆ వర్గరాజ్యాంగయంత్రంలో అంతర్భాగంగా మారిపోయాయి.

ఆ యుద్ధంవల్ల సంప్రాప్తించిన విధ్వంసన ఇంతా అంతా అని చెప్పటానికి అలవికాదు. ఆ విధ్వంసన కారణంగానే బానిస నాగరికతాభివృద్ధి కొంతకాలందాకా కుంటుపడిందికూడా. అయితే తర్వాత ఆ నాగరికత తిరిగి పుంజుకొని సామ్రాజ్యాలను నిర్మించుకోగల్గింది. ఆ తర్వాత మనకు చరిత్రలో కనిపించే ఉజ్జయిని, కాశీ, కోసల, మగధ సామ్రాజ్యాలు ఆ బాపతుకు చెందినవే.

మహాభారత యుద్ధానంతరం భూస్వామికయుగం ప్రారంభమైనదనే అభిప్రాయం నా రచనలో స్ఫురించింది. దానిని సరిదిద్దుకోవాలి.

భారతదేశంలో బానిససమాజంయొక్క ప్రత్యేక లక్షణాలేమిటి? ఉత్పత్తివిధానంలో ఆ సమాజం నిర్వహించిన పాత్ర ఎలాంటిది?

భారతదేశంలో బానిససమాజం అసలు ఎప్పుడూ అమలులో లేదని బహుశా కొంతమంది వాదించవచ్చు. అయితే కొన్నిరకాల బానిసలు ఉండేవారనీ, వారి విముక్తికి కొన్ని నియమాలు విధించారనీ, ఆస్తివారసత్వంలో వారి స్థానం మున్నగు విషయాలపై మనకు కావలసినంత ఆధారం దొరుకుతోంది. అందువల్ల అసలు బానిససమాజం తలెత్తలేదనే వాదనలో పసలేదు.

అంతకుముందే వివరించినట్లు భారతదేశంలోని బానిస విధానం రోమన్, గ్రీక్ తరహాకుచెందిన 'శ్రమబానిసత్వం' మాత్రంకాదు; అది 'గృహబానిసత్వం' (డొమిస్టిక్ స్లేవరీ). అంటే బానిస యజమానులు అనేకమంది బానిసలతో పెద్ద

పెద్దక్షేత్రాలను సాగుచేయించే ఉత్పత్తి విధానం ఆనాడు భారతదేశంలో అమలులోలేదనిమాత్రమేఅర్థంచేసుకోవాలి. అయితే గృహంలోని యజమానికిమాత్రమే ఆనాటి బానిస ఏదో పాదసేవ (పర్సనల్ సర్వీస్) చేశాడనిఅనుకోటంకూడా పొరపాటే అవుతుంది.కుటీరపరిశ్రమల ఉత్పత్తిలో బానిసలను నియమించినట్లూ, పెద్దపెద్దక్షేత్రాలలో వారితోపనిచేయించి నట్లూ, ఈ బానిసలతోపాటు 'స్వేచ్ఛగలిగిన' రైతులు, కూలీలు పనిచేశారనీ మనకు కావలసినన్ని ఆధారాలు కని పిస్తున్నాయి. అంతేకాకుండా యజమానులు తమబానిసలను ఇతరులపనికి పంపించి, డబ్బు ఆర్జించిన సాదృశ్యాలుకూడా ఉన్నాయి.

పట్టణ పరిసరాలలో సాధారణంగా పెద్ద పెద్ద ఎస్టేట్లు ఉండేవి. బానిసలను, కూలీలను నియమించి, ఆ ఎస్టేట్లను సాగుచేస్తుండేవారు. ఆఎస్టేట్లన్నీ రాజుల సొంత ఆస్తులుగా పరిగణింపబడేవి. కొంతమంది భూస్వాములు ఉన్నట్లూ, పవిత్రమైన బ్రాహ్మణభూస్వాములుకూడా ఉన్నట్లూ వైదిక సాహిత్యంలోఉదహరించబడింది. కాని,గ్రామీణప్రాంతంలో మాత్రం వ్యావసాయికఉత్పత్తి ప్రధానంగా బానిసలద్వారా జరిగేదికాదు. గృహపతి, లేక కులపతి ఆధ్వర్యాన స్వతంత్ర మైనకుటుంబంలోని సభ్యులందరూ సమిష్టిగాసాగుచేసేవారు. ఆపద్ధతే గ్రామీణ ప్రాంతాలలో ప్రధానంగా అనుసరించ బడేది. చేతిపరిశ్రమలకు నిలయమైన పట్టణాలలో హెచ్చు గానూ, గ్రామాలలో కొంతవరకూబానిసలుకన్పిస్తుండేవారు.

అవిభక్త జనసంపదలతోపాటు, 'గృహదాస్యం' కూడా చాలాకాలం అమలులో ఉంది. ఇదే భారతదేశంలోని బానిస విధానంయొక్క విశిష్టలక్షణం.

జనాభా పెరుగుదలతోనూ, ఉత్పత్తి విధానాభివృద్ధితోనూ అవిభక్త జనపదం చీలిపోవటం, గ్రామీణజనపదంగా రూపొందటంజరిగింది. బానిసమూతాలు గ్రామీణజనపదంలో హీనజాతులుగా మారిపోయాయి. అవిభక్తజనపదంలోని సభ్యులు తమ తమ అభిరుచులనుబట్టి, నేర్పరితనాన్నిబట్టి, అవసరాలదృష్ట్యా వివిధవృత్తులను స్వీకరించారు. అలా వారు వివిధవృత్తులను స్వీకరించటంవలన వివిధకులాలుతలెత్తాయి. ఈపరిణామక్రమంలోనే వర్గాలు అంతరించి కులాలు అవతరించాయి. గ్రామీణ జనపదంయొక్క నూతన నిర్మాణ వ్యవస్థే కులాలు.

ఈ పరిణామాభివృద్ధి సర్వే సర్వత్రా ఒకేస్థాయిలో సాగలేదు. స్థానికభూమి స్థితినిబట్టి ఆ అభివృద్ధి జరిగింది. భారతదేశంలోని వాతావరణ భౌగోళిక పరిస్థితులవల్ల సస్యశ్యామలమైన భూములు ఏర్పడ్డాయి. మన గ్రామీణ జనపద రూపురేఖలను నిర్ణయించింది ఆ సస్యశ్యామలమైన భూములే. భూమిపై సమిష్టిహక్కు, కులవ్యవస్థలుచాలాకాలం గ్రామీణ జనపదజీవితాన్ని వెంటాడాయి.

కులవ్యవస్థ ఆధారభూతంగా ఏర్పడిన గ్రామీణజనపదం భారత భూస్వామిక విధానానికి పునాదిఅయింది.

ఈపరిణామక్రమాన్ని మనంజాగ్రత్తగాపరిశీలించాలి. భారతదేశంలోని ఆ యా ప్రాంతాల ప్రత్యేక పరిస్థితులను

దృష్టిలోవుంచుకొని మరీపరిశోధన సాగించాలి.కుల, గ్రామీణ జనపదాలు ప్రధానంగా ఒకేరకమైన ఉత్పత్తి సంబంధాలను కలిగివున్నా, వాటి అభివృద్ధిలోమాత్రం విభిన్నలక్షణాలు ద్యోతకమవుతున్నాయి.

బానిసయజమానుల రాజ్యాలు ఎంతకాలం ఉన్నాయని మరొక ప్రశ్న.

బౌద్ధమతంపుట్టి, అభివృద్ధి చెందేవరకూ, బానిసయజమానుల రాజ్యాలు పరిఢవిల్లుతూవచ్చాయని నేను అభిప్రాయపడుతున్నాను. బహుశా నందసామ్రాజ్యమే (క్రీ. పూ. 413) ఆ బానిస యజమానుల రాజ్యాలలో కడపటిది కావచ్చు.

నందరాజులకు, అశోక సామ్రాజ్యానికి మధ్యకాలంలో (క్రీ. పూ. 273) భారతప్రజల సాంఘిక, ఆర్థికవ్యవస్థలో పెద్ద మార్పులు సంభవించాయి. బానిసవిధానం, గ్రామీణ జనపదంకూడా తీవ్రమైన మార్పులకు లోనవుతూవచ్చాయి. భారత భూస్వామ్యం ప్రజలలో వేరూని, విస్తరించటానికి ప్రయత్నించే దశ అది.

అయితే ఇక్కడ ఒక్క విషయం గమనించాలి: ఒక వ్యవస్థ అంతరించి, కొత్తది అవతరించేటప్పుడు ఆ రెంటిమధ్య స్పష్టమైన సరిహద్దుగీయటం సాధ్యంకాదు. ఇండియాలో బానిసవిధానం, భూస్వామిక విధానం – రెండూకూడా ఒకదాని సరసను మరొకటి కొంతకాలంపాటు మనుగడను సాగించుకొన్నాయి. అందువల్లనే భూస్వామికదాస్యంలోనే బానిసవిధానం లక్షణాలు మనకు గోచరిస్తాయి.

ఏమైనప్పటికీ క్రీ. పూ. 5వ శతాబ్దంలో బౌద్ధ, జైన మతాలు రెండూకూడా బానిసవిధానానికి వ్యతిరేకంగా సైద్ధాంతిక తిరుగుబాటు సాగించాయనటం నిర్వివాదాంశంగా కనిపిస్తోంది.

పై విషయాన్నిగూర్చి దీర్ఘంగా చర్చించటానికి ఈ ఉపోద్ఘాతంలో సాధ్యంకాదు. అయినప్పటికీ పాఠకుల పరిశీలనకు ఉపయుక్తమైన ఒక ముఖ్యవిషయం ఇక్కడ ప్రస్తావించక తప్పదు. బౌద్ధ,జైనమతదృక్పథాలు ఒకేకోవకు చెందినట్టివి.

జైనమతంప్రకారం, 24 గురు తీర్థాలంకారుల తర్వాత మహావీరజైనుడు వచ్చాడు. 'సద్ధర్మాలంకారం' లోని విషయాన్నిబట్టి ఆరుగురుతీర్థాలంకారులు కనిపిస్తున్నారు. వారిలో నలుగురు పరారైనబానిసలు. మిగతా యిద్దరూ బాగా చితికి పోయినరైతులు. అంటేదాదాపు బానిసబ్రతుకు వెళ్ళబుచ్చినవారు. వారిలో ఒకరిపేరు 'పూర్ణకశ్యప'. అతను జన్మించటం అతని తల్లియొక్క యజమానికుటుంబములోని బానిసలసంఖ్య వంద పూర్తయినందువల్ల అతని కా పేరు వచ్చిందంటారు. మఖలిఘోషల్, నిగంత్ నత్పుట్టు, అజిత్ కేష్కంచిల్,కకుథ కాత్యాయన మున్నగువారినందరినీ భౌతికవాదులుగానో, లేక తత్తుల్యులుగానో పరిగణించవచ్చు.

బుద్ధుడు ( జననం: క్రీ. పూ. 583 మరణం: క్రీ. పూ. 478) తెగల అధిపతుల (బైబిల్ అరిస్టాక్రసీస్) వంశంలోజన్మించాడు. తెగలప్రజాస్వామ్యంజీర్ణించుకున్నాడు

ఈ సందర్భంలో 'లుడ్విగ్ ఫ్యూయర్‌బాచ్' అన్న గ్రంథంలో ఏంగిల్స్ వ్యాఖ్యానం గమనార్హం.

"అనేక మతాలు వచ్చాయి; పోయాయి. అయితే బౌద్ధమతం, క్రైస్తవమతం, ఇస్లాంమతం-ఈ మూడు మతాలు మాత్రమే తమతోపాటు మహత్తరమైన చారిత్రకమార్పులు తీసుకొచ్చాయి. ఈ మూడు ప్రపంచ మతాలు-ముఖ్యంగా క్రైస్తవ, ఇస్లాం మతాలు-దాదాపు కృతకంగా అవతరించాయి. అందువల్ల సాధారణమైన చారిత్రక ఉద్యమాలపై మతప్రభావం పడటం మనం చూస్తాం.

బౌద్ధమతం తనతోపాటు తీసుకొచ్చిన 'మహత్తరమైన చారిత్రక మార్పు' ఏమిటి? చారిత్రక ఉద్యమంపై ఆ మతప్రభావం ఏమిటి? అజాతశత్రువు మొదలుకొని అశోకుని వరకు సామ్రాజ్యవంశాల పరిపాలనకాలంలో ప్రతిబింబించిన బానిసవ్యవస్థను బౌద్ధమతం వచ్చి బలహీనపర్చింది. ఇదే భారతదేశంలో బౌద్ధమతం తీసుకొచ్చిన చారిత్రక మార్పు.

సామ్రాజ్యవంశాలలో కల్లా నందవంశమే అత్యంత బలవత్తరమైంది. నందరాజుల కాలంలో పెద్దపెద్ద సైన్యాలను తయారుచేశారు. ప్రజలపై విపరీతంగా పన్నులు విధించారు. పాలకవర్గాలలో దుర్నీతి, భోగలాలసత్వం ప్రబలంగా పెరిగిపోయింది. వారు సాగించిన దండయాత్రల ఫలితంగా వేలాదిప్రజలు బానిసత్వంలో పడిపోయారు; తెగల ప్రజాతంత్రం (ట్రైబల్ డెమాక్రసీస్) నాశనం చేయబడింది. దేశంలో పెద్దపెద్ద భూభాగాలలో అప్పటివరకువున్న గణసమాజ అవశేషాలుసైతం తుడిచిపెట్టబడ్డాయి. గ్రామాలలోని స్వేచ్ఛారైతులు, చితికిపోయిన తెగలవారు, పీడించుకొని తినబడుతున్న పట్టణాలలోని ప్రజలు, వ్యాపారస్థులు

ఏదో ఒకమార్పురావాలని అర్రులుజాచి చూస్తున్నారు. సైద్ధాంతికంగా ఆ మార్పును బౌద్ధమతం ఎలుగెత్తిచాటింది. రాజకీయంగా సామ్రాజ్యాలను మౌర్యులద్వారా కూలదోయించింది. కాని, పాతవాటిస్థానే ప్రజలపై భారం తొలగిస్తూ, కొన్ని మార్పులతో కొత్తసామ్రాజ్యాలను స్థాపించింది. మన చరిత్రలో నిఈ మార్పును మనం శ్రద్ధగా పరిశీలించాలి. ఈ విషయంలో కౌటిల్యుని 'అర్థశాస్త్రం' మనకు బాగా ఉపకరిస్తుంది. దానితోపాటు బుద్ధవాఙ్మయంలోని 'జాతకాలు' 'ధర్మసూత్రాలు', అశోకకాలంనాటి స్తూపాలుకూడా ఉపయోగపడగలవు.

బానిసవ్యవస్థ క్షీణించి, దానిస్థానే క్రమంగా భూస్వామికవ్యవస్థ అమలులోకి రావటానికి దాదాపు మూడువందల సంవత్సరాలకుపైగా పట్టింది. భూస్వామిక వ్యవస్థయొక్క ఆర్థికపునాది గ్రామాలలో ఉండటంవల్ల, అది గొప్ప మార్పులు తీసుకురాగలిగింది.

ఆదిమకమ్యూనిస్టు సమాజం భూమిని సమిష్టిగా సాగు చేసుకొని, పశువులను పెంచుకొని, సంపదను సమిష్టిగా అనుభవించింది.

ఉత్పత్తిశక్తులు అభివృద్ధిచెందటంతోనూ, శ్రమవిభజన ఏర్పడటంతోనూ, వర్గాలు తలెత్తటంతోనూ బానిస వ్యవస్థ అవతరించింది. గణతంత్ర రైతాంగం బానిసల సహాయంతో భూమిని సాగుచేసినా, వ్యావసాయిక ఉత్పత్తిని మాత్రం ప్రధానంగా స్వేచ్ఛారైతాంగమే సాగించింది.

పట్టణాలలో క్రొత్తగా తలెత్తుతున్న ధనస్వాములు (అరిస్టో క్రేట్స్) విపరీతంగా ధనాన్ని ఆర్జించి, బానిసలను సంపాదించి వ్యాపారం సాగిస్తూ తమతమ రాజ్యాలను, సామ్రాజ్యాలను నిర్మించుకొన్నారు. పట్టణపరిసరాలలోని రాజుల చేతిపరిశ్రమలలోను ఎస్టేట్లలోను, వ్యాపారస్తుల యిళ్ళలోను, తోటలలోను బానిసముఠాలు పనిచేశాయి; బానిసలతోపాటు స్వేచ్ఛ గలిగిన చేతిపరిశ్రమదారులు, కూలీలుకూడా పనిచేస్తుండేవారు.

ఉత్పత్తిఅభివృద్ధి చెందటంతోనూ, జనాభా పెరగటంతోనూ, సామ్రాజ్యాలుకూడావిస్తరించాయి. భూమిపైసమిష్టి యాజమాన్యం గలిగినగణతంత్రజనపదాలు; భూమిపైసమిష్టి యాజమాన్యంఉన్నా, వ్యక్తిగతంగా సాగుచేసుకొని అనుభవించే అవిభక్తజనపదాలుఒకవైపునగ్రామాలలోవున్నాయి. మరొకవైపునబలసంపన్నమైనసామ్రాజ్యప్రభుత్వాలున్నాయి ఆరెంటిమధ్య భూమివిషయంలో తీవ్రమైన వైరుధ్యాలు, వైమనస్యాలు ఏర్పడ్డాయి. ఆవైమనస్య వైరుధ్యం రెండు రూపాలలో బయటపడింది. ఒకటి: గ్రామాలలోని ఉమ్మడి భూమిని రాజుస్వాధీనం చేసుకోవచ్చా? మొత్తంఉత్పత్తిలో ప్రభుత్వపు పాలు ఎంత? అదనపుఉత్పత్తిలో ఎంత పాలు తీసుకొనేందుకు పాలకవర్గానికి అధికారం ఉంది?

'పూర్ణమీమాంస' మొదలుకొని అన్నిధర్మశాస్త్రాలలోను, వాటిపై చేయబడిన వ్యాఖ్యానాలలోను, పైవిషయం దీర్ఘంగా చర్చించబడింది. దోపిడీసంబంధాలను నియమబద్ధం చేసేందుకూ, పన్నులు వసూలుచేసే అధికారాన్ని పరిమితం చేసేందుకు సూక్ష్మమైన నియమాలతోసహా కౌటిల్యుడు తన

అర్థశాస్త్రంలో ప్రయత్నించారు. భూమిని రాజు దానం చేయవచ్చా అన్న సమస్యను పూర్ణమీమాంసలో చర్చించి, అలాంటి హక్కు రాజుకు లేదని తేల్చటం జరిగింది ఎందువల్ల? 'భూమి అందరికీ చెందినట్టిద'ని, అది ఏ ఒకని సొంతసొత్తు కాదనీ 'పూర్ణ మీమాంస' చెబుతోంది.

అయితే కాలంగడిచేకొలదీ పాలకవర్గాలు ఆ పరిస్థితిని క్రమంగా మార్చివేశాయి. పన్నులను, కౌలును, అదనపు ఉత్పత్తిలో తమపాలును పెంచుకుంటూ, ఉమ్మడిభూమిని పాలకవర్గాలు స్వాధీనం చేసుకున్నాయి.

దోపిడీవర్గాల చెప్పుచేతలలోఉండేధర్మసూత్రకారులు (జ్యూరిస్ట్స్) అప్పుడొక సమస్యను లేవనెత్తారు. ఉమ్మడిభూమి అంటే ఏమిటి? గ్రామానికిచెందిన ఉమ్మడిభూమి, రాజుకు చెందిన ఉమ్మడిభూమి అంటూ వేరువేరుగా లేవా? తనకు చెందిన ఉమ్మడిభూమిని రాజు యితరులకుఎందుకుయిచ్చుకోకూడదు? మొదలైన సమస్యలను వారు లేవనెత్తారు. అంతేకాకుండా ఉత్పత్తిలో పన్నులరూపంలో ప్రభుత్వానికి ఎంత దక్కాలన్న సమస్యకూడా లేవదీశారు.

చరిత్రముందుకు సాగేకొలదీ, ప్రభుత్వంఅంటే దోపిడీవర్గాలు వివిధరకాల ఉత్పత్తిదారులనుంచి పన్నులరూపంలో అధికధనం రాబట్టడం మనంచూస్తాం. వ్యావసాయిక ఉత్పత్తిలో ప్రభుత్వపాలును పదోవంతునుంచి సగానికి పెంచారు. అదేవిధంగా ధనరూపంలో కౌలును, పన్నులను కూడా విపరీతంగా హెచ్చించారు. ఉమ్మడిభూమిసిరక్షించుకుంటూ, కౌలురేట్లు, పన్నులు పెరగకుండా నిరోధించటానికి దీర్ఘ

పోరాటం జరిగింది. నందరాజుల అనంతరం, అనేక సామ్రా జ్యాలు అంతరించటానికీ, అంతరించటానికీకూడా మూల కారణం ఆ పోరాటమే (విదేశాలనుంచి వచ్చిన కుషాన్లు, సిథియన్లను మినహాయించినా). పై పోరాటం నందరాజులకు పూర్వంకూడా జరిగింది.

ఈ పరిణామక్రమంలో ఉత్పత్తిశక్తులుకూడా అభివృద్ధి చెందాయి. చేనేతపరిశ్రమలు గుణరీత్యా, రాశిరీత్యాకూడా అభివృద్ధి అయ్యాయి. వ్యవసాయపద్ధతులలో అనేకమార్పులు రావటం, తత్ఫలితంగా ఉత్పత్తి సంబంధాలలో మార్పులు రావటం జరిగింది.

పాత గణతంత్ర జనపదాలు నశించిపోయిన తర్వాత, వాటిస్థానే కొత్తరకమైన జనపదాలు తలెత్తాయి; భూమి ఉమ్మడిసొత్తుగా ఉన్నప్పటికీ, అవిభక్తజనపదాలప్రాతిపదికపై కొన్నిదశలలో, కొన్నిచోట్ల సాగుచేసుకొనేవారు. అవిభక్త జనపదం పోయినతర్వాత వానిస్థానంలో గ్రామీణ జనపదం అవతరించింది. గ్రామీణజనపదంలో వ్యక్తిగత కుటుంబాల ప్రాతిపదికపై సాగుచేసుకొనేవారు. పనితనం, పనిముట్లు అభివృద్ధిచెందటం, ఆ పనితనం, పనిముట్లుకూడా కొన్నికుటుం బాలకుమాత్రమే పరిమితమై ఉండటంవల్ల ఆయావృత్తులలో వంశపారంపర్యపద్ధతి అమలులోకివచ్చింది. ఆవంశపారంపర్య పద్ధతి ఆ జనపదాలలో వంశపారంపర్య పనివిభజనను సృష్టిం చింది. దానితో కులాలుపుట్టి, కులాలప్రాతిపదికపై గ్రామీణ జనపదాలు తలెత్తాయి. ఆ విధంగా భారత భూస్వామిక వ్యవస్థకు మౌలికస్వరూపం ఏర్పడింది.

అనాగరిక, బానిససమాజ, నాగరికదశల అంతిమ కాలంలోని సామాజికవ్యవస్థయొక్క ధార్మిక, నైతిక బాహ్య రూపమే వర్ణవ్యవస్థ (వర్ణాశ్రమధర్మాలు) అని చెప్పవచ్చు. అలాగే భారత భూస్వామికవ్యవస్థపుట్టుక, అభివృద్ధులయొక్క బాహ్యరూపమే కులవ్యవస్థ (కులధర్మాలు). గ్రామాలలో అవిభక్తజనపదాలను అంటే వర్ణాశ్రమ ధర్మాలను నిర్మూలించి కులవ్యవస్థ తలెత్తింది. బానిసవ్యవస్థకు ప్రత్యామ్నాయం గానూ, తలెత్తుతున్న కొత్త ఉత్పత్తిశక్తులకు చక్కగా తగినట్టుగానూ ఆ కులవ్యవస్థ ఉంది. బహుశా ఆ వ్యవస్థ మౌర్యులతో ప్రారంభమై, తర్వాత గుప్తసామ్రాజ్యము (క్రీ.శ. 200) రోజులలో విస్తరించి ఉంటుంది; అప్పటినుంచి కొన్ని శతాబ్దాలుగా భూస్వామికవిధానానికి ఆ కులవ్యవస్థ అచేతనమైన గట్టి పునాదిగా ఉపయోగపడుతూ వస్తోంది. అయితే ఇండియా అంతటా ఒకేసారి ఆ కులవ్యవస్థ అమలులోకి రాలేదు.

ఈ సందర్భంలోనే మార్క్స రచనలనుంచి కొన్నింటిని పాఠకులు ఉదహరించారు: ఇండియాపై మార్క్స రచనలలో 'అత్యంతపురాతనమైన','ఎలాంటిమార్పూలేని' గ్రామీణ జనపదాలు ఉన్నట్టువ్రాయటం జరిగిందిగదా అని పాఠకులు ప్రశ్నించారు.

మార్క్స రచనలను అన్వయించటంలో రూఢ్యర్థ సిద్ధాంతాన్ని, పిడివాదాన్ని అనుసరించటంవల్ల ఈ ప్రశ్న ఉత్పన్నమైందని భావిస్తున్నాను. కనుక దీనిపై వివరంగా చర్చించవలసిన అవసరం ఉంది.

ఇండియాలోని భూసంబంధాలను గురించి, గ్రామీణ జనపదాన్నిగురించి మార్క్స తన నిర్దిష్ట నిశ్చితాభిప్రాయా లను (ఫైనలైజ్డు వ్యూస్) ఎక్కడా వెలిబుచ్చలేదు. వివిధ దృక్కోణాలనుంచి వివిధదశలలో భారతదేశచరిత్రను ఆయన అప్పుడప్పుడు పరిశోధిస్తూవచ్చాడు. ఇండియాలో భూమిపై వ్యక్తిగత హక్కు లేదని ఒక సమయంలో ఆయన అభిప్రాయం వెలిబుచ్చినమాట నిజమే. కాని తర్వాత చేసిన పరిశోధనల ఫలితంగా తేలినవిషయాలను దృష్టిలోఉంచుకొని,కృష్ణలోయ ప్రాంతంలో భూమిపై వ్యక్తిగతహక్కు అమలునందున్నదని ఏంగిల్స్‌కు వ్రాసిన వుత్తరంలో మార్క్స పేర్కొన్నాడు.

అలాగే గణాల, గ్రామీణ జనపదాల అభివృద్ధిని గురించి మార్క్స ఏంగిల్స్‌తో కలసి 'కుటుంబం పుట్టుపూర్వో త్తరాలు: రాజ్యాంగయంత్రం' అన్న గ్రంథం వ్రాసేవరకు ఆయనకు నిశ్చితాభిప్రాయం ఏర్పడలేదు.

కాపిటల్ మొదటిసంపుటిలో మార్క్స ఉదహరించిన గ్రామీణ జనపదాలు, ఆదిమ కమ్యూనిజంలోని గణతంత్ర సమాజం ఒకటికాదు. అలాగే అవిభక్తజనపదాలుకూడా కావు. బంధుత్వ సంబంధాలను ఆధారంచేసుకొని గణతంత్ర జనపదాలు ఏర్పడ్డాయి కాని, పీడక-పీడితుల సంబంధాలతో ఏర్పడినవికావు. పోతే గ్రామీణజనపదం ప్రాంతీయ ప్రాతి పదికపై ఏర్పడింది. అందులో పీడక-పీడిత - సంబంధాలు వుండేవి.

'కుటుంబం-పుట్టుపూర్వోత్తరాలు'అన్నగ్రంథం మొదట వ్రాసినప్పుడు ఏంగిల్స ఈ మార్పులను ప్రస్తావించలేదు.

కాని, కోవలవస్కీ రచనలను ఆధారంచేసుకొని 1891 లో వెలువడిన ముద్రణలో ఆ సమస్యను వివరించాడు. భూమి వుమ్మడిసొత్తుగా వుంటున్నప్పటికీ, జనపదాలు ఆ భూమిని సాగుచేసిన పద్ధతి మూడురకాలుగా వున్నట్టు కనిపిస్తోందని ఏంగిల్స్ యిచ్చిన వివరణనుబట్టి ఎవరైనా గ్రహించవచ్చు.

బంధుత్వ సంబంధాలపై ఏర్పడిన ఆదిమ గణతంత్ర జనపదాలు (వీటిని గణపద్ధతి అని పిలవవచ్చా?) మొదటిరకం.

గోత్ర సంబంధాలను ఆధారంచేసుకుని ఏర్పడిన అవిభక్తకుటుంబం(వీనినే కులపతి లేక గృహపతిపద్ధతి అనవచ్చు) రెండవరకం.

మూడోరకం గ్రామీణజనపదం. అనేక కుటుంబాలుగా ఏర్పడి,కొంతభూమిని వుమ్మడిసొత్తుగానూ,మరి కొంతభూమిని సొంత సొత్తుగానూ వుంచుకొని సాగుచేస్తూ, కుటుంబ ప్రాతిపదికపై ఆర్థికవ్యవహారాలు నడుపుకొంటూ, కులాలరీత్యా ముఠాలుగా ఏర్పడి, గ్రామపంచాయతీల రూపం పొందింది.

మార్క్సు ప్రస్తావించింది మూడోకరకమైన యీ గ్రామీణ జనపదమే. వర్ణాలు, కులాలు లేనటువంటి ఆదిమ కమ్యూనిజంలో గ్రామీణ జనపదం ఏర్పడలేదు. వర్గాలు, వర్ణాలు బానిసవిధానం అమలులోకిచ్చిన మొదటిరోజులలో కూడా అది ఏర్పడలేదు. బానిసవ్యవస్థ పతనంచెంది, భూస్వామిక విధానానికి సంబంధించిన కులవ్యవస్థ అవతరించిన తర్వాతనే అది ఏర్పడింది.

ఇతరవాటికన్నా గ్రామీణ జనపదంలో విభిన్నమైన వుత్పత్తిసంబంధాలు ప్రతిబింబించాయి.

గ్రామీణ జనపదం, భారతభూస్వామ్యవ్యవస్థలపుట్టుక, పరిణామాలనుగురించి ఇక్కడ ఇంతకన్నా ఎక్కువ వివరించటం సాధ్యపడదు. ప్రతికులం, ప్రతివుపకులం తమచేతిపనుల ప్రావీణ్యతను వృద్ధిచేసుకుంటూ, చేతిపరిశ్రమలను మహోన్నత స్థాయికి తీసుకుపోయాయి. ఉత్పత్తి పెరిగినకొలదీ పాలక వర్గాలు, ప్రభుత్వం వారినుంచి అదనంగా డబ్బుగుంజటం ప్రారంభించాయి. ఈ అదనపు రాబడితోనే నీటిపారుదల సదుపాయాలు కల్గించటం, వాస్తు శిల్పఖండాలను భద్రపరచటం జరిగింది. అశోక సామ్రాజ్యంనాటి మహోన్నత సంస్కృతీ, గుప్తసామ్రాజ్యంలో విలసిల్లిన కళలూ, సాహిత్యమూ, అస్పృశ్యుడైన ఒక తాపీపనివాడు కాశ్మీరులో నిర్మించిన నీటినిల్వల నిర్మాణం (వాటర్ వర్క్స్), మధ్యయుగాలలో పెద్దయెత్తున సాగించిన వాణిజ్య వ్యాపారాలు-ఇవన్నీకూడా గ్రామీణజనపదం పెంపొందించిన వుత్పత్తి శక్తుల, వ్యావసాయిక, చేతిపరిశ్రమల అభివృద్ధి పర్యవసానమే. మధ్యయుగపు రాజులు పట్టణపరిసరాలలో ఏర్పరచిన చేతిపరిశ్రమలుకూడా అందుకు దోహదమిచ్చాయి.

ఈ జనపదాలే తర్వాత అభివృద్ధికి అవరోధాలుగా తయారై, చారిత్రకగతిలో ప్రతిష్టంభనకు కారణభూతాలయ్యాయని అదేసమయంలో మార్క్స్ స్పష్టీకరించాడు. చరిత్రను అధ్యయనంచేసే విద్యార్థులందరికీ మార్క్స్ వ్రాసిన ఆ గ్రంథభాగాలు సుపరిచితాలే కనుక, పునశ్చరణ చేయవలసిన అగత్యంలేదు.

ఆ గ్రామీణ జనపదాలలో కొనసాగిన వర్గపోరాటాన్ని, యింకా స్పష్టంగా చెప్పాలంటే భారతభూస్వామ్యసంబంధాల

లోని వర్గపోరాటాన్ని పరిశోధించాలని చరిత్రను అధ్యయనం చేసే విద్యార్థులు సహజంగా కోరుతారు.

ఇండియానుంచి వ్రాసిన వ్యాసాలలో గ్రామీణ జన పదాల తీరుతెన్నులను పరిశీలిస్తూనే, బ్రిటిషు ఆక్రమణవల్ల కొత్తగాపుట్టిన ఉత్పత్తిశక్తులనుగూర్చి వివరించటంపైనా, విప్లవంపైనా మార్క్సుముఖ్యంగాతనదృష్టిని కేంద్రీకరించాడు.

పెట్టుబడిదారీ ఉత్పత్తివిధానంవల్ల కర్మాగారాలలో ప్రత్యేకమైనపని విభజనను, గ్రామీణజనపదాలలోని పని విభ జనతో పోల్చుతూ మాత్రమే మార్క్సు 'కాపిటల్' గ్రంథంలో వాటిని చర్చించాడు. ఆ సందర్భంలో గ్రామీణ జనపదాలు స్వయంపోషకత్వపు ఆర్థికవిధానం కలిగివున్నాయనీ, వేలాది సంవత్సరాలు మనుగడను కొనసాగించాయనీ, ప్రభుత్వాలు మారినా అవి చలించకుండా వున్నాయనీ మార్క్సు వివరిం చాడు.

ఆ రెండు సందర్భాలలోనుకూడా, భారత భూస్వామిక వ్యవస్థనుగురించి మనకు మార్క్సు చక్కని అవగాహన ప్రసాదించాడు. అయితే, ఆ రెండు సందర్భాలలోనుకూడా ఒక విషయాన్ని సమగ్రంగా చర్చించటం కాకుండా, ఏదో ఒక లక్షణాన్ని తీసుకొని చర్చించాడు. ఆ విషయాన్ని సమగ్రంగానూ, సంపూర్ణంగానూ చర్చించటానికి ఆయన అప్పుడు పూనుకోలేదు. భారతదేశచరిత్ర వ్రాయాలని ఆయన సమాచారం సేకరించాడు. కాని, దురదృష్టవశాత్తు ఆ పని పూర్తి చేయకముందే కనుమూశాడు. కనుక గ్రామీణ జనపదాలలోని వర్గపోరాటంగురించీ, గ్రామీణజనపదాలకు,

భూస్వామ్యవ్యవస్థకు మధ్య జరిగిన పోరాటంగురించీ ముందు ముందు పరిశీలించాలి. మౌర్యులకాలంనుంచి మొగల్, మరాఠా రాజ్యాలవరకు గల మధ్యకాలం-అంటే రెండువేల సంవత్సరాల చరిత్రను పరిశోధించాలి.

ఈ రెండువేల సంవత్సరాల కాలంలోను ఆ జనపదాలలో అంతర్ వైరుధ్యాలు, వైమనస్యాలు, పోరాటాలు లేవనటంకానీ, వాటిపై అధికారం చెలాయించిన భూస్వామ్య ప్రభుత్వంతో అవి పోరాటాలు జరపలేదనటంకానీ మార్క్సిజాన్ని తిరస్కరించడమే అవుతుంది.

అయినప్పుడు ఆ జనపదాలలో జరిగిన అంతర్ పోరాటాలు, ప్రభుత్వంతో అవి సాగించిన పోరాటాల స్వభావం యేమిటి?

గ్రామీణ జనపదంలోని ప్రతి కులం, ప్రతి కులకుటుంబం కూడా సాగుకోసం సొంతభూములను కలిగియున్నాయి. ఉమ్మడి భూమిలోని సంపదనుకూడా ప్రతి కులం, ప్రతి కులకుటుంబం అనుభవించవచ్చు. అడవులు, నీటిని సరఫరాచేసే చెరువులు, పచ్చగడ్డి మొదలైనవి ఉమ్మడిసొత్తు (ధర్మశాస్త్రాలలో దానిని మహాభూమి అని పేర్కొన్నారు.) సాగుచేసుకొనేందుకు ప్రతి కుటుంబానికీ భూమి ఉండేది. నేత, నూనె తయారుచేయటం, తోళ్ళను బాగుచేయటం, వీధులను పరిశుభ్రపర్చడం, కాపలా కాయటం మున్నగు చేతిపరిశ్రమలను కొన్ని కులాలవారికి ప్రత్యేకించారు. ఆ విధంగా వ్యవసాయం, చేతిపరిశ్రమలు ఒకదానితో మరొకటి సంలీనం చేయబడ్డాయి.

చేతిపరిశ్రమను వృత్తిగా గల్గిన కులం, తాము తయారు చేసిన వస్తువులను యితరుల కిచ్చి, వాటికి బదులుగా వారు తయారుచేసిన వస్తువులను తీసుకొనేవారు. ఉదా॥ నూనెకు బదులు తోలు, కొయ్యవస్తువులకు బదులు గోధుమ. ఆ విధంగా ఒక గ్రామంలో, లేక కొన్ని గ్రామాల గ్రూపులో ఒండొరుల శ్రమఫలితం మారకం పొందుతుండేది.

ఐతే శ్రమించనటువంటి, ఉత్పత్తి చేయనటువంటి కులాలుకూడా కొన్ని వున్నాయి. చదువు నేర్పటం, పూజారిత్వం చేయటం, పంచాంగాలు (సీజన్ వాచింగ్) తయారు చేయటం మున్నగు పనులనుమాత్రమే బ్రాహ్మణకులస్థులు చేసేవారు. అలాగే క్షత్రియకులాలు, సైనిక కుటుంబాలు ప్రభుత్వ రక్షణను చూస్తుండేవి. వివిధప్రాంతాలలో, వివిధ పేరులతో రివెన్యూ ఉద్యోగాలను, గుమాస్తాగిరీలను చేసేవారు కూడా కలరు. అలాంటివారు తాము చేసేపనికి "జీతాలను" ఎక్కడనుంచి రాబట్టేవారు? శ్రామికకులాలు తయారుచేసే అదనపు వుత్పత్తి వస్తువులనుంచీ వారు "జీతాలు" పుచ్చుకొనేవారు. ఉత్పత్తిచేసే కులాలు తయారుచేసిన వస్తువులతో ఉత్పత్తిచేయని కులాలు జీవించాయి. అంటే ఉత్పత్తిదారులు కౌలురూపంలో యిచ్చిన వస్తువులపై జీవించారన్నమాట. ఆ దృష్టితో చూచినప్పుడు వారు భూస్వామిక కౌలుగృహీతలు (ఫ్యూడల్ రెంట్ రిసీవర్స్.)

భూమిపై యాజమాన్యహక్కును పురస్కరించుకొని వారు కౌలు తీసుకొనేవారా? కాదు; ఐతే కౌలు స్వీకరించే హక్కు వారి కుంది.

ప్రభుత్వం ఆహక్కును బలవంతానఅమలుజరిపిందా? అవును, అమలుజరిపింది. ఉత్పత్తివిధానంలో మిగతాకులాల వారి స్థానం స్థిరీకరించబడింది. ఫలానా కులం ఫలానా చేతి పరిశ్రమనో, వ్యవసాయాన్నో స్వీకరించాలని నిర్ణయించారు. అలాగే తమ ఉత్పత్తిలో యింతపాలును మిగతావారికి యివ్వాలని నిర్ణయించి, బలవంతాన ఆ నిర్ణయం అమలుజరిపారు. ఆనిర్ణయాలను అమలుజరిపేది ప్రభుత్వం. గ్రామీణ జనపదాలలోను, ముఖ్యపట్టణాలలోను గల పాలకముతాలైన బ్రాహ్మణ క్షత్రియకులాల సహాయంతో ధర్మసూత్రాలను ఆధారంచేసుకొని ఆప్రభుత్వం నడుపబడింది.

వారసత్వంఆధారంగా ఈసంబంధాలురూపొందాయా? ఈసంబంధాలను ప్రతివారూ పాటించవలసిందేనా ? అవును, పాటించవలసిందే. పాటించనివారికి శారీరకశిక్షవిధించేవారు.

ఈ గ్రామీణజనపదాల అంతర్వ్యవస్థ ఆవిధంగా స్పష్టమైన భూస్వామ్య సంబంధాలను ఆధారంచేసుకొని ఏర్పడింది. వంశపారంపర్య దాస్యంవంటిది ఈ గ్రామీణ జనపదాల ప్రాతిపదిక. సమాజంలోని అస్పృశ్యకులస్థులే పాలకవర్గాలకు ఊడిగం చేస్తుండేవారు.

రాజకీయ పరిపాలనారంగంలో కూడా అదేసంబంధం ప్రస్ఫుటంగా బయటపడింది. ఉత్పత్తిచేయనట్టి పాలకకులాలైన బ్రాహ్మణ-క్షత్రియకులాలకు ప్రభుత్వం చెందిఉండేది. కవిన్యూఉద్యోగులు (ఉత్తర హిందూదేశంలో కాయస్త కులస్థులు - మన ప్రాంతాలలో నియోగులు) పాలనా యంత్రంలో భాగం పంచుకొన్నారు.

కౌలు గృహీతలు (రెంట్ రిసీవర్స్) ఎక్కువ కౌలును రాబట్టుకోవాలని ప్రయత్నించటంతో ఆజనపదాలలో పోరాటం ప్రారంభమైంది. 'బలి' 'భాగం'లకు సంబంధించినచట్టాలలో ఈవిషయం బయటపడింది. ఉత్పత్తిదారులనుంచి తమవంతు 'భాగాన్ని', 'బలి'ని హెచ్చుచేసుకోవాలని బ్రాహ్మణులు, క్షత్రియులు, రెవిన్యూఉద్యోగులూ ఎల్లప్పుడూ ప్రయత్నిస్తారు. 'బలి' 'భాగం' ఎంతెంత యివ్వాలో ధర్మసూత్రాలలో స్పష్టంగా వివరించబడింది. తమలపాకులు, వక్కలు, కొబ్బరికాయలు ఎన్నెన్నియివ్వాలన్న దానిదగ్గరనుంచి ప్రతిచిన్నవిషయం అనేకగ్రంథాలలో వర్ణించారు. ఆ నియమాలను ఎవరైనా ఉల్లంఘిస్తే, పాలకకులం వారికి దాస్యకులానికి విధించే శిక్ష విధిస్తుంది.

రాజ్యాంగయంత్రంతో గ్రామం సంఘర్షణపడినసందర్భాలుకూడా వున్నాయి. ఉత్పత్తికులాలన్నీ కలిసి, లేక ఒక్కొక్కప్పుడు మొత్తం గ్రామమంతా కలిసి, రాజుకు యివ్వవలసిన 'బలి', 'భాగాల' విషయంలో ప్రభుత్వంతో పోరాటం సాగించిన సాదృశ్యాలున్నాయి. అనేక సందర్భాలలో అలాంటి తగవు శాంతియుతంగా పరిష్కారంకాక, సాయుధసంఘర్షణలుజరగటం, గ్రామీణజనపదంమొత్తంగా ఒకరాజ్యంనుంచి మరోరాజ్యానికి, కౌలునిబంధనలు కఠినతరంగా లేని రాజ్యానికి వలసపోయిన వుదంతాలున్నాయి.

గ్రామీణజనపదాలలో వుత్పత్తిచేయనటువంటిపాలకకులాలు విపరీతమైన కౌలుగుంజుకొని, వ్యవసాయాన్ని, చేతిపరిశ్రమలను నాశనంచేసినప్పుడూ, ధనరూపంలో హెచ్చు

పన్నులు వసూలుచేసి, వాణిజ్యాన్ని నాశనం చేసినప్పుడూ, దొంగలనుంచి దండెత్తివచ్చినవారినుంచి గ్రామాన్ని కాపాడ లేకపోయినప్పుడూ ప్రజలు పాలకవర్గాలపై తిరుగుబాటు చేసే వారు. పన్నుల నిరాకరణే ఆతిరుగుబాటు స్వరూపం. 'కులధర్మా లను' పాటించనందువలననే అలాంటి దౌర్భాగ్యపరిస్థితులు ఏర్పడ్డాయని చివరకు తేలుస్తారు. ప్రతివారూ 'కులధర్మాలను' పాటించి శాంతిని స్థాపించాలసి, అందుకు పరిష్కారమార్గం చూపేవారు. ఇండియాలోని వివిధప్రాంతాలలో పదోశతా బ్దంనుంచి 16వ శతాబ్దం మధ్యకాలంలో వెలువడిన ఋషుల సాహిత్యమంతా ఈ సమస్యపై చర్చలతో నిండివుంది. 'బలి' 'భాగా'లకు సంబంధించినహక్కుల మొత్తాల మార్పునుగురించి అనేకమంది పండితులు చర్చించారు. ఆచర్చలద్వారా భారత భూస్వామిక కౌలుసంబంధాలు బయటపడ్డాయి. అందులో వర్గాలపేర్లతో మాత్రం విశదీకరించబడలేదు. అంతే. దోపిడీ సంబంధాలను బయటపెట్టరాదనే వైఖరిని కొందరు తరచుగా ప్రదర్శిస్తున్నారు. ఆ దోపిడీసంబంధాలకు వ్యతిరేకంగా జరిగిన పోరాటాలు, ఆక్షేపణలు భారతచరిత్రలో మనకు కన్పిస్తాయి.

'బలి', 'భాగం'మధ్యగల తారతమ్యంగురించి జరుగు తున్న చర్చల విషయంలో ఒకమాట చెప్పదలచుకొన్నాను. ఇతర పన్నులవిధింపు విషయంలోవలెనే, ఈ రెంటిమధ్యా తేడా వున్నదని ఋజువుచేయటానికి మనచారిత్రకాచార్యులు నానా తంటాలు పడుతుంటారు. 'బలి' యిచ్చేపద్ధతి చాలా పురాతన మైనది. ఉత్పత్తిచేయనటువంటివారికి వుత్పత్తిదారులు ఇచ్చే అదనపు వుత్పత్తినే 'బలి'అనేవాళ్లు. వళ్లువంచి పనిచేసేవారు,

మేధస్సునుపయోగించి పనిచేసేవారిమధ్య శ్రమవిభజనఏర్పడ టంతో 'బలి' అమలులోకివచ్చింది. ఆదిమకమ్యూనిస్టు సమాజంలో ఋతువులు, వర్షాలు మున్నగువాటిని కనిపెట్టుతూ వుండటానికి కొంతమందిని ప్రత్యేకించారు. వారుచేసేపనిసమిష్టి శ్రేయస్సుకు వుపయుక్తమైనది కనుక, సమాజం వుత్పత్తిచేసిన దానిలో వారికి కొంతపాలు యిస్తుండేవారు. వీరులకూ, సమాజాధిపతులకూ కూడా అదే 'బలి' యిస్తుండేవారు.

ఆ సమాజం విచ్ఛిన్నమైపోయి, వర్గాలు, రాజ్యాలు తలెత్తినప్పుడు పట్టణ, పల్లెప్రాంతాల మధ్య, వ్యవసాయం, చేతిపరిశ్రమల మధ్య విభజన అభివృద్ధిచెంది స్థిరీభూతం కావ టంతో కొత్తరూపంలో-'భాగం'-పేరుతో అదనంగా గుంజ టం ప్రారంభించారు. 'భాగం' అంటే ప్రభుత్వానికి చెల్లించే పన్నే. ద్రవ్యమారకం అమలులో లేనిచోట్ల చేతిపరిశ్రమ దారులు, వ్యవసాయదారులు పరస్పరం వస్తుమార్పిడి చేసు కోటాన్నికూడా 'భాగం' అని పిలిచారు. బానిసలకు, బానిస యజమానులకు మధ్య మారకం అన్న సమస్యే లేదు. భూస్వామ్య గ్రామీణజనపదం అవతరించటంతో కౌలు సంబంధానికి 'భాగం' మౌలికరూపంగా స్థిరీభూతమైంది. 'భాగం'తోపాటు సహచారిణిగా పాత 'బలి'కూడా ప్రత్యక్ష మైంది.

ప్రభుత్వం, భూస్వామ్య, పాలకకులాలు తమ కోర్కె లను పెంచుకుంటూ, సంఘర్షణకు యెలా దారితీశాయో యింకా వివరించటం యిక్కడ సాధ్యపడదు. గ్రామాలలోని కులాలమధ్య, గ్రామాలకు రాజ్యాంగయంత్రానికి మధ్య పట్టణ

సభలకు (పౌరసభలు) రాజుకు మధ్యగల సంబంధాలుగా 'బలి', 'భాగాల'ను మనం పరిగణించినట్లయితే భారత భూస్వామ్య విధానంలోని వర్గపోరాటాల కీలకాన్ని పట్టుకో గల్గుతామని సూచించవచ్చు. అయితే ప్రాతిపదికను - వుమ్మడిభూమిని-మాత్రం విస్మరించరాదు.

అలాంటి పరిస్థితులలో గొప్పరాజులు, ప్రజానాయకులని ఎలాంటివారిని పొగడటం జరిగింది? కూలిపోతున్న ధర్మాన్ని నిలబెట్టినవాళ్ళు గొప్పవాళ్ళు; అంటే 'బలి', 'భాగం' విష యంలో న్యాయమైన సరసమైన సంబంధాలనుపునరుద్ధరించిన వాళ్లు; విపరీతమైన దోపిడీనుంచి ప్రజలను కాపాడినవాళ్ళు; ప్రజలతరఫున నిలబడి వారిరక్షణకై పోరాడినవాళ్లు గొప్ప వాళ్ళు. ఋషులు సైద్ధాంతిక ప్రచారకులు-పనిచేశారు పీడిత ప్రజలతరఫున నిలబడి సాయుధపోరాటం సాగించినవాళ్లు ప్రజా వీరులయ్యారు. భారత భూస్వామికవిధానంలోని ఆ పరిస్థితు లలో పీడితులంతా కోరిందిఇదిమాత్రమే.ధర్మం పునరుద్ధరించ బడాలి. ప్రతికులం తనధర్మాన్ని పాటించి, సమాజంలో సము చితస్థానం స్వీకరించాలి. ఆవిధంగా సామాజికజీవితంలో పాలుపంచుకోవాలి. ఆ సమతూనిక(ఈక్విలిబ్రియమ్) పరిస్థితి కల్లోలమైపోతే అప్పుడు ప్రపంచమే అంతరించిపోతుంది.

శుక్రనీతిలో ఈవిషయం ఇంకా స్పష్టంగా వివరించ బడింది. ప్రభుత్వం తనక్రింద పనిచేసేఉద్యోగస్థులకూ,నౌకరు లకూ వేతనంయిస్తూనే 'యిన్ని'రోజులు సెలవుయివ్వాలనీ, సిక్ లీవ్ 'ఇన్ని' రోజులనీ శుక్రనీతి చట్టాలలో స్పష్టంగా పేర్కొనబడింది. ఆధునిక పెట్టుబడిదారీ ప్రభుత్వాలుసైతం,

కార్మికవర్గం సంఘటితమై దెబ్బతీసేదాకా, అలాంటి సెలవు లను కార్మికవర్గానికి ప్రకటించలేకపోయాయి.

మనచరిత్రలోని ఈదశనుగురించి పరిశీలించేటప్పుడు; భారతభూస్వామ్యవ్యవస్థ అభివృద్ధికి ముఖ్యపాత్రను నిర్వ హించినవ్యాపారస్థుణ్ణికూడాదృష్టిలోఉంచుకోవాలి. గ్రామీణ జనపదం తయారుచేసిన వస్తువులను సాధ్యమైనంతవరకు అమ్మకపుసరుకు(కమొడిటీ)గా మార్చడానికి ఆవ్యాపారస్థుడు ప్రయత్నించాడు. ఉత్పత్తిదారులు తయారుచేసే వస్తువులు అమ్మకపుసరుకుగా మారి, గిరాకీ ఎంతగా పెరిగితే వస్తు రూపంలో కౌలు రాబట్టుకొన్నవారికి అంత ఎక్కువలాభం. కౌలు పేరిటవసూలుచేసినవస్తువులను వ్యాపారస్థునికిఅమ్ముకొని అతడు బంగారాన్ని, ఇతరవస్తువులను సంపాదించుకోవచ్చు.

వ్యాపారస్థుడు అమ్మకపుసరుకును ఎంత ఎక్కువధర పలుకుతాడో, అంతఎక్కువగాగ్రామీణజనపదంలో కల్లోలం పుట్టి, సాంప్రదాయానుసారం వస్తున్న శ్రమవిభజన ఉత్పత్తి తలక్రిందు లవుతుంది; గ్రామీణజనపదంలో స్పష్టమైన ఆర్థిక అసమానతలకు శంకుస్థాపన జరుగుతుంది. తత్ఫలితంగా అంతర వైరుధ్యాలు బయలుదేరుతాయి. అందువల్ల గ్రామీణజనపద ఆర్థికజీవనం శాంతియుతంగా వర్ధిల్లాలని కోరినవారంతా వ్యాపారస్థుని చర్యలను హర్షించలేకపోయారు.

అయినప్పటికీ వ్యాపారస్థుడు తన పాత్రను నిర్వ హించాడు; మనుగడను కొనసాగించుకొన్నాడు; అభివృద్ధి చెందాడు.

బూర్జువావర్గ పుట్టుకకు అవసరమైనంతా ఆ వ్యాపారస్తుడు యెందువల్ల అభివృద్ధి చెందలేకపోయాడు? ఆవిధంగా మన చరిత్రలో బూర్జువా అభివృద్ధికి రాస్తా యెందుకు వేయలేకపోయాడు?

ఇదంతా ఆధునికచరిత్రకు సంబంధించినది. కనుక దానిని యిక్కడ చర్చించలేదు.

ఈ విషయంపై మార్క్సిస్టు పాఠకులు యింకా చర్చలు సాగించి, విశదీకరణకు తోడ్పడగలరన్న ఆశతోనే యీ నాలుగుముక్కలు వ్రాస్తున్నాను. ప్రస్తుతపరిస్థితులలో యీ విషయాలమీద వివరంగా వ్రాయడానికి నాకు తీరికాలేదు; నాలో శక్తీలేదు అని చెప్పడానికి చింతిస్తున్నాను. అందువల్లనే చరిత్రపై వ్రాద్దామనుకొన్న యితర సంపుటాలనుగూడా వ్రాయలేకపోతున్నాను.



...DESAM    Price : 2.50

# ఉత్తమ గ్రంథాలు

| | | |
|---|---|---|
| మన లిపి పుట్టుపూర్వోత్తరాలు | | |
| | తిరుమల రామచంద్ర | రు. 3.50 |
| నర్తనబాల | నటరాజ రామకృష్ణ | 5.00 |
| ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర | | |
| | ఏటుకూరి బలరామమూర్తి | 2.50 |
| భారతీయ తత్వశాస్త్రం | ,, | 2.50 |
| 1857 పూర్వరంగములు | దిగవల్లి వెంకటశివరావు | 2.75 |






(పోస్టేజి అదనం)

---

ప్రతులకు

**విశాలాంధ్ర ప్రచురణాలయం,**
**విజయవాడ.**

Wrapper Printed at Swatantra Art Printers, Vijayawada.

BC



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | LPSA101B161 |
| పుస్తకం పేరు | ఆదిమకమ్యూనిజమునుండి బానిససమాజమువరకు భారతదేశం |
| తారీఖు | 10 March 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 371 |
| పెద్ద సైజ పేజీలు | no |
| ఖాళీ పేజీలు | 6, CI, BCI, [illegible] |
| లేని పేజీలు | 29,30,41,42,154 |
| తయారు చేసినది | thasin |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | PRIYANKA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |